# ప్రజల మనిషి

(తెలంగాణా నవల)

రచయిత:
శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి,

ప్రచురణము 16.
దేశోద్ధారక గ్రంథమాల
3-5-1027, నారాయణగూడ, హైదరాబాదు.

# దేశోద్ధారక గ్రంథమాల

## విజ్ఞప్తి

మహాశయా !

ఆంధ్ర సోదరులకు అవసర గ్రంథముల నందించు ఆశయముతో బహుధాన్య (౧౯౩౮) సంవత్సరంలో కీ॥ శే॥ దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా స్థాపింపబడిన ఈ గ్రంథమాల ద్వారా లోగా ౧౨ ప్రచురణములు దేశీయుల కందజేసినాము. ఆ రోజుల్లో విజ్ఞానము నిచ్చి, స్వాభిమానమును పురికొల్పి, సత్వర కర్తవ్యమును తెలుపు గ్రంథములను ప్రచురించి దేశభక్తులయొక్కయు, మేధావంతులయొక్కయు మన్ననలను పొందినాము. పిమ్మట మొత్తము భారతదేశముతోపాటు హైదరాబాదులో యేర్పడిన రాజకీయ అసాధారణ పరిస్థితులలో గ్రంథమాల ౧౯౪౨లో ఆగిపోయింది. ౧౦ సంవత్సరముల తర్వాత కొంత స్థిమితము కలిగి, తిరిగి గ్రంథప్రచురణకు పూనుకొను అవకాశము కలిగింది. గ్రంథమాల స్థాపన కాలములో మా ముందుండిన కర్తవ్యము నేటివరకును తీరలేదని భావిస్తున్నాము.

'మనిషి యే పంథా నవలంబించవలయునో అని ఆలోచించుటకు ముందు వివిధ పంథాలను తెలిసికొనుట ముఖ్యము'. కాబట్టి మేము ప్రచురించు ప్రతి గ్రంథము దేశీయుల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను దృష్టియందుంచుకొని కర్తవ్యములను సూచించునదిగా నుండును.

ఇట్టి మా కృషికి చేయూతనిచ్చి మా ఆశయ సఫలతకు దేశీయులు మమ్ము ప్రోత్సహించెదరని విశ్వసిస్తూ, విజ్ఞులగువారి సర్వసహాయాలపై మాత్రమే ఈ మావ్యవస్థను నిర్వహించ గలుగుదుమని విన్నవిస్తున్నాము.

పదిరూపాయలకు తక్కువకాని విరాళమును మీనుండి అభ్యర్థిస్తూ, అట్టి మొత్తముమేరకు వెలువడే గ్రంథాలు అందజేయబడునని మనవి చేస్తున్నాము.

ఇట్లు విన్నవించు

3-5-1027 నారాయణగూడ<br>హైదరాబాదు.

పట్టికోట ఆళ్వారుస్వామి<br>స్థాపకుడు, ప్రకాశకుడు

# మనవి

చాలాభయంతో ఈనవలను బయటికి తెస్తున్నాను. నవలలో కలం గాణా జనసామాన్యంతో పాటు, సర్వ సామాన్యంగా అందరూ మాట్లాడే భాషను సంభాషణలల్లో రాశాను. మరి ఎంతవరకు సఫలుడి నయ్యానో! ఇక నవలకథా విషయం. 1938 లో హైదారాబాదులో స్టేటు కాంగ్రెసు పుట్టుటకు పూర్వం తెలంగాణా వాతావరణాన్ని ఆధారం చేసికొని, దాని ప్రభావం నుండి బయలుదేరిన ఒకరిని కథానాయకునిగా తీసికున్నాను. ఇది శిల్పం విషయం. ఇతివృత్తం, పాత్రలు, సంభాషణ, వాతావరణం, జీవనతత్వం, ఇవి ఏవిధంగా పోషింపబడ్డాయో!

సుమారు మూడు ఏండ్ల కిందట ప్రారంభించిన ఈ నవలను చాలా మంది మిత్రులకు చదివి వినిపించాను, చర్చించాను, సూచనలను స్వీకరించాను. ఒక మిత్రుడు సంవత్సరంకిందట ఈనవల విషయంలో సందర్భ వశాత్తు ఒకపత్రికలో పేర్కొని వెంటనే ప్రకటించాల్సిందిగా ఆదేశించారు. నవలను విన్న ప్రతిమిత్రుడు ప్రశంసించడం నాకు సమస్యగా పోయింది. వారు కేవలం మిత్రత్వాన్ని పురస్కరించుకొని ప్రశంసలను కురిపించి. లోపాలను కప్పి పుచ్చుడం లేదుకదా యని భయపడ్డాను. ఆ భయం యింకా బాధిస్తూనే ఉంది. ఆ భయంతో ఈనవలను బయటికి తెస్తున్నాను.

ఈ వాక్యాల ద్వారా నామనోవేదనను ప్రకటిస్తున్నానే కాని మిత్రుల ప్రోత్సాహాన్ని, ప్రశంసలను శంకించటంలేదు. నామనోదౌర్బల్యమే ఈ వాక్యాలురాయడానికి కారణం. యిక మీఅభిప్రాయమేమిటో!

ముఖ్యంగా ఈ నవల అంద, చందాలు, తీర్చడంలోను, అచ్చులో నుండి బయటికి రావడంలోను ఎందరో సహృదయులు తోడ్పడ్డారు. వారందరికి హార్దిక ధన్యవాదాలు.

గ్రంథమాలలో సభ్యులుగాచేరి, విరాళములనిచ్చి, నా కృషిని దేశీయులు ఆదరించి ప్రోత్సాహిస్తున్నారు. వారి ఆదరణను సద్వినియోగ పరచి, గ్రంథమాల లభివృద్ధికై నిర్విరామంగా ప్రయత్నించగలను.

ముఖచిత్రం సకాలానికి అందించిన అజంతా ప్రింటర్సు వారికిని, మిత్రులు శ్రీ ఎం. బలరామాచారిగారికిని కృతజ్ఞతలు. విన్నవించు,

వట్టికోట ఆళ్వారుస్వామి
రచయిత, ప్రకాశకుడు.

# ప్రజల మనిషి

## 1

తెల్లవారుజామున మొదలైన వర్షం అప్పుడే వెలిసింది. ప్రజలు ఇండ్లలో నుండి బయటికివచ్చి తమ దైనందిన కార్యకలాపాల్లో లీనమయ్యారు. రైతులు తమ పశువులను దొడ్లోనుండి బయటికి వదిలి వీధిలో ఎత్తైన ప్రదేశములో నీరు నిలువనిచోట ఎండుగడ్డి వేశారు. బాటనపోయే ఒక ఆవు గడ్డిలో మూతి పెట్టబోయింది. తన హక్కును హరించపోతున్నదనే కోపంతో గడ్డితింటున్న ఎద్దు ఆవును కుమ్మబోయింది. చేతికర్రతో ఎండు గడ్డిని కిందుమీదుచేస్తున్న కోటయ్య పరీక్షగా తన ఎద్దును చూచాడు. అందరికీ సంబంధించినదిగా తలచబడే వస్తువును ఇతరులు హరించబోతుంటే అడ్డుపడి రక్షించుకొనే ఆలోచన తన ఎద్దుకు కలిగినందుకు మానవుని ప్రవృత్తి తన ఎద్దుకు అలవడినందుకు ఆనందిస్తూ కోటయ్య కొట్టములోకి వెళ్ళాడు.

కొట్టములో గుంజకు కట్టివేసియున్న ఆవును దీనంగా చూస్తూ కోటయ్య కొడుకు కొమరయ్య నిలబడ్డాడు. ఆ ఆవు లొట్టపోయిన రాళ్ళ వద్ద మేతతీయటానికి అతనికి మనసొప్పటంలేదు. ఆవుమీద అంబే అని అరిచింది. కోటయ్య కండ్లవెంట నీరుకారింది. తండ్రిని చూడగానే కండ్లలో నీరును పట్టియత్న పూర్వకంగా ఇంకించుకొన ప్రయత్నం చేస్తూ, "దీనికి చొప్పవేయాల్నా అయ్యా" అన్నాడు. తండ్రి అనంగీకార సూచకంగా కొమరయ్యనుచూచి కొట్టంలో ఈతనార కట్టను పరీక్షిస్తునాడు.

"ఇక రోజు మేపంగద అయ్యా! ఇయ్యాల ఒక రోజేగద! కడుపు నిండ మేపుదాం." కొమరయ్య సందిగ్ధధోరణిలో అడిగాడు.

"ఇయ్యాళ్ళంతా అది ఉండబోతుందా? ఇప్పుడో, ఇంకాసేపటికో సుంకరి పుల్లయ్య రానేవస్తాడు." అంటూ కోటయ్య విసుగుతో ఇంట్లోకి వెళ్ళాడు.

ఆవును దక్కించుకునే ఆలోచనేమన్నా ఉందేమో అడుగుదామని, తండ్రి వెంబడే పోయాడు కొమరయ్య.

"ఇక మనకు ఆవు దక్కదా అయ్యా?" కొమరయ్య గంభీరంగా అడిగాడు.

"నీ కెందుకురా ఈ తిప్పలంతా? కన్నబిడ్డనే ఇంకో అయ్యకిచ్చి రోజులు గడపటం లేదు? ఇక గొడ్డుకొచ్చింది" అన్నాడు కోటయ్య.

"అంచే"అని కొట్టంలోనుండి ఆవు దూడ అరుపు వినవచ్చింది. కొమరయ్య పెరట్లోకివెళ్ళి, గోడమీదినుంచి కొట్టంలో ఉన్న, ఆవును, దూడను దీనంగాచూస్తూ నిలుచున్నాడు.

చేదబావివద్ద పాచిపని చేసుకుంటున్న తల్లివద్దికి వెళ్ళాడు. "ఆవును దొరకు ఇయ్యొద్దని నీవైనా చెప్పరాదే."

"నే నివ్వమంటేగా వద్దనటానికి?"

"అదికాదే. ఆవును దొర తోలుకపోతాడన్నప్పటినుంచి నాకెటూ తోచడంలేదు. దానికింద కుర్రదున్నను ఇస్తే తీసికోడా దొర?"

"అదంతా నాకేం తెలుసు నాయనః ఆ ఆవునే కావాల్నన్నాడట దొర. మీ అయ్యకు మాత్రం ఇయ్యాల్ననిఉందా? దొర ఆవును అడిగిన్నాడు మీ అయ్య సరిగా బువ్వకూడా తినలే" అంటూ పెరుగుకుండ గీకిన గోకను కొమరయ్య చేతిలో వేసింది తల్లి అన్నమ్మ.

"చూడు! బాయికాడికిపోయి, వంగ పిందెలు, అనగప్పిందెలు, మిర పకాయలు ఏమైన ఎళ్ళుయేమో చూడు, నేను ఆవును దొరకాడ ఒప్పచెప్పి అచ్చేవస్తా," అంటూ కోటయ్య నెత్తిరుమాలు చుట్టాడు.

కొమరయ్య గొంగడి భుజాన వేసుకొని కర్రను అడ్డంగా మధ్యన కట్టుకొని కొట్టంలోకి పొయ్యాడు. ఆవు ముఖాన్ని దిద్దాడు. గంగడోలును దువ్వాడు. వెన్నుమీదినుండి రెండు వైపుల రెండు చేతులువేసి కౌగలించు కొన్నాడు. ఆవు ఆప్యాయంగా కొమరయ్య వైపు తలతిప్పి నాకాలని

నాలుక నాకించింది. కొమురయ్య ఆవు వెన్నుపై తలవాల్చాడు. ఉబికి వచ్చిన కంటినీరును తుడుచుకుంటు, ఆవు దూడ వద్దికి వెళ్ళాడు. దూడ చిన్న అరుపు పెట్టి, కుప్పిగంతులువేయ సన్నద్ధమవుతున్నది. పలుపువల్ల ఏర్పడిన ప్రతిబంధకాన్ని, కండ్ల ద్వారా కొమరయ్యకు చెప్తున్నట్టు తలఎత్తిచూచింది. తిరిగి చిన్న అరుపు అరిచింది. కొమరయ్య దూడ పలుగు విప్పాడు. దూడ కుప్పిగంతులేస్తూ తల్లినిచేరి పాలు చీకసాగింది. దూలంమీద ఉన్న గడ్డి మోపును చేతికర్రతో కిందపడేశాడు కొమరయ్య. మోపును ఊడ్చుకపోయి ఆవు ముందర వేశాడు. ఆనందంతో ఉబ్బిపోయాడు. టొటటొట కన్నీటి చుక్కలు రాలాయి.

"కడుపునిండా తాగు. అక్కడ నీ కడుపునిండ పాలు వస్తాయో లేదో" మనసులో అనుకుంటూ బావిదోవ పట్టాడు. వెనుకకు తిరిగి, తిరిగి చూసుకుంటూ కష్టంగా ఒక్కొక్క అడుగువేస్తున్నాడు.

పెద్దవాన పడినప్పుడల్లా ఊరిపక్క కాలువ నిండుగా పారుతుంది. దాన్ని దాటి పోవాల్సిన పిల్లవాండ్లకు ఇబ్బందిగా ఉంటుంది. కొమురయ్య కూడా ఎన్నోసార్లు భయంతో కాలువ దాటలేక ఇంటికి తిరిగివచ్చాడు. కాని ఆ రోజు కొమరయ్య ఒళ్ళుమరిచి కాలువదాటి పోతున్నాడు. కాలువలోతు గాని. అతనికి ఎల్లప్పుడు కలిగే భయంగాని స్ఫురించలేదు ఆలోచనలోనే కాలువదాటి కొంత దూరం పోయాక వెనుకకు తిరిగి, కాలువ ప్రవాహాన్ని తీక్షణంగా చూచాడు. మొలబట్ట, గొంగడి చివర భాగం తడిసి నీళ్ళు కారు తున్నాయి. అంతలోతు, ఇంత తొందరగా, సులభముగా ఎట్లా దాటాడో ఆలోచిస్తూ నిలబడి పోయాడు. పక్క చెలకలో గొడుక కింద మూయబడి యున్న గొర్రెపిల్లల అరుపులో తెప్పరిల్లి తిరిగి బావిదోవ బట్టాడు. బావిగడ్డ మీద గుడిసెలో కూర్చొని ఎక్కి ఎక్కి ఏడ్చాడు. "ఆవు బాగా పాలిచ్చేది. మంచి ఆవును వదులుకోవడానికి అయ్య ఎందుకు ఒప్పుకున్నాడో" అర్థం కాని తండ్రి అసహాయస్థితిపై కొమరయ్య ఆలోచించసాగాడు.

దూరంనుండి తండ్రి పిలుపు వినవచ్చింది. గుడిసెలోనుండి బయ టికివచ్చాడు. కోటయ్య వస్తూనే వంగతోట్లో చెట్లను పరిశీలించాడు. "అనగప్పు

తీగెను మళ్లీ చూడు, ఏమైన పిందెలు పడ్డయేమొ!" కొమరయ్యా నుద్దేశించి అన్నాడు కోటయ్య.

కొమరయ్య తీగెలను మళ్ళేస్తూ "ఎన్ని తెంపమంటవు" బిగ్గరగా తండ్రిని అడిగాడు.

"తెంపకు, నేనువచ్చి చూస్తా" అంటూ కోటయ్య తీగెవైపు వెళ్లాడు. తీగెంకు అక్కడక్కడ ఉన్న పిందెలను చూస్తున్నాడు.

"ఆవును ఎందుకిస్తున్నా వయ్యా?" బరువైనధ్వనితో కొమరయ్యా అడిగాడు.

కోటయ్య చకితుడై. గంభీరంగా కొడుకును చూస్తు "కండ్లు ఉబ్బిన వేం? ఏడ్చినావు? ఎందుకురా?" జాలిగా అడిగాడు.

"ఆవును ఇయ్య కయ్య" కొమరయ్య బ్రతిమలాడినట్టు అన్నాడు.

"వద్దంటే ఆగుతదా, పిచ్చోడా. నాకు మాత్రం ఇయ్యాలని ఉంది? దొర అడిగిండు, ఇస్తున్న, అంతే."

"ఇవ్వనంటే దొర ఊరుకోడా?"

"ఇయ్యన్ని నీకెందుకులే ఇప్పట్నుంచి. ఇంకో మంచి ఆవును తెచ్చుకుందాం."

"ఆతెచ్చే ఆవును దొర కియ్యరాదే."

"ఇయ్యాల దొర అల్లుడొస్తున్నాడట. రేపు అల్లుడిని, బిడ్డను సాగ నంపుతారు. వాండ్లతో మన ఆవుకూడా పోతది. బిడ్డకు ఇస్తాడట మన ఆవును" అంటూ కోటయ్య అనగపు తీగెలకున్న పిందెలను కొడుకుకు చూపాడు. "ఆపిందెలు తెంపి, మిరప తోట్లో ఇన్ని మిరపకాయలు తెంపు తుండు. బిరాన దొరకు పంపాలె. పొద్దెక్కుతున్నది" అంటూ కోటయ్య వంగ తోట వైపు వెళ్ళాడు.

కొమరయ్యకు గాయంమీద కారం చల్లినట్లైంది. "మా అయ్యకు పిచ్చి లేశినట్టుంది. అన్నీ దొరకే కావాల్నట" అన్నట్టు వింతగా తండ్రిని

కొద్దిసేపు చూచాడు. ఆనగపు పిండెలు చేతపట్టుకొని మిరపతోటవైపు వెళ్ళాడు. కోటయ్య కూరగాయలు తీసికొని వెళ్ళి పోయాడు.

కొమరయ్య తిరిగి ఆలోచించ మొదలు పెట్టాడు. పక్కనే ఉన్న కంచె వైపు దిగాలుపడి చూస్తున్నాడు. ప్రతిరోజు ఆవును కంచెలో తోలి బావిగడ్డ మీద చూస్తు నిలుచునే కొమరయ్యకు, ఆరోజు ఆవు లేకుండా కనపడుతున్న కంచె జాలి కొలిపింది. "ఇక ఆవు ఈ కంచెకురాదు. ఈ ఊళ్ళోనే ఉండదాయె" ఒక నిట్టూర్పువిడిచాడు. కంచెను దిగాలుపడి చూస్తున్నాడు.

కంచెలోని చెట్లల్లో ఎవరో పిల్లవాడు తిరుగు తున్నాడు. ఎవరా అని చూస్తున్నాడుకొమరయ్య. ఆ పిల్లవాడు మోదుగు చెట్లలో అటు, ఇటు తిరుగుతున్నాడు. చేతిలోని గైకత్తిని అటూ, ఇటూ తిప్పుతున్నాడు. కొమ రయ్య కంచె దోవబట్టాడు. కంచెలోని పిల్లవాడు కొమరయ్య రాకను కని పెట్టాడు. అంగీతో కండ్లు తుడుచుకున్నాడు. కొమరయ్య వస్తున్న వైపు చూస్తు నిలుచున్నాడు.

కొమరయ్య దగ్గరికి వెళ్ళి, "ఓ, నూవా? ఎన్నడు లేంది ఇయ్యాళ ఇదేంపని? ఇయ్యాల బడికి పోలే? పంతులు నిన్నొదిలిండా?" ప్రశ్నలు కురిపించాడు.

ఆ పిల్లవాడు నిరుత్తరుడై దిగాలుపడి కొమరయ్యను చూస్తున్నాడు.

"ఆకులు తెంపుత" కొమరయ్య గైకత్తితో మండలు కోయ సాగాడు. ఆ పిల్లవాడు ఉబికివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక బావురు మని ఏడ్చాడు. కొమరయ్య దిగాలుపడి గైకత్తి కిందపడవేసి, ఆదరంతో "ఎం దుకు ఏడుస్తున్నావ్" అన్నాడు.

"మాఅమ్మ నన్ను బల్మోంచి బలవంతంగా తీసికొచ్చి ఇక్కడికి పంపింది" గద్గదస్వరంతో అన్నాడు ఆ పిల్లవాడు.

ఆ పిల్లవాడు వైష్ణవుడు. అతని పేరు కంఠీరవం. అతని గురించి బడి పిల్లల తల్లి తండ్రులంతా వింతగా చెప్పుకుంటారు. అక్షర స్వీకారం

జరుగకుండానే అతని చదువు మొదలైంది. బడిపంతులు అతనంటే ప్రాణాల్ని వదిలేవాడు. కంఠీరవం బడిలో ఉన్నంతసేపు పంతులు వళ్ళోనో, కుర్చీమీదనో, బడిలేనపుడు పంతులు ప్రక్కమీదనో, పంతులమ్మ వళ్ళోనో గడిపేవాడు. పంతులు కులానికి మహమ్మదీయుడైనా కంఠీరవం గారిపు అగ్రజాతి వాడైనా వారి పరస్పర ప్రేమ, వాత్సల్యాలు ఆ గ్రామంలో ఒక విశేషంగా చెప్పుకునేవారు. ఇంట్లో తల్లితండ్రులు కోపపడినా, ఇష్టం కాని పని చెప్పినా చెప్పకుండా కంఠీరవం పంతులు వద్దికి చేరేవాడు.

ఆనాడు కంఠీరవం మామూలుగా బడికివెళ్ళాడు. కాని పంతులు పరగ్రామం వెళ్ళినందున పిల్లలంతా ఆడుకొంటున్నారు.

కంఠీరవం తల్లి ఆండాళమ్మ బడికి వచ్చి, కంఠీరవాన్నుద్దేశించి, "ఇటు రా తండ్రి''అని పిలిచింది. బడి కడపలో నిలుచుండి "ఎందుకే?" ప్రశ్నించాడు కంఠీరవం. "ఏమీలేదు నాయనా! ఇన్ని మోదుగు ఆకులుతెచ్చి పెట్టాలె కొడుక" ఆండాళమ్మ బ్రతిమిలాడింది.

"నేను రాను"అని కంఠీరవం. గిదగిద ఉరికి, పొయ్యివద్ద వంట చేసుకుంటున్న పంతులమ్మ వీపుపై పడ్డాడు. గట్టిగా కౌగలించుకున్నాడు.

మహమ్మదీయుల ఇంట్లో అడుగుపెట్టడమే ఆండాళమ్మకు కష్టంగా ఉంది. కాని ఏం చేస్తుంది? ఇరువై ఇస్తాళ్ళు కుట్టి రామభూపాలరావు దొర ఇంటికి పంపాలె. దొర ఇంటికి చుట్టాలు వస్తున్నారు. అవసరమున్నపుడల్లా ఆ విధంగా కుట్టి ఇవ్వడం మామూలు. తోరణం ఆకుల్తో కుట్టి ఇస్తామంటే, పచ్చిఆకులు దొరుకుతున్నపుడు తోరణం ఆకుల్తో వద్దని ఇస్తాళ్ళు కావాల్నని చెప్పవచ్చిన ఆడబాపడు అన్నాడు.

ఆండాళమ్మ భర్త రఘునాథాచార్యులు, పెద్దకొడుకు వెంకటాచార్యులతో దేశసంచారానికి వెళ్ళాడు. అందువల్ల ఆండాళమ్మ విధిలేక ఆరాటంతో బడికి వచ్చింది. కంఠీరవం రానంటున్నాడు. మహమ్మదీయుల ఇంట్లో, పైగా పొయ్యివద్ద చేరాడు ఆండాళమ్మ బహుకష్టంగా ఒక్కొక్క అడుగు వేసుకుంటు పెరట్లో నుండి వంటఇంటి కడపవద్దికి వెళ్ళింది. పంతులమ్మ

కోడిగుడ్లు పగులకొడ్తున్నది. అండాళమ్మ ముఖం తిప్పుకొని, మూతికి కొంగు అడ్డుపెట్టుకొని "మా పిల్లవాడిని బయటికి పంపమ్మ కాస్త. ఇంట్లో ఎవరు లేరు"అన్నది.

"నీ కొడుకును నేను పట్టుకున్నానా!" నవ్వుకుంటూ పంతులమ్మ అన్నది.

"నేను పోవాలెతల్లి. చాలా పొద్దెక్కి పోయింది"అంటూ, "వస్తావా రావా?" గద్దించింది కొడుకును.

కంఠీరవం పంతులమ్మకు దూరంగా మంచంమీదచేరి, "నేనురాను" అన్నాడు, బోర్లపడుకొని కొంటెగా తల్లిని చూచాడు.

"ఏం చేయను వీడితో? పదిహేను, ఇరువై ఇస్తర్లు కుట్టివ్వాలె, ఎక్కడి పనిఅక్కడే ఉంది. ఇంట్లో ఒక్క ఆకు చింపుకూడా లేదు. వీడేమో మంకు చేస్తున్నాడు." అండాళమ్మ ఆరాటపడింది.

"పోరాదు నాయన, పంతులు పగటికి వస్తాడు. అందాక ఇంటికి పొయ్యి అమ్మచెప్పిన పని చెయ్యి" అంటూ పంతులమ్మ కంఠీరవాన్ని సమీపించ పోతుండగా, "కొంచెం చేయికడుక్కొని పట్టుకరా అమ్మ." అండాళమ్మ పంతులమ్మకు ఆచార విధిని తెలిపింది.

పంతులమ్మ ముసి, ముసిగా నవ్వింది. అండాళమ్మను ఓరకంటితో చూచింది. చెయ్యి కడుగుకొని కంఠీరవాన్ని అమాంతంగా ఎత్తుకొని "పోయిరాపో నాయన"అని ముద్దుపెట్టుకొన్నది.

"బాగుంది గారాబం. దున్నపోతున్నట్టున్నాడు. ఎందుకెత్తుకున్నవు? కడుపు నొప్పి లేస్తుంది" అని పైకి మాత్రం అన్నది. కాని తన కొడుకుపై పంతులమ్మ చూపే ప్రేమకు లోలోన ఆనందించింది అండాళమ్మ.

"ఎందుకమ్మ దున్నపోతంటారు? బంగారంలాంటి కొడుకును? మాకిచ్చేయండి మేము సాదుకుంటాం" అని పంతులమ్మ కంఠీరవాన్ని కిందికిదింపింది. "అన్నంతినగానే పంపండి", "వస్తావుకదు" పంతులమ్మ గారాబంగా కంఠీరవాన్ని చూచింది.

కంఠీరవం ముఖం మార్చుకొని, తల్లి చేయిపట్టుకొని ఇంటికి వెళ్ళాడు. ఆండాళమ్మ బస్తాసంచి, గైకత్తి ఇచ్చి విస్తరాకులకు పంపింది. పిల్లల సాయంతో, దున్నపోతుమీద ఎక్కించి కాల్వదాటిందాక ఇవతలి ఒడ్డున నిలుచున్నది ఆండాళమ్మ. కంచెకు వెళ్లేవరకు అక్కడ కొమరయ్యా సాహచర్యం దొరికింది.

కొమరయ్యా మండలు కోస్తున్నాడు. కంఠీరవం మండలు ఏరి ఒక చోట కుప్ప చేస్తున్నాడు. తర్వాత ఇద్దరూ కూర్చొని మండలనుంచి ఆకులు తుంచ మొదలు పెట్టారు.

"మా అయ్య మాఆవును దొరకిచ్చిండు" కొమరయ్యా అన్నాడు.

"మెకు మరి" కంఠీరవం వెంటనే ఆవేదనతో అడిగాడు.

"మా అయ్య ఇంకోటి తెస్తానన్నాడు. కాని ఎన్నడు లేంది నువ్వ ఇయ్యాల ఇస్తరాకుల కొచ్చిన వెందుకు?"

"మా నాయనగారు, అన్నయ్య సంచారం పోయిన్రు. ఇవ్వాళ దొర ఇంటికి చుట్టాలొస్తున్నారట. ఇరువై ఇస్తళ్ళు మా అమ్మ కుట్టివ్వాలట."

"అవును! చుట్టాలొస్తున్నారట. మా అయ్య మిరపకాయలు, ఆనగపు పిందెలు, వంకాయలు తీస్కపోయిండు".

ఆలోచనాధోరణితో, "ఊఁ! మీరు కూరగాయలు, ఆవును ఇస్తున్నారు. ఇస్తళ్ళు మా అమ్మ కుట్టిస్తున్నది. వాండ్లింటికి చుట్టాలొస్తే అంతా మనకే వచ్చించే."

"అదే నిన్నడుగుదామనుకొంటున్న. దొంకు గతిలేదా యేం? ఆచుట్టాలతోటి మా ఆవును పంపుతాడట."

"ఎందుకు?"

"మా ఆవును దొర తన బిడ్డకు ఇస్తాడట."

"మీ ఆవును దొరబిడ్డకు ఇవ్వడమేమిటి?"

"అవన్ని అడుగొద్దంటాడు మా అయ్య."

" మనం ఏమీ అడుగొద్దంటే, మనతో ఆ దొరకు పనిచేయించడ మెందుకో! మరి అయితే ఇస్తళ్ళు కుట్టటానికి మా అమ్మనుకూడా దొరబిడ్డ వెంట తోల్తారేమో!!"

"ఏమో! మీ అమ్మను అడుగు."

"అడుగుత. మా నాయనగారు, మా అన్నయ్యకూడా ఊళ్ళోలేరు. మా అమ్మకూడా లేకుండ పోతే నాకు అన్నం ఎట్ల?"

"బడి పంతులు ఉన్నాడుగా" కొమరయ్య నవ్వుతూ అన్నాడు.

"ఛా! అతడు తురకనాయె. వాండ్లు గుడ్లు, చాపలు తింటారు. నేను తినకూడదాయె."

"వేరే వాండ్లతో వేరే ఏమన్న వండించి పెట్తడు పంతులు."

"అవును. అదికూడా అమ్మను అడుగుత."

మాటల్లో మొత్తం ఆకులు తుంచారు. తర్వాత ఇద్దరు ఆకులను సంచిలో నింపారు. కంఠీరవం కాసేపు, కొమరయ్య కాసేపు కొంతదూరం సంచిని మోసుకుంటూ వచ్చారు. ఇద్దరూ అలసిపోయారు. ఆ సంచిని గైకత్తికి మధ్యన కట్టారు. కావడిగాచేసి ఇద్దరు చెరొకవైపు భుజాన పెట్టు కొని కాల్వవరకు వచ్చారు. దున్నపోతుల సాయంతో కాల్వదాటారు. మళ్లా కావడిగా చేసికొని కంఠీరవం ఇంటికి చేరారు.

ఇంటికివచ్చే వరకు ఆండాళమ్మ ఇస్తరి పుల్లలు చీకుతు కూర్చున్నది ఇస్తళ్లు కుట్టడానికి సహాయానికై పిలిపించుకున్న సాతాని మంగమ్మకూడా పుల్లలు చీకుతున్నది.

ఆండాళమ్మ లేచి. "తెచ్చినావు కొడుక," అన్నది. సంచితెచ్చి మంగమ్మ కూర్చున్నచోట విప్పి ఆకులు కుమ్మరించింది. "ఏడెవరో జంట దొరికిన్రే?"కొమరయ్యను చూస్తూ, "ఎవరి కొడుకువు పిల్లగా?" అడిగింది.

"మొదట బళ్ళో నాతోటే చదివిండే, ఇప్పుడు బడికి రావటంలేదు. బాయిదగ్గరికి పోతున్నాడు" కంఠీరవం సమాధాన మిచ్చాడు.

"మీ నాయన పేరేంది పిల్లగా?" సాతాని మంగమ్మ అడిగింది.

"గొట్టం కోటయ్య."

"మీ ఆవునేనా దొరతోలుక పోయింది?" మంగమ్మ ఆతురతతో అడిగింది.

బిక్క ముఖంతో, "అవును"అన్నాడు.

కొమరయ్య, కంఠీరవం ఆకుల తొడిమెలు తీస్తుకూర్చున్నారు.

"నేను చెప్పలేదా, ఇదే సంగతి? పాపము! బిడ్డడు కడుపునిండా పాలుతాగిండో లేదో!! మొన్న మొన్ననే ఈనింధట. ఎవడికంట్లో మన్ను పోసుకున్నడో, పాలు బాగా యిస్తుందని దొరకు తెలిసింది. ఇంకేముంది? కావాలన్నాడు" మంగమ్మ మూతి విరిచింది. తొడిమెలు తీసిన ఆకులు కిందుమీదుచేస్తూ పెద్ద ఆకులు ఏరింది.

"అమ్మా! దొర బిడ్డ ఊళ్లో ఇస్తళ్ళు కుట్టివ్వడానికి దొర నిన్ను పొమ్మంటే పోతావా? నాకుఅన్నం ఎవరు పెడ్తారు? పంతులు తురకనాయె. ఆయనింట్లో తినకూడదాయె" కంఠీరవం అడిగాడు.

"మా ఆవును దొర బిడ్డతో పంపుతారట" కొమరయ్య అన్నాడు.

"అదా సంగతి? చూచావమ్మా? దొరకు గింత ఉన్నడోలేదో అన్ని తెలుసుకున్నడు. బిడ్డకుఅరణం ఇస్తున్నాడు గామాలు, ఆవును" మంగమ్మ ఆశ్చర్యంగా అన్నది. ఇస్తళ్ళు కుట్టసాగింది.

"మరి నిన్నుగూడ రమ్మంటారా అమ్మ" తిరిగి కంఠీరవం అడిగాడు,

"పిచ్చి తండ్రి! ఆడఊళ్లో ఇస్తళ్ళు కుట్టేవాండ్లున్నారు, నేనేం పోను" అని ఆండాళమ్మ తల నిమిరింది. "నీకు అన్నీ ఆదుకోవడానికి పంతులు, పంతులమ్మ లేరు? అక్కడే తిను" ముసిముసిగా నవ్వుతూ ఆండాళమ్మ అన్నది.

"అయితే, ప్రతి ఊళ్ళో ఇట్లా కుట్టేవాండ్లుంటారా అమ్మ?"

"ఉంటారు, ఎందుకుండరు? మీ తాత కాలంలో ఈ దొర తండ్రిని

ఆశ్రయించుకునే యిక్కడికి వస్తిమి. ఆ దొర చచ్చి స్వర్గంలో ఉన్నాడు. మహారాజు చెరువు కింద నిక్షేపంలాంటి పొలమిచ్చిండె. ఓఅయ్యను ఆశ్రి యించకుండా గుట్టుగా కాలంవెళ్ళేది. ఆదొర చచ్చిండు. పొలంపోయింది. కాని మంగమ్మా! చాకిరి మాత్రం తప్పటంలేదు. అక్షరజ్ఞానంలేని పెద్దవాడిని వెంటేసుకొని, పెద్దమనిషి, ఇల్లనక, వాకిలనక, ఒళ్లనక దేశాలు తిరిగితే గాని ఈమాత్రం సంసారం నడవటంలేదు. నీకు తెలియదా మంగమ్మ? ఆ దొర చచ్చిం తర్వాత ఒకటికొకటి విపరీతాలు పుట్టుకొస్తున్నాయి కాని'' అండాళమ్మ అంటుండగా గుడ్లల్లో నీళ్ళు తిరిగాయి.

"నీకు ఎరికే ఉండొచ్చు. మొన్నకిస్తులో మా ఇంటాయనను ఫజీతా చేసి వసూలు చేసిన సంగతి" మంగమ్మ తన ఇబ్బందిని తెలుపుకుంది.

"చచ్చిన దొర రోజులలో గడీలో ఏది జరిగినా ఊరంతా పెండ్లి వోలె ఉండేది. ఆ మామూళ్ళు, మర్యాదలు ఇప్పుడు లేక పోయినా, సాగించు కోవడం మాత్రం తప్పడంలేదు." అండాళమ్మ అన్నది.

"అవును, అంతే, ఇంగువ కట్టినగుడ్డ'' మంగమ్మ తోడుపలికింది.

"చిన్న, పెద్ద విచక్షణ లేకుండాకూడా పోతున్నది మంగమ్మ, నీవేమన్నా అను. ఆ దొర లేమంటారోఏమో కాని మధ్య ముండాకొడుకు లున్నారే, ఒక్కొక్కడు మిడిసిపడి పోతున్నారు. ఇస్తళ్ళు కావాలని చెప్ప వచ్చిన ఆడవాప రంగడు కూడా మాట్లాడే పద్ధతిని చూస్తే నాకు ఒళ్లుమండి పోయింది.'' అండాళమ్మ అన్నది.

మంగమ్మ, అండాళమ్మ సంభాషణ శ్రద్ధగా వింటూ కామయ్య కంఠీరవం అప్పుడప్పుడు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొంటున్నారు.

"వాండ్ల నంటే ఏంలాభం. సాగే అవకాశముంటే సాగుతుంటుంది. పైవాండ్ల ఆసరా ఉంటేనే కిందివాండ్లు ఎగురుతుంటారు. ఇంతకు ఎన్ని అయినట్లు ఇస్తుళ్ళు? మావాడు పొద్దున ఏమీ తినకుండానే పోయిండమ్మ బడికి. రోజు ఏంపెడ్తాం? ఎక్కడినుంచొస్తాయ్. నోట్లో తడిలేని పుటకలు.

ఇంకా అయిదు ఇస్తళ్లు కుట్టిపోతానమ్మ” మంగమ్మ ఇస్తళ్లు లెక్కపెడ్తూ అన్నది.

ఆకుల తొడిమెలు తీస్తున్న కంఠీరవం “మడి ఎప్పుడే కట్టుకునేది” తల్లినడిగాడు.

“ఇవి కావొద్ద కొడుక. కొడుకు ఎన్నడు లేంది ఆకులకు పోయిం దమ్మ. కొడుకు ఎంత కష్టపడ్డడో” కంఠీరవం నెత్తిని నిమురుతూ తల్లి అన్నది,

“అయితే నేను పంతులు దగ్గరికి పోతా. పంతులు వచ్చిండొచ్చు. లే, కొమరయ్య పోదాం రా” అని కంఠీరవం లేచినిలుచున్నాడు.

“నేను బడికిరాను. పంతులు కోప్పడతాడు. మాఅయ్యా నన్ను బళ్ళోంచి తీసినప్పుడు మాఅయ్యతో పంచాయితి పెట్టుకుండు.”

“సరే అయితే, ఇంటికిపో'' అని కంఠీరవం బడిదోవ పట్టాడు.

కొంతసేపట్లో ఆడబాప రంగడు ఇస్తళ్ళ కొరకు వచ్చాడు. గడిలోకి కావలసిన మొత్తం ఇస్తళ్ళు ఇరువై అయినా కుట్టిఉన్న ఇరువై మూడు ఇస్తళ్ళు కూడా అవసరముందని తీసికెళ్ళాడు. ఒక ఇస్తరి, చేత బట్టుకపోతామనుకున్న మంగమ్మ నిరుత్సాహంతో ఏదో గొణుగుకుంటూ ఇంటికి పోయింది. “ఏదో వైపరీత్యానికే వచ్చింది” అండాళమ్మ తనకు తానే అనుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

కంఠీరవం తండ్రి రఘునాథాచార్యులు తండ్రితో పాటు ఆగ్రామం చేసుకొని ఎంతోకాలం అయిపోయింది. రామభూపాల్‌రావు తండ్రి భుజంగ రావు బ్రతికి ఉన్నప్పుడు రఘునాథాచార్యులు చాలా మన్ననలు పొందాడు. రఘునాథాచార్యులు యొక్క పాండిత్యప్రతిభను మిక్కిలి కొనియాడేవాడు. భుజంగరావు మరణించిన తర్వాత రామభూపాల్‌రావు వ్యవహార పద్ధతి రఘునాథాచార్యులకు నచ్చలేదు. రఘునాథాచార్యుల అసంతృప్తికి ప్రబలమైన ఏకారణం లేకపోయినా రామభూపాల్‌రావు మాటల వైఖరి,

ప్రజలతో వ్యవహరించే విధానం, వ్యక్తిగత జీవితము మొదలైన అతని దైనందిన జీవిత విధానమే రఘునాథాచార్యులకు ఏవగింపుగా తోచింది. ముఖ్యంగా భుజంగరావులో కనిపించిన విశాల భావము, ఠీవి, మర్యాద, మన్నన, విచక్షణా జ్ఞానము రామభూపాల్‌రావులోలేవని రఘునాథాచార్యులు తేల్చుకున్నాడు. దానితో రామభూపాల్‌రావు అంటే రఘునాథాచార్యులకు ఒక విధమైన నిర్లక్ష్యము, నిరసన భావం ఏర్పడింది. రఘునాథా చార్యులకు, చదువుకున్నాననే ధీమా, గర్వము ఎక్కువ ఉందని రామభూపాల్ రావుకు ఒక అభిప్రాయమేర్పడింది. ఈవిధంగా పరస్పరం సుముఖత లేకుండా కొన్నాళ్ళు గడిచాయి. ఇట్టి వాతావరణానికితోడు రామభూపాల్ రావు బిడ్డ పెండ్లి సందర్భమున జరిగిన ఒక సంఘటనలో రామభూపాల్ రావుకు, రఘునాథా చార్యులకు యింకా బెడిసి పోయింది.

పెండ్లి ఆడంబరం, అట్టహాసంతో ఊరి ప్రజలంతా ఉబ్బి, తబ్బిబ్బై పోయారు. పనిపాటల వాండ్లకు ఊపిరి మెసలకుండా అయిపోయింది. పెండ్లి అయిదు రోజులకు కావాల్సిన కూరగాయలు అందించే బాధ్యత రైతులకు ఒప్పజెప్పబడింది. ప్రజలు తమ ఇండ్లలోని పాలనుండి వెన్నను భద్రపరిచి నెయ్యి సిద్ధం చేయించి వీలున్న ప్రతి చోట మంచి నెయ్యి సేకరించి అందించే బాధ్యత, పెండ్లి రోజుల్లో సామాను గది నిర్వహించి తిను పదార్థాలను అందించే బాధ్యత, గ్రామవైశ్యుల నెత్తిన బడ్డది. గ్రామంలో ఉన్న బల్లెపీటలు, మంచాలు అతిథుల అవసరాలకై ప్రత్యేకించ బడ్డవి. అతిథుల పశువులకు మేతకొరత రాకుండా చూచే బాధ్యత కొందరి రైతులకు అప్పగించబడ్డది. వీధుల పరిశుభ్రత, గుర్రాలను అరుచుకొనే భారం చేగారి వాండ్లపై బడ్డది. ముఖ్యంగా ఆ పెండ్లి దిగ్విజయంగా జరిగి, రామభూపాల్‌రావు ఘనతకు ఏలాటిలోటు రాకుండా చూచే బాధ్యత గ్రామ ప్రజల కర్తవ్యంగా నిర్ణయించబడ్డది. ఆ పెండ్లిని గురించి, అందుకై చేస్తున్న సన్నాహాలను గురించి, జరుగబోయే వినోదాలను గురించి చుట్టు పట్ల పది గ్రామాలవరకు ప్రజలు వింతగా చెప్పుకున్నారు. మంగళగిరి

నుండి సన్నాయిమేళాన్ని, బెజవాడనుండి ప్రవీణులైన సంగీత పాటకులను, కూచిపూడి భాగవతుల వాండ్లను, హైదారాబాదునుండి బ్యాండు వాండ్లను, నౌబత్ వాండ్లను, బోగంమేళాన్ని పిలిపించాడు. తోట్లో ఉన్న బంగళా అధికారులకు అతిథిగృహంగా ఏర్పాటు చేయబడ్డది. విశాలమైన ధర్మశాల బోగంవాండ్లకు నివాసస్థలముగా మార్చబడ్డది. రఘునాథాచార్యుల యింటి ముందర, పెరట్లో పందిళ్ళు వేయించి వైష్ణవులకు, గడివెనుక నున్న తోటలో శైవులకు వసతి, భోజన ఏర్పాట్లుచేయబడ్డవి. రామభూపాల్‌రావు ఇంటి నుండి తోటవరకు వెళ్ళే మార్గంలో ఉన్న ఇండ్ల వాండ్లందరూ వారివారి ఇండ్లకు అలుకులు, సున్నాలు, తోరణాలు అలంకరించాలని రామ భూపాల్‌రావు ఆజ్ఞాపించాడు. ఇండ్లల్లోనుండి బయటికి నీరు రాకుండా జాలార్లు మూసివేయబడ్డవి. రామభూపాల్‌రావు స్నానము నీటివరద ఆ ఊరి వారికి గడియారంవలె పనిచేస్తుంది. రామభూపాల్‌రావు స్నానము చేస్తే ఇండ్లముందర నుండి ప్రవహించే నీటివరద వడిని బట్టి ఆయాఇండ్ల వాండ్లు పొద్దు యొక్క గమనాన్ని అర్థము చేసుకుంటారు. ఇంచు మించు అరఫర్లాంగు వరకు ఆవిధంగా ప్రవహించే ఆకాల్వ తోటమార్గాన్నే ఉండ టంబట్టి, ఆ ప్రవాహాన్ని తాత్కాలికంగా వేరే సందులోకి మలిపివేసినారు.

పెండ్లినాడు పెండ్లికొడుకును ఎదుర్కొని వచ్చేటప్పుడు ఊరంతా—పిల్ల జల్ల, ఆడ మగ కదిలిపోయారు. చుట్టుపట్ల గ్రామాలనుండి కూడా వందల కొద్ది ప్రజలు వచ్చారు. మొదట వరుసలో డప్పుల వాండ్లు, కొమ్ముల వాండ్లు, తర్వాత చుట్టు ప్రక్కల గ్రామాలకు చెందిన సన్నాయి వాండ్లు. పిమ్మట ప్రత్యేకంగా పిలిపించబడిన సన్నాయివాండ్లు, ఆ తర్వాత బ్యాండు వాండ్లు. చుట్టూ రామభూపాల్‌రావు బంధువులైన యువకులు తమ గుర్రాలను బ్యాండు చప్పుడుకు అనుగుణంగా, నాట్యం చేయిస్తూ వలయా కారంగా తిరుగుతూ మెల్లమెల్లగా ముందుకు సాగుతున్నారు. వారి వెనుక నౌబత్ వాయిద్యము, దాని తర్వాత బోగంవారి పాటలు, కూచిపూడి భాగ వతుల కీర్తనలు, ఆ తర్వాత బంధువులు, పరివారం, ప్రత్యేకాహ్వానితులు,

వారి ననుసరిస్తూ వైష్ణవులు, శైవులు, సాతానివాండ్లు, భట్రాజులు— ఈ విధంగా ఊరేగింపు బయలుదేరింది. ఊరేగింపుకు రెండువైపుల ప్రజలు క్రిక్కిరిసి నిలబడి చూస్తున్నారు. అక్కడక్కడ అప్పుడప్పుడు రకరకాల మందులు కాల్చబడుతున్నాయి. ఆ ఊరేగింపువల్ల ఒకవైపు ప్రజలకు ఆనందం కలుగుతున్నది. రెండోవైపు అంతమంది దొరల హడావుడిని చూచి భయం కూడా కలుగుతున్నది. ఆ రోజు రాత్రి వివాహం చాలా వైభవంగా జరిగింది.

ప్రత్యేకంగా ఆహ్వానించబడిన మోహనాచార్యులు ఫిడేలుతో బెజవాడనుండి లగ్నంఅయిన మరునాడు మధ్యాహ్నం వరకు చేరుకున్నాడు. భోజనాల వేళైంది. ఇతర వైష్ణవులతోపాటు మోహనాచార్యులకు రఘునాథాచార్యుల ఇంటిలోనే బసఏర్పాటు జరిగింది. మోహనాచార్యులు కనీకనబడనట్టు తిరుమణిచూర్ణముతో బొట్టుపెట్టుకున్నాడు. అయినా అతని వేషం ఆక్రాఫింగు ఆమొత్తం వైష్ణవుల్లో వేరేసినట్టు కనుపించింది. భోజనానికై ఆయత్తపడుతున్న ఇతర వైష్ణవులు వింతగా మోహనాచార్యులనుచూచారు. కొందరు గుస గుసలు సాగించారు. కొందరు కోపానికివస్తున్నారు. వారిలో ఒకడు వస్తున్నకోపాన్ని పట్టలేక, "ఆ అప్రాచ్యుడితో పంక్తి భోజనానికి నేను ఒప్పుకోను. నేనేకాదు మీరెవరుకూడా ఒప్పుకోవద్దని నాఅభిప్రాయం." అధికారధ్వనిలో శాసించాడు. వడ్డనపనులలో లీనమైయున్న రఘునాథాచార్యులు ఆ నిర్ణయం సక్రమమైందేనని ఒప్పుకొన్నాడు.

"ఒక్కని గురించి అందరం మాదుగుల్లో కలవాల్నా?" ఇంకొకడు చేయూతనిచ్చాడు.

"సరే! బాగానే ఉంది. కాని మరి ముందు కర్తవ్యం ఏమిటో తేల్చివేయండి" ఇంకొకడు అందుకొన్నాడు.

ఒక్కొక్కరు ఇంటి వెనుక భోజనం పందిరికింద తర్జా ఓటీరు మాట్లాడుతున్నారు.

"దొరవారు పిలిపిస్తే వచ్చినవాడు కదా! మనవైఖరితో దొరవారికి కోపంరాదా?" ఒకడు ఆలోచనలో పడ్డాడు.

"అయితే? ఇందులో తిండిలేక పొట్ట చేతబట్టుకొని వచ్చిందెవరూ లేరు. ఎవరి ఆచారాలు, గౌరవమర్యాదలు వాండ్లకున్నవి. మన కట్టుబాట్లు, సంప్రదాయాలు మంట కలిసింతర్వాత బ్రతికినా ఒక్కటే చచ్చినా ఒక్కటే" రామభూపాల్‌రావు ఆచార్యులైన తిరువేంగడాచార్యులు గట్టిగా అన్నాడు.

అతని ధోరణితో అందరికి ఆత్మ విశ్వాసం కలిగింది.

"తిరువేంగడాచార్యులవారు సాయించింది చాలా బాగుంది. భ్రష్టులు కావడానికి ఎవడు ఒప్పుకుంటాడు" గుంపులో నుండి ఒకడన్నాడు.

"నేనిప్పుడే దొరవారిని పిలుపించుతాను. ఇందులో మనం చేస్తున్న తప్పేమీలేదు. మంచినిమంచిగా చెడ్డను చెడ్డగా హితవుచెప్పుతూ, వర్ణాశ్రమ ధర్మాలు కాపాడబడేట్టు చూడాల్సింది మనం. రఘునాధాచార్యులవారు! మీరే వెళ్లి దొరవారిని పిలుచుకవస్తే బాగుంటుంది" తిరువేంగడాచార్యులు అన్నాడు.

రఘునాధాచార్యులు ఆతురతతో బయలుదేరాడు. యింటి ముందర పందిట్లో కూర్చుని ఉన్న మోహనాచార్యులను అసహ్యంగాచూస్తు గడీవైపు వెళ్ళాడు.

కొద్ది దూరాన ఉన్న ధర్మశాలలో భోగంవాండ్లు పాడుతున్న పాటలకు తన ఫిడేలుకు స్వరాన్ని తన మనస్సులో కలుపుకుంటు మోహనాచార్యులు పగలు జరుగాల్సియున్న పాటకచ్చేరిలో ప్రదర్శించాల్సిన ప్రావీణ్యతకై పథకం వేసుకుంటున్నాడు.

రఘునాధాచార్యులు గడీలోకి వెళ్ళేవరకు దొరలంతా ఇస్తర్ళ మీద కూర్చుని ఉన్నారు. వడ్డనజరుగుతూ ఉంది. మెల్లగా రామభూపాల్‌రావును సమీపించి, "మిమ్ములను తిరువేంగడాచార్యులుగారు అందాక రమ్మంటున్నారు," అన్నాడు.

"ఇంకా మీరు ఇక్కడే ఉన్నారే. ఇంకా సాపాట్లు కాలేదన్నమాట. అప్పటినుంచి ఏం చేస్తున్నారు" అని రామభూపాల్‌రావు బయలుదేరాడు.

"ఆ సాపాట్లు విషయమే మిమ్ముల రమ్మనడం." రఘునాథాచార్యులు నడుస్తూనే సమాధాన మిచ్చాడు.

మోహనాచార్యులు ఒక్కడే పందిట్లో కూర్చుని కూనరాగాలు తీయడం రామభూపాల్‌రావుకు వింతగా తోచింది.

"మీకు సాపాటుకు చాలా పొద్దుపోయింది. చాలా దూరంనుంచి వచ్చినారు. అలసిఉంటారు. వంట ఎప్పుడో అయిందికదా! ఇంకా ఆలస్యం ఎందుకవుతున్నతో అర్థంకావడంలేదు." మోహనాచార్యులతో అన్నాడు; ఆరాటంతో రఘునాథాచార్యులను అనుసరిస్తూ పెరట్లోకి వెళ్ళాడు. మోహనాచార్యులు కూడా వెంటవెళ్ళాడు.

రామభూపాల్‌రావు సమీపించగానే తిరువేంగడాచార్యులు ఆచార్య పురుషుని ధీమాతో, "అయ్యా! నాకండ్ల ముందరే ఇట్టి భ్రష్టత్వం సంభవిస్తే చూచి ఊరుకోలేను. అనుకోకుండా ఒకటి మా నెత్తిమీద తెచ్చిపెట్టి మమ్ములను పరీక్షిస్తున్నారా? పరీక్షించడానికి సమయం ఇప్పుడే దొరికిందా? (మోహనాచార్యులను చూపుతూ) వారు గొప్ప ప్రవీణులు కావచ్చును. వారి కళా కౌశలం మెచ్చుకో తగ్గదే. కాని వారు జుట్టు పెంచడం, వారితో సహపంక్తి భోజనం చేయడం మాత్రం మేము ఒప్పుకోం. ఇందులో మీరు బాధపడాల్సిందేమీలేదు. నేను మీకు ఆచార్యుణ్ణి, దైవసమానుణ్ని. ఆచార్య పురుషునిగా మీకు హితవు చేయడం నా విధి. ఆ ప్రకారం మీరు నడవడం, శిరసావహించడం మీ కర్తవ్యం. ఇది సంగతి." గుక్క తిరుగకుండా రౌద్రముతో ఏకరువు పెట్టాడు.

మోహనాచార్యులకు తల కొట్టినంత బాధకలిగింది. ముఖం వెలవెల బోయింది. అతని జీవితంలో అలాంటి సంఘటన ఎన్నడూ జరుగలేదు. వెంటనే ఊరు విడిచి వెళ్ళిపోదామన్నంత బాధపడ్డాడు. కాని రామభూపాల్‌రావు అధికారబలం ఆసరా చేసుకొని నిలుచున్నాడు. ఫలితమేమవుతుందో తేల్చుకుందామని నిర్ణయించుకొని ఓపిక పట్టాడు.

రామభూపాల్‌రావు మొత్తం వైష్ణవులను, మోహనాచార్యులను గంభీరంగా ఒకసారి చూచి, తల నేలకు వేశాడు. కండ్లల్లోనుంచి నిప్పులు కురుస్తున్నాయి. కోపంతో వణికి పోతున్నాడు. "అయితే ఇప్పుడేమంటారు?" అధికార ధ్వనిలో అన్నాడు.

"ఇంకే మనమంటాము? జరుగవలసిన శుభకార్యం జరిగిపోయింది. సంతోషం. ఇక భోజనాల సంగతేకద! ఈ ఒక్కపూట తినక పోయినంత మాత్రాన ప్రాణాలు పోతాయా? ఎవరి ఇండ్లకు వాండ్లు చేరుకుంటారు. సిద్ధం చేసిన వంట పనివాండ్లకో, కుక్కలకో వేయించండి." రఘునాధాచార్యులు అన్నాడు.

రామభూపాల్‌రావు కోపము మించిపోయింది. "ఆలోచించకుండ, ఆవేశంలో మాట్లాడుతున్నారా? శుభకార్యాలల్లో మీరన్నట్టు జరగడం మంచిదంటారా?" గుడ్లు మిటకరించి రఘునాధాచార్యులను ఉరిమి చూచాడు.

"మీ శుభాని కేమిలోటు జరిగింది? మా ఖర్మంకాలింది కాని" రఘునాధాచార్యులు వెంటనే అందుకున్నాడు.

"నా శుభం, మీ శుభంగా తలవని మీ మాటలు,నాకేమీ నచ్చటంలేదు." రామభూపాల్‌రావు గొంతు చించుకొని అరిచాడు.

"తనవాడిని పరాయివాడుగా తలచే ఈ వైష్ణవులతో తినడం కంటె మర్యాదగా మీ పంక్తిలో భోజనం చేయడమే ఉత్తమ మనుకొంటాను." మోహనాచార్యులు రామభూపాల్‌రావు నుద్దేశించి అంటూ గిరుక్కున అక్కడి నుండి బయలుదేరాడు. రామభూపాల్‌రావు దెబ్బతిన్న పామువలె బుసకొట్టుకుంటూ గడీకి చేరుకొని మోహనాచార్యులకు ప్రత్యేకంగా ఒక గదిలో వడ్డన చేయించాడు. వైష్ణవుల పట్టుదల, మోహనాచార్యుల నిర్ణయం ఎంత వరకు సవ్యంగా ఉందో దొరలెవరూ వెంటనే నిర్ణయించలేక ఆలోచనలో పడ్డారు. వైష్ణవులంతా విజయోత్సాహంతో అయిదు రోజులు హాయిగా కాలంగడిపారు.

నాటి సంఘటన రామభూపాల్‌రావు అధికార గర్వానికి గొడ్డలి పెట్టు గాను, తన ఆచార్యత్వానికి అమోఘ విజయంగాను తలచి రఘునాథాచార్యులు ఉబ్బిపోయాడు.

పెండ్లి సందడి ముగిసిన తర్వాత, రామభూపాల్‌రావు రఘునాథాచార్యులను పిలిపించాడు. "మేమిచ్చిన భూమిమీద ఇకమీదట మీకేమి జోక్యం ఉండబోదు. ఆ విషయం చెప్పుదామనే పిలిపించింది. ఇక వెళ్ళవచ్చు" అన్నాడు.

"సరే! మీ చిత్తం. ఇచ్చింది మీరే, తీసుకుంటున్నది మీరే. ధర్మదృష్టితో మీ నాయనగారు ఇచ్చారు. ధర్మనిర్వహణంకారణంగానే మీరు ఆ భూమిని తీసుకుంటున్నారు. కాలవైపరీత్యం. మంచిది. ఏదైనా పెరుమాండ్ల కృపే." రఘునాథాచార్యులు వెనుకకు తిరిగి వెళ్లాడు.

ఆనాటినుండి రఘునాథాచార్యులు నిరాశ్రయుడై కేవలం పండితుడుగా, ఆచార్యపురుషుడుగా గడించే ఆదాయమే అతని కుటుంబ పోషణకు ప్రధాన ఆధారమైంది. అయినా అవసరమున్నప్పుడల్లా ఇది వరకు వలెనే గడీలో చాకిరి తప్పడం లేదు.

## 2

రామభూపాల్‌రావు దొర బంకుల్లో అల్లుడు కొండల్‌రావుతో కాలమాన పరిస్థితులను గురించి మాట్లాడుతూ కూర్చున్నాడు. పెద్దగుమాస్తా హైదరలీ పత్రికను శ్రద్ధగా చూస్తున్నాడు. హైదరలీ ఆశ్చర్యంతో లేచి, "చూచారా దొరవారు! ఒక పిల్లకు రెండు తలలట, అదేదో ఊళ్ళో ఒక హరిజన స్త్రీకి పుట్టిందట. ఈ హరిజనులనే వాండ్లు ఏ దేశంలో ఉంటారు దొరవారు?" పత్రికను రామభూపాల్‌రావుకు అందిస్తు అన్నాడు.

"ఏ దేశమేందయ్యా! అగాదం మనిషివి. మాలమాదిగలకు గాంధీ ఆపేరు పెట్టాడు." కొండల్‌రావు హేళనగా నవ్వుతూ అన్నాడు.

"ఎక్కడ తోచక లేనిపోనివి ఏవేవో లేవదీస్తుంటారు. హరిజనుడైతేమి, ఆదిదేవుడైతేమి. మాలమారే మాదిగ మాదిగె. ఉండలేని చేష్టలు గాని" రామభూపాల్‌రావు పత్రికను చూస్తునే అన్నాడు.

"అయితే ఇక మీద మాల, మాదిగను హరిజను లనాలని సర్కారు ఖానూ౯ చేస్తుందా దొరవారు?" అమాయకంగా అడిగాడు హైదరలీ.

"సర్కారు ఖానూను కాదు. గాంధీ అని ఒక కాంగ్రెసువాడున్నాడు. ఆయన ముద్దుగా ఆ పేరు పెట్టాడు. దేవుని మనుషులని దాని అర్థమట" కొండల్‌రావు వివరించాడు.

"మనమంతా దేవుని మనుషులం కాకపోతే దయ్యాలకు పుట్టమా?" "సరేగాని దొరవారు! మాలమాదిగలంటే యాదికొచ్చింది. ఇయ్యాల రేపు అందరికి మాలమాదిగలంటే దయగలుగుతున్న దెందుకో! ఈ గాంధేగా మాలు, మాలమాదిగలు వేరే మతాల్లో చేరితే, చచ్చిందాకా ఉపవాసము జేస్తానన్నాడట. ఎవరో వాండ్లు వీండ్లు పోగై గాంధీని సమ్మతి పరిచినారట. నిజమేనా? ఏది నిజమో ఏది అబద్ధమో. మొన్న నిజామాబాదులో మా అల్లుని ఇంట్లో అనుకుంటుంటే వింటి." హైదరలీ అడిగాడు.

"ఏమిటో జరుగుతుంటాయి" రామభూపాల్‌రావు ఆవలింత దీసి, చిటికెలు వేశాడు. హైదరలీ నుద్దేశించి "చూడు, నేను చెప్ప మరిచిపోయిన. కోమటి శంభయ్యను పేటకు పొమ్మని అనుంటిని. వాడు అశ్రద్ధ మనిషి. నీవే స్వయంగావెళ్ళి వెంటఉండి పంపించు, తెల్లవారేవరకు రావాలనిచెప్పు. అపే పోతు, పోతు, నాగబోయిన యల్లడికి, ఈరబోయిన రంగడికి చెప్పి రేప్రు కచ్చుగాలకు ఎడ్లు కావాలని చెప్పింపు" అన్నాడు.

"మన కచ్చడపుఎడ్లు అవసరమేమోనని ఇవ్వాళ్ళ రేప్రు బాగా మేపండని కొట్టంలోకట్టించిన" హైదరలీ కండ్లద్దాలు పెట్టెలోపెడ్తూ అన్నాడు.

"ఇవ్వాళనే నడిచి, నడిచి వచ్చినవాయె. రేపు మళ్ళీపోవాలంటే ఎట్లా? యల్లడి, రంగడి గిత్తలు కచ్చదానికి బాగా అలవాటైనవి" రామభూపాల్‌రావు అన్నాడు.

"అట్లైతే సరే!" అంటు హైదరలీ వెళ్ళిపోయాడు.

తండ్రి చెప్పిన విషయాలు మామతో ఏవిధంగాచెప్పాలని కొండల్‌రావు ఆలోచిస్తున్నాడు. చేతికర్రను వింతగా పరీక్షిస్తున్నాడు.

"మీవైపు బాగా వర్షాలు ఉన్నట్టేనా?" రామభూపాల్‌రావు అడిగాడు.

"వర్షాలు అట్లట్లనే ఉన్నయి. ఈ సంవత్సరం పశువులు కూడా చాలా నష్టపడ్డవి. రెండు ఇంజన్లు పెట్టిందామని నాయన అనుకుంటున్నాడు. డబ్బు తెమలక ఇబ్బందిగా ఉందని మీతో చెప్పమన్నాడు" కొండల్‌రావు అవకాశాన్ని పురస్కరించుకొని అనేశాడు.

అల్లుని మాటలు వరదక్షిణ పైకం కావాలంటున్నట్టు రామభూపాల్‌రావు పసికట్టాడు. ఇదివరకే ఎన్నో వాయిదాలు పెట్టాడు, ఈ పర్యాయం ఏంచెప్పాలో వెంటనే తలపుకురాక గొంతు సరాయించుకున్నాడు. "మాకు వర్షాలుండగనే అయిపోయింది. ఎన్ని ఒనరులు అనుకూలంగా ఉండాలె" గొణిగినట్లు పైకిఅన్నాడు.

"పెండ్లిబాబతు పైకం ఈపర్యాయం పూర్తిగా తీసికొని రమ్మన్నాడు." కొండల్‌రావు కుండ బద్దలు కొట్టినట్టు అనేశాడు.

"మీనాయనకేం? మహారాజు. అనుకున్నట్లల్లా సాగుతూఉంది. ఏమైనా అంటాడు. ఆయనకే ఇబ్బందిగా ఉంటే నాకెట్లా ఉండొచ్చు, కొంచెం మీనాయనను ఆలోచించమను" రామభూపాల్‌రావు మందహాసముతో అన్నాడు.

కొండల్‌రావు ఇక మాట్లాడటం లాభం లేదనుకున్నాడు. కాని వరదక్షిణ పైకం వసూలుచేసికోలేని అసమర్థుడని తండ్రి కోపపడతాడని ఆరాట

పడ్డాడు. ఇంతలో దాసీవాడు వచ్చి, స్నానానికి రమ్మని పిలిచాడు. కొండల్ రావు లోపలికి వెళ్ళిపోయాడు.

ఇంతలో హైదరలీ వచ్చాడు. కోమటి శంభయ్యను ప్రయాణం చేయించానని, ఎడ్లప ఏర్పాటు జరిగిందని చెప్పాడు. కండ్లద్దాలు తగిలించు కొని దప్తరాలు గూడు వద్దికి వెళ్ళాడు.

రామభూపాల్‌రావు చేత్తో సైగచేసి దగ్గరికి పిలిపించుకొన్నాడు. "చూడు, నీకు చెప్పడం మరచిన. ఖుర్ధీ వచ్చినప్పుడు మన గర్సెలోడన్న ఏమి పుట్లవడ్లు శంభయ్య ఇంట్లో దాచిపెట్టింటిమి గదా! వాటికి ధరకట్టి పబ్బిస్తా నన్నాడు శంభయ్య. వాడు పేటనుంచిరాగానే ఆ పైకం రాబట్టు."

"మీ బాకీ కింద చెల్లు పెడ్తానని మీతో ఒకసారి అన్నట్టు జ్ఞాపకం."

"అన్నాడనుకో! అనగానే అయిపోతుందా? మన అవసరాలు కూడా చూచుకోవాలెగాని. అదీగాక, ఆ వడ్లు బాకీ కింద చెల్లుబెట్టుకోవాలని కాదుగా వాటికి ఇచ్చింది? గింజలు జప్తుకాకుండా వాడిదగ్గర దాస్తే ఇప్పుడు చేతిలో గింజలు చిక్కాయని అట్లా అంటున్నాడు. ఇట్లైతే వ్యవహారా లెట్లాసాగుతాయి? నీవైన ఆలోచించవద్దు? అతనన్నదే ఖానూ నైందని నీవు ఊరుకోపడమేమిటి? ఇట్లైతే బాగనే యిక" రామభూపాల్ రావు కొంచెం కటువుగా హైదరలీని మందలించాడు.

"సరే! పేటనుంచి వస్తాడు కద! వసూలుచేస్తాను. డబ్బు లేక పోతే గింజలు తెప్పిస్తా" అన్నాడు హైదరలీ.

"గింజ లెందుకు? శంభయ్య ధరకూడా నిర్ణయం చేసుకున్నాడు. ఇప్పుడు గింజలు తీసికుంటే అప్పటి ధరకు అమ్ముడుపోతయా? నీకు చిలుకకు చెప్పినట్లు నేర్పాల్సి వస్తున్నదే?"

హైదరలీకి అటువంటి పోటు మాటలు, చీదరింపులు అలవాటే. అద్దాల సందుల్లోంచి వింతగా ఒకక్షణంపాటు రామభూపాల్‌రావును చూచి, తన పనిలో లీనమైనాడు.

వంటవాని పిలుపు రాగానే రామభూపాల్‌రావు ఇంట్లోకి వెళ్ళి పోయాడు.

మరునాడు మేనాలో బిడ్డను, కచ్చడంలో అల్లుడిని సాగనంపాడు. మేనాకు రెండు వైపుల ఇద్దరు దాసీలు, అల్లుడి బండి తొట్లో దాసీవాడు, బండిముందర మాదిగవాడు. బండి వెనుక చాకలివాడు. ఇంకో కచ్చడం ఖాళీగా. దాని వెనుక కోటయ్యవద్ద తీసికున్న ఆవు బయలుదేరాయి.

మేనా, బండ్లు బయలుదేరకముందే ఇద్దరు సేతుసింఫీలు బాట ముందు హడావుడిగా వెళ్ళి కుండలతో ఎవరూ ఎదురుగావుండాను, అరుగుల మీద ఎవరూ కూర్చొనకుండాను ఏర్పాటుచేశారు. మేనాచప్పుడు మూగల చప్పుడువిని, ఆనందంతో అల్లరిచేస్తూ, అడ్డం వచ్చిన పిల్లవాండ్లను అదలించి పక్క సందుల్లోకి తరిమారు. వీధులు ఇంచుమించు నిర్మానుష్య మైనాయి. ప్రజల ముఖాల్లో భయము, హేయభావము తాండవించింది. రామభూపాల్‌రావు బిడ్డ, అల్లుడు ఊరువిడిచి వెళ్ళిపోయారు.

# 3

కంఠీరవం వయసుమీరుతున్నాకొద్దీ బడికి పోవడం తక్కువై పోయింది. ఒక నాడు భోజనాలకని, మరోనాడు వేరే ఊరికి సంభావనకని, ఇంకొకనాడు దొరవెంట ఎక్కడికో వెళ్ళాడని బడి పంతులుకు తెలిసినప్పు డల్లా బడి పంతులు చికాకు పడేవాడు. మొత్తముపై కంఠీరవం అటూ, ఇటు తిరగడం, చదువుకు దూరంకావడం పంతులుకు సహించరాని విషయ మైంది. తన స్వంత కొడుకునే ఇతరులు బలవంతముగా పెడమార్గాన పెట్టున్నారన్నంత బాధ పడ్డాడు.

ఒకనాడు రఘునాథాచార్యులను బడికి పిలిపించుకున్నాడు పంతులు. "పెద్ద కొడుకును చెడగొట్టింది చాలక, చిన్న కొడుకును కూడా తయారు చేస్తున్నారు" పంతులు కటువుగా అన్నాడు.

పెద్ద కొడుకైన వెంకటాచార్యులను, ఒక నాడు బడిలో నుండి ఏ విధంగా లాగుకొని పోయింది, రఘునాధాచార్యులకు తటాయున జ్ఞాపకం వచ్చింది.

రఘునాధాచార్యులు శిష్య సంచారం నుండి ఒక నాడు బడి ముందరి నుండి యింటికి వెళ్లుతున్నాడు. బడిలో పిల్లల ఏడ్పు వినిపించింది. ఆగి పోయి ఆవేదనతో బడిలోకి తొంగిచూచాడు. సాతాని పంతులు సపుకు చేతిలో పట్టుకొని నిలబడి ఉన్నాడు. కోదండంపై నల్గురు పిల్లలు వేలాడుతున్నారు. అందరికంటే కింద ఉన్న వెంకటాచార్యులు పెద్దగా బొబ్బలుపెట్టి ఏడుస్తు న్నాడు. సాతాని పంతులు సపుకుతో ఫటాలున నాలుగు దెబ్బలు వేశాడు. రఘునాధాచార్యులు ఉగ్రుడై పోయాడు. "పంతులువా? పశువువా? ఎవడురా నీకు ఉద్యోగం ఇచ్చింది? పోరగాండ్రను చంపుతున్నావు. నీ చదువు పాడు గాను" అంటూ పంతులు చేతిలోని సపుకును గుంజి వడిగా గోడ అవలికి విసరివేశాడు. పంతులు కోపంలో వణికి రఘునాధాచార్యులను బెదరి చూచాడు. రఘునాధాచార్యులు, వేలాడుతున్న పిల్లలను కిందికి దింపి, వెంకటాచార్య లను కౌగలించుకొన్నాడు. వీపు నిమిరాడు. ఎర్రపడి, మరకలు తిరిగినవేళ్లను పంతులుకు చూపుతు "కండ్లుంటే చూడు, మనిషివా, రాక్షసుడవా?" అని, వెంకటాచార్యులను వెంటబెట్టుకొని ఇంటికి వచ్చాడు. భార్య ఆండాళమ్మకు కొడుకు దెబ్బలు చూపాడు. "ఇకమీద నా కొడుకును బడికి పంపను. నీవు పంపావంటే చూడు, ఏంచేస్తానో. అది బడి కాదు, బందెరదొడ్డి" అన్నాడు.

రఘునాధాచార్యులకు ఈసంఘటన జ్ఞాపకం రాగానే, "అవును! నా పెద్దవాడిని బడినుండి, పంతులు క్రౌర్యంనుండి రక్షించుకున్నాను. కాని విద్యావంతునిగా మాత్రం చేయజాలలేదు. అందుకే ఈనాడు వాడు నాకు చావు బరువుగా తయారైనాడు." గంభీరంగా అన్నాడు.

"ఆనాటి పరిస్థితిలో ఆవిధంగా జరిగిందేమో. కాని ఇప్పుడు కంఠీరవానికి అట్టిబాధలు లేవని మీరు నమ్మరా?" పంతులు ప్రశ్నించాడు.

"రామానుజ! అపచారము!! అటువంటి మూర్ఖుడ ననుకున్నారా? కాని ఏమిచేయమంటారు? విధిలేదు. మా ఆర్థిక పరిస్థితులు మమ్ములను అరాజక స్థితికితెచ్చినవి." రఘునాథాచార్యులు సూక్ష్మంగా సూచించాడు.

"అందరికి విద్యాబుద్ధులు చెప్పి, ప్రోత్సహించాల్సిన మీరే మీపిల్లల విషయంలో ఈవిధంగా అశ్రద్ధచేస్తే, మీరు నేర్చుకునేదేమిటి? సమాజానికి నేర్పేదేమిటి?" పంతులు మూలప్రశ్ననే తవ్వాడు.

"నా అంతటి వాళ్లు నాకొడుకులు కావాలని నాకు లేదనుకుంటారా? కాని బడులు పెట్టించిన ప్రభుత్వం బ్రతుకుతెరువు గురి.. ..ోచించ దాయె. మావి ఆదరువులేని బ్రతుకులు. యాచించో, దీవించో కాలం వెళ్ల బుచ్చుతున్నాము," ఆర్థిక నిస్సహాయతను వివరించాడు రఘునాథాచార్యులు.

"అవును! మీరన్నది నిజమే. కాని చూచిన వేళావిశేషమేమిటో కాని మీకంఠీరవం పూర్తిగా మావాడై పోయిండు. వయసుకు మించిన బుద్ధులు, ఆలోచనలు, అణకువ, ఆపేక్షలున్నాయి. అవకాశముంటే అవక్యనీ యుడు కాగల అంశకలవాడు. అతనితో కాలం గడుపుతుంటే నాకు సంతా నంలేని లోపంకూడా తీరిపోతుంది. నేను యిక్కడ శాశ్వతంగా ఉంటానా? ఉన్నప్పుడే అతని నొక మార్గంలో పడవేస్తే అల్లుకపోతాడని అనుకుం టున్నాను. మీతో ప్రార్థించేదేమంటే, మీకులవృత్తిగొడవలోకి అతడిని ఈడ్చకండి దయచేసి.'' పంతులు దీనంగా అన్నాడు.

"చెడకొట్టుకోవాల్నని మేము మాత్రం ఎందుకనుకుంటాం? మాపెద్ద వాడు విద్యకేకాదు, విధేయతకు, విచక్షణా జ్ఞానానికికూడా దూరమై పోయాడు. నాకడుపులో అటువంటివాడు పుట్టడమే మావంశానికి తీరనిలోటు. కాని ఏం చేయగలం? అధికారి రాగానే బేగారివానికై వెదికించినట్లు, మేము దొరకు అవసరమున్నపుడల్లా వంట మనుషులుగా పిలవబడుతాం. తప్పించుకోలేము. కాదంటే కాలం గడవదు. కడుపుమాడి చావాల్సిందే. అందుకే ఇన్ని అవస్థలు. కడుపు చీల్చుకుంటే కాళ్లమీద పడ్తాయి. ఏనాటి

తపఃఫలమో మీరు మావాడికి పట్టుకొమ్మైనిరిచారు. సాధ్యమైనంత వరకు బడికి పంపించుటకై శ్రద్ధతీసికుంటాను. ఇక వెళ్లొత," అంటూ రఘునాథాచార్యులు వెళ్లబోయాడు.

"సాధ్యాసాధ్యాలు నాకే వదిలివేయండి" అంటూ పంతులు రఘునాథాచార్యులకు నమస్కరించాడు.

కొన్నాళ్ళకు ఆ బడిపంతులు వేరే ఊరికి మార్చబడ్డాడు. ఈలోగా కంఠీరవం నాల్గవ తరగతి పూర్తిచేసాడు. ఇంకా ఎక్కువగా చదివించాలంటే వేరే చోటికి పంపించాలె. అది ఆయింటివాండ్లకు సాధ్యంకాని పని.

ఇంట్లో వెంకటాచార్యులకు, కంఠీరవానికి ఏవిషయంలోను ఏకాభిప్రాయం కుదురటం లేదు. వారిద్దరికి పంచాయతి ఏర్పడినపుడల్లా తల్లి కంఠీరవం వైపు, తండ్రి వెంకటాచార్యుల వైపు వాదించే వారు. రఘునాథాచార్యులు వృద్ధుడైకూడా ఎక్కడికైనా ఆదరువుకై శిష్యసంచారం వెళ్ళక తప్పేది కాదు. ఎక్కడికైనా వంట చేయడానికో, యాచనకో, సంభావనకో వెంకటాచార్యులు వెళ్తుండేది. ఆవిధంగా కలిగే ఆదాయమే ఆ కుటుంబ పోషణకు ప్రధానమైంది. కంఠీరవం మాత్రం కులవృత్తిగా తలచబడే అలాంటి పనులకు వెళ్ళనిరాకరించే వాడు. అందువల్ల కంఠీరవం ఆయింట్లో పనిమాలిన సోమరిగా తలచబడేవాడు. చిన్నతనమునందున్న చురుకుతనము, చొరవ, తెలివి, తెగింపు అన్నీ శూన్యమైపోయాయని. ఏమీరాని వెంకటాచారే ప్రయోజకుడైనాడని తలచబడేది. వైష్ణవుల కులవృత్తిగా తలచబడుతున్న వాటిని గురించి కంఠీరవం అపుడపుడు తండ్రితో వాదిస్తుండేది. తండ్రి కొడుకువాదనపై, వైష్ణవజాతిపొందిన పతనస్థితిపై చాలా బాధ పడేవాడు.

"బావ నీకంటె ఎక్కువ చదువుకున్నవాడా నాయనగారు?" కంఠీరవం ఒకసారి తండ్రిని ప్రశ్నించాడు.

"వాండ్ల అధికారానికి, చదువులకు సంబంధం లేదు. అశక్తుల నణచి వేయడమే వాండ్ల గొప్పతనం. ఇంత ఆర్భాటం చేసే రామభూపాల్‌రావు, ఒక పోలీసు జవానుకు, తహశీలు చప్రాసికి దాసోహ మంటాడు. వాండ్ల పశుబలముకింద చదువులు, సంప్రదాయాలు, కట్టుబాట్లు పనికిరాని రోజులు తండ్రి." ఇంకా ఏమో అనబోయి ఒక నిట్టూర్పు విడిచాడు రఘునాథాచార్యులు. "విజ్ఞానానికి విలువకట్టని సమాజానికి వృద్ధిలేదు, వికాసము చెందదు." తిరిగి బరువైన ధ్వనిలో అన్నాడు.

కంఠీరవం తీవ్రంగా ఆలోచనలో పడ్డాడు. ఆలోచిస్తూనే ఊరిబయట చెరువు కట్టమీదికి వెళ్లాడు. సూర్యాస్తమయ సమయం. పశువులు ఇండ్లకు చేరుకుంటున్నాయి. పక్షులు అరుస్తు గూళ్లలోకిచేరి భార్య, భర్తలు, తల్లి పిల్లలు కిచ, కిచమంటున్నాయి. కూలికి వెళ్ళిన కూలీ స్త్రీలు జంటలు, జంటలుగా పాడుకుంటూ ఇండ్లకు చేరుకుంటున్నారు. ప్రొద్దస్తమానము కష్టించినా ఆ కూలీలకెంతో ఆనందం కలుగుతున్నది. కాలు కదపక, గుట్టుగా కూర్చునే తన ఇంట్లో ఆ ఆనందంలేదు. కంఠీరవం ఆందోళన పడ్డాడు. తనను తాను మరచి స్త్రీల పాటల్లో లీనమైనాడు. స్త్రీలు వెళ్లిపోగానే తిరిగి తన కుటుంబ స్థాయిపై, వైష్ణవుల జీవనస్థితిపై ఆలోచించ మొదలుపెట్టాడు. కూటికిలేకున్నా. కూలిచేసుకోకూడదు. ఆపూటకు తిండిలో ఉప్పులేకున్నా ఊళ్ళో అందరికంటే అగ్రజాతివారు. అయినా అగ్రజాతికున్న గౌరవమేముంది? సంభావనకై చేసే ఆరాటము, పోరాటము, దబాయింపు, ఉప్పుము జ్ఞప్తికి వచ్చి సిగ్గనిపించింది. వంటవాండ్లుగాపొందిన పతనస్థితి బల్లెంపోటు వలె బాధించింది. కురూపముతో కొట్టవస్తున్నట్టుండి నేడు చలామణి అవుతున్న అలవాట్లకు బునాది, భక్తి, భయము, గౌరవములని కంఠీరవానికి ఒకసారి తండ్రి చెప్పాడు. భక్తిలో, పుణ్యబుద్ధితో సంభావన ఇచ్చేవాడు బలవంతంచేసినా సరేమి అంటున్నాడు. శక్తిలేదని వాపోయే వానికి, ముక్తి కలుగుతుందని స్వార్థులు శాస్త్రాలను సాగదీస్తున్నారు. ఈ విధంగా ఆలోచనలో మునిగితేలుతున్న కంఠీరవం పిచ్చివానివలె చెరువు కట్టపై నిలుచుండి పోయాడు.

చేనునుండి వస్తున్న కొమరయ్య సమీపించే వరకు చూడలేదు. కొమరయ్య మందలించితే తెప్పరిల్లి, "కొమరయ్యా!" ఆనందంతో కేకవేసాడు.

"ఇదిగో! కంకులు. నీకోసమే తెస్తున్నా." చేతిలోని సజ్జకంకుల కట్టను, ధోతిలోని దోసపిందెలు, పెసరకాయలు కంఠీరవం పైపంచలో పోశాడు. కంఠీరవం, కొమరయ్య ఆమాట, ఈమాట మాట్లాడుతూ కొమరయ్య ఇంటికి చేరుకున్నారు. కొమరయ్య ఇల్లు ఆరోజు కంఠీరవానికి చాలా ఆకర్షణీయంగా కనిపించింది. ఇంటి ముందర గుంజకు కట్టివేసిన బర్రె దూడలు, తల్లికై అవి చేస్తున్న ఆరాటము, వాటి పేండవాసన, ఇంకొక వైపు వచ్చిమేతకుప్పలోనుండి బలము, గడ్డివాసన, కుడితివాసన. దోమల స్వైరవిహారము, ఓమూలకి జల్ల, గుమ్మి, ఓమూలకు మోటబొక్కెన, పలుపులు, తాళ్ళు. కుంపట్లోనుండి మెల్లగా పైకి లేస్తున్న పొగ, వంటింట్లోనుంచి పచ్చిగాయలవాసన —— ఇవన్ని కంఠీరవానికి ఒక నూతన వాతావరణంగా తోచింది. "వస్తాను కొమరయ్యా" అని, అక్కడినుంచి లేచి ఇంటిదోవబట్టాడు. కొమరయ్యవరె కష్టించి బ్రతికే వ్యవసాయదారుడు కాజాల సందుకు లోలోన కుందుతూ ఇంటికి చేరుకున్నాడు.

# 4

కొన్నాళ్ళకు గొట్టం కోటయ్య మరణించాడు. కోటయ్య జీవించి ఉన్నప్పుడే కొమరయ్యకు పెండ్లి చేశాడు. తల్లి అన్నమ్మ అనుభవాన్ని ఊతగా తీసికొని కొమరయ్య వ్యవసాయము పొదుపుగా సాగిస్తున్నాడు. కొమరయ్యకు ఒక కొడుకు కూడా పుట్టాడు. తండ్రిపేరే పెట్టుకున్నాడు కొడుకుకు. ఒకసారి కంఠీరవం కోటయ్యను ఎత్తుకొని ముద్దులాడుతూ "కొమరయ్యా! కోటయ్య పేరేమి బాగులేదు. "ముద్దులకోట" అనిపెట్టు" అన్నాడు. అన్నమ్మ సంతోషంతో ఉప్పొంగి పోయింది. కోడలు కనకమ్మ క్షణం పాటు కొడుకునుచూచి. ఒక చిరునవ్వు విసిరింది. కొమరయ్య కొడుకును చిటికెలతో పిలిచి, "టర్"అన్నాడు. కోటయ్య బోసినోరునువిప్పి, కండ్లన్న

మూతలు పడంగ కడుపునిండా నవ్వాడు. ఎత్తుకొమ్మన్నట్లు తండ్రివైపు చేతులు చాపాడు. కొమరయ్య, కొడుకును కంఠీరవం నుండి తీసికొని తనివితీర ముద్దులు కురిపించి "నా కోట. నా బంగారుకోట, పెట్టనికోట, ముద్దులకోట" అంటూ రెండు చేతులతో పైకిఎత్తి "టర్"అన్నాడు. ఇంతలో సేతుసింధీవచ్చి, "దొర రమ్మంటున్నాడు" అని కొమరయ్యతో అన్నాడు. "ఆ కండ్లు, ముక్కు, అంతా కోటయ్యే!" ఆయింట్లో వారంతా అనుభవిస్తున్న ఆనందంలో తానుకూడా పాల్గొన్నాడు సేతుసింధీ.

"ఎందుకు? ఏంపనంటావు?" అని కొమరయ్య కొడుకును తల్లికి అందించి బయలుదేరి సేతుసింధీతో వెళ్ళాడు.

రామభూపాల్‌రావు పడకకుర్చీలో కూర్చొని పొగచుట్టను పొతం చేసుకుంటున్నాడు. కొమరయ్యవెళ్ళగానే "తోటబావి భూమి నేను ఇంకోండ్లకు కౌలుకు ఇవ్వాలనుకుంటున్నాను. రబీపైర్లు అయిపోయిన తర్వాత, నువ్వు పునాసకోసం భూమి పొతం చేయవద్దు" అన్నాడు.

"కౌలుకిస్తారా? ఎవరికుండీ? అసలు కౌలుకివ్వడమంటే నాకేం తోచటంలేదు." దిగులుగా అడిగాడు కొమరయ్య.

"అవును! కౌలుకిస్తాను. ఎప్పటికి నీవే శాశ్వతమా? నీ స్వంతభూమి కాదుగా! ఎప్పటికి నీవేఉండటానికి?"

"ఎందో! అంత గంద్రగోళంగా మాట్లడుతున్నరు."

"గంద్రగోళమేంలేదు. అస లా భూమిమీదికాదు. మీ అయ్య కౌలుకు తీసుకున్నాడు. అదన్నా తెలుసుగద?"

"ఆమాత్రం తెలుసులేరి? కాని ఆ భూమి ఎవరో బాపనోళ్ళదట గదుండీ?"

"మరి నేనన్న దేంటి? అందుకే ఆ భూమి మీది కాదంటున్నాను."

"మరి ఆ బాపనాయనతోటే మేము మాట్లాడుకుంటం."

"ఆ బాపిస్టాడికి కౌలు కట్టినవా ఎప్పుడైన?"

"అరి జాదజవాబే లేకపాయె? ఎవరికి కష్టం?"

"ఉహుం! కౌలు తీసికొనేవాడు లేడుకాబట్టి భూమి నీదంటావు? అంతేనా? సరేపో, తర్వాత మాట్లాడుకుందాం." రామభూపాల్‌రావు తీవ్రంగా ఆలోచిస్తూ కుర్చీలోంచి లేచి ఇంట్లోకి వెళ్ళాడు.

కొమరయ్య అయోమయస్థితిలో అక్కడినుండి బయలుదేరి కంఠీరవం ఇంటి దోవ బట్టాడు.

కంఠీరవం తండ్రి కూడా మరణించి చాలాకాలమైంది. మరణదశ రోజుల్లో పెద్ద కొడుకు వెంకటాచారి ఇంట్లో లేడు. రఘునాథాచార్యులు భార్య ఆండాళమ్మను, కంఠీరవాన్ని పిలుచుకొని కన్నీరు తీశాడు. దీనంగా భార్యవైపు చూచాడు. ఆండాళమ్మ లోలోన కుమిలిపోతున్నది. రఘునాథాచార్యులు కంఠీరవం చేయిని గట్టిగా పట్టుకున్నాడు. దుఃఖాన్ని దిగమింగుతు, గద్గదస్వరంతో మనోబాధను వెళ్ళకక్కాడు. "నాయనా! మన కుటుంబ స్థాయికి, నీ ఆలోచనలకు పొంతనలేదు. ఏమవుతావో కొడుక! నా గౌరవం కాపాడుతావుకదు కొడుక! అన్నయ్యకు నీకు దేంట్లోను పడిరాదు. నేనా! ఎట్లా పుట్టానో అట్లాగే పోతున్నాను. నావి ఎప్పుడూ వట్టిచేతులే. కాని ఒకమాట కొడుక! నేలవిడిచి సాముచేయకు! ఆవేదనను మాత్రం చంపుకోకు. ఈమాటలే నీకు నేనిచ్చే ఆస్థి" అని పలికిన మాటలు కంఠీరవాన్ని ఎల్లప్పుడూ కలిచి వేస్తుంటాయి. ఆమాటలు జ్ఞాపకమురాగానే దిగ్భ్రాంతుడై దిక్కులు పరికించి చూస్తాడు. ఎవరో పిలుస్తున్నట్టు నలువైపులచూస్తాడు.

కొమరయ్య రామభూపాల్‌రావు ఇంటికి వెళ్ళగానే కంఠీరవం కొమరయ్య ఇంటి నుండి బయలుదేరి తన ఇంటికి వెళ్లాడు. కొమరయ్య ఇంటి వాతావరణం, వాండ్ల కుటుంబం, వ్యవసాయం, కొడుకుతో ఆటలు, వాండ్లు పొందుతున్న ఆనందాన్ని తలుచుకుంటూ ఇల్లుచేరుకున్నాడు. ఇంటికి వచ్చేవరకు తల్లి ఏడుస్తు ఓమూలకు కూర్చొని ఉంది. అన్న వెంకటా

చార్యులు తల్లిని దుర్భాషలాడుతున్నాడు. ఆండాళమ్మ నెత్తి ముడిఊడి, వెంట్రుకలు చెల్లాచెదరై ఉన్నవి. ఆండాళమ్మను కొట్టడం తిట్టడం వెంకటాచారికి మామూలై పోయింది. ఆరోజున తిరిగి జరిగిందని కంఠీరవం గ్రహించాడు.

కంఠీరవం తనఇంట్లో ఆ దృశ్యాన్ని చూడలేక పోయాడు. "దేన్ని చూచుకొని ఈ మాత్సర్యం?" వెంకటాచార్యులపై కండ్ల నురిమించి అన్నాడు.

"పెద్దవాడు, అన్నయ్యను అట్లా అనగూడదు నాయనా!" ఆండాళమ్మ బలవంతంగా దుఃఖాన్ని చంపుకొని అన్నది.

"పెత్తనము ఇట్లాఉంటుందా? పెత్తనము రక్షించుకునేవాడే పెద్దవాడనిపించుకుంటాడు. సాగిందల్లా పెత్తనమనిపించుకోదు." కంఠీరవం గొంతుచించుకొని అన్నాడు.

ఆండాళమ్మ అక్కడినుంచి లేచి వంటింట్లోకి పెళ్ళింది.

"నా పెత్తనానికి అర్థాలుతీసే ధైర్యంకూడా కలిగింది నీకు. నోరెత్తావంటే చీల్చిపేస్తా" వెంకటాచారి ఉగ్రుడై అన్నాడు.

"అది! అసలు నీ పెత్తనం. తల్లిపై చేయి చేసుకునే నీవు, తమ్ముడిని చీల్చేస్తే ఆశ్చర్యం ఏం లేదు."

"మాట. మాటకి అమ్మను వెనుకేసుకొని వస్తావు! ఏమిటి నీ ప్రయోజకత్వం? పెట్టి సాద్తున్నావా? కష్టపడి సంపాదిస్తున్నావా? రండగా బతుకున్న నీకే అంత నిగ్గుడుంటే నేను నీకు భయపడ్తాననుకున్నావా? ఈ ఇంటికి నేను పెద్దను. మంచికి, చెడ్డకు నేను బాధ్యుడ్ని. నాకెవరు అడ్డం వచ్చినా నేనూరుకోను. ఇంకానోరెత్తావంటే వీపు పగులుతుంది. ఏమనుకొంటున్నావో." వెంకటాచారి కొట్టేటంతకోపంతో అన్నాడు.

"వీపు పగలగొట్టి? ఆతర్వాత? ఇంకేం చేస్తావు? పెళ్ళ గొట్టివు?"

"సిగ్గు, లజ్జ అనేవి ఉంటే ఇంకా అనాల్నా?"

కంఠీరవం గిరుక్కున ఇల్లు వదలి బయట పడ్డాడు.

"పో! ఎక్కడికి పోతవో. పో! ఈ బెదిరింపులు నాదగ్గరనా? ఒక్క గవ్వ ఆదలేకున్నా అంతా నెత్తిన కూర్చునేవారే. అప్రయోజకపు ముండా కొడుక. మళ్ళా ఇంట్లో కాలుపెట్టావంటే చూడు" అని వెంకటాచారి మంచం దబాలున వేసుకొని, తత్తరపడ్డు కూర్చున్నాడు.

ఆండాళమ్మ ఆవేదనతో "ఎటుపాయె? ఎక్కడికిపోతడు?" అంటూ ఇంటి బయటికి వెళ్ళి నాలుగు వైపుల సందులు పరికించింది. కంఠీరవం కనబడలేదు. "ఎంత ముండి పుట్టుక నాచె. ఇవ్వన్ని చూడటానికే ఆ పర మాత్ముడు నన్ను బ్రతికిస్తున్నాడు. పోయినవాండ్లే మహారాజులు" అను కుంటూ, వెంకటాచారిని భయంతో చూస్తూ తిరిగి వంటింట్లోకి వెళ్ళింది.

వెంకటాచారి తానొక ఘనకార్యం చేసినంత సంతృప్తితో, తమ్ముని పై వచ్చిన కోపాన్ని చల్లార్చుకుంటున్నాడు.

"దొర మిమ్ముల రమ్మంటున్నాడు" అని ఆదబాప రంగడు నిలుచున్నాడు.

"ఎవరు నాయనా! ఎందుకు?" ఆండాళమ్మ వడిగా వంటింట్లోంచి బయటికి వచ్చి అడిగింది.

వెంకటాచారి ఇల్లు వదలి, వచ్చిన వానితో వెళ్ళిపోయాడు!

ఆండాళమ్మ పసిపిల్లవలె కుమిలి, కుమిలి ఏడ్వసాగింది.

## 5

కంఠీరవం పట్టలేని భరింపరాని అవమానముతో చెరువు కట్ట మీద నుండి పోతున్నాడు. ఎక్కడికి పోతున్నాడో, ఎవరి దగ్గరికి పోతున్నాడో, ఏమిచేయ నున్నాడో అతనికేతెలియదు. సుమారు ఒకటిన్నర మైలు పోయి నాక ఒకచేనులో దోవ పక్కనే ఉన్న పాతగుడి లో ప్రవేశించాడు. కాళ్లు బారవేశాడు, ముఖంనిండా పైపంచె కప్పుకొన్నాడు. ఆలోచనలో లీన

మయ్యాడు. సరిగా రెండు ఝాములవేళ. ఆకలితో కడుపు దహించుక పోతున్నది. ఆవేదనతో హృదయం తల్లడిల్లుతున్నది. అతనికి, అన్నకు జరిగిన వాదన మెదడులో మారు మోగుతున్నది. తల్లిని అన్న కొట్టే దృశ్యాలు జ్ఞాపకం సాగాయి. "అమ్మా!" అని బావురు మంటూ ఏడ్చాడు.

మంచె కింద నీడకు అన్నంతింటున్న చేనుకాపరులు ఆ ఏడ్పువిని, ఆశ్చర్యపడి, మెల్లగా వెతుక్కుంటూ, ఆ గుడి ముందరికి వచ్చి చకితులై చూచారు. వాండ్లకు ఎటూతోచలేదు. వాండ్లలో వాండ్లు ఏవో గొణుగ మొదలు పెట్టారు. కంఠీరవం ఏడుస్తూనే ఆ అలికిడిని కనిపెట్టి, ముఖం మీది బట్టతీసాడు. ఎదురుగా నిలుచున్న పిల్లలను చూచాడు. తిరిగి, ఇంకా బావురు మని ఏడ్చాడు.

ఆ పిల్లల్లో ఒకడు, "అయ్యగారి తమ్ముడురా!" అన్నాడు.

"ఇక్కడెందు కేడుస్తున్నడో?" ఇంకొక డన్నాడు.

"కడుపు నొప్పి లేస్తున్నదేమో." మరొక డన్నాడు.

"ఏడ్వవద్దని చెప్పరాదురా?" ఒకడు ఇంకొకడికి సలహా చెప్పాడు.

"ఆకలి అవుతుండొచ్చు. నెత్తిమీదికి పొద్దొచ్చింది. మొఖాన బొట్టు లేదు."

"నేను పోయ ఇన్ని దోసకాయలు, పెసరకాయ, కంకులుతెస్తా, దారా పోదాం" అని ఒకడు ఇద్దరిని వెంటబెట్టుకొని వెళ్ళాడు.

కంఠీరవం వాండ్ల మాటలను, వాండ్ల అమాయకపు చూపులను శ్రద్ధగా గమనిస్తు దుఃఖాన్ని అదుపులోకి తెచ్చుకున్నాడు. ఆ పిల్లలకు అడ్డంగా అప్పుడప్పుడు సజ్జకర్రలు ఊగుతూంటే, వాటికున్న కంకులు తమను ఆహారంగా అర్పిస్తున్నట్టనిపించింది. ఆ కర్రల మమతను కంఠీరవం ఆనందంతో అనుభవించాడు.

"ఈ చేను మీదేనా?" బొంగురుపోయిన గొంతుతో కంఠీరవం ఆ పిల్లలను ప్రశ్నించాడు.

"అవును, మాదే, ఎందుకు? కంకులుకావాలా" పట్టరాని ఆనందంతో అన్ని ఒక పిల్లవాడు ఇతర పిల్లవాండ్లను వికసించిన ముఖంతో చూచాడు.

"మనోళ్ళు ఎప్పుడొస్తారో? మనం తెంపుదాం" అని ఇద్దరు పిల్లలు కంకులు తెంపసాగారు.

"ఇట్టి అమృత హృదయాలుగల పిల్లలు పుట్టిన ఈగ్రామంలో నా అన్నవంటి వాండ్లెట్లాపుట్టారో!" కంఠీరవం హృదయం కొట్టుకున్నది.

మొదట కంకులకై వెళ్ళిన పిల్లలు వచ్చారు. వెంట కట్టెపుల్లలు తెచ్చారు. వాండ్లలో అందరికంటె పెద్దవాడైన కనకయ్య తన నడుముకు చుట్టిఉన్న జకముకి సంచి తీసి నిప్పుకొట్టి ఆ పుల్లలకు అంటించి మంట పెట్టాడు. కొందరు కంకులు కాలుస్తున్నారు. కొందరు దోసపిందెల చెక్కు తీస్తున్నారు. కొందరు పెసరకాయను ఒలుస్తున్నారు.

కంఠీరవం పిచ్చివానివలె ఆపిల్లల ఆరాటానికి, ఆప్యాయతకు ముగ్ధుడై ఆలోచిస్తున్నాడు. "వీరెవరు? నేనెవరు? వీరికి నాకు ఏమిటి సంబంధం? నాఆకలికి వీరి మనసులెందుకు చలించాయి? నా ఏడుపు వీరి నెందుకింత కలవర పరచింది? అడుగనిదే ఏమిటి వీరి పరిచర్య, స్నేహభావము, ప్రేమ, మన్నన? ఎవరు నేర్పారు వీరికివన్ని? మంచి నేర్చుకోనవసరం లేదేమొ! నేర్చుకోవలసినవి చెడ్డ విషయాలే కాబోలు!" కంఠీరవం హృదయంలో తుఫాను రేగింది.

ఒక పిల్లవాడు దోసకాయలను ఎనిమిది భాగాలుగా కోసి కంఠీరవం ముందర పెట్టాడు.

కంఠీరవానికి తల్లి జ్ఞాపకం వచ్చింది. ఏవిధంగాను సంబంధంలేని ఆపిల్లలు ఆ విధంగా ఆత్మీయులై ఆదుకొని తహతహపడ్తున్నారు. ఇక కన్నతల్లి తనకై ఎంత కుమిలి పోతున్నదో అని ఖేదపడ్డాడు. అతనికై

విలపిస్తున్న తల్లిని అన్న ఎన్ని దుర్భాషలాడుతున్నాడో, ఇంటిలో ఎంత గంద్రగోళం జరుగుతున్నదో అని ఆలోచనలో పడ్డాడు.

రెండు దోసపిందెలు తిని చాలు నన్నాడు కంఠీరవం. కాల్చిన సజ్జలను పిల్లలు అందించారు. "మనమంతా కలిసితిందాం", అంటూ కంఠీరవం అందరి మధ్యలో సజ్జలు పెట్టి చుట్టు కూర్చున్నారు.

"ఇక ఏడ్వవు కదా!" ఒక పిల్లవాడు అమాయకంగా అడిగాడు.

"ఏడ్వ" ఆపిల్లవాని వీపు నిమిరాడు కంఠీరవం.

"నాకింకో సహాయం చేయాలె మీరు" అని కంఠీరవం ఇంకా ఏదో చెప్పబోతుండగనే, "ఓ" అని పిల్లలంతా అన్నారు.

"మీలో ఎవరైనా పెళ్ళి గొట్టం కొమరయ్యను ఇక్కడికి తీస్కరావాలె. నేనిక్కడ ఉన్న సంగతి మావాండ్లకు, మీవాండ్లకు, ఎవరికి తెలియ వద్దు" కంఠీరవం దీనంగా అన్నాడు.

"నేను పెళ్తా, నేను పెళ్తా" అని ఒకరికొకరు పోటీ పడ్డారు. కనకయ్య ముగ్గురు పిల్లలను పంపాడు.

"ఒరే! నీ గురిగి కడిగి అయ్యగారికి మంచి నీళ్ళుతేనా!" ఒక పిల్లవాడు అన్నాడు.

"మనం తెస్తే అయ్యగారు తాగుతాడురా!" కనకయ్య వెంటనే అందుకొని, కంఠీరవాన్ని చూచాడు.

"అదె! ఎందుకు తాగను?" కంఠీరవం పరధ్యానంలో అన్నాడు.

"నిజంగా తాగుతవా?" ఒక పిల్లవాడు గట్టిగా అడిగాడు.

కంఠీరవానికి ఆ పిల్లవాడు అంటున్నది అప్పుడు తెలిసింది. వాండ్లు తెస్తే తాగడానికి అతనికి మనస్కరించక పోయినా, ఆవిషయం వాండ్లతో చెప్పడం బాగుండ దనుకున్నాడు.

"మీరు తేవడ మెందుకు, మనమే పోదాం, దగ్గరేనా కాలువ?" అంటూ కంఠీరవం లేచాడు. పిల్లలుకూడా లేచారు.

"మరి నేను ఒలిచిన పెసరగింజలు మరి?" ఒక పిల్లవాడు ముఖం మాడ్చుకొని అడిగాడు.

"మంచినీళ్ళు తాగి మంచెమీద కూచొని తిందాం." కంఠీరవం సమాధానం చెప్పాడు.

అంతా మంచినీళ్లు తాగి మంచెమీదికి చేరుకున్నారు.

కంఠీరవం దిగాలుపడి తన గ్రామం వైపు చూస్తూ మంచెపై నిలుచున్నాడు.

"పుట్టి పెరిగిన గ్రామాన్ని విడిచి, నేను ఎల్లప్పటికి దూరం కావల్సిందే? నాకు అన్నయ్యకు మధ్య ఏర్పడిన అగాధ మిట్లనే ఉంటుందా? మాకోసం మా అమ్మ ఈ విధంగా ఎన్నాళ్ళు కృశించుతుండాలె? నాకు ఆదుకోనే దిక్కేలేదా? ఈ అన్యాయాలను, అన్యాయలుగా అనేవాడు, అడ్డుకొనేవాడే లేడా? అయితే ఈవిధంగా చూస్తూ ఊరుకోవడమేనా?" కంఠీరవం హృదయం కొట్టుకొన్నది.

పక్కన నిలుచున్న కనకయ్య నాలుగు వైపులచూసి, "ఎవరోయ్" అని కేకవేశాడు.

కంఠీరవం తడబడుతు లేచి నిలుచున్నాడు. నాలుగు వైపుల చూచి, "ఎవరు? ఎక్కడ? ఏరి? ఎవరూలేరే? కొమరయ్య వస్తున్నాడేమో" అన్నాడు.

కనకయ్య ఒకవైపు చేయితో చూపుతు "అగో! అటుచూడు. తెల, తెల్లగా కనపడుతున్నరు. వీండ్లకోసమే మేము చేండ్లలో కావలుండేది, వీండ్లతో ఏగలేం, కంకుల కాలమొచ్చిందంటే" అన్నాడు.

"ఎవరు వాండ్లు" కంఠీరవం అడిగాడు.

"ఎవరో దిక్కులేని వాండ్లు. వాండ్ల కిదేపని. సమయం కనిపెట్టి ఎవరి చేలనో జొరపడి, అయినన్ని కంకులో, కాయలో తెంపుతరు. వాటితో ఆరోజు గడిచిపోతది. పుట్టగతిలేనోండ్లు. ఇట్లా పదిమంది చేలో పడితే ఏచేను ఆగదు. మిగిలేది చొప్పే" అంటూ కనకయ్య మంచెను దిగపోయి, తిరిగి ఒకకేక వేశాడు. పరీక్షగా చేనువైపు చూచాడు.

చేనులో నుండి ఇద్దరు వ్యక్తులు బాటకు చేరి చేతులు పైకిలేపి, ఏమీ తెంపలేదన్నట్లు చేతులు తిప్పారు. ముందుకు నడిచి పోయారు.

"దొంగ ముండా కొడుకులు, చూచి కేక పెట్టకపోతే యాభై కంకుల కట్టయినా కట్టుక పోదురు. కనిపెట్టి కేకపెడ్తే, కంకులు తెంపలేదని, బుద్ధిమంతులోలె వెళ్ళిపోతున్నరు," అన్నాడు కనకయ్య.

అతిశ్రద్ధగా కనకయ్య మాటలు వింటున్న కంఠీరవం "అయితే నాకుపెట్టిన కంకులు, దోసకాయలు, పెసరకాయవల్ల మీకు నష్టమేనంటవా?" అన్నాడు.

"అట్లనుకుంటె ఎట్ల? మేం మాత్రం అప్పుడప్పుడు కంకులు అవో, ఇవో తింటూనే ఉంటం. కష్టాల్లో ఉన్న నీకుపెడ్తే మంచిదేగా! పైగా మీరు పెద్దలు. మీకెంత పెడ్తే మాకంత పుణ్యముంటది. పని. పాట లేక, జీతం, నాతం లేక బతికే యీఅలగా జనంతోటి వస్తుంది కష్టం. అసలు పనిలేకుండ ఎట్ల బతుకుతరో, నాకేం తోచదు. ఎండకాలంలో మాకు చేను పనులు లేకుండోర్కె మాకెక్కడతోచదు. ఏదన్న పని మొదలు పెట్టు కుంటం." ఈవిధంగా కనకయ్య చెప్తున్న విషయాలు కంఠీరవం హృదయంలో నాటుక పోతున్నాయి. ఎవరో ఉపదేశం చేస్తున్నట్టనిపించింది. కనకయ్య మాటలకు వ్యాఖ్యానంగాని, అర్థం కాని చెప్ప నవసరం లేకుండానే మానవ ప్రవృత్తిని, సహజ భావాలను ప్రతిబింబింప చేస్తున్నాయని కంఠీరవం భావించాడు. కాని తనకులం వాండ్లను కనకయ్య

అన్న మాటల్లో సోమరులుగా తలకవపోవడం కనకయ్య ఆలోచనా లోపమని కంఠీరవం అనుకున్నాడు.

"అయితే మేము పనిచేయక బ్రతికినా పర్వాలేదంటావా?"

"మీకెట్లైనా రోజులు గడుస్తాయి."

"బిచ్చ మెత్తుకొని వెళ్ళ తీసినను మంచిదంటావా?"

"అది బిచ్చ మెందుకైతది"?

"ఇది నేను బిచ్చమంటా. గౌరవం, మర్యాద లేని బ్రతుకంటా, సోమరితనమంటా."

"మీరనేది నిజమైతే అది తప్పే" అంటూ కనకయ్య లేచి నిల్చొన్నాడు. ఒళ్ళు విరుచుకొని, చేను నాలుగు దిక్కులు చూచాడు. అరచేయి కండ్లకు కప్పుగా చేసికొని ఒకవైపు శ్రద్ధగా చూచి, "కొమరయ్య వస్తున్నట్టుంది" అన్నాడు.

కంఠీరవం ఆతురతతో లేచి నిలుచున్నాడు. "ఏడి? నిజంగానా? ఎక్కడినుంచి వస్తున్నాడ"ని కనకయ్య పక్కకు నిలుచుండి కనకయ్య చూస్తున్నవైపు చూచాడు.

కంఠీరవం కొమరయ్యను రానైతే రమ్మన్నాడు కాని ఎందుకు పిలిపించింది, ఏమి అడుగాల్సింది ఆలోచించనేలేదు.

కొమరయ్య దగ్గరికి వస్తున్నా కొద్ది కంఠీరవం దుఃఖం ఉబికిరా సాగింది. తన హృదయావేదనను విని, అతని దుఃఖములో, ఆవేదనలో, అభిప్రాయాల్లో భాగస్వామియై, మానసిక భారాన్ని కొమరయ్య తీర్చగలడని అప్పుడు కంఠీరవానికి ఆశకలిగింది.

కొమరయ్య, అతనికై వెళ్ళిన పిల్లలతో సహా సమీపానికిరాగానే, కంఠీరవం వడిగా, మంచెదిగాడు. తల్లిలేనప్పుడు పరాయిపిల్లలతో దెబ్బలు తిన్న చిన్నపిల్లవాడు కన్నతల్లిరాగానే పైనబడి ఏడ్చినట్టు, కంఠీరవం

కొమరయ్యను అమాంతంగా కౌగలించుకొని ఏడ్చాడు. కొమరయ్యకు ఏమీ అర్థం కాలేదు. అంతగా కుమిలిపోవడానికి కారణం కూడా తెలియదు. పిల్లయి పిలువగానే చేను నుండి నేరుగా అక్కడికి వచ్చాడు.

"మగవాడివి ఆవిధంగా ఏడుస్తావా? ఏమీచెప్పకుండా అట్లా ఏడిస్తే ఎట్లా తెలుస్తుంది? రా! అటుపోయి కూర్చుందాం" అన్నాడు కొమరయ్య.

"పాపం! ప్రొద్దటి నించి అన్నంతినలేదు. ఇన్ని సజ్జలు, దోస బిందెలే తిన్నడు" కనకయ్య దీనంగా అన్నాడు.

కొమరయ్య ఆశ్చర్యంగా కనకయ్యను చూచాడు. "ఏంది కనకయ్య, నువ్వు ఈ చేనుకాడ ఉన్నవు?" అన్నాడు.

"కోమటి శంభయది ఈ చేను. నేను జీతానికున్న."

"మీచేనేమైంది?"

"మా చేను అమ్మినంగదన్న? ఏయేటికి ఆమేడు శిస్తు యెళ్ళటమే కష్టమైంది. మా అయ్య చచ్చేముందే అమ్మేసి, కోమటి శంభయ్యకు బాకి కట్టినం. శంభయ్యే పాపమని జీతాని కుండ మన్నడు" కనకయ్య అంటూ కండ్లకు నీళ్ళు తీసుకొన్నాడు. "సరే! నా దేందిగాని, అయ్యగారి సంగ తేందో కనుక్కో ముంజాత" అన్నాడు కనకయ్య.

కంఠీరవం కనకయ్య మాటలు శ్రద్ధగావింటు తన దుఃఖాన్ని ఆపు కున్నాడు.

"ఊళ్లోకి పోదాంపద. ఏమొచ్చింది అడివిలో పడి ఉండానికి" కొమరయ్య కంఠీరవాన్నుద్దేశించి అన్నాడు.

కంఠీరవం దిగులుగా దిక్కులు పరికించాడు. "మనసు పట్టలేక నిన్ను పిలిపించిన. నీపనులేమి చెడిపోలేదుకదు! నాకు నీవు తప్ప ఎవరు లేరని అనిపించింది" ఒక్కొక్కటి కూచినట్టన్నాడు.

"మళ్ళా మీ అన్నకు నీకు నడిచిందన్న మాట. నేను నీముందరే దొర పిలిస్తే పోతిగద! అడ్నించి మీ ఇంటికే వచ్చిన. మీఇంట్లో ఎవరూ లేరు. మీఅన్న నాకు దోవలో కనపడ్డడు. దొరో రింటికి పోతుండె. సరే అదంత పోనియిగాని, ఊళ్లోకి పోదాంపద! మా యింటికి రా! నీకేంభయం లేదు. లే పోదాం" కొమరయ్య బలవంతం చేశాడు.

"కొద్దిగా చీకటి పడని. లేకుంటే మావాండ్లకు తెలుస్తుంది. మా అమ్మ వచ్చి ఆరాటం చేస్తుంది. అప్పుడు ఇంటికిపోక తప్పదు. మా అన్న య్యను కలిసికోక తప్పదు. అతను ఏదో అంటాడు. నేను ఊరుకోను. పైగా మాఅన్నయ్య నన్ను ఇంట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు కూడా'' కంఠీ రవం అన్నాడు.

"మీ అన్నయ్య అనగానే అయింది. పెద్ద మనిషి మీఅమ్మ లేదు. ఊళ్ళో పెద్ద మనుషులులేరు. మంచి, చెడ్డా ఏమీలేకుండా ఇట్లా జరుగు తుంటుంటే ఎవరు ఊరుకుంటరు?" కొమరయ్య ధైర్యంగా మాట్లాడాడు. "ఏందో పాడుఊరు. అన్నిటికి దొరేనాయె. ఏంన్యాయంపాడైతది" తిరిగి కొమరయ్య నిరుత్సాహ పడ్డాడు. "సరే నీయిష్టం, చీకటి పడ్డాకనే పోదాం." అని ఇద్దరు ప్రత్యేకంగా ఒక చోట కూర్చున్నారు. అన్నకు, తనకు జరిగిన పంచాయితీ వివరాలు కంఠీరవం చెప్పాడు. ముసి, ముసి చీకటి పడగానే ఊరివైపు బయలుదేరాడు. చేసు కాపరి పిల్లలు దీనంగా కంఠీరవాన్ని చూచారు. ఒకపిల్లవాడు. "మళ్ళారేపు వస్తే చాలాకంకులు తెంపి పెడ్తం" అన్నాడు.

"దండం, అయ్యగారు," కనకయ్య అన్నాడు. వెంటనే పిల్లలంతా "దండం అయ్యగారు" అని వికసించిన ముఖాలతో ఒకరినొకరు చూచు కున్నారు.

# 6

"పాపం మీనాయనగారు పెద్దమనిషి, గతించినప్పటినుంచి, అన్ని చిక్కులేనని విన్నాను." రామభూపాల్‌రావు మాట్లాడటానికి పిలిపించిన వెంకటాచారితో, పరామర్శతో అన్నాడు.

రామభూపాల్‌రావు ఆ విధంగా శాంతంగా చనువుగా మాట్లాడటం వెంకటాచారికి ఆశ్చర్యం వేసింది. రాంభూపాల్‌రావు ఎల్లప్పుడు అధికార ధ్వనిలో మాట్లాడటం అతనికి తెలిసిన సంగతి. రామభూపాల్‌రావు అంటే వెంకటాచారికి భయం కూడాను.

"మీకు తెలియందేముంది" వెంకటాచారి నీళ్లుమింగుతూ అన్నాడు.

"మీ నాయనగారు పాపం చదువుకున్నవాడే. పూజనీయుడే. కాని చదువుకున్నాననే గర్వం మాత్రం బాగావుండేది. అదే ఆయనకు చెరుపు చేసింది. ఉన్న ఆకాస్తా భూమిని పోగొట్టుకొని మీ అందరికి కష్టాలు తెచ్చాడు" రఘునాథాచార్యుల గురించి తన అభిప్రాయం ప్రకటించాడు రామ భూపాల్‌రావు.

ఏమి సమాధానం ఇవ్వాల్సింది వెంకటాచారికి తో...ను. తల నేలకు వేసి రామభూపాల్‌రావు అంటున్న దేమిటో ఆలోచించసా...డు.

"మీ తమ్ముడు నీకు ఎదురు తిరగబడతాడట నిజమేనా? తమ్ముడిని హద్దుల్లో పెట్టుకోలేక పోయావా?" ఓరకంటితో వెంకటాచారిని చూస్తూ రామభూపాల్‌రావు అన్నాడు.

"చిన్నప్పటినుంచి మా అమ్మ గారాబంతో వాడావిధంగా చెడిపో యిండు" వెంకటాచారి సమాధాన మిచ్చాడు.

"నిన్ను మీ నాయన పోకిరివాణ్ని చేసిండని ఊరంతా అనుకుం టుంది. నువ్వు మీ అమ్మను కొడతావటగదు! కన్నతల్లిని కొడతారయ్యా ఎక్కడన్నా?" రామభూపాల్‌రావు కొంచెము అధికార ధ్వనిలో అన్నాడు.

"మా తమ్ముడు చెప్పేడా ఆ సంగతి?" అంటూ వెంకటాచారి భయంగా చూచాడు.

"ఎవరు చెప్పితేం. సంగతైతే నిజమేగదా! మీ తమ్ముడు పిలిస్తేనే ముఖం తప్పించుకొని తిరుగుతాడు. మీ నాయన కంటె రెండింతలు గర్వం ఎక్కువుంది మీ తమ్ముడికి. సరేగాని ఒక విషయం అడుగుదామని పిలిపించాను. మీమేలుకే. ఇందులో నాకొచ్చేదేమిలేదు." గొంతు సవరించు కొన్నాడు రామభూపాల్‌రావు.

"మీరనడం. నేను కాదనటమా? ఎప్పుడైనా అట్లా జరిగిందా?" వెంకటాచారి వినయంగా అన్నాడు.

"నేను రేపు తహశీలుకు పోతున్నాను. నీవు కూడ వస్తే మీ భూమిని నీ పేరు మీద చేయించివేస్తా. ఇంకా నీకు పెండ్లి కావలిసివుంది. ఈడు ముదిరి పోతున్నది. కవులుకో, పొత్తుకో భూమి ఇవ్వావంటే దిగులు లేకుండా జరిగిపోతుంది. మీ అమ్మ పెద్దమనిషై పోయింది. నీకు రెండు ముళ్ళు పడ్డాయంటే కోడలు, సంసారంతో ఆనందముగా బతుకుతుంది. ఇది చెప్పుదామనే పిలిపించాను. రేపు భోంచేసి బయలుదేరుతున్నాను" అంటూ రామభూపాల్‌రావు కుర్చీలోంచి లేచి వెళ్ళబోయాడు.

"సరే! మీ దయ. వెళ్ళొస్తాను" అంటూ రామభూపాల్‌రావు దండం పెట్టకున్నా వెంకటాచారి దండం స్వీకరించినట్టు చేతులు ఆడించి ఇంటికి వెళ్ళాడు.

వెంకటాచారి ఎంతో గొప్పవాడుగా, ఏదో సాధించినట్టుగా ఒళ్ళు మరిచి ఇంటికి చేరాడు. ఆ సంగతి తల్లికి చెప్పుదామనుకొన్నాడు మొదట. కాని "ఏమిటి చెప్పేది. చెప్తే ఆమె చేసేదేముంది. చిన్న కొడుకు వెళ్ళి పోవడంవల్ల వచ్చిన కోపం, దుఃఖంలో నా యోగ్యత, గొప్పతనం ఆమె కేమి అర్థమవుతుంది" అనుకున్నాడు. భోజనం చేస్తున్నపుడు "రేపు దొర వారితో కామారెడ్డికి పోతున్నాను" ముఖం వంచుకొని అన్నాడు.

దొరవారితో అప్పుడప్పుడు ఆ విధంగా వెళ్ళడం మామూలే. అందు వల్ల ఆమె ఏమి అనలేదు. "తమ్ముని జాడ ఏమైన తెలిసిందా?" మెల్లగా అడిగింది తల్లి.

"ఎక్కడ తెలిసె. అప్పుడు పొయ్యి ఇప్పుడు వస్తునేపుంటిని, ఇహ నీకు పనేముంది, అన్నం తిని అదేపని చెయ్యి. గారాబాల కొడుకు లేక పోతే నువ్వు వుండలేవుగా!" హేళనగా వెంకటాచారి అన్నాడు.

"నీకు మాత్రం ప్రేమలేదు: ఏదో ఉద్రేకంలో ఆ విధంగా మాట్లా డుతున్నావు. కాని ఒక కడుపున పుట్టిన వాండ్లకు ప్రేమలుండకపోతే ఇంకెవరి కుంటాయి కొడుకా?" గుడ్లల్లో నీరు తీస్తు గద్గదస్వరంలో తల్లి అన్నది.

"ఇవన్ని చిన్నప్పటినుంచి వాడికి చెప్పితే వాడింతవరకు రాకనే పోవు. వాడికి చిన్నప్పటినుంచి మంది సహవాసమేనాయె. తురక పంతులు శిక్షణ, శూద్రుల సహవాసము. పెద్ద బుద్ధులు ఎట్లా వస్తాయి?" అంటూ లేచి చేతులు కడిగి వంట ఇంటినుండి బయటికి వచ్చేసాడు.

తల్లి ఆండాళమ్మ వంటింట్లో అన్ని సదిరిపెట్టి మైలపడి, తుంగ చాప పరుచుకొని పండుకొన్నది. పైట కొంగును ముఖంనిండా కప్పుకొని లోలోపల కుములు సాగింది.

వెంకటాచారి ఏదో గొణుగుకుంటూ, తాంబూలం వేసికొన్నాడు. హడావుడిగా ఇల్లు వదలి ఊళ్ళోకి వెళ్ళాడు.

మరునాడు భోజనం చేసుకొని రామభూపాల్‌రావుతో వెంకటాచారి కామారెడ్డికి బయలుదేరాడు. కచ్చడంలో రామభూపాల్‌రావు కూర్చున్నాడు. కచ్చడం తొట్లో వెంకటాచారి కూర్చొని బండిని తోలుతున్నాడు. కచ్చడం ముందట ఒక మనిషి, వెనుక ఒక మనిషి ఉరుకుతున్నారు. కచ్చడపు ఎడ్ల మెడకు కట్టిన మూగల గల్లు, గల్లు చప్పుడుతో, దుమ్మును రేపుతు కచ్చడం వడిగా పోతున్నది.

"కొంచెం మెల్లగానే పోనియ్యి" రామభూపాల్‌రావు అన్నాడు.

వెంకటాచారి ఎడ్ల తోకలను వదిలాడు. ఎద్లు ఉరికి, ఉరికి వాటంతట అవే మెల్లగా నడవసాగాయి.

"నిన్న నీకు చెప్ప మరచిపోయిన. నీతో ఇంకొకపనిఉంది. అంతా గుట్టుగా వెళ్ళిపోవాలె. నీవు తొందర పడొద్దు. నీవు భయపడాల్సిం దేమీలేదు" రామభూపాల్‌రావు సంభాషణ సాగించాడు.

"ఏదో ఆపని, సెలవివ్వండి" అంటూ వెంకటాచారి రామభూపాల్‌రావు వైపు తిరిగి కూర్చున్నాడు.

"కోటయ్య కొడుకు కొమరయ్య తోటబావి ఎరికేగా?"

"అదే, చెరువు అవతలిది. మామిడిచెట్లుకూడా ఉన్నాయి."

"ఆఁ. అదే. అవును కదు! ఎన్నిసార్లు నీవు మామిడి పిందెలు తెంపుక రాలేదు గడీలోకి. ఆ తోటబావి ఉందే, న్యాయంగా చూస్తే కొమర య్యదికాదు."

"అట్లాగా? తనదికాందే, బావికి రాతికట్టం, మామిడిచెట్లు—ఇవన్ని చేయించాడా?"

"ఎవడూ ఏమీ అనకపోతే తనదేనని మింగేయటానికి. అట్లా జరుగుతూంటే మేము ఇటువంటి అన్యాయాన్ని చూస్తూ ఊరుకుంటామా? అందుకే, ఆ మోటబావి కింది భూమిని నాపేర చేయించుకోవాల్నని అను కుంటున్నాను."

"కొమరయ్య అందుకు ఒప్పుకుంటాడా?"

"ఆ వెధవను ఎవడు బ్రతిమిలాడుతాడు? ఖానూను ప్రకారం జరు గావెగాని. నీవు కొంచెం తెలివిగా పనిచేశావంటే నేను అనుకున్న పని సులభంగా అయిపోతుంది."

"ఇంతకూ ఆ భూమి ఎవరి దంటారు?"

"అది అసలు అడుగాల్సిన ప్రశ్న. మన ఊళ్ళో ఒక బ్రాహ్మణ కుటుంబంకూడా ఉండేది. వాళ్లది అసలు ఆ భూమి. వాండ్ల ఆతి, గతి ఇప్పు డేమి తెలియడం లేదు. ఆ బ్రాహ్మణుడు చచ్చింతర్వాత అతని భార్య, ఓ చంటి పిల్లవాడు ఊరు వదిలి వెళ్ళిపోయారు. అంతే మరి. ఆ పిల్లవాడు చచ్చాడో, బ్రతికాడో ఏమీ తెలియడంలేదు. ఒకవేళ భగవంతుని కృపవల్ల ఆ పిల్లవాడు జీవించిఉండి ఒకనాడు కాకపోతే ఒకనాడైనా వచ్చి, "నాభూమి ఏది?" అంటే సమాధానం చెప్పాల్సిన బాధ్యత గ్రామానికి ప్రభువులమైన మాకు ఉంటుంది. కాని ఆ కొమరయ్య కేముంటుంది? పైగా "అన్యాయంగా ఒకని భూమి ఇంకొకడు అనుభవిస్తుంటే చూస్తు ఏం చేస్తున్నారు?" అని ప్రభుత్వం మమ్ములనే అడుగుతుంది. ఇవన్నీ ఆలోచించి, ఆ భూమిని నా పేర మార్చుకుందా మనుకున్నాను. ఎప్పటికైనా ఆ బ్రాహ్మణుడు బ్రతికి బాగు పడుతాడు. నాకు ప్రభుత్వంతో మాటరాదు."

"అంటే ఆ బ్రాహ్మణుడు వచ్చి అడిగినప్పుడు ఆ భూమి అతనికి ఇచ్చి వేయాల్ననేగా మీ అభిప్రాయం? అవునులేండి. మీకేం భూములు తక్కువ గనకనా, ఇతరుల భూమికి ఆశపడేది?"

"అవును మరి. ఇప్పుడు నీ భూమి సంగతే చూడరాదూ? ఏదో కారణమనుకో. ఎప్పుడో తీసికున్న భూమిని ఇప్పుడు నీకు తిరిగి ఇస్తున్నా నంటున్నానా లేదా? ఇది కూడా అంతే."

"అయితే, ఇందులో నన్నేమి చేయమంటారు?"

"ఏమీ లేదు. కఛేరిలో "వెంకటేశ్వర్లు హాజర్ హై" అని పిలుస్తారు. అప్పుడు నీవే వెంకటేశ్వర్లనని చెప్పాలె. ఆ భూమి నాకు అమ్మివేస్తున్నట్టు, దానికించ మొత్తం పైకం ముట్టినట్టు, మీకు ఇంకా ఎవరు వారసులు లేనట్టు చెప్పాలె."

"నాపేరు వెంకటాచారి గదండీ? మరి వాండ్లు "వెంకటేశ్వర్లు" అని ఎందు కంటారు?"

"అది కాదయ్యా. ఆ బ్రాహ్మణుడు చచ్చినప్పుడు ఆతనికొక పసిపిల్ల వాడున్నాడంటినే అతనిపేరు వెంకటేశ్వర్లు. ఆ వెంకటేశ్వర్లు నీవేనని అక్కడ చెప్పాలె. ఈ మాత్రం అర్థంకాదా? నీవు ఒట్టి మొద్దువని అందర నేది నిజమే." అని రామభూపాల్‌రావు గద్దించాడు.

వెంటచారి దేబెముఖం వేశాడు. యింకా వివరంగా ఏమేమో అడు గాలని అనుకున్నాడు. కాని రామభూపాల్‌రావు గద్దింపుతో గొంతునొక్కి నట్లైంది "సరే"అని నీళ్లు మింగాడు.

"బండిని తొందరగా పోనియ్యి." రామభూపాల్‌రావు అధికార ధ్వనిలో ఆజ్ఞాపించాడు. "అన్నీ అర్థమైనట్టేనా? మళ్ళా అక్కడికి పోయిన తర్వాత "దద్దదా" అంటావా?" అని మళ్ళా వెంకటాచారిని కోపపడ్డాడు. కచ్చడంలో వెల్లకిల పడుకొని కాళ్లు చాపాడు.

వెంకటాచారి ముఖం కందిపోయింది. అంగీకారసూచకంగా తల ఊపాడు. తెల్లముఖం వేసుకొని రామభూపాల్‌రావును చూచాడు.

రామభూపాల్‌రావు తన భావికార్యక్రమాన్ని ఆలోచించసాగాడు. కండ్లుమూసి, మీసాలను పైకి దువ్వాడు.

బండిని వడిగా ఉరికించాడు వెంకటాచారి. వెంకటాచారి ఆలోచించా ల్సిన అవసరంమేమీ లేదనుకున్నాడు. ఆలోచించజాలడు కూడా. తండ్రి కాల ములో పోయిన భూమిని తిరిగి రామభూపాల్‌రావు యిస్తున్నాడన్న సంతో షం ఒక వైపు. ఏమైన సందేహాలు అడిగితే రామభూపాల్‌రావు కోపపడ్తా డన్న భయం ఒక వైపు కలిగి ఏమీమాట్లాడక గంభీరించి ఊరుకున్నాడు.

# 7

ఎవరికి తెలియకుండా ఆరాత్రి కొమరయ్య ఇంట్లో తల దాచుకుందా మనుకున్న కంఠీరవం తన తల్లిని ఒకసారి కలసికోవాలని ఆతురతపడ్డాడు. వెంకటాచారికి తెలియకుండా తల్లి ఆండాళమ్మ చీకటిపడ్డ తర్వాత కొమరయ్య ఇంటికి వెళ్ళింది. కీనీడకు కూర్చొన్న కంఠీరవాన్ని చూచింది. అతడు కొమ రయ్యతో మాట్లాడుతున్నాడు. ఆండాళమ్మ కంఠీరవాన్ని అమాంతంగా కౌగలించుకొని కుమిలి, కుమిలి ఏడ్చింది.

"ఆయనే పొద్దుటినించి ఏడ్చి, ఏడ్చి ఇద్దైపోయిండు. ఇంకా ఎందుకు ఏడ్పిస్తావు అమ్మగారు'' కొమరయ్య దీనంగా అన్నాడు.

"కన్న కడుపు కొడుకా! ఎట్లా ఊరుకుంటుంది?" కొమరయ్య తల్లి అన్నమ్మ మాతృప్రేమ మహిమను తెలిపింది.

"ప్రొద్దటినుంచి ఉపోషమేనా కొడుకా?'' దుఃఖాన్ని తగ్గించుకొని ఆండాళమ్మ అడిగింది. కంఠీరవం తల నిమిరి, బుగ్గలను ముద్దాడింది.

"ఉపోషంకాకుంటే ఏం తింటాడు? మీరు పెద్దకులం వాళ్లు, మావి మీకు పనికిరావాయె. చేలో ఇన్ని కంకులు, దోసపిందెలు పెట్టారంట. ఇక్కడికి వచ్చినాక బలవంతాన ఇన్ని పాలు తాగిండు. ఎంతైనా అన్నం మీదికి వస్తాదమ్మా" అన్నమ్మ ఆదరంగా అన్నది.

"ఆ మాత్రం పాలు ఇచ్చే పుణ్యమన్నా దక్కింది అన్నమ్మ నీకు. నేను కన్నతల్లినైనా ఆమాత్రం సాయం చేయలేకపోతిని కొడుకుకు. పిడి చెడు అన్నం పెట్టలేముకదా? నేను బ్రతికున్నా లేని దానితో సమానమైతి. వీడి మాటలు వీడికి, వాడి మదం వాడికి?'' ఆండాళమ్మ తన దీనావస్థను తల నేలకు వేసి, భూదేవికి నివేదించుకుంటున్నట్లు అన్నది.

"ఏమంటాడు నీ పెద్ద కొడుకు?" కొమరయ్య అడిగాడు.

"ఏమంటాడు? నేను రెక్కలు విరిగిన పక్షివలె కొట్టుకుంటున్నా వాడికి చీమ కుట్టినంత లేదు." కంఠీరవం వైపుతిరిగి, "ఇంటికి పోదాం రారాదు నాయనా!" ఆండాళమ్మ ఆలోచనా ధోరణిలో అడిగింది.

"నేను రానమ్మ. రోజు జగడాలు. అన్నదమ్ములం మాకు సుఖం లేదు. నీకు శాంతిలేదు. నేను ఇంట్లోలేకుంటే పంచాయతీలు లేకుండానన్న ఉంటుంది. ఇట్లాగే రోజులు గడువనియ్యి. కాలంవస్తే నాలోఏమైన తప్పుంటే నేను సర్దుకుంటాను. అన్నయ్యకూడా ఒకనాడు కాకపోతే ఒకనాడైనా ఆలోచించక పోడు. ముఖ్యంగా నేను సుఖంగా ఉండటమే కదా అమ్మ నీకు కావాల్సింది? కొమరయ్యవంటి ఆప్తులకు, అన్నదాతలకు కరువులేదు. ఎక్కడైనా ఏదోవిధంగా కాలం వెళ్ళబోసుకుంటాను. నా క్షేమసమాచారాలు తెలుపుతుంటాను. నా బదులు ఈ కొమరయ్య నీ కొడుకు అనుకో. అతడు మనసు అన్నివిధాలా ఆత్మీయుడమ్మా. నేను ఈఊళ్ళనే ఉండతలచుకోలేదు. ఎక్కడైనా కష్టించి బ్రతికి కాలం వెళ్ళబుచ్చుకుంటాను. ఇక నీవు వెళ్లమ్మా. అన్నయ్యకు తెలిస్తే అదొకరాద్ధాంత మవుతుంది. నావల్ల నీకు కలిగే సుఖం లేకున్నా, కొట్లు, తిట్లు మాత్రం తప్పడం లేదు." కంఠీరవం బాధగా ఒక్కొక్కటి అన్నాడు.

"కొడ్తాడా అమ్మా?" అన్నమ్మ బెదిరినట్టు అడిగింది.

"దానిమీదనే ఇద్దరికి చెడిసి ఇంతవరకు వచ్చింది. ఒకటికాదు తల్లి చెప్పుకోటానికి." అంటూ ఆండాళమ్మ పైటకొంగుతో ముక్కు తుడుచుకుంది.

"ఎక్కడికో పోతానంటాడు. కాని ఎక్కడికి పోతాడో ఏమో! నాకే భయంవేస్తున్నది." కొమరయ్య దిగులుగా ఆండాళమ్మను చూస్తూ అన్నాడు.

"అదే నాయనా, నాకు దిగులు" ఆండాళమ్మ దీనంగా కొడుకును చూస్తూ అన్నది.

"కొమరయ్యా! నీవంటి హృదయంగల రైతులు, అన్నదాతలు, ఆప్తులు ప్రతిచోట ఉన్నారని నాకు ధైర్యం ఉంది. ఎక్కడైనా వేళ్లకు తాగడానికి ఇన్ని నీళ్లు దొరకవనుకోకు. అమ్మా! వెళ్తాను. దిగులుపడకు. కొమరయ్యా! చికాకుగా ఉంది. అట్లా ఊరి బయటికి వెళ్దాంపద" అని లేచాడు కంఠీరవం.

ఆండాళమ్మ కొడుకును కౌగలించుకోబోయింది. కంఠీరవం తల్లి కాళ్లపైబడి, సాష్టాంగ దండప్రణామాలు పెట్టాడు. కండ్ల నిండా నీళ్లు తిరిగాయి. పరిసరాలు అస్పష్టంగా, అనేక రూపాలతో తాండవించాయి.

"ఇక పొమ్మంటావా తండ్రీ! మళ్ళ ఎప్పుడు కొడుక నిన్ను చూచేదీ?" ఆండాళమ్మ ఎక్కి, ఎక్కి ఏడ్చింది.

"దిక్కు లేనోండ్లకు దేవుడే దిక్కు. ఎందుకేడుస్తావు తల్లి" అన్నది అన్నమ్మ. కంఠీరవం కాళ్లకు దండం పెట్టింది. కంఠీరవం, కొమరయ్య ఇల్లు వదలి బయటికి వెళ్ళారు.

"నా కొడుకు దిక్కు లేనివాడైనాడా అన్నమ్మా? శ్రీ యఃపతి! అన్నిటికి నీవే ఉన్నావు" ఆండాళమ్మ ఆకాశానికి చేతులు మోడ్చి నివేదించింది. "పొయ్యివస్తా అన్నమ్మా!" ఆండాళమ్మ ఇంటికి బయలుదేరింది.

అన్నమ్మ వాకిలికడపదాక వెంట వచ్చింది. "మనుసు గట్టిచేసుకో తల్లి. పెద్ద మనిషివి. అడ్డం పడితే ఎవడు దిక్కు?" అంటూ సాగనంపింది.

# 8

కంఠీరవానికి కొమరయ్య తన ధోతి, కండువ, ఒక రూపాయి ఇచ్చి తెల్లవారు ఝామున సాగనంపాడు. కంఠీరవం నిజామాబాదు దోవపట్టాడు. కొంత దూరం బండ్లబాట నడిచి వెళ్ళాడు. మధ్యన రైలు దారి అడ్డు వచ్చింది. రైలుదారి వెంట, వెంట, నడువసాగాడు. పక్కచేలల్లో కనిపించిన, కంకులు, కాయలు, తినుకుంటూ, బావుల్లో నీళ్లు తాగుతు పొద్దుతిరిగేవరకు డిచ్పెల్లికి

చేరుకున్నాడు. గడిచినరోజే సరిగా తిండిలేదు. పైగా ఈ రోజు చాలా నడి చాడుకూడా. అలసిపోయి, రైలు స్టేషన్‌లో కొంత సేపు పడుకున్నాడు. ఇంతలో హైదాబ్రాదుకు వెళ్ళే రైలువచ్చి ఆగింది. కంఠీరవం లేచి కట కటాలను పట్టుకొని రైలుబండిని ఎక్కుతున్న, దిగుతున్న ప్రయాణీకులను వింతగా చూస్తూ నిలుచున్నాడు. రైలు వెళ్ళిపోయింది. రైలు పోలీసు ఒక ప్రయాణీకుని తీసికొచ్చి ఒక చోట కూర్చోబెట్టి స్టేషన్‌మాస్టరు వద్దికి వెళ్ళాడు. కంఠీరవం మెల్లగా ఆ ప్రయాణీకునిదగ్గరికి వెళ్ళాడు. "నీ వేం తప్పుచేశావు?" అడిగాడు.

"ఏమీలేదు. టిక్కెటు లేకుండ రై లెక్కిన."

"ఇప్పుడు నిన్నేమి చేస్తారు?"

"ఏమో ఏంజేస్తరో?"

"అయితే నీకు టిక్కెటు ఎందుకు ధొరకలేదు. ఎక్కడ దొరుకు తాయి?"

"రైలు ఎక్కేచోటే అమ్ముతారుగాని, నాకు పైసలులేక కొనలేదు?"

ఇంతలో రైలు పోలీసువాడు వచ్చి ఆ ప్రయాణీకుని స్టేషన్‌మాస్టరు ఆఫీసులోకి తీసకెళ్ళాడు. కొద్ది సేపైన తర్వాత వదిలిపెట్టారు.

ప్రయాణీకుడు, దూరంగా కనిపిస్తున్న చెట్లగుంపు వైపు పోసాగాడు. కంఠీరవంకూడా అతన్ని అనుసరిస్తూ "నిలబడు, నేనుకూడా వస్తా" నన్నాడు.

ఆ వ్యక్తి వెనుకకు తిరిగి నుంచున్నాడు. "నీ వెక్కడికి పోతావు?" ప్రశ్నించాడు.

"టిక్కెటు లేనందుకు వాండ్లేమన్నారు." కంఠీరవం ప్రశ్నించాడు.

"వెండి దండకడియం తీసుకున్నారు. ఇవ్వనంటే జేలుకు పంపిస్తా మని భయపెట్టారు. నేను మా తమ్ముడిని చూడపోతున్నాను" ప్రయా ణీకుడన్నాడు.

"ఎక్కడ ఉంటాడు మీతమ్ముడు? టిక్కెటుపైకం కింద సొమ్ములు కూడా తీసికుంటారా?" అమాయకంగా కంఠీరవం అడిగాడు.

"వాండ్ల చేతిలో చిక్కాం, వాండ్లేమంటే అదే సాగుతది." దూరంగా కనిపిస్తున్న చెట్లవైపు చేయిలేపి. "అగో! అక్కడ ఉంటాడు. మందు తింటున్నాడు, కుష్ఠు రోగానికి. అక్కడ దవాఖానాలో కుష్ఠు రోగులకే మందిస్తారు. తెల్ల దొరలు మా మతంవాండ్లకు డబ్బు లేకుండానే మందు లిస్తారు" ప్రయాణీకుడు అన్నాడు.

"మీమత మంటే" కంఠీరవం అడిగాడు.

"కిరస్తానీ మతం. అంటే తెల్లదొరల మతం."

కొద్దిసేపు సంభాషణలేకుండా బాటసాగింది.

కంఠీరవానికి బాల్యమునాటి ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది. తురక పంతులు ఉన్న రోజుల్లో అతని ఊరికి ఒక తెల్ల దొరవచ్చి ఊరిబయట మామిళ్ళలో, మాల, మాదిగలను పిలిపించి, ఒకచోట కూర్చోబెట్టి ఏదో చెప్పాడు. తమాషాగా వేరే కులాలవాండ్లు కూడా వెళ్ళి దూరంగా నుంచుని వింతగా చూచారు, విన్నారు. నామాలు నాకేస్తారని తెలిసి మొదట కంఠీర వం వెళ్ళడానికి మొదట భయపడ్డాడు. కాని పంతులుతో ధైర్యంగా వెళ్లాడు. ఆతెల్లని శరీరాన్ని, నల్లని గడ్డాన్ని, కింది నుంచి మీదిదాక తొడుక్కున్న అంగీని చూచి అంతా వింత పడ్డారు. "ఏం చెప్తున్నాడు పంతులు?" కంఠీరవం ప్రశ్నించాడు.

"అందరిని తన మతములో కలువాలని, అప్పుడు అందరికి చదువు, మందులు, దొరుకుతాయని, చచ్చింతర్వాత స్వర్గానికి పోతారని చెప్తున్నాడు."

"మాల, మాదిగలకు మన మందులు బళ్లు పనికిరావా పంతులు? వాండ్లు కూలిచేసుకుంటరుగదా! మరి ఇంకా కొలువు లెందుకు?"

"వాండ్ల పిల్లలు మన బళ్ళోకి వస్తే ఊళ్ళో వాండ్లు ఊరుకోరు. మాల మాదిగలను మీరు ముట్టుకోరుగా? మన వైద్యులు మాదిగ గూడానికి వెళ్ళడం కూడా జరుగదు. అందుకని ఆ తెల్లవాళ్ళు ఆ ఏర్పాట్లు చేస్తా మంటున్నారు." పంతులు వివరించాడు.

"మన ఊళ్ళోవాం డ్లంత తెల్లగా ఎందుకుండరు పంతులు?"

"వీండ్లు మనదేశంలో పుట్టినవాండ్లుకారు. వాండ్లది వేరేదేశం. మనకు చాలాదూరంగా సముద్రాలని పెద్ద పెద్ద చెరువులుంటాయి, వాటి అవతల వాండ్ల దేశం."

"అంత దూరం నుండి ఇక్కడికివచ్చి మాల, మాదిగలకు బళ్ళు, మందులు ఇస్తున్నారన్నమాట."

"వాం డ్లదే పనిమీద రాలేదు. సర్కారు నడుపుతున్నదికూడా వాండ్లే."

కంఠీరవం ఆశ్చర్యంగా పంతులును చూచి, "సర్కారును వారే నడుపుతున్నారా పంతులు? మరి మన ఆలాహజ్రత్ ఉన్నదుగద పంతులు?" అన్నాడు..

"మన ఆలాహజ్రత్ మన హైదరాబాద్ రాజ్యానికి పెద్ద. కాని ఈ తెల్ల వాండ్లు ఢిల్లీలో కూర్చొని మొత్తం భారత దేశాన్ని రాజ్యం చేస్తున్నారు."

కంఠీరవానికి, తన పంతులుకు ఈ విధంగా జరిగిన సంభాషణ జ్ఞాపకం చేసుకుంటూ ఆవ్యక్తి వెంట వెళ్ళుతున్నాడు.

ఆ వ్యక్తి వెనకకు తిరిగి చూచి "ఏవూరుకు పోవాలె?" ప్రశ్నించాడు,

కంఠీరవం వెంటనే సమాధాన మివ్వలేక పోయాడు. "నిజామాబాదుకు పోవాలని యింటి నుండి బయలుదేరాను. నీవు కనబడ్తే నీ వెంట వస్తున్నాను." మెల్లగా అన్నాడు.

ఆ వ్యక్తి నడకనాపి, "నిజామాబాదు అక్కడ ఉంటుంది. మరి యెందుకు వస్తున్నావు?" అడిగాడు.

"ఈ రోజు ఈఊళ్ళోనే ఉందామనుకుంటున్నాను. కాని నాకు ఎవరూ గుర్తు లేదు." విచారంగా కంఠీరవం సమాధాన మిచ్చాడు.

"కొత్తచోట ఎక్కడ ఉంటావు? సానా కష్టమైతది. ఇప్పుడు వచ్చినతోవన రైలు టేషన్‌కుపో. నిజామాబాదుకుపోయే రైలువస్తది. దాంట్లో పోరాదు?" ఆ వ్యక్తి అన్నాడు.

"రైలుకు ఎన్ని పైసలైతవో!" నా రూపాయచాలునో లేదో" కంఠీరవం తనకు తానే అనుకున్నాడు. "నావగ్గర ఒక్క రూపాయ ఉంది. నిజామాబాదుకు చాల్తదా?" ఆ వ్యక్తిని ప్రశ్నించాడు.

"నీ తాన రూపాయ ఉందా? నీకాలు మొత్త. దాంట్లో నీటిక్కటు పైసలు పోంగ, ఏమైన మిగులొచ్చు. అవిచ్చి, నా దండెకడియం ఇడిపిచ్చుకుంట. నీకు పుణ్యముంటది. బీదోడ్ని అన్నాలంగా ఉన్నొక్క దండెకడియం లేకుండైంది." అంటూ ఆవ్యక్తి వెనుకకు తిరిగి స్టేషన్‌వైపు దోవ తీశాడు. కంఠీరవం ఆవ్యక్తిని అనుసరించాడు. రూపాయ పూర్తిగా ఒకేసారి ఆవిధంగాఖర్చు కావడం కంఠీరవానికి కష్టమనిపించింది. కాని పైకి తన భావాన్ని ప్రకటించలేదు.

ఆ వ్యక్తి స్టేషన్ మాస్టరువద్దికి వెళ్ళి రూపాయ ఇచ్చాడు. నిజామాబాదు టిక్కటుకు పైసలు ముదరా బెట్టుకొని, మిగతాపైసలు తన టిక్కటు కింద తీసికొని దండెకడియం ఇమ్మన్నాడు.

స్టేషన్ మాస్టరు క్రోధంగా ఆవ్యక్తిని చూచాడు. రూపాయను టంగ్‌మని కొట్టి మోగించాడు. నిజామాబాదుకు టిక్కటు ఇచ్చాడు. దబాలున కిటికీ మూశాడు. కంఠీరవం, ఆవ్యక్తి దిగులుపడి ఒకరి నొకరు చూచుకున్నారు. స్టేషన్ మాస్టరు ఆఫీసుగది నుండి బయటికి వచ్చి, కోపంగా ఆవ్యక్తిని చూచాడు. "బుద్ధికలిగి ఇక్కడినుంచి పోతావా, పోలీసుకు పట్టివ్వాల్నా?" గొంతుచించుకొని అన్నాడు. కంఠీరవం ఆశ్చర్యపడ్డాడు. అయోమయంగా తోచింది. ఆ రైలు వ్యవహారాలు ఆ ఁధంగా ఉంటాయేమో అనుకున్నాడు. ఆవ్యక్తి భయంతో వెనకకు తిరిగి చూడకుండానే తన మొదటి తోవన వెళ్లిపోయాడు.

కంఠీరవం మెల్లగా స్టేషన్ మాస్టరువద్దికి వెళ్ళి, "నా రూపాయ సరిగ్గా సరిపోయిందా?" వినయంగా అడిగాడు.

"ఇంకా వేరే చెప్పాలా? వచ్చే దుంటే మేము ఇవ్వం. ఎన్నడు రైలెక్కిన ముఖం కానట్టుందే?" అంటూ స్టేషన్ మాస్టరు రైలు ప్లాటు ఫారం మీదికి వెళ్ళి నిలుచుండి అటు, ఇటు చూచాడు.

కంఠీరవం ఉక్కిరి బిక్కిరై పోయాడు. విచారంగా వెళ్ళి ప్లాటు ఫారం మీద నిలుచున్నాడు.

కంఠీరవం వెనుక భాగంలో కటకటాల నానుకొని ఇద్దరు వ్యక్తులు స్టేషన్ మాస్టరు గురించి మాట్లాడుకుంటున్నారు.

"వీడి దశేందోగాని భలేసాగించుకుంటున్నడే, ఏమైనాగాని."

"ఇంక నీకు ఆశ్చర్య మేస్తున్నదా? ఇటువంటోండ్లు అంతటా ఉన్నరు. కొంచెం పైచేయి, కిందిచేయి అనుకో. ఎక్కడైనా జరుగుతూనే ఉంటుంది" అంటూ ఇంకొక్కడు బీడీ ముట్టించాడు.

రైలు రాగానే కంఠీరవం ఎక్కి, నిజామాబాదుకు చేరుకున్నాడు. ఎక్కడికి వెళ్ళాల్సింది, తోచలేదు. అంత గ్రామాన్ని, ఆవిధంగా దుకాణాలు, దీపాలు, ప్రజల సంచనలం చూడటం కూడా అతనికి మొదటిసారి. వింతగా రెండువైపుల దుకాణాలను చూస్తూ మెల్లగా రోడ్డు వెంట నడుస్తున్నాడు.

నామాలు పెట్టుకొని బట్టల దుకాణములో మెత్తకానుకొని కూర్చున్న ఒక వర్తకుని వద్దికి వెళ్ళి నిలుచున్నాడు. లక్ష్మీనారాయణ పేరుగల ఆవర్తకుడు కంఠీరవాన్ని ఎగాదిగా చూచాడు. లైటు వెలుతురుకు కంఠీరవం నొసటిపై నామాల మచ్చలు స్పష్టంగా కనిపించాయి. వైష్ణవభక్తుడైన ఆవర్తకుడు చాలా బాధపడ్డాడు. ఒకవైష్ణవుడు, ఆవేళ వరకు ముఖాన బొట్టులేక ఉండటం భరింపరాని అన్యాయమని ఆశ్చర్య పడ్డాడు.

"మీరు స్వాములా?" చేతిలోని బీడీని నలిపి, దూరంగా పారవేసి లక్ష్మీనారాయణ అడిగాడు. "ఏం? ప్రొద్దటి నుంచి సాపాటు చేయలేదా? రాండి. అట్లా కూర్చోండి" అన్నాడు.

కంఠీరవం విచారంగా తల నేలకు వేసి నిలుచున్నాడు.

"అయ్యో! నిలబడితిరి? కూర్చోండి! ఏపూరు స్వామి మనది? ఎక్కడి కొచ్చారు? ఇక్కడెవరైనా బంధువులున్నారా?" లక్ష్మీనారాయణ ప్రశ్నలు కురిపించాడు.

"నా కీవూరు క్రొత్త. నా కిక్కడ ఎవరూ గుర్తు లేదు." కంఠీరవం దీనంగా జవాబు చెప్పాడు.

"ఊరేది స్వామీ?"

"దిమ్మె గూడెం. పేదాల రఘునాధాచార్యులు మా నాయనగారు. మానాయనగారు కాలం చేశారు. మా నాయనగారు మీకెరికేనా?" కంఠీరవం సమాధానంగా, తిరుగు ప్రశ్నలు వేశాడు.

"ఆఁ? ఏమన్నారు. దిమ్మెగూడెం రఘునాధాచార్యుల కొడుకులా మీరు? రామానుజ, అన్యాయం. ముఖాన బొట్టు లేకుండా ఎన్నడైనా మీ నాయనగారు ఊరు వదలి బయటికి వెళ్ళేవారా? మీనాయనగారిని ఎవరు ఎరుగరు స్వామీ? వారి ఆచారము, సాంప్రదాయము, తెలివి, పాండిత్యము ఎరుగని వారెవరు? ఎంతటి మహానుభావులు, ఎంతటి ఘటము? వారిని చూస్తేనే పంచమహాపాతకాలు పోతాయి"........." ఒరే! వెంకటయ్యా! ఇటురా. ఈ అయ్యగారిని వేదాంతాచారిగారి ఇంటికి తీసుకపో. వీరు దిమ్మె గూడెం రఘునాధాచార్యులగారి కుమారులని, ప్రొద్దుట నుంచి సాపాటు చేయలేదని చెప్పు. బోజనానికి ఏర్పాటు చేయించమని చెప్పు." అని లక్ష్మీ నారాయణ గుమాస్తాకు చెప్పాడు.

"అయ్యా! మీరు వాడి వెంట పోండి. అపచారము. పొద్దటనుంచి సాపాటులేదు. ఎంత మాట" అంటూ లక్ష్మీనారాయణ మెత్తమీద నుంచి లేచి "దాసుడిని" అని దండం పెట్టాడు.

కంఠీరవం గుమాస్తా వెంట బయలు దేరాడు. తన తండ్రిని గురించి లక్ష్మీనారాయణ వెలిబుచ్చిన భావాలకు, తన యెడ అతను కనబరచిన అప్యాయతకు లోలోన ఆనందంతో పొంగిపోయాడు. తండ్రిని, ఇంటి స్థితిని జ్ఞాపకం చేసుకుంటూ గుమాస్తా వెంట వేదాంతాచార్యుల యింటికి వెళ్లాడు.

కంఠీరవం విషయం గుమాస్తా ద్వారా వివరాలు తెలిసికొన్నది మొదలు వేదాంతాచార్యులు రఘునాధాచార్యుల ప్రతిభను పొగడడం మొదలు పెట్టాడు. రఘునాధాచార్యుల మరణానికి వగచాడు. అటువంటి పరమ భాగవతోత్తముడిని ఇక చూడటం కష్టమని విచారించాడు. అతని పేరు, ప్రతిష్టలు కాపాడాల్సిన బాధ్యత కంఠీరవంపై ఉందని, హెచ్చరించాడు.

కంఠీరవం స్నానం ముగించుకున్నాడు. వేదాంతాచార్యుల రెండో కొడుకు మోహనాచార్యులు, కంఠీరవం ఉపాహారం ముగించుకొని వివేక వర్ధని గ్రంథాలయం వైపు వెళ్ళారు.

వేదాంతాచార్యులు ఆయుర్వేద వైద్యుడుగా ఆ చుట్టుప్రక్కలా, స్థానికంగా మంచి పేరు, ప్రఖ్యాతులు గడించాడు. వైద్యవృత్తికి తోడుగా వ్యవసాయం కూడా ఉంది. వైద్యంలో ఎంతశ్రద్ధతో పనిచేస్తాడో, వ్యవసాయం కూడా అంతే శ్రద్ధతో చేయించుకొంటాడు. పెద్ద కొడుకు కస్తూరిరంగాచార్యులు బడిపంతులుగా పనిచేస్తున్నాడు. రెండోకొడుకు మోహనాచార్యులు మెట్రిక్ చదువుతున్నాడు. తర్వాత వకీలు పరీక్షలో కూర్చోవాలని ఆలోచిస్తున్నాడు.

కంఠీరవం, మోహనాచార్యులు గ్రంథాలయానికి వెళ్ళగానే, మోహనాచార్యులు ఒక పత్రికను చేతబట్టి చూడసాగాడు. "మీకు కావలసిన పత్రికేదైన తీసికొని చదువండి" కంఠీరవంతోఅన్నాడు. కంఠీరవానికి ఆ ప్రదేశం కన్నుల కింపుగా తోచింది. అల్మారాలల్లో అందంగా పేర్చబడియున్న పుస్తకాలు, అంతా నిశ్శబ్దంగా కూర్చొని చదువుతూ ఉన్న చదువరులు, అప్పుడే గ్రంథాలయంలోకి ప్రవేశించి ఒకరి నొకరు మందహాసంతో నమస్కరించు

కోవడం కంఠీరవానికి ఆనందంగా తోచింది. అవన్ని గమనిస్తూ కంఠీరవం కొంతసేపు కాలంగడిపాడు.

గ్రంథాలయం ఆవరణలో నాలుగు వైపుల గోడలకు తగిలించి ఉన్న ఫోటోలను ఒక్కొక్కటి చూస్తూ ఆ ఆవరణమంతా తిరిగాడు. గాంధీ, గోఖ్లే, తిలక్, మోతీలాల్, లజపతిరాయ్, జవాహర్‌లాల్, సరోజినీదేవి, విఠల్‌భాయిపటేల్, డా॥ అన్సారి, కమలానెహ్రూ, స్వరూపరాణి నెహ్రూ, కమలాదేవిచటోపాధ్యాయ, సుభాస్‌చంద్రబోస్ చిత్రాలన్ని తగిలించబడి ఉన్నాయి, ఆ పటాలల్లో అచ్చైన పేర్లన్ని ఇంగ్లీషు భాషలో ఉన్నందువల్ల వారంతా ఎవరో కంఠీరవానికి అర్థంకాలేదు. అన్ని పటాలకంటె పెద్దగా ఉండి, ప్రధానమైన స్థలంలో ఉన్న నిజాం పటమును మాత్రము కంఠీరవం గుర్తుపట్టాడు. వరుసగా బల్లలు, వాటికి రెండువైపుల కుర్చీలు, బల్లలపై దిన, వార, పక్ష, మాస పత్రికలు పెట్టబడి ఉన్నాయి. కంఠీరవం ఒక్కొక్కటి తిరగవేస్తు, వాటిలోని బొమ్మలను, వార్తల శీర్షికలను చదువుతూ కొంతసేపు కాలం గడిపాడు,

మోహనాచార్యులు వచ్చి పిలువగానే, కంఠీరవం బయలుదేరాడు. మార్గమధ్యంలో మోహనాచార్యుల నడిగి గ్రంథాలయములోని చిత్రాల వివరాలను తెలిసికొన్నాడు. ఆ చిత్రాలలోని ఒక్కొక్కరిని గురించి మోహనాచార్యులు తనకుతెలిసినవి, విన్నవి వివరించాడు. వారిపై ఆంగ్లేయప్రభుత్వం చేసిన, చేస్తున్న దౌర్జన్యాలు, వారిని జేళ్ళలో హింసిస్తున్న పద్ధతులు తెలిపాడు. ఆ వివరాలు కంఠీరవంపై చాలా ప్రభావం కలిగించాయి. తిరిగి ఆ చిత్రాలను చూడాలనే ఆసక్తి హెచ్చింది.

"ఢిల్లీలో వైద్యసహాయము చేస్తున్న తెల్లవాండ్లే అటువంటి అన్యాయమైన పనులు చేస్తున్నారా?" ఆశ్చర్యంతో కంఠీరవం అడిగాడు.

"అవును! ఆ తెల్లజాతివాండ్లే" మోహనాచార్యులు అన్నాడు.

"అంత దయతో రోగులకు చికిత్స చేస్తున్నవాండ్లు అంతకఠినంగా అటువంటి గొప్ప, గొప్ప వాండ్లను ఎందుకు హింసిస్తున్నారు?" ఆవేదనతో అడిగాడు కంఠీరవం.

ఈ ప్రశ్నకు సమాధానమివ్వడం మోహనాచార్యులు శక్తికిమించిన విషయమైంది. "అదే అర్థం కావడంలేదు. మా మాష్టారుకూడా తెల్లవాండ్ల పట్టుదల,క్రమశిక్షణ, పరిశోధనాపటిమ, విజ్ఞానప్రియత్వము, సాహసములను గురించి తెగపొగడుతుంటాడు. ఈ కాంగ్రెసు వాండ్లెంత కష్టపడ్డా ఆ తెల్ల వాండ్లతో సరితూగ జాలరని కూడా అంటాడు" అన్నాడు.

"నా అభిప్రాయంలో, ఇందులో మనకు తెలియని విషయమేదో దాగిఉంది. లేకపోతే, అట్లా అంత చదువుకున్న వాండ్లు అర్థంలేకుండా కష్టాల ననుభవిస్తున్నారంటె; ఒక వైపు దయను చూపుతు రెండో వైపు మీరు చెప్పిన దౌర్జన్యాలు తెల్లవాండ్లు చేస్తున్నారంటే ఇందు ఏదో పెద్ద విష యమే దాగి ఉంది" అన్నాడు కంఠీరవం.

"మనమేమీ చెప్పలేం" మోహనాచార్యులు తన నిస్సహాయతను వ్యక్తపరిచాడు.

ఇంటికి చేరుకోగానే మోహనాచార్యులు, కంఠీరవం భోజనం ముగిం చుకొని ఒకే చోట పక్కలు వేసుకొని పడుకొన్నారు.

మోహనాచార్యులు పడుకొని స్కూల్ పుస్తకాలు చదువ మొదలు పెట్టాడు.

కంఠీరవం కూడా ఉండలేక కొన్ని పుస్తకాలను తిరగవేశాడు. అందులో ఒకటి ఇంగ్లీషు పుస్తకం, రెండోది లెక్కల పుస్తకం! ఆ రెండు కూడా అతడు చదువురాని వానిగా తేల్చివేశాయి.

ఆ పుస్తకాలు తన కేమీ అర్థంకానందుకు చింతించాడు. అటువంటి చదువులు పల్లెటూరివాండ్లకు చెప్పకపోవడం, బస్తీవాండ్లకు మాత్రం చెప్పడం ఎందుకో తెలిసికోజాలలేము. "ఏ బస్తీ చదువులకు, మాపల్లెటూరి

చదువులకు చాలా భేదముంది." పుస్తకాలను మోహనాచార్యులకు చూపి, "ఈ చదువు మాకు చెప్పనే లేదు" అన్నాడు.

అతని అమాయకత్వానికి మోహనాచార్యులు తనలో తాను నవ్వు కున్నాడు."ఇవన్నీ మీరు నేర్చుకుంటారా?" కంఠీరవాన్ని చూస్తూ అన్నాడు.

"నేర్పితే ఎందుకు చదువను?" ఆశతో కంఠీరవం అన్నాడు.

"సరే! మంచిది. ఆలోచిద్దాము. చాలా అలసిపోయారు. పడుకోండి" అని మోహనాచార్యులు తిరిగి చదువులో లీనమయ్యాడు.

కంఠీరవం తిరిగి ఆలోచనలో పడ్డాడు. తన భవిష్యత్తు ఏం కాను న్నదో, తెల్లవారితే ఏంచెయ్యాల్సుందో అయోమయంగా తోచింది. కొత్తగా వచ్చిన తనకు బస్తీలో ఆదరణ కలగడానికి కారణమైన తన తండ్రి ఘన తకు ఉబ్బిపోయాడు. తండ్రి జీవించి ఉన్నప్పుడు తండ్రికి, తనకు జరుగు తుండే వాదనను జ్ఞాపకము చేసుకొని నిట్టూర్పువిడిచాడు. డిచ్పల్లి రైలు స్టేషన్‌లో స్టేషను మాస్టరు కరకుతనం, తెల్లవారి ద్వంద్వ నీతిపై ఆలోచిం చాడు. బట్టల వర్తకుడు లక్ష్మీనారాయణ ఆప్యాయతను తలుచుకొన్నాడు. మరునాడు తిరిగి లక్ష్మీనారాయణను కలిసికోవాలని అనుకుంటూ నిద్రలో లీనమైనాడు.

## 9

రామభూపాల్‌రావు వెంకటాచార్యుల దొంగ వాజ్మూలము, అతని తొత్తులైన వారి కుటిల సాక్ష్యాలతో కొమరయ్య తోటబావి కింద భూమి తన పేర వ్రాయించుకొని ఎవరికితెలియకుండానే రెండేండ్లు గడిపాడు. వెంకటా చార్యులకు వాగ్దానము ప్రకారము భూమి ఇచ్చానని చెప్పాడు. వెంకటా చార్యులు స్వంత సేద్యము చేయడు కాబట్టి రామభూపాల్‌రావు కౌలుపద్ధతిన సేద్యము చేయిస్తానని చెప్పాడు. ప్రతి సంవత్సరం న్యాయంగా యివ్వాల్సిన భాగము యిస్తానని చెప్పి, ఆ విధంగా ధాన్యమో, డబ్బో తోచినంతవరకు వెంకటాచార్యులకు ఇచ్చేవాడు.

వెంకటాచార్యులు రామభూపాల్‌రావు నమ్మిన బంటుల్లో ఒకడై పోయాడు. ప్రజలపై అన్యాయాలుచేసే రౌడీముఠాలో చేరాడు. వెంకటాచార్యులకు బాల్యంనుండి అలవడిన చిలిపితనానికి రామభూపాల్‌రావు అండ, ఆదరము ఇంకా తోడైంది. రామభూపాల్‌రావుకూడా ఒక్కొక్కసారి ఉచితజ్ఞత నుపయోగించి, సంకోచించి చేయని పనులు రామభూపాల్‌రావు ఆజ్ఞ, అధికారము లేకుండానే వెంకటాచార్యులు చేస్తుండేవాడు. తండ్రి రఘునాథాచార్యులు ఎంత సాత్త్వికుడని మర్యాదగలవాడని పేరు పొందాడో వెంకటాచార్యులు అంత మూర్ఖుడుగా, నీచుడుగా ప్రజలు భావించారు. రామభూపాల్‌రావు అండ, అధికారానికి మురిసిన ఒక పెద్ద మనిషి తన బిడ్డను వెంకటాచార్యుల కిచ్చి పెండ్లి చేశాడు. ఆండాళమ్మ కోడలును అండగా చేసుకొని తానుమాత్రము ఏ విధంగాను వెలితిపడక, గుట్టుగా సంసారం వెళ్ళదీసికున్నది.

ఒకనాడు రామభూపాల్‌రావు తన పది అరకలను కొమరయ్య భూమిలోకి పంపి దున్నవలసిందని ఆజ్ఞాపించాడు. హైదరలీ నాయకత్వాన పది అరకలు పొంపొద్దు ఎక్కేవరకు కొమరయ్య భూమిలోకి ప్రవేశించి దున్నడం మొదలైంది. మామూలుగా కొమరయ్య వెళ్ళేవరకు తన భూమిలో ఇతరుల అరకలు ఉండటంతో అదరిపోయాడు. ఆవేదనతో వడిగా వెళ్ళాడు. హైదరలీని వావిగడ్డమీద చూచాడు. రామభూపాల్‌రావు జీతగాండ్లను, ఎడ్లను గుర్తుపట్టాడు. నిలువెల్ల నీరైపోయాడు. ఏమి తోచలేదు. మెల్లగా హైదరలీ నిల్చున్న చోటికి వెళ్ళి హైదరలీని ఓరకరబోయి చూచాడు.

"ఏం కొమరయ్యా! ఏం చూస్తున్నావ్? ఎట్లా దున్నుతున్నారనా? ఎందుకు దున్నుతున్నారనా? కొట్టంలో, గడ్డి, గరప, రాళ్ళు, మేకులు ఏమన్న ఉంటే తీస్కపో. తీస్కపోయి ఇంట్లో పెట్టుకో. ఇక్కడ నీ సామాను ఏది కూడా ఉంచకు. ఈ భూమిమీద ఆశవదులుకో. ఏమన్న చెప్పేదుంటే గడీలకు పోయి దొరకు చెప్పుకో. ఇక్కడ నిలబడితే ఏం లాభం?" హైదరలీ హితోక్తులు పలికాడు.

హైదరలీ మోటమీదినుంచి బావిలోకి తొంగిచూచాడు. "మంది వాటికి ఇంత మరమ్మతు ఏమనుకొని చేయించావ్? లోకం గొడ్డుపోయిందను కున్నావా? గుడ్డిదనుకున్నావా?" వెటకారంగా అన్నాడు.

రాసేపు మోట బొక్కెనను, తొంచాన్ని, మోటమోకును, హైదరలీ పరిశీలించాడు. "వీటినన్నా దక్కించుకో, మా జీతగాండ్లు అసలే పోకిరి ముండా కొడుకులు. చూస్తే దక్కనీయరు" అని కొంటెగా నవ్వి చుట్టను వెలిగించాడు.

కొమరయ్య మోటమోకు చుట్టకట్టి బొక్కెన నెత్తిన పెట్టుకొని, మోటమోకును కర్రకు తగిలించుకొన్నాడు. హృదయంలో చెలరేగిన తుఫాన్ను అరికట్టుతూ ఆలోచనతో ఇంటికి చేరాడు. తల్లి అన్నమ్మ, మనుమడు కోటయ్యను బుజగరిస్తూ, చిటికెలు వేస్తూ అన్నం తినిపిస్తున్నది. కోటయ్య తండ్రిని చూడగానే, "అయ్యొచ్చిండు" అని తండ్రివైపు రాసాగాడు. కొమరయ్య బొక్కెన, తాళ్ళు ఒక మూలకు వేసి, కొడుకు మాటలను లెక్క చెయ్యకనే, అన్నమ్మ నుద్దేశించి, "అమ్మా! మన బావి చేనంతా దొరోరి అర్కలు దున్నుతున్నై. దొరకాడికి పొయ్యొస్తా" అని గబా, గబా ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు.

అన్నమ్మ అదరిపోయింది. మనుమనికి పెడ్తున్న అన్నం ముద్ద అట్లాగేపట్టుకొని, "దొర అర్కలు మన భూమిని దున్నుతున్నయా?" అంటూ హడావుడిగా వాకిలి కడపవరకువచ్చి, కొమరయ్యను చూపు దాటి నంతవరకు చూస్తూ నిలుచుంది.

"ఏం పాపపు రోజులొచ్చినయి దేవుడా?" అనుకుంటూ ఇంట్లోకి వచ్చింది. మనుమడిని చంకన వేసుకొన్నది. "కనకమ్మా! ఇల్లు చూస్తుండు. ఇప్పుడే వస్తా" కోడలును కేకపెట్టి శివమెత్తినదానిలాగా తోటబావి దోవ బట్టింది. రామభూపాల్‌రావు అర్కలు తమ భూమిని దున్నుతుంటే, తననే నిలువునా చీలుస్తున్నంత బాధపడింది. "దొరంటే చెప్పిండు. మీకైనా బుద్ధి ఉండొద్దు? ఒక ఊళ్ళోపుట్టి పెరిగిన మీకు మంది భూములు అన్యాయంగా

దున్నటానికి చేతులెట్ల వచ్చినై" అన్నమ్మ కేకలు పెడుతు భూమిలోకి ప్రవేశించింది. మనుమడిని కిందికి దింపి అర్కలకు అడ్డంగా తిరిగింది. "ఇక దున్నండి. నా ప్రాణంపోయినా మానె. ఇప్పుడు భూమి గుంజు కున్నరు. రేపు మెడ పిసికేస్తరు. ఎట్లైనా మావి కుక్కబతుకులె. ఎప్పుడో చచ్చేది ఇప్పుడేచస్త" అంటూ ఒక అర్కను విడువబోయింది. ఆ నాగలి జీతగాడు బిత్తరబోయి, అసమర్థుడుగా నిలబడ్డాడు. ఆ జీతగాడు ఆ విధంగా నిలబడటం దొరగారి జీతగాని తనానికే అప్రతిష్ఠ అన్నంత రోషముతో ఇంకో జీతగాడు వెంకయ్య అన్నమ్మ మీదికి పోబోయాడు. ప్రక్కనే ఉన్న ఇంకొక జీతగాడు కనకయ్యకు వెంకయ్య సాహసానికి కోపం వచ్చింది. "మాదిగోళివి. కాపుమనిషిని ముట్టుకో పోతున్నావుర?" తోడి కులానికి కలుగుతున్న అవమానాన్ని సహించలేక అన్నాడు.

దూరంగా తోటదావి గడ్డమీద కూర్చున్న హైదరలీకి అన్నమ్మ ఆరాటానికి, జీతగాండ్ల చేష్టలకు కోపం వచ్చింది. వడిగా వచ్చి కనకయ్య చేతిలోని ముల్లుకర్రను తీసికొని కనకయ్యను బలంగా రెండు దెబ్బలు వేశాడు. మూడోసారి కర్ర లేబట్టేవరకు కనకయ్య దెబ్బను తప్పించుకో డానికి నాగలిని వదలి దూరంగా ఉరికాడు.

కనకయ్యను కొట్టడం వెంకయ్యతో సహా మొత్తం జీతగాండ్లకు కూడా అన్యాయమనిపించింది. "ఏమిటి ఈ అన్యాయం?" అన్నట్లు జీత గాండ్లంతా హైదరలీని ద్వేషంతో చూశారు.

"ఏం చూస్తున్నారు? సాగనీయండి అర్కలను" హైదరలీ గొంతు చించుకొని అన్నాడు.

"చూస్తగద ఎట్లా దున్నుతరో" రౌద్రంతో అన్నమ్మ అన్నది. మనుమడిని అందుకొని, చంకకెత్తుకొని, మళ్ళీ నాగండ్లకు అడ్డంగా నిలు చుంది. ఎడ్లు ఆమె చీరెరంగుకు, కేకలకు చెవులు, తోకలు ఆడిస్తు బెదిరి, బెదిరి, చూశాయి.

హైదరలీ అన్నమ్మను చూడటం ఇదే మొదటిసారి. సామాన్యంగా కాపు ఆడవాండ్లు పాటించే బిడియమేగాక, మహమ్మదీయుడైనందువల్ల అతని కంటబడటం ఇంతవరకు జరుగలేదు. అన్నమ్మ ఆరాటము హైదరలీ ఆలోచనకు కారణమైంది. "కోటయ్య భార్య ఇంతటి మనిషా?" అనుకున్నాడు తనలో.

"మర్యాదగా చెప్తున్న. నీవు ఏం గోలచేసినా లాభంలేదు. వట్టి పుణ్యానికి రచ్చకెక్కడం తప్ప. నీకొడుక్కు అన్ని తెలుసు, నీకొడుకు దొర దగ్గరికే పోయిండు. మీ ఆడవాండ్లకు ఇవన్ని తెలియవు. కోటయ్య బ్రతికున్నపుడు ఆయన, దొరకలిసి మెలసి ఉన్నరు. ఇప్పుడు మీరు ఉండలేక పంచాయతీలు లేవదీసుకుంటున్నారు. ఎందుకొచ్చింది. నాగండ్ల ముందటి నుంచి జరుగు" హైదరలీ చాకచక్యంగా మాట్లాడాడు.

హైదరలీకి జవాబు చెప్పడమే అన్నమ్మ అనవసర మనుకున్నది. హైదరలీ చెపుతున్నది తనకు కాదన్నట్లు, మనుమడిని ఒళ్లో పెట్టుకొని నాగండ్ల ముందర కూర్చున్నది. "ఇంత పగటి దోపిడా?" తనకుతానే గొణుగుకున్నది.

హైదరలీకి ఏమీ తోచలేదు. జీతగాండ్లు ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ నిలుచున్నారు. అర్కల ఎడ్లు నెమరువేస్తూ, ఆ గొడవంతా తమకు పట్టిరేనట్టు చెవులు, తోకలు ఆడిస్తున్నవి. వెంకయ్య పశ్చాత్తాపంతో తల నేలకువేసి ఆలోచిస్తున్నాడు. కనకయ్య నాగండ్లకు దూరంగా చెట్టు నీడకు నిలుచుండి హైదరలీని కోపంగా చూస్తున్నాడు. దెబ్బలకు లేచిన దద్దులను చేతితో నిమిరి చూచుకున్నాడు.

హైదరలీ జేబులో నుండి పొరచుట్టను తీశాడు. ఆలోచిస్తూనే చుట్ట ముందు వెనకలు పొతంచేశాడు. "ఒక్క ఆడది, పదిమంది జీతగాండ్లను, దొరవారి పెద్ద గుమాస్తాను నిలువునా కట్టివేయడమా?" హైదరలీ హృదయంలో తుఫాను రేగింది.

రామభూపాల్‌రావు ఆలోచనలు, ఎత్తుగడలు హైదరలీ కార్యదీక్షతో నేటివరకు అనుకున్న వన్ని అవలీలగా జరుగుతూ వచ్చాయి. కాని అన్నమ్మ కింద అవన్ని నీరువలె ఇంకిపోయినవని హైదరలీ అదరిపోయాడు. కులాభిమానంతో కనకయ్య చేసిన పని హైదరలీకి నిప్పులో మాడినట్లైంది, కనకయ్యను కొఱ, కొఱ చూపులతో చూస్తూ చుట్టను ముట్టించాడు. "నన్ను దయ్యం పట్టలేదు గదా?" హైదరలీ జంకాడు.

"ఒరే! ఇటురా!" ఒక జీతగాడిని పిలిచాడు.

ఆ జీతగాడు వెళ్ళాలా, వద్దా అన్నట్టు తోటి జీతగాండ్లను చూస్తూ మెల్లగా హైదరలీ వద్దికి వెళ్ళాడు.

"నువ్వు దొడికాడికి పోయి, కొమురయ్య తల్లి అన్నమ్మ అర్కలకు అడ్డంగా నిలబడి దున్ననీయటం లేదని చెప్పు" అంటూ హైదరలీ చుట్టను నేలకు రాసి, మళ్ళీ ముట్టించాడు. జీతగాడు ఊరిపోవ పట్టాడు.

"నాగండ్లను ఇడ్వమంటారా?" ఒక జీతగాడు హైదరలీని చూస్తూ అన్నాడు.

"బువ్వేళ్ళ కూడా అయింది" ఇంకో జీతగాడు అన్నాడు.

"ఎడ్లు ఎండలో ఉండి కూడా చాల సేపైంది" ఇంకొక జీతగాడు అన్నాడు.

"అయితే యిప్పండి. ఎడ్లను మాత్రం యిక్కడనే కొట్టంలో కట్టేయండి" అన్నాడు హైదరలీ.

"ఎవడి కొట్టం? మా కొట్టంలో ఇంకోండ్ల ఎడ్లు కట్టేయవానికి పీల్లేదు. ఇయ్యాల అహో, ఇహో తేలాల్సిందే!" అన్నమ్మ హైదరలీని చూడకుండానే అన్నది.

హైదరలీ, పిచ్చివానివలె అన్నమ్మను చూచాడు. ఏమీ పాలుపోలేదు. తాను ఇన్నాళ్ళనుంచి గర్వించుకుంటున్న శక్తి, సామర్థ్యాలను, కార్య దీక్షను ఏదో తెలియరానిశక్తి హరించి వేసిందని తత్తర పడ్డాడు. కాని

ఏమి చేయాల్సింది తోచలేదు. "జీతగాండ్లంతా కనకయ్యవలె మారిపోరు కదా?" అనుమాన పడ్డాడు.

"అదేదో తేలనీయండి. మీరు చెప్తే దొరోను కొట్టంలోనే ఎడ్లను కట్టేస్తం" ఒక జీతగాడు అన్నాడు.

"అంతవరకు దున్నటం ఆపి ఉంచండి." అని ఆజీతగాడు అంటున్నట్టు హైదరరీకి తోచింది. హైదరరీ వింతగా ఆ జీతగాడ్నిచూచి. "సరే! అర్కలను యిడిచి ఎడ్లను దొరోరి కొట్టంకోకే తోల్కపొండి" అన్నాడు. హైదరరీ పైకండువాను దులుపుకుంటూ ఇంటిదోవ పట్టాడు.

జీతగాండ్లు నాగండ్లను విడిచారు. కనకయ్య కూడా తన నాగలిని విప్పవానికి దగ్గరికి రాగానే. "దెబ్బలు బాగా తగిలినయ్యా?" జీతగాండ్లు సానుభూతితో పరామర్శించి, పైకి తేలిన దద్దులను పరీక్షించారు.

పైకి తేలిన దద్దులను చూపుతూ, "ఎన్నడు లేంది తురకాయన భలే కొట్టిండే" అన్నాడు కనకయ్య. జీతగాండ్లంతా ఆలోచనాధోరణిలో ఎడ్లను తోలుకొని ఊళ్ళోకి పోయారు. కనకయ్య మాత్రం అన్నమ్మ ధగ్గరికివచ్చి "పెద్దమ్మా! ఎండ బాగా కాస్తున్నది. చంటోడు ఉన్నడు. ఇగ పోరాదు?" అన్నాడు.

"నేను ఊళ్ళోకి పోను కొడుక. యీడ కొట్టంలనే ఉంటా. ఇయ్యాల అటో. ఇటో తేలాల్సిందే" అంటూ అన్నమ్మ మనుమడిని నడిపించుకొని కొట్టంలోకి వెళ్ళి దిగాలుపడి కూర్చున్నది. మనుమడు కోటయ్య దిగాలుపడి అన్నమ్మను చూస్తూ ఏడ్పు ముఖం పెట్టాడు. "ఊరుకో, కొడుక" అంటూ అన్నమ్మ మనుమడిని మంచం మీద పండుకోబెట్టి జోకొడ్తూ ఆ ప్రదేశాన్ని తీక్షణంగా చూడసాగింది. కనకయ్య వెళ్ళిపోయాడు. మనుమడు నిద్ర పోయాడు.

అన్నమ్మ కొట్టంలోంచి బయటికి వచ్చి. నాలుగు వైపుల దీనంగా చూచింది. మోటను పట్టుకొని బావిలోకి పరీక్షగా చూచింది. ఆమె కన్నీటి

బొట్లు బొట, బొట బావిలో పడ్డాయి. నీళ్ళు వలయాకారాలతో బావినిండా విహరించాయి. కప్పలు బెక, బెకమన్నాయి. బావిలోకి వంగి ఉన్న తుమ్మ చెట్టుకు వేలాడుతున్న పక్షుల గూళ్ళల్లోనుండి బుర్రున పిట్టలు లేచి యెగరి పోయాయి, తుమ్మచెట్టు పైకొమ్మపై కూర్చొని ఉన్న గుడ్లగూబ భయం కరంగా అరిచింది. ఆకాశంనుంచి పరుగెత్తున్న గోరెంకలను వెంబడించ డానికి, చెట్టుమీది గుడ్లగూబ రెప, రెప రెక్కలు చప్పుడు చేసుకుంటూ గోరెంకను తరుమసాగింది. ఆ బావిలోని పరిసరాలు అన్నమ్మకు భయంక రంగా తోచాయి. అన్నమ్మ ఒక్క నిట్టూర్పు విడిచి బావిగడ్డమీద గుడిసె వద్ద నిలుచుండి దిగాలుపడి భూమి నలువైపుల చూచింది. మామిడిచెట్ల కొమ్మలు గాలికి ఊగుతూంటే అవన్ని మూగ నోటితో ఏమిటో తనకు చెప్పుతున్నా యని అన్నమ్మ భావించింది. భర్త కోటయ్య, తాను ఆమామిడి చెట్లను నాటిన రోజులు జ్ఞాపకాని కొచ్చాయి. అన్నమ్మ కాపురానికి వచ్చిన కొత్తలోనే ఆ చెట్లనాట్లు జరిగాయి. నాడు నాట్ల సమయాన కోటయ్య నీళ్ళ బుంగను తనకు అందిస్తూ చూచిన అతని చూపులు, వికసించిన ముఖము, మందహాసము జ్ఞాపకాని కొచ్చాయి. ఆ చెట్లు మొదటిసారి కాయలుకాసి నపుడు ఉగాదినాడు సరసాలాడుతు, పచ్చడి తాగిన రోజు కండ్లల్లోఆడింది. మామిడిపండ్లు పండినపుడు ఆచెట్ల కింద కూర్చొని భార్య భర్తలు ఒకరి కొకరు పండ్లను అందించుకుంటూ గడిపిన కాలము స్మృతి కొచ్చింది. తన భర్త పేరు పెట్టుకున్న. మనుమడు కొట్టంలో మంచంలో పడుకొనిఉన్నాడు. ఒళ్లు మరిచి మనుమడి వైపు దృష్టిసారించింది. "నా చిట్టి తండ్రి అనుభ వించకుండా, ఈ చెట్లన్ని దొర పొట్టన పెట్టుకుంటడా?" హృదయం తట పటాయించింది. గుడిసెలోకి తొంగిచూచింది. భర్త కోటయ్య మంచం మీద కూర్చొని తన్నాహ్వానిస్తున్న దృశ్యం కండ్లల్లో ఆడింది."కూరలో మసాలా అవి బాగా యేసినవా?" అని భర్త కోటయ్య కొంటెగా తనను చూచి దగ్గరికి తీసుకున్న ఘట్టం ఆమెను పులకరింపచేసింది. అన్నమ్మకు అవన్ని ఒకటొకటి జ్ఞాపకం రావడంతో, ఆమె ఒళ్ళు స్వాధీనం తప్పింది. గుడి సెలో ఉన్న మంచంపైపడి రాగాలుతీస్తూ బోరునఏడ్వసాగింది. అప్పుడులో

ఆ భూమి కౌలుకు తీసికొన్నది మొదలు ఆ రోజువరకు ఆ భూమి విషయంలో చేసిన కృషి, పెట్టిన పెట్టుబడి మొదలగునవి అన్నీ తన భర్తకు నివేదిస్తూన్నట్టు పేర్కొన్నది. "రెక్కలు, బొక్కలు నూరి పౌతం చేసుకుంటిమి అయ్యో నా అయ్య" తో మొదలై "ఆఖరికి మంది బొందమీద కొట్టాల్నా అయ్యో ఓ అయ్య?"తో ముగిసింది. చాలాసేపు వరకు ఆ విధంగా కృశించి, కుమిలి మెల్లగా మనుమని మంచంలోకి చేరింది. మనుమడిని బాహువుల్లోకి అదుముకొని నెత్తిని ముద్దాడింది. ఆలోచిస్తూ పడుకున్నది.

హైదరలీవద్దనుంచి, రామభూపాల్‌రావు యింటికివచ్చిన కొమరయ్య బంకుల్లో ఒక్కడే కూర్చొని ఉన్నాడు. కొమరయ్య వచ్చిన సంగతి తెలిసి కూడా చాలాసేపు వరకు రామభూపాల్‌రావు బయటకురాలేదు. ఎంతో సేపటికి భోజనం ముగించుకొని గంభీరంగా వచ్చి పడక కుర్చీలో కూర్చున్నాడు. కొమరయ్యను చూడనట్టే నటించాడు. కొమరయ్య దండం పెట్టినా లెక్క చేయలేదు. ఏమీ ఎరుగనట్టు కుర్చీలో కాళ్ళు బారచాపుకొని కూనరాగాలు తీయసాగాడు.

కొమరయ్య ఎదురుగా వెళ్ళి తిరిగి దండం పెట్టాడు. చేతులు పిసుక్కుంటూ, "మేమెట్ల బతకాలె, మీ దయలేక పోతె?" దీనంగా అన్నాడు.

"ఏం సంగతి?" రామభూపాల్‌రావు నిర్లక్ష్యంగా కొమరయ్య వైపు ముఖంతిప్పాడు.

"తోటబావి సంగతి. తమ జీతగాండ్లు దున్నుతున్నరు. హైదరలీమి దగ్గరికి పొమ్మంటె వచ్చిన. నేనేం తప్పుచేసిన చెప్పుండి" కొమరయ్య గుడ్లల్లో నీరు తీసికొని అన్నాడు.

"అయితే తప్పంత నాదేనా?"

"మీరట్ల మాట్లాడితె ఎట్ల? దయచేసి ఆ భూమి నాకు వదిలేయండి. మీ నీడ చూసుకొని బతికే మాకు ఇంకెవరు దిక్కు చెప్పండి?"

"మంది భూమి కావాలని అంటే ఎట్లా దొరుకుతుంది? ఉండలేని ఆలోచనలుగాని!" రామభూపాల్‌రావు కోపంతో అన్నాడు.

"అంతకైతే కౌలు రకం ఏటేట మీకే కట్టమంటే కడ్త. మీరే ఆ బాపనాయనకు ముట్టచెప్పండి. ఎట్లైనా ఆ భూమి మాత్రం గుంజుకోకండి" దీనంగా అంటూ రామభూపాల్‌రావుకు కొంచెం దగ్గరికి వెళ్ళాడు కొమరయ్య.

"నీకేం మతిపోయిందా? ఆ భూమినాది. ఆ బ్రాహ్మడు నా కెప్పుడో అమ్మిండు. నా కిష్టమొచ్చిన వాడికి కౌలుకిచ్చుకుంట. స్వంత సేద్యం చేసుకుంట. ఏమిటి నీ బలవంతం?" రామభూపాల్‌రావు కసురుకుంటూ కుర్చీ లోంచి లేచాడు.

కొమరయ్య పిచ్చివానివలె రామభూపాల్‌రావును చూచాడు. అది తన భూమి అని రామభూపాల్‌రావు అనడం కొమరయ్య మీద పిడుగు పడ్డట్టనిపించింది. రామభూపాల్‌రావు గొంతును పిసికి వేద్దామన్నంత కోపం వచ్చింది. "జాడ జవాబులేని బాపనాయన మీకు భూమి ఎక్కడ్నించి అమ్మేనంది! మా నోట్లో మన్నుకొట్టాలని కాకపోతే!" కొంచెం గట్టిగాఅన్నాడు.

కొమరయ్య అన్న ఆ మాటలు రామభూపాల్‌రావుకు బల్లెంతో పొడిచి నట్లైంది. రామభూపాల్‌రావు ఉగ్రుడై తీవ్రంగా కొమరయ్య పైకి లంఘించాడు. పక్కనే చిలుక్కొయ్యకు దగిలించి ఉన్న కొరడాతో బలంగా, దెబ్బ మీద దెబ్బ శివమెత్తిన వానివలె కొమరయ్యను కొట్టసాగాడు. కొమరయ్య దెబ్బలకు తాళలేక పెడబొబ్బలు పెట్టాడు. కొమరయ్య కేకలకు గడీలోపల పనిచేస్తున్న పనివాండ్లు వచ్చి తొంగి చూచారు.

"ఎవరక్కడ?" రామభూపాల్‌రావు కొరడాను చేతిలో పట్టుకొని, కుర్చీలో చేరగిలబడి అన్నాడు.

గిద, గిద ఉరుకుతు ఇద్దరు పనివాండ్లు వచ్చి నిలుచున్నారు. "వీడ్ని గుంజకు కట్టివేయండి బద్మాషును. ఒళ్లు ఒలిపించి వేస్తాను. నా

యింటికి వచ్చి నా పెదికి సవారు కావటమా?'' అని రామభూపాల్‌రావు అంగీ చేతులు కోపంతో పైకి ఎగదెక్కాడు.

ఆ ఇద్దరు పనివాండ్లు కొమరయ్యను గుంజకు కట్టివేశారు.

"హైదరలీ ఎక్కడున్నాడో వెంబడే రమ్మంటున్నానని చెప్పు!'' గాండ్రించి ఆజ్ఞాపించాడు.

ఇంతలో, తోట బావి వద్దినుండి హైదరలీ పంపిన జీతగాడు వచ్చి దండం పెట్టాడు. గుంజకు కట్టి ఉన్న కొమరయ్యను చూచి: "వాయ్యో! గుంజకే కట్టిండు కాపాయన్ను" తనలో అనుకున్నాడు.

"దున్నటం ఎంత వరకు వచ్చింది? అర్కలు విడిచి అన్నాలకు పోతున్నారా?" వచ్చిన జీతగాడిని రామభూపాల్‌రావు ప్రశ్నించాడు.

"నీకాల్ మొత్త, కొమరయ్య తల్లి అన్నమ్మ అర్కలకు అడ్డం వచ్చి దున్ననీయడంలేదు. గుమస్తగారు దొరకు చెప్పుమన్నడు" చేతులు పిసుక్కుంటూ చెప్పాడు.

"ఏందీ? కొమరయ్య తల్లి అర్కలకు అడ్డం వచ్చింది? దున్నటం ఆగిపోయింది? సిగబట్టి గుంజు కొని రాక, పదిమంది జీతగాండ్లు, ఓ గుమాస్తా గోళ్లు గిల్లుకుంటూ ఇప్పటి దాక కూచున్నరన్నమాట. లంజా కొడుక, ఏముఖం పెట్టుకొని వచ్చినవురా?" అంటూ అహంతంగా కుర్చీ లోంచిలేచాడు. కచ్చడంకాడి ఇనుప చిర్రను అందుకొని బలంగా ఆ జీత గాని మీదికి విసిరాడు.

ఆ జీతగాడు దెబ్బను తప్పించుకొని వడిగా గడీని వదిలి వెళ్ళి పోయాడు.

"ఇప్పుడు అర్కలు సాగాల్సిందే. చూస్తాను, ఎవడు అడ్డం వస్తాడో," గడీలోంచి గాండ్రించాడు.

గుంజకు కట్టిఉన్న కొమరయ్య, తన తల్లి సాహసానికి నిర్ఘాంతుడై పోయాడు. రామభూపాల్‌రావు మాటల ఘోరణికి బెదరి పోయాడు. అవిష యం పెరిగి ఎక్కాడికి దారితీస్తుందో యని గాభరా పడ్డాడు.

"హైదరలీ ఎక్కడున్నాడో తొందరగా రమ్మనుపో!" కొమరయ్య పక్కన నిలుచొని ఉన్న పనివానితో రామభూపాల్‌రావు అన్నాడు.

"మంచిది దొర" అని ఆ పనివాడు వెళ్ళి పోయాడు.

"ఇదా నీపన్నాగం? తల్లిని అటుపంపి నంగనాచోలె నాదగ్గరికి వచ్చినావు? ఇంత కండ్లకు కావరమెక్కింది? మీకు మధ్య మధ్యన వీపులు పగులుతుంటేనేగాని కుక్కల్లాగపడి ఉండరు. ఏదో మర్యాదగా కాలం గడు పాలని గంభీరించి ఊరుకుంటే కండ్లు నెత్తికెక్కినై" కుర్చీలో అటు, ఇటు పొర్లుతూ రామభూపాల్‌రావు దీరాలు తీశాడు.

ఇనుప చిరస్రను తప్పించుకొని వెళ్ళి పోయిన జీతగాడు దోవలో హైదరలీని కలిసి రామభూపాల్‌రావు ఆరాటం, ఆగ్రహం, కొమరయ్యను కట్టివేసిన సంగతి చెప్పాడు. హైదరలీకి భయం, ఆశ్చర్యం వేసింది. ఆడ దానికింద పనికిరానివాడంటాడని, ఎందుకూ చేతకాక పారివచ్చిన పిరికి పందవంటాడని భయం కలిగింది. కాని కాపుకులం వాడిని గుంజకు కట్టి వేయడం మాత్రం రామభూపాల్‌రావు మొదటి సారిగా సాహసించి చేసిన పనని, కొంచెం తొందరపాటే జరిగిందని భావించాడు. జంకుతో ఒక్కొక్క అడుగు వేస్తూ, గడీలోకి ప్రవేశించాడు. రామభూపాల్‌రావు ముందట చేతకాని వానివలె కనపడితె గౌరవ లోపమనుకున్నాడు. లేనికోపం తెచ్చుకొన్నాడు. గుంజకు కట్టియున్న కొమరయ్య నుద్దేశించి, "ఏమి కొడుకువు పుట్టినవు కోటయ్య కడుపులో? కాపుకులానికే వంకతెచ్చినవు. మీ నాయన పెద్దమనిషి. తనాన్ని మంట్లో కలిపినవు. ఆడమనిషిని రచ్చకీడుస్తావా? ఇదంత కొత్త, కొత్తవి మాకు నేర్పడం కాకపోతే ఇంకేంది? ఎవడి మర్యాద సంగతి వాడు చూచుకోవాలె. కొమరయ్యా! బాగా చెప్తున్నవిను!! మీఅమ్మను ఇక్కడికి పిలిపించి మర్యాదగా ఉండమనిచెప్పు. దొరవారి గౌరవం, మర్యాద కాపాడ టానికి ఆడదికదా యని ఊరుకున్న. లేకుంటే ఈరోజు మీఅమ్మ సంగతే మయ్యేదో తెలిసొచ్చేది." అన్నాడు.

అక్కడి నుంచి కదిలి రామభూపాల్‌రావు వైపువెళ్లుతూనే రామభూపాల్‌రావు వైఖరిని ఓకంట కనిపెట్టున్నాడు. రామభూపాల్‌రావును సమీపించాడు. "అయ్యా! మీకు చెప్పంది చేయకూడదని గంభీరించి ఊరుకున్న. లేకుంటే ఈ రోజు ఏమైనా చేసేవాడిని. ఇట్లా పెచ్చు పెరిగిపోతుంటే ఊళ్ళో మనం నిల్వటమే కష్టమై పోతుంది. మీ ఆజ్ఞ కోసమనే వచ్చాను." అన్నాడు హైదరలీ.

తిరిగి "జీతగాండ్లు అన్నాలకని పోయిన్రు. రాగానే అర్కలు కట్టిం చేస్తాను." అనుకుంటు మూలనున్న చేతికర్రను చేతబట్టాడు.

"ఇంత అన్నం తిని జీతగాండ్లను తీస్కపోత,....ఆ, మరచిన. ఇంకోసంగతి. మన కనకయ్యలేడు, బతికి చెడినోడు! వాడిసంగు కూడా మారింది. అన్నమ్మను వెనకేసికొని వచ్చిండు. అన్నమ్మ అర్కలకు అడ్డంరాగానే అందరికంటే ముందర అర్కలు వదిలిపెట్టి దూరంగా పోయి నిలబడ్డడు. వాడి సంగతి కూడా కనుక్కోవాలె, ఒక్కొక్కడికి బాగావాతలు పెడ్తేగాని దారికిరారు." అని బయలుదేరి కొమరయ్య దగ్గరికి వచ్చి నిలుచున్నాడు. రామభూపాల్‌రావు వైపుమళ్లి "వీడి తల్లిని పిలిపించమంటారా?" అన్నాడు.

హైదరలీ మాటల ధోరణి, తన భావికార్యక్రమమును గురించి దీర్ఘంగా ఆలోచిస్తున్న రామభూపాల్‌రావు, "ఎవరిని పిలిచే అవసరంలేదు. అడిగేదిలేదు. నీపనేదో నువ్వు చూచుకో!" అధికారధ్వనిలో అన్నాడు.

హైదరలీ "మంచిది" అని వెళ్ళిపోయాడు. కొమరయ్య అయోమయంలో పడ్డాడు. తల్లిగతి ఏమవుతుందో అని బెంగటిల్లాడు, రామభూపాల్‌రావును బ్రతిమిలాడినా లాభం లేదని అనుకున్నాడు.

"ఈ భూమితోటే పోలేదు. కోటయ్య కౌలుకు తీసుకున్నప్పటి నుంచి ఇప్పటి వరకు ఏమీ ఇవ్వకుండ మింగుతు కూర్చున్నదంత కక్కాల్సి వస్తుంది. తలె, ముంత, ఇల్లు, గొడ్డు, గోదా వేలం వేయిస్తా,

నేను మర్యాదకే మనిషిని. కోపం వచ్చిందంటే బ్రహ్మాదులక్కూడా భయ పడేవాడినికాను." మరొకసారి మనసులోని ఉక్రోషాన్ని వెళ్ళగక్కాడు రామభూపాల్‌రావు.

కొమరయ్య పక్కకు నిలుచున్న పనివాడితో, "వాడి కట్లు విప్పేయి. అయ్యేదేమో కానియ్యి చూస్తాను." అంటూ ఆరాటంగా రామభూపాల్‌రావు ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

కొమరయ్య భరింపరాని అవమానంతో ఇంటి ముఖం పట్టాడు. దోవలో కొందరు రైతులు చెప్పిన సలహా ప్రకారం బావి వద్దికిపోయి తల్లిని వెంట తీసికొని ఇంటికి చేరాడు.

హైదరలీ నిలుచుండి సాయంత్రం వరకు అయినంత భూమిని దున్నించాడు. జీతగాడు కనకయ్య మాత్రం ఇంట్లో లేకుండా ఎక్కడికో పోయాడని తెలిసింది. తొమ్మిది అర్కలతోటే భూమి దున్నటం జరిగింది.

# 10

కంఠీరవం మరుసటి రోజు మోహనాచార్యులతో పదిగంటల వరకు భోజనం ముగించుకొని లక్ష్మీనారాయణ దుకాణములోకి వెళ్లాడు. లక్ష్మీనారాయణ అతిమర్యాదచేసి పక్కకుకూర్చోబెట్టాడు. గ్రాహకులు లేనపుడు మధ్య, మధ్య కంఠీరవంతో మాట్లాడటం, తేప, తేపకు బీడీలు ముట్టించడం కంఠీర వానికి విసుగ్గాతోచింది.

"ఆఁ. అయితే నాయనగారు కాలంచేసి చాలారోజు లైందన్నమాట, వారున్నారే! చాలాగొప్పవారండి. మీరింకా చాలా చిన్న వాండ్లుండొచ్చు. నాకుబాగా తెలుసు, వారి గురించి, వారంటే అదేందోగాని నాకు విశ్వాస ముండేది. మీరు నమ్మండి, నమ్మకపోండి." ఇంతలో ఒక స్త్రీ బట్టలు కొనడానికి దుకాణములోకిప్రవేశించింది."ఒరే రాములు! ఆమె కేంకావాలో చూడు." గుమాస్తాతో అన్నాడు. "రఘునాధాచార్యులుగా రున్నారే వారి

విగ్రహమే విగ్రహమండి. వారు అంత దూరం నుండి వస్తుంటేనే కని పెట్టేవాడిని." తిరిగి ఆస్త్రీని సంబోధిస్తూ, "రూపాయన్నరకు గజం కంటె తక్కువ రాదమ్మ. అస్సలు సరుకు, పక్కారంగు. బజార్లో రెండు రూపాయలకు తక్కువ ఇవ్వరు, ఎవరైనా ఇస్తే నేను ఉరికెనే ఇస్త. ఎంత కావాలె తల్లి నీకు? గజం ఇటుతేరా? చీరెకా, రవికెకా?" అన్నాడు.

"ధర తేల్చి చెప్పితే చీరకో, రవికెకో తీసుకొంట" ఆ స్త్రీ అడిగింది.

"ఒక్కటే మాట, నీకోసం చెప్తున్న. ఆఖరుమాట రూపాయ ఏడణాలు, ఎన్ని గజాలు చెప్పు?" అంటూ లక్ష్మీనారాయణ బట్టలతాను విప్పాడు.

"రూపాయకు గజమిస్తే ఏడు గజాలు తీసుకొంట," అంటూ ఆమె లేచి దుకాణందిగింది. పక్క దుకాణం వైపువెళ్ళిపోబోతుండగా వెంటనే లక్ష్మీనారాయణ ఆతానును పక్కకు తోసి, అదే రంగులో చౌకరకము ఇంకోతాను తీసి పరుస్తూ, "అట్లా తొందర పడ్తే ఎట్ల తల్లి? మేమిక్కడ కూర్చున్నది బేరం చేయటానికమ్మా! ఇక రూపాయరెండణాలకు తీస్కపో. ఇగరా, వచ్చిన గిరాకిని పోనివ్వొద్దని ఇస్తున్నా" అంటూ బట్టను కొలవటం మొదలు పెట్టాడు.

"ఏడు గజాలు చాలు, మంచిగ కొలువాలె" ఆ స్త్రీ తిరిగి దుకాణంలోకి వచ్చింది.

"ఏడు గజాలట కొలిచియ్యర వెంకయ్యా" లక్ష్మీనారాయణ తానును గుమాస్తావైపు తోశాడు.

"ఆఁ అయితే చెప్పరూ? వేదాంతాచార్యులగారింట్లో మీకు బాగా జరిగిందా? వారంతా బహు మంచి వాండ్లండి. వైద్యంలోకూడా మంచి చెయ్యి లేండి. మా ఆడోండ్లు ఎంతచెప్పిన వినరు గాని నేనెప్పుడూ వారి దగ్గరనే మందు తింటుంట. అసలు నాకు రోగాలు రావడమే తక్కువ. ఎందు కను

కుంటరేమో! నాకు చెడ్డ అలవాట్లు ఏమీలేవు!. ఈ బీడి మాత్రం ఎంత అను కున్నా వదలకుండఉంది అయ్యగారు! ఒకటి రెండుసార్లు పట్టుపట్టి తాగడం మానుకుంటే, అయ్యగారు! ఇగ ఏం చెప్పాలె. పొట్ట ఉబ్బిపోయి, బలే ఆయాసమైందండి. అదిగాక మా ఊరు బీడీలున్నాయే చాలా మంచివిలేండి. ఎక్కడెక్కడికో పోతుంటాయి. అయ్యగారు! ఓమాట చెప్తున్న. మీరు మాత్రం వీటి తెరువుపోకండి. పాడుఅలవాటు." ఇంతలో బీడి చల్లారి పోయింది. అగ్గిపెట్టెలో పుల్లలు కూడా అయిపోయినాయి "ఒరే వెంకటేశం! అగ్గిపెట్టె తేరా!" అన్నాడు.

"ఈ బీడీల్లో ఇవొక చెడ్డ ఉందండి. కొద్దిగ మాటల్లో పడి తాగడం మానుకుంటామా ఆరిపోతది" అని అగ్గిపెట్టె రాగానే బీడిని ముట్టించాడు.

"నేను చదువుకోవాల్ననుకుంటున్న" తల నేలకువేసి కంఠీరవం అన్నాడు.

"బడి చదువైతే మాత్రం లాభంలేదు అయ్యగారు! మాదుకాణానికి అన్ని రకాలవాండ్లు వస్తుంటారు. మేము చూస్తుంటాముకద వాండ్ల సంగతి. మీరు నమ్మండి నమ్మకపోండి, ఆ చదువుకునోళ్లకంటె చదువురానోళ్లే నయం. ఓ పైస అటోఇటో తీసుకపోతరు. ఇగ చదువుకునోండ్లున్నరే! ఆకుకు అందని, పోకకు పొందని ధరలకు అడిగి, దుకాణమంతా కుప్ప చేయించి ఆఖరుకు ఊర్కెనే వెళ్ళిపోతరు. అవేం చదువులో గాని, తెలు వుల్లేవండి" అన్నాడు. అతని దృష్టి ఒక వ్యక్తి వైపుమళ్ళింది. "ఒరే వెంక టేశం! ఆ ఆసామీ నిట్లా పిలువు!" అన్నాడు లక్ష్మీనారాయణ.

బట్ట క్రియముచేసిన స్త్రీ దుకాణం వదలి వెళ్ళిపోయింది. తిరిగి లక్ష్మీ నారాయణ కంఠీరవంతో సంభాషణ సాగించాడు. "ఈమె సంగతేమాడండి. భగవత్సాక్షిగా చెప్తుతున్న. వేరేచోట ఆ బట్ట రెండు రూపాయలకు గజం ప్రకారం అమ్ముతున్నారండి. మీరు నమ్మండి, నమ్మకపోండి. మరి నేను రూపాయ రెండు అణాలకు ఇచ్చినానంటే ఎందుకిచ్చానో మీరు గమనించి నారా? లేదు. ఆమె ఓదమనిషని చూడంగనే నా కర్థమయింది. పోనీ, మనకు

భగవంతు డిచ్చేవాడు ఉన్నాడనుకున్నా" అని అంటుండగా గుమాస్తా ఆసామీని వెంటబెట్టుకొని వచ్చాడు. ఆసామి దుకాణంలో కూర్చోగానే, "ఏమి జానయ్యా! మమ్ముల్ని మరిచిపోయినట్టుంది పూర్తిగా! రాములూ! మొన్న తెచ్చిన కోయంబుత్తూరు కణుములు, నాగ్పూరు చీరెలు, నువ్వు మొన్న తెచ్చిన రుమాండ్లు సేటుకు చూపించు. జానయ్యా! ఈ తేప మా రాములు ఊరూరు తిరిగి, ఏ రేరి తెచ్చిండు. మరిచిన, బీడీకాల్వావు? ఆం చెప్పవూ? చేరాలెట్లున్నయి. మీకేమిలే విరామంలేకుండ అమ్ముతుంటారు. అవును గాని నీ పద్దు కొద్దిగా ఉండిపోయింది చాలా రోజులాయె. చెల్లు బెట్టరాదూ! మరి ఏమన్న పద్దు రాయిస్తవా? "గుక్క మెసలకుండ లక్ష్మీనారాయణ ఏ కరువుపెట్టాడు.

గుమాస్తా తెచ్చి ముందర వేసిన బట్ట లన్నిటిని జానయ్య, అటు తిప్పి, ఇటు తిప్పి, "సరే ఉండనియి. మళ్ళావస్తా" అంటూ లేచి ఒళ్ళు విరిచాడు.

"మళ్ళ, మళ్ళ వస్తుంటయూ ఇటువంటివి. మరి పద్దు సంగతేమంటవు?" అనుకుంటూ లక్ష్మీనారాయణ కూడా మెత్తమీది నుంచి లేచాడు.

"పద్దు ఎక్కడికి పోద్దిసేటు. మళ్ళ వస్తగద. ఇప్పిస్తలే" అంటూ జానయ్య దుకాణం వదలి వెళ్ళిపోయాడు.

లక్ష్మీనారాయణ తిరిగి తన దృష్టి కంఠీరవం వైపు తిప్పాడు. "చూచారా అయ్యగారు! దున్యా ఎట్ల ఉందో. ఈ జానయ్య ఉన్నడే, సానా ఉన్నవాడు. ఉండటానికి ఆర్మూరులో ఉంటాడు. కాని ఊరూరు తిరిగి బేరంచేసి బాగా సంపాయించిండు. కాని మన్సు మంచిదికాదు అయ్యగారు. అంతటా బాకీలు పెడ్తుంటడు. మనం ఎన్ని వ్యవహారాలు చేసినా మన్సు బాగుండాలె. మనం శాశ్వతమా? మనకీ డబ్బు శాశ్వతమా? పోయేటప్పుడు కట్టుకపోతామా? వచ్చినప్పుడు తీసుకొచ్చినమా" అన్నాడు. ఇంకా లక్ష్మీనారాయణ ఏమో మాట్లాడబోతుండగా, దుకాణంలోకి కొందరు గ్రాహకులు

గుంపుగా వచ్చారు. లక్ష్మీనారాయణ కంఠీరవానికి దండంపెట్టి, "మంచిది, మళ్ళ కలువండి" అని గద్దెమీదినుండి లేచి గ్రాహకుల వద్దికి వెళ్ళాడు.

కంఠీరవానికి దుకాణములో లక్ష్మీనారాయణ సంభాషణ, చర్యలు కొత్త అనుభవంగా తోచింది. అతని భక్తి, వ్యాపారము, చమత్కారము తలచుకొని తనలోతాను నవ్వుకున్నాడు. ఆ దుకాణం, ఈ దుకాణం చూస్తూ పోతుంటే, ప్రతి దుకాణములోని యజమానులంతా లక్ష్మీనారాయణ వలెనే కనిపించారు. ఆ విధంగా ఒక్కొక్క దుకాణం దాటి గ్రంథాలయం చేరుకున్నాడు. అప్పుడు గ్రంథాలయంలో పాఠకులు ఎవరూలేరు. గ్రంథాలయ నిర్వాహకు లిద్దరు కూర్చొని మాట్లాడుకుంటున్నారు. కంఠీరవం ఆసక్తితో ఆవరణములో ఉన్న నాయకుల చిత్రాలను ఉత్తేజితుడై చూడసాగాడు. వారినిగురించి మోహనాచార్యులు చెప్పిన విషయాలు స్మృతికితెచ్చుకొన్నాడు. మహాత్ముడు ఎర్రవాడ జేలులో కటకటాల వెనుక కూర్చొని ఉన్న భంగిమము, సరోజినీదేవి ముఖములోని వర్చస్సు, మోతీలాల్ నెహ్రూ చూపుల్లో ఉట్టిపడుతున్న శాంతము, లజపతిరాయ్ గాంభీర్యము, తిలకు, గోఖేల నెత్తిపైని పగిడి, కమలానెహ్రూ సౌకుమార్యము, స్వరూపరాణి వృద్ధాప్యములో తొణికిసలాడుతున్న మాతృహృదయము, కమలాదేవిఛటోపాధ్యాయ్ చుఱుకుతనము, జవహర్లాల్ నెహ్రూ గుర్రముస్వారిలో కనబడుతున్నటీవి కంఠీరవమును ఆకర్షించాయి. చిత్రాలను చూడటంకాగానే గ్రంథాలయ నిర్వాహకుల వద్దికి వెళ్ళి, "ఆ తస్వీర్లకు సంబంధించిన పుస్తకా లున్నాయా?" అని అడిగాడు.

"ఉన్నాయి. కాని ఇప్పుడు వేళైపోయింది. సాయంత్రం వస్తే దొరుకుతాయి" అని వారు సమాధాన మిచ్చారు.

కంఠీరవం అక్కడినుండి నేరుగా వేదాంతాచార్యుల ఇంటికి చేరుకున్నాడు. ఆడవాండ్లు కట్టుపనులల్లో లీనమై ముచ్చట పెట్టుతున్నారు. కంఠీరవం బయట గదిలో పడక కుర్చీలో కూర్చొని గూళ్ళల్లో పడిఉన్న పాతపత్రికల్లోని వార్తలన్ని శ్రద్ధగాచదువసాగాడు. ఆపత్రికలల్లో ముఖ్యంగా

గ్రామాల వార్తలు ప్రత్యేకంగా అతన్ని ఆకర్షించాయి. ఆ విధంగా అన్ని వార్తలు ఎట్లా తెలిసికుంటారో అని ఆశ్చర్యపడ్డాడు.

ఇంతలో బయటినుంచి వేదాంతాచార్యులు వచ్చాడు. కంఠీరవం ఆతురతతో కుర్చీలోనుండి లేచి వినయంగా నిలుచున్నాడు. "కూర్చో, కూర్చో" అంటూ వేదాంతాచార్యులు ఇంట్లోకి వెళ్లాడు.

కంఠీరవం తిరిగి కుర్చీలో కూర్చుని చదువుతూ నిద్రపోయాడు.

ఇంతలో ఒక ముసలిస్త్రీ. జ్వరంతో వణుకుతున్న కొడుకును వెంట బెట్టుకొనివచ్చి, ఇంట్లోకి వెళ్ళి వేదాంతాచార్యులను తనకొడుకుకు మందు కావాలని అడుగుతూ తనదీనావస్థను సోదిగా చెప్పసాగింది. ఆ అలికిడికి కంఠీరవం నిద్రతేలిపోయింది. ముసలిస్త్రీ చెప్తున్న విషయం వింటూకూర్చున్నాడు. తనకొడుకు రైల్వేగ్యాంగు కూలివాడని, మూడు రోజులనుంచి జ్వరంవస్తున్నదని, ప్రభుత్వ వైద్యశాలలో మందుతాగితే తగ్గలేదని, వెతుక్కుంటూ అంతదూరంవచ్చానని దీనంగా చెప్తున్నది. వేదాంతాచార్యులు మందులపెట్టెలోని గుళికెలను పైకితీస్తూ, చూస్తూ, ఆముసలిస్త్రీ చెప్పే మాటలకు ఊఁకొడ్తున్నాడు. "సీతారాములు ఎక్కడికి వెళ్ళాడే" భార్య నుద్దేశించి వేదాంతాచార్యులు అన్నాడు.

"బోధక్కు పంపిన. సాయంత్రింగానిరాడు. ఏమైన పనిఉందా?" భార్యసీతమ్మ బదులుచెప్పింది.

"అవును! పనిఉందె.బజారుకు పంపించాలె. ఒకటి కొనుక్కరావలె. ముసలిదానికి మందివ్వాలెగద" మందులపెట్టె సదురుతూ అన్నాడు.

బయట గదిలోకూర్చొనిసంభాషణవింటున్న కంఠీరవం కుర్చీలోంచి లేచివచ్చి, "నేను వెళ్ళితెస్తాను. ఎక్కడ తేవాలో చెప్పండి" అన్నాడు.

పంపడమా? వద్దా? అని వేదాంతాచార్యులు సంకోచించాడు.

"నీకు పున్నెముంటది అయ్యగారూ, నీకాలుమొక్త. కొడుకు వణికి పోతాండు" ఆ ముసలి కంఠీరవాన్ని బ్రతిమిలాడింది.

వేదాంతాచార్యులు కాగితంమీద వ్రాసి పైకమిచ్చి, కంఠీరవాన్ని పంపాడు. కంఠీరవం సేవాభావంతో వేదాంతాచార్యులకు ఆనందం కలిగింది. ఆప్తుడుగా ఆదుకున్న వేదాంతాచార్యులకు అవిఘంగా సహాయంచేయడం, తీవ్రజ్వరంతో బాధపడ్తున్న రోగికి సేవచేయడం కంఠీరవానికి ఎంతో సంతోష మనిపించింది. ఆ ఉత్సాహముతో మందుతేగానే, వేదాంతచార్యులు మందును సిద్ధంచేస్తూ, "వైద్యం నేర్చుకుంటావా?" కంఠీరవాన్ని అడిగాడు.

కంఠీరవం వెంటనే సమాధానమివ్వక తల నేలకువేసి కొద్దిసేపు ఆలోచించాడు. "నేర్చుకోవడం మంచిదంటారా?" కంఠీరవం అడిగాడు.

"ఇందులో చెరుపేముంది? మానవుని జీవితం సాఫల్యమవుతుంది. మానవసేవే మాధవసేవ అన్నారు పెద్దలు. తోడిమానవునికి కష్టకాలంలో ఆదుకోవడంకంటె మించిన సేవ ఇంకేముంటుంది? జీవకోటిలో ఉత్త మోత్తమ జీవియైన మానవునికి వైద్యుడు ప్రాణభిక్ష పెట్టేవాడంటే అతిశ యోక్తి కాదు." అంటూ వేదాంతాచార్యులు మందుతెచ్చి రోగి నోట్లోపోసి, రెండు పొట్లాలు ముసలి స్త్రీకి ఇచ్చి, వాటి ఉపయోగ పద్ధతులు పథ్యము వివ రాలుచెప్పి వారిని పొమ్మన్నాడు.

"ఎన్ని పైసలో చెప్పరైతిరి దొంచను!" పొట్లాలు చేతిలో పట్టుకొని దండంపెడ్తూ ఆ ముసలిది అడిగింది.

"మూడు రోజులవరకు నేను పైకం తీసుకోను. మూడు రోజులకు కూడా జ్వరం తగ్గకపోతే తర్వాత చూద్దాం" అంటూ వేదాంతాచార్యులు ఇంట్లోకి వెళ్ళాడు.

"నీ కడుపు చల్లగుండ తండ్రీ" ముసలిది దీవించి, కొడుకును ఒక చేతితో పట్టుకొని వెళ్ళిపోయింది.

కంఠీరవం సానకడిగి, మందుల పెట్టెను సదిరి,మూసి పెట్టాడు. బయట గదిలోకివెళ్ళి కూర్చున్నాడు. వేదాంతాచార్యులు వైద్యవృత్తి గొప్ప తనం గురించి చెప్పిన విషయంపై ఆలోచించసాగాడు.

వేదాంతాచార్యుల భార్య సీతమ్మ బయటికి వచ్చి, చూచేవరకు సాన కడిగి ఉండటం, పెట్టె సదిరి పెట్టి ఉండటం చూచి ఆశ్చర్యపడింది. భర్తకు ఆ సంగతి చెప్పింది. "అతడు పరమ భాగవతోత్తముడు రఘునాథాచార్యుల కొడుకే! ఏమనుకున్నావు మరి? గర్వంలేని మనుష్యులు, కపటమెరుగని కష్ట జీవులు అట్లానే ఉంటారు." అని వేదాంతాచార్యులు, చరకసంహిత గ్రంథం పుటలు తిప్పసాగాడు.

సాయంత్రం మోహనాచార్యులు స్కూల్ నుండిరాగానే కంఠీరవంతో ఉపాహారానికి కూర్చున్నారు.

"మోహనా! కంఠీరవం చాలా ఉత్తముడురా. కష్టించే స్వభావము కలవాడు." వేదాంతాచార్యులు ఉపాహారం చేసుకుంటూ ప్రశంసించాడు.

"అపును నాయనగారు, గ్రంథాలయములోని పటాలను గురించి ఎంతో శ్రద్ధగా అడిగి వివరాలు తెలుసుకున్నాడు. కాంగ్రెసువాండ్లపై, ఇంగ్లీషువాండ్లు చేస్తున్న అన్యాయాలు చెప్పితే ఏమన్నాడో విన్నావా నాయన గారు! డిచ్పల్లిలో దవాఖానా పెట్టి సేవచేస్తున్నవాండ్లు ఇటువంటి పనులెందుకు చేస్తున్నరో అన్నాడు. నిజంగా మనమీవిషయం ఎన్నడు అనుకోనేలేదు. పాపం! చదుకోవాల్నని కూడా ఇష్టముంది" మోహనాచార్యులు అన్నాడు.

"నా చేతికింద వేసుకొని వైద్యం నేర్పితే బాగుండదూ?" ఆలోచనా ధోరణిలో కొడుకు నడిగాడు.

"ఏమి వైద్యంలేండి. ఏదైన ఆలోచించి, ఇంత చదివిస్తేనే బాగు. తెలివిగలవాడు. చొరవ ఉంది. శ్రద్ధ ఉంది. ఇంత విద్య కడుపులోపడితే ఉద్యోగమో, సద్యోగమో చేసుకుంటూ హాయిగా బ్రతుకుతాడు." అనుకుంటూ భార్య సీతమ్మ గ్లాసుల్లో మంచినీళ్ళు పోసింది.

కంఠీరవం బిడియంతో తల నేలకు వేశాడు. వాండ్లావిధంగా సానుభూతితో మాట్లాడడంతో అభిమాన పడ్డాడు. "మీరు నా విషయం ఇంత సానుభూతిలో ఆలోచించడం నా అదృష్టం. మా నాయనగారి కడుపున పుట్టిన

ఫలితం. మా నాయనగారు కాలంచేసిన తర్వాత నాకుకలిగిన బాధ, నా హృదయావేదన నేడు మీరుచూపుతున్న ఆదరంతో కొంత తగ్గింది. నా అన్నగారి హద్దులకు, అవివేకానికి నేను,నాతల్లి మెరలయినాము. నేను ఉండ జాలక ఇల్లు వదలి అయోమయంగా ఇటువచ్చాను. ఇంట్లో నా తల్లి కృశించి పోతున్నది. మీరు నాకు ఆశ్రియం ఇచ్చారు. నా చేతనైన సేవచేసి, మీ రుణం తీర్చుకుంటాను. మీకు శుశ్రూషచేసి వైద్యముతోపాటు. విద్యా భ్యాసం కూడా చేయాలని ఉంది. పాఠశాలలో కాకున్నా, ఇంట్లోనే చదువు కుంటాను." తలెత్తకుండనే దీనంగా ఒక్కొక్క వాక్యం వదిలాడు.

గ్లాసుల్లో కాఫీ తెస్తున్న సీతమ్మ కంఠీరవం విచారానికి చలించింది. మాతృప్రేమ ఉబికి వచ్చింది. "నీవేమి దిగులు పడొద్దు నాయనా! మేము పరాయవాండ్లం అనుకోకు. ఎప్పుడు, ఎవరికి, ఏమి వస్తాయో తెలియదు. మాఇంట్లో నీవొకడివి అనుకుంటాం నాయనా! దిగులు పడకు. ఈవయసు లో అన్ని ఫికర్లు ఉండటం బాగుండదు. ఇప్పుడు నీకొచ్చే ఆపద ఏమీ లేదు. తర్వాత మెల్లెగా మీవాండ్లకు తెలుపుతాం. ఏదీ! ఇటు తలెత్తి పైకి చూడు" అని సీతమ్మ కంఠీరవం ముందర వంగి నిలుచున్నది. కంఠీరవం కన్నీరు అంగీకి తుడుచుకొని, ఎర్రని కండ్లతో దీనంగా సీతమ్మను చూచాడు. "పిచ్చి పిల్లగ, మగవాడివి కన్నీరు పెట్టొచ్చు. కాఫీతాగు." అని సీతమ్మ ఆప్యాయంగా కాఫీ గ్లాసును నోటి కందించింది.

కంఠీరవం వెంటనే గ్లాసునందుకొని వస్తున్న దుఃఖాన్ని ప్రయత్న పూర్వకంగా ఆపుకొన్నాడు. "పాపం! తల్లిని ఎన్నడూ వదిలి పెట్టి ఉండ లేదేమో!" సీతమ్మ అన్నది.

వేదాంతాచార్యులుకూడా బాధపడ్డాడు. మోహనాచార్యులకు ఆ వాతా వరణం బాధామయమనిపించింది.

"మీ నాయన గారికి మాకు ఎంతో వాత్సల్యముండేది. సంబంధాలు, ఇచ్చి, పుచ్చుకోవడాలు లేకపోయినా మేమేం కొత్తవాండ్లం కాము. పరాయి

వాండ్ల ఇండ్లో ఉన్నాననే ధ్యాసపెట్టుకోవద్దు." వేదాంతాచార్యులుకూడా ఉప శమనం కలిగించాడు.

"మోహనా! అటు గ్రంథాలయం, స్టేషన్‌వైపు తీసికెళ్ళరాదు! మనోల్లాసంగా ఉంటుంది." అంటూ వేదాంతాచార్యులు కాఫీ ముగించి లేచాడు.

"అవును నాయనగారూ! గ్రంథాలయానికి వెళ్లాలేగా?" అన్నాడు మోహనాచార్యులు,

ఆలోచనావస్థలోనే కంఠీరవం కాఫీ ముగించుకొని లేచాడు. ఇద్దరూ గ్రంథాలయానికి వెళ్లారు. మార్గమధ్యంలో మోహనాచార్యుల నడిగి గ్రంథాలయ నియమాలు, నిర్వహణ పద్ధతి తెలిసికొన్నాడు. గ్రంథాలయంనుండి మొట్టమొదట గాంధీ మహాత్ముని "ఆత్మకథ" ను తెచ్చుకొని చాలాశ్రద్ధగా రెండు మూడుసార్లు చదివాడు. గాంధీ మహాత్ముడు వైష్ణవ మతస్థుడని తెలిసి పొందిన ఆనందం అంతింతకాదు. ఆత్మకథలో ఒకచోట మహాత్ముని దిగువవాక్యాలు కంఠీరవం మనసులో నాటుకొనిపోయాయి.

"ఏమంచి పనియైనను, సకాలమున ఉపయోగకరమగునేని తత్క్షణం ఆనందదాయకమని నా యనుభవము. దంభముచే గాని, పరభీతిచే గాని చేయుచో అది వానినణచును. అట్టివారు మాసిపోదురు. ఏ సేవ చిత్తానందము కలుగజేయదో, అది సేవకునకు ప్రయోజనకారిగాదు. సేవ్యునిగూడ సుఖ పెట్టదు. ఏ సేవచే చిత్తమానందమగునో దానిముందు ఈభోగములు, ధనో పార్జనములు మొదలగు నవన్నియు తుచ్ఛములని తోచును."

ఆత్మకథలో వేరేచోట చదివిన దిగువ పద్యము కంఠీరవానికి స్మర ణీయముగాను, పారాయణంగాను పరిణమించింది.

సీ॥ జలమును నీకీయగల వాని కెందేని నొసగుమీ కడుపార నోగిరంబు
వందనంబును జేయువానికి జేయుమీ భక్తిమై సాష్టాంగ వందనంబు
దమ్మిడి నీకిచ్చు ధన్యాత్మునకు మాఱుగా నిమ్ము మేల్మి బంగారుకాసు
కష్టంబులందు నక్కఱవచ్చు వానికి నిమ్ము నీ నెమ్మేని నేని కోసి

ఒకటి యొసగిన బదిరెట్టు లొసగవలయు
చెట్టచేసిన మేలును చేయవలయు
ప్రాంతకాలము నాటి ఈచేతలెల్ల
అనుపూర్వగ సత్య రహస్య మరయ.

కంఠీరవానికి "ఆత్మకథ" ముఖ్యంగా పారాయణ గ్రంథంగా పరిణమించింది. ఆంగ్లేయుల అహంకారము, కుటిలనీతి, ద్వంద్వపరిపాలన, బహుముఖచతురత, మహాత్ముని గొప్పతనము, భారతదేశ యథార్థస్థితి కంఠీరవానికి మచ్చుగా అర్థమైనవి. వీలున్నవుడెల్ల "ఆత్మకథ" ను తిప్పి తిప్పి చూడటం అలవాటైపోయింది.

అప్పుడప్పుడు వేదాంతాచార్యుల యింట్లో ఉన్న చరక సంహిత, అష్టాంగ హృదయం, బసవరాజీయం, యోగరత్నాకరం, చింతామణి, ధన్వంతరీ నిఘంటువు, ధన్వప్రదీపిక, శారంగధర సంహిత మొదలగు వైద్యగ్రంథాలు అర్థము అయినా కాకపోయినా చదువుతుండేవాడు. ఔషధాలు సిద్ధము చేయడంలో ప్రత్యేక శ్రద్ధతీసికొనేవాడు. మోహనాచార్యుల సహాయమున గ్రంథాలయములోనుండి అనేక గ్రంథాలు, పత్రికలు తెచ్చుకొని విధిగా, విసుగులేకుండా చదివేవాడు. ఉర్దూను అభివృద్ధిచేయడంలోను, ఇంగ్లీషు భాషాభ్యాసంలోను మోహనాచార్యులు ఎంతో తోడ్పడ్డాడు. ఈవిధంగా రెండు సంవత్సరాల కాలంలో అప్పుడప్పుడు కొమరయ్యను కలిసికోవడం, దిమ్మెగూడెం ఉత్తరాలు వ్రాయడం, తల్లి క్షేమసమాచారాలు, అన్న దుడుకుతనం తెలిసికొంటు ఉన్నాడు, తర్వాతకొన్నాళ్లకు కొమరయ్యతోట భావి రామభూపాల్‌రావు హరించిన విషయం తెలిసికొని, ఏమి చేయలేక నిస్సహాయుడుగా నిట్టూర్పు విడిచాడు.

# 11

అంజుమన్ ఇత్తెహాదుల్ముసల్మీన్ పక్షమున పరివర్తన కార్యక్రమం తీవ్రముగా జరుగుతున్న రోజులవి. హరిజనులను మహమ్మదీయులుగా మార్చడంతో గ్రామజీవితం తల్లడిల్లిపోతున్న రోజులవి.

దిమ్మెగూడెంలో రామభూపాల్‌రావు వేరేగ్రామాల్లోని వార్తలను వింటూ ఆవేదన పొందుతున్నాడు. అట్టి కార్యక్రమంవల్ల గ్రామంలో తన పలుకుబడి తగ్గిపోవడం తప్పదు. హరిజనులు మహమ్మదీయులుగా మారకుండా ప్రయత్నంచేస్తే, అంజుమన్‌కు సర్వసహాయాలు చేస్తున్న ప్రభుత్వంతో మాటవస్తుంది, ప్రభుత్వోద్యోగులతో పొందుతున్న సహాయ, సానుభూతులు లేకుండా పోతాయి. ఈ ఆలోచనలతో సతమతమై పోతున్నాడు. ఈ విషయంలో హైదరలీతో ఆలోచన చేయడంకూడా ప్రమాదమే. హైదరలీ అల్లుడు నిజామాబాదులో వకీలుగాను, అంజుమన్ నాయకుడుగాను పనిచేస్తున్నాడు. అల్లునికి సాయంగాను, తనకు వ్యతిరేకంగాను హరిజనులను సిద్ధంచేసి, గ్రామంలో తనకు ప్రతిగా పెత్తనం చేయవచ్చునని రామభూపాల్‌రావు తీవ్రంగా ఆలోచించ సాగాడు.

ఒకనాడు యర్రగుట్టనుండి, వియ్యంకుడు లలితారావు చాలా వివరంగా ఉత్తరం రాశాడు. యర్రగుట్టలో అంజుమన్‌వాండ్లు హరిజనులను మహమ్మదీయులను చేస్తే అంజుమన్‌వాండ్ల ఆటల కట్టించడానికి వేసిన ఎత్తులను, పొందిన విజయములను ఆ ఉత్తరంలో దీర్ఘంగా పేర్కొన్నాడు. రామభూపాల్‌రావు ఆ ఉత్తరాన్ని చదివి తీవ్రంగా ఆలోచిస్తూ, బంకుల్లో పచారు చేయసాగాడు. ఇంతలో హైదరలీ వచ్చాడు. అల్మారాలోఉన్న కాగితాల కట్టను విప్పి, కాగితాలను పరిశీలిస్తు "దొరవారు! నేను రేపు నిజామాబాదుకు వెళ్లివద్దామనుకుంటున్నాను" అన్నాడు.

హైదరలీ మతపరివర్తన కార్యక్రమం విషయమై అల్లునితో మాట్లాడటానికే వెళ్లుతున్నాడని రామభూపాల్‌రావు అనుమానపడ్డాడు. "మీ అల్లుని వకాలత్ బాగాసాగుతున్నట్టేగా?" హైదరలీని అడిగాడు,

"బాగనే సాగుతుందె. కాని ఈమధ్య అంజుమన్ పనులలో తిరగడం ఎక్కువైంది. అంటిపెట్టుకొని ఉంటే ఏదైనాబాగా నడుస్తది'' కాగితాలు చదువుతూ హైదరలీ సమాధానమిచ్చాడు.

"ఏదో సంఘాలు, సభలు, ఎవరి ఇష్టం వచ్చినట్టు వాండ్లు చేసుకుంటుంటారు. నడుస్తుంటాయి. కాని ఈమధ్య మాల, మాదిగలను తుర్కలు చేయడం ఏమీబాగలేదు. లేనిపోనివి కల్పించడం తప్ప." ఆలోచనాధోరణిలో రామభూపాల్‌రావు అన్నాడు.

"దాంట్లో కొత్తేమి ఉంది లేండి. ఎన్నిసార్లు కిరస్తానోళ్ళు మన ఊరుబయట అందరిని కూడగట్టి తమ మతంలో చేరాలని చెప్పలేదు? ఇది కూడాఅంతే" రామభూపాల్‌రావుపై తన మాటల ప్రభావం ఎట్లాఉంటుందో కనిపెడ్తూ హైదరలీ అన్నాడు కాగితాలు తిరిగి కట్టకట్టి. అల్మారాలో సదిరి లేచిపోతూ రామభూపాల్‌రావుకు సలాంచేసి వెళ్ళిపోయాడు.

యర్రగట్టనుండి వియ్యంకుని ఉత్తరంలోవి వివరాలు, హైదరలీ సంభాషణాపద్ధతిపై రామభూపాల్‌రావు గంభీరంగా ఆలోచిస్తు పరధ్యానంలో ఉన్నాడు.

ఇంతలో వెంకటాచార్యులు ఉత్సాహంతో వచ్చి, "చూచారా దొరవారు! వీని బర్రెమూడ మన చెరువు లోదట్టులో మేస్తున్నది. నేను బందెరదొడ్లో పెట్టించి కావలి ఉంచి వచ్చిన" అన్నాడు.

వెంకటాచార్యులను అనుసరించి వస్తున్న హరిజనుడు రామభూపాల్‌రావుకు వంగి దండంపెట్టాడు. "అయ్యా నీకాలు మొక్త బాంచను. నాదూడ అసలు చెరువు లోదట్టుకుపోనేలేదు దొర. పక్కపొంటె ఏనెరాళ్ళల్ల మేస్తాంటే, అయ్యగారు అన్నాలంగా బక్కదుడ్డెను బందెల్ల పెట్టించిండు నీకాలు మొక్త" అన్నాడు.

"కాదు దొరవారు! నేను సమయానికి అక్కడికి పోకపోతే మేసుకుంటు మేసుకుంటు, చెరువులోదట్టుకు పొయ్యేదే. పైగా పోదని నాతో వాదనకుదిగిండు" వెంకటాచార్యులు లేని కోపం తెచ్చుకొని అన్నాడు.

రామభూపాల్‌రావుకు వెంకటాచార్యుల వాదన చీదరగా తోచింది. "దొడ్డిదగ్గర ఉన్నకావలోడ్ని పిలుచుక రాపో" హరిజనుడితో అన్నాడు.

అతడు వెళ్ళిపోయాడు. వెంకటాచార్యుల నుద్దేశించి, "మన చెరువేం దయా?" ప్రశ్నించాడు.

"అదే దొరవారు! మనం ప్రతి పర్యాయం శనగ్గచేనువేయం దొర వారు? అది" అన్నాడు వెంకటాచార్యులు.

రామభూపాల్‌రావు వియ్యంకుని ఉత్తరం విప్పి తిరిగి చదువసాగాడు. బందెలదొడ్డి కావలి వాన్ని తీసికొని హరిజనుడు వచ్చాడు. "పీంఛ్లు కూడ తురకల్లో చేరవచ్చు" మనసులో అనుకున్నాడు. "కావచ్చు. హైదరలీ తప్ప కుండా ఈపనిలో శ్రద్ధతీసుకొంటాడు. ప్రభుత్వం ఆసరా చూచుకొని నాకు వ్యతిరేకంగా తయారుకావచ్చు. సరే కాని, చూద్దాం, దాని రంగేమిటో" మధన పడ్డాడు. కావలివా న్నుద్దేశించి, "వెంకటాద్రిని రమ్మన్నానని పిలువురా!" అన్నాడు. హరిజనునితో, "దూడెను తోలుకొనిపో" అన్నాడు. హరిజనుడు "నీకాలు మొక్త బాంచను" అని దండంపెట్టి, వెంకటాచార్యు లను తీవ్రంగా చూస్తూ వెళ్ళిపోయాడు. "తిని ఉండలేక అయ్యోరాయన ఏదో చేస్తుంటడు" అన్నట్టున్నాయి ఆహరిజనుని చూపులు.

"నువ్వు చెప్పని పనులెందుకు జేస్తవు? అది మనచెరువు అని, ఎవ రన్నారు నీతో? అది సర్కారిది ఎరికేనా?" కోపంతో రామభూపాల్‌రావు అన్నాడు. వెంకటాచార్యులు తెల్లముఖం వేసి, అవమానంతో తల నేలకు వేశాడు.

దొరవారి వద్ద తన గొప్ప తనాన్ని చూపడానికై చేశాననుకున్న ఘనకార్యం ఆవిధంగా అవమానానికి, మందలింపుకు కారణంకావడం వెంకటాచార్యులకు బాధకలిగింది. ఈ విధంగా తనకు తానే జోక్యం కలి గించుకొని రామభూపాల్‌రావు మనిషిగా గ్రామ ప్రజలను ఇబ్బంది పెట్టడం వెంకటాచార్యులకు అలవాటైంది. రామభూపాల్‌రావు అంతకటువుగా లోగా ఎప్పుడు కూడా మాట్లాడలేదు. వెంకటాచార్యులు విచారంగా వెళ్ళిపోయాడు. వెంకటాద్రివచ్చాడు. కావలి వాన్ని వెళ్ళిపొమ్మని, బందెలదొడ్లో దూడను వదిలి పెట్టించానని రామభూపాల్‌రావు చెప్పాడు.

రామభూపాల్‌రావు వెంకటాద్రికి, వియ్యంకుని ఉత్తరం అందించాడు. వెంకటాద్రి శ్రద్ధగా ఉత్తరం చదివాడు. "లలితారావుగారి ధైర్యమే వేరు. దేనికైనా తయారే వారు" మందహాసం కురిపిస్తూ ఉత్తరాన్ని రామభూపాల్‌రావుకు అందించాడు.

వెంకటాద్రి కులానికి తెలగవాడైనా అక్షర జ్ఞానం కలిగినవాడు. వ్యవహర్త. వ్యవసాయస్థితికూడా బాగానే ఉంది. గ్రామతగాదాలల్లో మధ్యవర్తిగా ఉండి, కోర్టు వ్యవహారాలల్లో ఆరితేరినవాడు. రామభూపాల్‌రావుకు ఎల్లప్పుడూ కుడి భుజంగా ఉంటాడు. వ్యూహాలు, ఎత్తు గడలు వేయడంలో దిట్ట. రామభూపాల్‌రావు అధికారబలానికి తన తెలివిని జోడించి చాక చక్యంగా గ్రామంలో పలుకుబడి, పెత్తనం నడుపుతుంటాడు. రామభూపాల్‌రావు మన్ననలను మాత్రం పోగొట్టుకోకుండా తెలివిగా వ్యవహరిస్తుంటాడు.

"మన ఊళ్లో కూడా మతపరివర్తనపని ప్రారంభమైతే పరిస్థితులు తల్లకిందైతవి. హైదరలీ కూడా అల్లుని సాయంతో రంగంలో దూకేటట్టే తోస్తున్నది. నిజామాబాదుకు వెళ్ళాడు. మొత్తానికి గ్రామ ప్రజల్లో మనమంటే ఒకవిధమైన నిర్లక్ష్యం కూడా కలుగవచ్చు" రామభూపాల్‌రావు వెంకటాద్రితో సంభాషణ మొదలు పెట్టాడు.

"అసలు వీళ్లు ఇప్పుడీపని ఎందుకు మొదలు పెట్టుకున్నట్టు దొరవారు!" వెంకటాద్రి లోతుగా ఆలోచించాడు.

"ఎందుకేమిటి? ఉండలేక, ఎవడో ఒకడు ఇట్లైతే బాగుంటుందని అంటాడు. సరేనని పదిమంది తలలూపుతారు. దాంతో మొదలవుతాయి ఇటువంటి పిచ్చి పనులు" రామభూపాల్‌రావు అన్నాడు.

"అంత ఆలోచనలేకుండ కాదు లేండి. ఏదో ఆలోచించే చేస్తుంటరు. అయినా మాల, మాదిగలను పిలిపించి ఒకసారి భయం చెప్పిచూస్తాం" అని వెంకటాద్రి అంటుండగా, వెంకటాచార్యులు వచ్చాడు.

"అయ్యగారితోటి, మన హిందూ ధర్మం గురించి, మాల, మాదిగలకు చెప్పిద్దాం!" వెంకటాద్రి కొంటెగా నవ్వుతూ వెంకటాచార్యులను చూచాడు.

"ఈ దద్దన్న వల్ల అదేం కాదు," అని హేళనగా వెంకటాచారిని చూచాడు. "మాల మాదిగలంతా తురకల్లో చేరుతారట. వద్దని చెప్తావు?" రామభూపాల్‌రావు అన్నాడు.

"తురకల్లెందుకు కలుస్తారు దొరవారూ?" వెంకటాచార్యులు ఆశ్చర్యంగా అన్నాడు.

"అదంతా తండ్రితోటే పోయింది." వెంకటాద్రి చప్పరించాడు.

"ఎందుకు చెప్పను దొరవారు! మీఆజ్ఞైతే తప్పకుండా చెప్తా. వినరనుకుంటారా? వినక పోతే బొక్క, బొక్క విరుగ్గొడ్తానని చెప్తా." వెంకటాచారి ఉత్సాహంతో అన్నాడు.

వెంకటాద్రి, రామభూపాల్‌రావు ఒకరినొకరు చూచుకొని నవ్వారు.

"ఆగమై పోయిండుగాని, ఆ తెలివి కంఠీరవానికే ఉంది. తండ్రిని మించే వాడయ్యేవాడు." రామభూపాల్‌రావు అన్నాడు.

"నేను మరిచి పోయిన దొరవారు మీకుచెప్పటం. ఆగమైపోయిండనుకున్నారా? ఎవరో వైష్ణవుల ఇంట్లో నిజామాబాదులో ఉన్నాడట, మీకు తెలియదన్నమాట" వెంకటాద్రి వెంటనే అందుకున్నాడు.

"అవునా? నిజమేనా!" రామభూపాల్‌రావు వెంకటాచార్యులను ప్రశ్నించాడు.

"ఏమో! ఏమైపోయిండో నాకు వాడి జోలి తెలియదు." నిర్లక్ష్యంగా వెంకటాచార్యులు అన్నాడు.

"హైదరలీ అల్లుడు కూడా మత ప్రచారంలో బాగా పనిచేస్తున్నాడట" తిరిగి రామభూపాల్‌రావు తన హృదయాన్ని ఆందోళన పరుస్తున్న విషయాన్ని బయట పెట్టాడు.

"హైదరలీ వచ్చినాక నేను మెల్లగా తెలుసుకుంటగద! ఈలోపల మనం కూడా మాల మాదిగలను పిలిపించి చెప్పుదాం. దేనికైనా మంచిది" అంటూ వెంకటాద్రి లేచి నిలుచుండి ఒళ్లువిరిచాడు. "ఇన్ని మంచినీళ్ళు తెండి అయ్యగారు!" అన్నాడు.

"లేస్తి వెందుకో! కూర్చో, మంచి నీళ్ళేమిటి? ఫలహారం చేద్దువు గాని." అని రామభూపాల్‌రావు అన్నాడు. "లోపలికి వెళ్ళి ఫలహారాలు పెట్టమని చెప్పుపో" వెంకటాచార్యులతో అన్నాడు. వెంకటాచార్యులు గడీలోకి వెళ్ళిపోయాడు.

"ఊళ్ళో కొందరు రైతులను పిలిపించి, లలితారావు చేసినట్లు చేయ మని చెప్పితే ఎట్లుంటుంది" రామభూపాల్‌రావు వెంకటాద్రిని సలహా అడిగాడు.

"ఇప్పుడే మనం ఆపనికి పూనుకోవద్దు. వాండ్ల మనసులేమి బాగ లేవు. కొమరయ్యను గుంజకు కట్టెయ్యడం కాపువాండ్లకు చాలాకోపంగా ఉంది. వాండ్ల కోపానికి వాడో వీడో పొగేసే వాండ్లులేరు? అంతా ముఖం తిప్పుకొన్నారు. ఇప్పుడు వాండ్లనేమి అనవద్దు. ఒకవేళ మనఊళ్ళో జరిగి నప్పుడు కదా! అప్పుడు ఎవడెవడు ఎట్లా మారుతడో, ఎవడి రంగేందో దాన్నిబట్టి అప్పటి కప్పుడు ఆలోచించచేమా? ఏమంత మునిగిపోతుంది గనుక." వెంకటాద్రినిబ్బరంగా మాట్లాడాడు. వెంకటా చార్యులు వచ్చి పిలువగానే లోపలికి ఉపాహారానికై వెళ్ళారు.

# 12

గొట్టం కొమరయ్య అనుభవంలోఉన్న తోటబావి రామభూపాల్‌రావు హరించి వేయడం, రామభూపాల్‌రావు చేసే అన్యాయపు పనుల్లో ఒకటిగా గ్రామ ప్రజలు భావించినా, కొమరయ్యను గుంజకు కట్టికొట్టడం భరింపరాని, అవమానకరమైన విషయంగా కాపుకులంవాండ్లు బాధపడ్డారు.

ఒకనాడు కొంతమంది రైతులు చంద్రయ్య అను రైతుచేనులో కూడినారు. చాలాసేపు చర్చోప చర్చలు చేశారు. రామభూపాల్‌రావు, చేష్టలను అందరూ విమర్శించారు. అందరూ కోపం వెలిబుచ్చారు. కాని అతని చర్యలను అడ్డుకోవడ మెట్లాగో తోచలేదు. పరితాపంతో ఎక్కడి వాండ్లక్కడ చెదిరి పోయారు.

అప్పుడప్పుడు ఒకరో ఇద్దరో రైతులు కూర్చున్నపుడల్లా రామభూపాల్‌రావు విషయం చర్చించడం అలవాటై పోయింది.

కొమరయ్య భూమిని దున్నుతున్నపుడు హైదరలీతో దెబ్బలుతిన్న జీతగాడు కనకయ్య చాలారోజుల తర్వాత ,దిమ్మెగూడెం చేరుకున్నాడు. చంద్రయ్య వద్దికి వచ్చి, "పెద్దయ్యః దొరోరికాడ జీతం లెక్క చేసుకావాల్నె" అన్నాడు.

"పొయ్యి అడగరాదురా?" చంద్రయ్య అన్నాడు.

"ఏమోనేః మల్ల ఏమన్న అంటడేమోనని భయపడ్తున్న. జర అందాకరారాదే." కనకయ్య అన్నాడు.

"అయితే పోదాం పారాడూః తలకాయ కొడ్తడా?" అని చంద్రయ్య, మరికొందరు రైతులను వెంట తీసికొని కనకయ్యతో రామభూపాల్‌రావు వద్దికి వెళ్ళారు.

"ఆ కొమరయ్య తోటబావికాడ అయ్యాల అన్నమ్మ మీదికి మాదిగోడుపోతే చూడలేక కనకయ్య అడ్డంపోయిండంట. హైదరలీ ఇజ్జర, మజ్జర కొట్టె. మీరేమో కొమరయ్యను గుంజకుకట్టి కొట్టిరి. కనకయ్యకు అదురుబుట్టి పెద్దమ్మకాడికిపోయి మొన్ననే వచ్చిండు. మరి లెక్కచూచి వచ్చేదుంటే ఇన్ని గింజలిప్పించుదు. ఇగవాడు మీతాన జీతముండబోతాడు" చంద్రయ్య వచ్చిన పనిని తెలిపాడు.

కనకయ్యను వెనకేసుకొని, ఆవిధంగా రైతులు కట్టుగా రావడం రామభూపాల్‌రావుకు హెచ్చరికగా తోచింది. పైకిమాత్రం గంభీరం ప్రక

టించాడు. "అంతమాత్రానికి మీరంతా ఎందుకు రావడం?" రామభూపాల్ రావు అన్నాడు.

"చెప్పకుండ పోయినందుకు మీరేమన్న అంటరని భయపడ్డదు లెండి. మీరు తొందరపడి కోపంతో ఇంకేమన్నచేస్తె ఎంటుకొచ్చిన పంచాయితి. మీకంటె సాగుతదనుకోరి. మేమేమో నోట్లో నాల్కలేనోళ్లం" చంద్రయ్య బొట్టన వేలుతో నేలమీద గీకుతు అన్నాడు.

"మొన్న కొమరయ్యను గుంజకుకట్టి కొట్టడం మాత్రం ఏదొరల కాలంలో జరుగలేదండి" ఇంకొక రైతు అన్నాడు.

"అసలు ఆరోజు మంచిదికాదురే. ఎన్నడు జరుగంది, అయ్యాల జరిగిందంటె ఏమనుకోవాలె? ఊళ్లో ఉన్నోళ్ళం మా కష్టాలేంటో మేము చెప్పుకుంటున్నం. దొరలకు తోచింది మంచో చెడ్డో చెప్పినుర్రి. ఇంత వరకు గట్టనే జరుగుతు వచ్చింది." ఇంకొక రైతు అన్నాడు.

"దొరల్నంటె ఏం లాభమే! అందాక రాకుండ మనకుమనమే చెల్విగడుండాలె. మనం కండ్లు మూసుకొనిపోతే ఏదన్న కాళ్ళకు తగల కుండుకుంటదా? తెల్యని ఏడ్పుగని" చంద్రయ్య గంభీరంగా అన్నాడు.

అందరి మాటలను శ్రద్ధగా వింటున్న రామభూపాల్‌రావు చంద్రయ్య మాటలతో చెదిరాడు. "అంటే చంద్రయ్యా?" చేనిశాంతంప్రదర్శిస్తూ అన్నాడు.

"దీంట్ల మీకు తెలియందేముంది గనుక. ఇంతకూ మేం నోట్లో తడి లేనోళ్ళం. అటువంటోళ్ళకు చెప్పుదెబ్బలు తగ్గక ఏమైతది. వెంకటాద్రయ్య ఉన్నడు. ఆయన మాకంటె కులమెక్కువోడా? ఆయనకున్న మర్యాద,మాట,ముచ్చటా మాదగ్గర లేకపోయె. అయితే,మేం మీకు చేస్తున్న దగాలేదు. వెంకటాద్రయ్య చేస్తున్న మేయిలేదు. మా ఉప్పులేందో మేం పెట్టిన్నం." అంటూ, కనకయ్యవైపు తిరిగి, "సరే, ఈ మాటలకేంగాని. ఇయ్యి ఓనాటికి తరిగేవా? నీ మన్సుల మాటేందో దొరకు చెప్పోరాదుర!" అన్నాడు చంద్రయ్య.

"మన్నులమాదేంచేః జీతం చాలించుకుంట. లెక్కసూసి వచ్చేదుంటే ఇస్తె అయిపాయె" కనకయ్య నీళ్ళు మింగుకుంటూ అన్నాడు.

రైతుల సంభాషణా పద్ధతి, వాడుతున్న వాక్యాలు రామభూపాల్‌రావుకు సహించరానివైనవి. కాని ఆ విధంగా రైతులుకట్టుగా రావడంతో తన ఉద్రిక్త తను లోలోన తమాయించుకొన్నాడు. రామభూపాల్‌రావు అమాయికుడేమి కాదుగాః మంచి వ్యవహర్త. నిరుత్సాహిసూడాకాదు తెగిందాక పరిస్థితులను రానిచ్చే స్వభావముకూడాకాదు. దర్పంగా వ్యవహరించడం, అడ్డంకులేమైనా ఏర్పడితే చాకచక్యంగా ప్రక్కకు తొలగి ప్రతిష్టకు భంగం రాకుండా మెలగడం అతనికి అలవాటు. కాని కొమరయ్య భూమి తాను పెంచతలచు కొన్న తోటకు అన్ని విధాలా అనుకూలంగా ఉండటంవల్ల అతడు తన సహజ రాజనీతికి భిన్నంగా ఆ భూమి విషయంలో త్వరపడ్డాడు.

కనకయ్యకు సమాధానంగా, "సరే దీంట్లోః బలవంతం ఏముంది? హైదరలీ ఊరికి పోయిండు. వచ్చినాక లెక్కచేయించుకో" నిర్లక్ష్యంగా అన్నాడు రామభూపాల్‌రావు.

కనకయ్య ఏదో గొణుగుకుంటూ వెళ్ళిపోయాడు,

"ఇంకేం సంగతులు చంద్రయ్యః" ఏదైన సంభాషణ మొదలు పెట్టాలనే అభిప్రాయంతో రామభూపాల్‌రావు అన్నాడు.

"కొత్త సంగతులు మీకు తెలియకుండేమున్నాయి చెప్పురి." చంద్రయ్య తల నేలకు వేసి అన్నాడు.

"కొమరయ్య కౌలుకు చేస్తున్న భూమి విషయంలో నీతో మాట్లాడాలని ఎన్నోసార్లు అనుకున్నా. ఏదోకారణమనుకో వీలుకాలేదు. ఇంతవరకు అట్లగేగడిచిపోయింది." రామభూపాల్‌రావు అసలు విషయం మొదలు పెట్టాడు,

"మేం తెలిసికోని ఏం చేస్తమంటరు? అన్ని తెలిసిన మారాజులు మీరు." అంటూ చంద్రయ్య ఇంకో రైతును కొంటెగా చూచాడు.

"అదికాదు చంద్రయ్య. ఏదైనా అందరికి తెలిసుండటం మంచిదికదు! ఎప్పైనా ఆ భూమి కొమరయ్య స్వంతదికాదాయె. ఎందుకా పట్టుదల కొమరయ్యకు? కొమరయ్య తండ్రి కాలంనుంచి కౌలుచెల్లించకుండనే మొన్నటి వరకు అనుభవిస్తున్నాడుకదా! నీవేచెప్పు. నాటినుంచి కౌలు కావాల్నని నేను అనలేదు. అనుభవించిందేమో అయిపోయింది." రామభూపాల్‌రావు ధలోక్తిగా అన్నాడు.

"మరి ఆ బాపనాయన కోటయ్యకు కౌలుకిచ్చె కాదుండి?" ఒక రైతు ప్రశ్నించాడు.

"ఎవరు కాదంటున్నారు. కాని ఇప్పుడది ఖానూను ప్రకారం నాదై పోయింది. కాబట్టి నా భూమి నేను తీసుకోవడం న్యాయము కాదంటావా?" రామభూపాల్‌రావు ప్రశ్నించాడు.

"ఆ ఖానూను తెలియకనే గదుండి మాకీ చిక్కులు. మీరు ఖానూను తెలిసినోరు. మేము ఏది మాట్లాడినా తప్పుకిందికి వస్తది." అంటూ చంద్రయ్య లేవగానే, ఇతర రైతులుకూడా లేచి నిలుచున్నారు.

రామభూపాల్‌రావు కూడా లేచి ఒళ్ళు విరిచాడు.

రైతులు ఒకరిముఖాలు ఒకరు చూచుకొని గడీనిపదలి వెళ్ళిపోయారు.

మత పరివర్తన కార్యక్రమం, రైతులపై ఖరి రామభూపాల్‌రావును ఉక్కిరి బిక్కిరిచేసినాయి.

# 13

కంఠీరవం నిజామాబాదు స్థానిక ప్రజాహిత జీవితంలో ప్రధానకార్యకర్తగా పరిణితిచెందాడు. గ్రంథాలయ అభివృద్ధికి ఎంతో కృషిచేశాడు. ఎల్లరి ప్రశంసలనుపొంది గ్రంథాలయ ప్రధానకార్యదర్శిగా ఎన్నికైనాడు. కంఠీరవం ఉత్సాహం, పట్టుదల కారణముగా గ్రంథాలయ వార్షికోత్సవము జరుపుటకు నిశ్చయింపబడింది. అందుకై చేయవలసిన సన్నాహాలు, ధన

సేకరణ మొదలగు పనులు చురుకుగా మొదలైనాయి. హైదరాబాదునుండి జగపతిరెడ్డిని వార్షికసభాధ్యక్షునిగా ఆహ్వానించాలని, వారితోపాటు ఇతర మేధావులను కూడా ఆహ్వానించాలని నిశ్చయించి అందుకై కంఠీరవం హైదరాబాదుకు వెళ్ళాడు. వేదాంతాచార్యుల కొడుకు మోహనాచార్యులు హైదరాబాదులోనే ఉంటున్నాడు. అతని సాయమున హైదరాబాదులోని కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము, స్టేట్‌లైబ్రరీ. రెడ్డిహాస్టల్ గ్రంథాలయ మును కంఠీరవం చూచి ముగ్ధుడైపోయాడు. జగపతిరెడ్డి అధ్యక్షులుగా నుం డుటకు ఒప్పించి, ఇతరప్రముఖులను కలిసికొని ఆహ్వానాలు అందించాడు. ప్రముఖుల హితవచనాలు, హైదరాబాదు పట్టణవాతావరణము కంఠీరవాన్ని ఇంకా ఉత్తేజితపరచాయి. కొత్తకొత్త ఊహలతో, ఆశయాలతో, ఆశలతో హృదయముప్పొంగ తిరిగి నిజామాబాదుకు చేరుకున్నాడు. సభానుమతికై అమలులోనున్న 53వ గస్తిప్రకారము ప్రభుత్వానికి విజ్ఞప్తి పెట్టుకో బడింది. కాని చాలా రోజులవరకు అనుమతి లభించలేదు. సభావేది సమీపిస్తున్నది. అనుమతికి ఆలస్యం కావడం కంఠీరవానికి ఆందోళన కలుగుటకు కారణ మైంది. ఎన్నోసార్లు జిల్లాధికారివద్దికి వెళ్ళి శ్రద్ధకలిగించగా ఒకనాడు జిల్లా కార్యాలయం నుండి దిగువపత్రికారం లేఖవచ్చింది:—

"గ్రంథాలయ సభానుమతికై నీవు పెట్టుకొన్న విజ్ఞప్తికి ప్రత్యుత్తరము గా వ్రాయడమేమనగా, సభాధ్యక్షుని యొక్కయు, ఆహ్వాన సంఘా ధ్యక్షుని యొక్కయు, ఉపన్యాసములు మరియు సభలో పాల్గొని ఉపన్యసించువారి యొక్కయు, సభకువచ్చే సందేశముల యొక్కయు సారాంశములు ముందుగా ప్రభుత్వానికి వ్రాసి పంపవలెను. మరియు సారాంశములలో పేర్కొనబడని విషయాలు తరువాత సభాసందర్భ మున వ్యక్తీకరింప కూడదు. మీకార్యక్రమములో ఉదహరించిన భజన, హరికథ విషయములో కూడా ఇప్పుడే ఏ విషయము నిర్ణయింపబడజాలదు. ఏలననగా మసీద్ పేష్ ఇమాం జనాబ్ ముర్తు జాఖాన్ సాహెబు గారి యొక్కయు ఇతర ముఖ్యుల యొక్కయు అంగీకారముపైగాని ఆ విషయము పరిష్కరింపబడదు."

ఈ విధంగా జిల్లాధికారి కార్యాలయంనుండి వ్రాసి రావడం గ్రంథాలయ సభానిర్వాహకులకు ఆశాభంగం కలిగింది. కంఠీరవం భరింపరాని అవమానంగా తలచాడు. గ్రంథాలయ నిర్వాహకుంతో చర్చించి కంఠీరవం తన ఉద్రిక్తతను కట్టిపేసుకొని దిగువవిధంగా తిరుగు లేఖరాశాడు:—

"ఈ సభ కేవలం గ్రంథాలయమునకు సంబంధించింది. ఇందు ఎట్టి రాజకీయాలుగాని, మత విద్వేషకర విషయాలుగాని, ఉపన్యసించబడవు. అంతేగాక గ్రంథాలయాలకు సంబంధించిన ప్రభుత్వ నిబంధనల ననుసరించి, మా గ్రంథాలయ పక్షమున ప్రభుత్వానికి ఒప్పందము పత్రముకూడా నివేదించుకున్నాము. అదిప్రభుత్వము వద్ద ఉన్నది.

మీరు కోరిన విషయ సంగ్రహము అసందర్భమేగాక, అసంభవముకూడాను. ఉపన్యాసకు లేయే విషయాలను గురించి మాట్లాడెదరో తెలుప సాధ్యమగునుగాని, ఏయే విధంగా వ్యక్తం చేసెదరో, ఏయే వాక్యాలు, పదాలు వాడెదరో మొదటనే ఊహించడం అసాధ్యమైన విషయము. ఒక విషయము మాత్రము స్పష్టము, రాజకీయా లుండవు, మత విద్వేషము కలిగించబడదు. మేము మొదట విజ్ఞప్తితో జతపరచి పంపిన కరపత్రములో పేర్కొనిన ఉపన్యాస విషయాలవల్ల ఆ సంగతి స్పష్టమే.

ఇక భజన, హరికథ విషయములో జనాబ్ ముర్తజాఖాన్ సాహెబుగారికి గాని, మరెవరికినిగాని ఎట్టి ఆక్షేపణ ఉండకూడదు. అంతేగాక సభాప్రదేశమునకు 500 అడుగుల మేరలో మస్జిద్‌గాని, ఎట్టి ఇతర పవిత్ర మతస్థలముగాని లేవు. కాబట్టి ఎవరికిని భజన, హరికథవల్ల విచారముకలిగి, వారి మత విశ్వాసము సడలిపోవు భయముండ నవసరములేదు. అందువల్ల మాగ్రంథాలయమును, తద్వారా విజ్ఞానాభివృద్ధి జరుగాల్సిన అవసరమును గుర్తించలేని మేరేవారి అంగీకారము, అనంగీకారముపై మాకు అనుమతి లభించుట

ఆధారపడియుందని మీరు పేర్కొనడం ఆశ్చర్యమును కలిగించు నదిగా ఉన్నది. కాబట్టి మేము తలపెట్టిన ఈ సభానిర్వాహణము జయప్రదముగా జరుగుటకు తోడ్పడి, గ్రంథాలయ నిర్వాహకులు, సభలో పాల్గొనువారెల్లరు దేశహితాభిలాషులుగను ప్రజాహితాభిలాషులుగను, బాధ్యతగలవారుగను గుర్తించి, ప్రభుత్వమువారు వారిని విశ్వసించి పరిపూర్ణమైన నమ్మకముతో అనుమతి నొసగి, విశాల హృదయముకలిగి ఉన్నచో నిష్ప్రయోజనము కాజాలదని విశ్వాసము కలిగించుచున్నాము.''

ఈ విధంగా వ్రాసి పంపిన తర్వాత గ్రంథాలయ నిర్వాహకులు స్వయంగా జిల్లాధికారితో సమక్షములో మాట్లాడివచ్చారు. గ్రామాల పరిస్థితులు ఆర్యసమాజీయుల హడావుడితో అశాంతిగా ఉండవి, అందు కొరకై శాంతి కాపాడుటకై ప్రభుత్వం జాగ్రత్తపడటం అవసరమని జిల్లాధికారి సమాధానమిచ్చాడు. ప్రభుత్వం శాంతి, భద్రతల దృష్ట్యా కొన్ని విషయాలను గమనించి, అనుమతి ఇవ్వటంలో ఆక్షేపణ చూపదని జిల్లాధికారి సమాధానమిచ్చాడు. జిల్లాధికారి మాటలు అస్పష్టంగా ఉండటం గ్రంథాలయ నిర్వాహకులకు చిరాకుగా తోచింది "రాతపూర్వకముగా ప్రభుత్వం మీకు వెంటనే తెలుపుతుంది'' అని జిల్లాధికారి అన్నాడు. దానితో కంఠీరవం కొంత తృప్తి చెందాడు.

మరునాడు జిల్లాధికారినుంచి దిగువ ప్రకారం అనుమతి పత్రం కంఠీరవం పేర వచ్చింది :—

" మీరు గ్రంథాలయం వార్షికోత్సవ సభానుమతికై పెట్టుకొనిన విజ్ఞప్తి సందర్భములో వ్రాయడమేమనగా, ఉపన్యాసములు మొదలగు వాటి వివరాలు పంపుట సాధ్యము కాదను విషయమును దృష్టియందుంచుకొని, ఇతరులకు, ప్రభుత్వానికి వ్యతిరేకమును ప్రేరికొల్పు ఉపన్యాసములు చేయబడవని అంటున్నారు కాబట్టి మీరు అట్టి ఒప్పందం పత్రము వ్రాసి యివ్వవలెను, ఒకవేళ భజనలోగాని, హరికథలో

గాని అవమానకరమైనట్టి విషయాలున్నచో ఇక మీద ఎప్పుడూ అనుమతి ఇవ్వబడక పోవుటయేగాక, చట్టరీత్యా చర్యగైకొనబడును.

తహశీల్దారు గారికి వ్రాయడ మేమనగా:- మీరు గ్రంథాలయము వారినుండి పై ప్రకారము ఒప్పందం పత్రము వ్రాయించుకొనవలెను. సభాచర్యలను శ్రద్ధగా గమనించవలెను. నమాజు వేళలలో భజన, హరికథ, ఊరేగింపు మొదలగునవి జరుగకుండా చూడవలెను. గ్రంథాలయ నిర్వాహకులు తహశీలుకు వ్రాసి యిచ్చిన తర్వాత పోలీసువారి అనుమతికూడా పొందవలెను. పోలీసువారు అనుమతించి, ఏర్పాట్లు జరిపిన తర్వాత చాలా శాంతియుతంగా కార్యక్రమాలు నడుపబడ వలెను. ఊరేగింపు జరుపకూడదు. నమాజు సమయమును మరచి పోకూడదు. సభాధ్యక్షుడు తన ఉపన్యాసములోని వాక్యాలు చాలా పరిమితిలో పెట్టి ఏవర్గమునకు వ్యతిరేకముగా ఎట్టి భావప్రకటనమును చేయకుండునటుల జాగ్రత్త వహించవలెను."

జిల్లాధికారినుండి వచ్చిన పై ఆజ్ఞను అనుమతి దొరికినటులనే గ్రంథాలయ నిర్వాహకుల్లో కొందరు భావించారు. కొందరు తికమకపడ్డారు. కంఠీరవం చాలా బాధపడ్డాడు. తొణకని కుండగాయుండే అతనిలో ఎంతో ఆవేశనజయలు దేరింది. ఆత్మగౌరవం వెల్లడికి వచ్చింది. ప్రభుత్వంనగ్నంగా కండ్లముందర నాట్యం చేసింది. జిల్లాధికారి విధించిన నిబంధనలకు లొంగి, సభను జరుపడమా, వద్దా అను సమస్య బయలు దేరింది. గ్రంథాలయ నిర్వాహకులు సమావేశమై చర్చలు సాగించారు.

"జిల్లాధికారి విధించిన నిబంధనలు ఉల్లంఘించాలని నా అభిప్రాయం కాదు. కాని ప్రజలపై అతను కనపరచిన అనుమానం. అవిశ్వాసం నేను ప్రధానంగా తీసుకొంటున్నాను. పరిపాలనా వ్యవహారాల్లోగాని, మతమునకు గాని ఏలాంటి సంబంధంలేని వైజ్ఞానిక సభ విషయంలో ఇన్ని అడ్డంకులు

కల్పించడంలో అంతరార్థమును మనం అర్థంచేసికోవాలని కోరుతున్నాను." కంఠీరవం చర్చను మొదలు పెట్టాడు.

"మన గ్రంథాలయం మంచిచెడ్డలతో ఏలాంటి సంబంధంలేని ముల్లా జాఖాఁ మొదలగువారి ఆమోదముపై మన కార్యక్రమ నిర్వహణము ఆధార పడుట సహించరాని విషయం." ఒక విద్యార్థి అన్నాడు.

"ప్రభుత్వం నియమాలను మోపడం, వాటినిఉల్లంఘిస్తారని శంకించ డం, భయపడటంచూస్తే, ఆ ప్రభుత్వం పెట్టిననియమాల వెనుక ప్రజాశ్రే యస్సు గాక ప్రజావ్యతిరేకత ఇమిడియున్నదను విషయం స్పష్టం" ఒక డాక్టరు అన్నాడు.

"ప్రభుత్వం అనవసరంగా అనుమానపడటం తప్పే. అయినా మనం మన కార్యక్రమ నిర్వహణ ద్వారా అట్టి అనుమానం అర్థరహిత మైందని రుజువుచేస్తే జరిగే నష్టమేముండదనుకుంటాను'' ఒక వకీలు అన్నాడు.

"అది అనుమానముకాదు. వారి వైఖరి అసహజముకాదు. అసలు ప్రభుత్వం ఆలోచనలే వేరువిధంగా ఉన్నాయి. మహమ్మదీయులను తమ చంకలో ఇరికించుకొని హిందువుల నణచివేయటమే పనిగా పెట్టుకున్నది, అందువల్లనే మహమ్మదీయేతరుడైన ప్రతివాడిని ముందుకు రాకుండా అణచి వేయ ప్రయత్నిస్తున్నది." ఒక యువకుడు అన్నాడు.

ఈ విధంగా చాలా సేపుచర్చలు సాగాయి. హైదరాబాదునుండి వచ్చే పెద్దల అభిప్రాయంపై సభనుజరుపాల్సింది, మానాల్సింది తేల్చుకుందా మని ఒక నిర్ణయానికి వచ్చారు.

అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన జగపతిరెడ్డి, ఆహ్వానితులు నియమిత తేదినాడు రాగానే స్టేషనునుండి గుంపుగా ఎదుర్కొని గ్రంథాలయానికి తీసికొని వచ్చారు. ఆ విధంగా ఎదుర్కొని రావడం ఊరేగింపు కిందికి వస్తుందా అనికూడ చర్చలుమొదలైనాయి. "ప్రభుత్వనిర్ణయానికే వదిలేద్దాం" నవ్వుతూ అధ్యక్షుడన్నాడు. కంఠీరవానికి ఆ మాట తృప్తి కలిగించింది.

నియమిత కాలానికి గ్రంథాలయాపరణములో ప్రత్యేకంగా నిర్మిం పబడిన పెండాల్‌లో అంతా కూడారు. మామూలుగా సభజరిపి, కార్యక్రమం మాత్రం నడుపక, జిల్లాధికారి మోపిన నిబంధనలకు అసమ్మతిని ప్రకటిం చుటతో సభను చాలించాలని తుదకు నిర్ణయం జరిగింది.

అమితోత్సాహంతో సుమారు నెల రోజులనుండి గ్రంథాలయ కార్య కర్తలు సభను పెద్ద ఎత్తున జరుపాలనుకొని, తుదకు ఆ విధంగా ముగిం చడం కొందరికి నిరుత్సాహం కలిగింది. ఊపిరిమెసలకుండ ఉక్కిరిబిక్కిరి చేస్తున్న దుష్టవాతావరణంనుండి తొలగి ఆ ఒక్క రోజైనా స్వేచ్ఛా వాయు వులను పీల్చదలచుకుందా మనుకున్నది నిష్ఫలమైంది. "ప్రభుత్వం అనుమా నిస్తున్నట్టేంమనం తొందరపడి ఆలోచిస్తున్నాం. సభజరిపితే ఏమవుతుంది?" ఒక ముసలి వకీలు గొణిగాడు. కంఠీరవం మాత్రం చాలా ఉత్సాహంగా ఉన్నాడు. ఆత్మగౌరవం నిలపెట్టుకునే మనోనిబ్బరం విద్యావంతుల్లో కలగడం కంఠీరవానికి మేరువు దొరికినంత సంతోషం కలిగింది. ప్రభుత్వంపై ఒక ఘనవిజయం సాధించినంత ఉప్పొంగి పోయాడు. అసమ్మతిని తెలుపడం ప్రభుత్వానికి తీవ్రమైన హెచ్చరికగాను, కనివిప్పుగాను ఉంటుందని మన స్తిమితం పొందాడు.

సభాస్థలము క్రిక్కిరిసింది. పెండాలు అలంకరణ ఉత్తేజపరిచేదిగా ఉంది. గాంధీమహాత్ముని చిత్రం ప్రత్యేకాలంకరణతో ప్రధానంగా ఒకవైపు, నిజాంప్రభువు పటం లాంఛనంగా ఒక వైపు వేలాడగట్టారు. నిజాం ప్రభువు చిత్రానికి ప్రత్యేకత లేకపోవడం ముసలి వకీలుకు కంపరం కలిగింది. తాను ఆ సభలో పాల్గొనడమే తప్పుచేశానని, ఏ విధంగానైనా తప్పించుకొని బయటపడాలని ఆలోచించాడు. ఒకసారి తలెత్తి సభకు అధికారు లెవరైనా వచ్చారేమోనని దిగులుగా నలువైపుల చూచాడు. ఎవరు ఇంకారాలేదు. "వస్తుందొచ్చు ఎవరైనా?" మనసులో అనుకున్నాడు, "జిల్లాధికారికి దావత్ పంపారా?" పక్కనే కూర్చున్న ఒకరిని అడిగాడు. "సభే జరుగడంలేదు, దావతు లెందుకు?" బాధతో అతను జవాబు చెప్పాడు. "ఇది సభ కాక ఏందంటారు?" ముసలి వకీలు అంటూ టోపితీసి గాలివిసురుకున్నాడు.

కంఠీరవం లేచి నిలుచున్నాడు. "మహాశయులారా! మిత్రులార!!" సంభాషణ మొదలు పెట్టాడు.

"మేము తలపెట్టిన సభగాని, నిర్వహించుతున్న గ్రంథాలయము గాని, రాజకీయాశయము, లక్ష్యము లేక కేవలం విజ్ఞాన వికాసమునకు వీలు కలిగించాలని మాత్రమే ఉద్దేశించబడింది. విజ్ఞాన వికాసము కలిగి, వివేక వంతులైన ప్రజలుండటం ప్రతి ప్రభుత్వము గర్వించుటకును, ఆ దేశము ప్రతిష్టపొందుటకును కారణాలవుతాయి. ప్రజలపై అవిశ్వాసముతో ప్రభుత్వ మున్నదంటే దానికి ప్రధాన కారణం ప్రభుత్వముతనలో ఉన్న ఏదోలోపాన్ని గ్రహించి, భయపడుతున్న దన్నమాట. అట్టి లోపాన్ని తొలగించుకొనుట వివేక మనిపించుకొనునుగాని, తన తప్పులనుకప్పిపుచ్చుకొనుటకు ప్రజలను నిందితులుగా తలచుట అన్యాయము. ప్రమాదకరము.'' ముసలి వకీలు భయంతో, ఆవేదనలో కంఠీరవంవైపుగుడ్లు మిటకరించి చూస్తున్నాడు, కంఠీరవం సంభాషణా పద్ధతిని శ్రద్ధలోవింటూ గంభీరంగా సభికులను పరికిస్తున్న అధ్యక్షుడు చప్పట్లు కొట్టాడు. సభికులంతా ఉత్సాహంతో చప్పట్లు కొట్టారు. ముసలి వకీలుకు ఏమీ తోచలేదు. బెదురుతూ, చప్పట్లు కొడ్తున్నవాండ్లను చీదరించుకుంటూ చూచాడు, కంఠీరవం సభాధ్యక్షుని వైపు కృతజ్ఞతా సూచకంగా చూచాడు. తిరిగిమొదలుపెట్టాడు. "అట్టి ప్రమాదమును గ్రహించి, దేశములో జ్ఞానాభివృద్ధికి, తద్వారా దేశాభివృద్ధికి దారితీయు ప్రవర్తన కలిగి ఉండాలని ప్రభుత్వమునకు శ్రద్ధకలిగించుటకే నేని రెండు మాటలు చెప్పి, ముగిస్తున్నాను. నేటి సభావ్యవహారాలనుగురించి అధ్యక్షులవారు తమ అభిప్రాయాన్ని ప్రకటిస్తారు" అని కంఠీరవంసభికులకు నమస్కరించాడు.

చప్పట్ల మధ్య అధ్యక్షుడు లేచి నిలుచున్నాడు.

"మిత్రులారా!

"మొదట మన మిక్కడ సభను జరుపుకుందామని నిశ్చయించి యుంటిమి. కాని ఇది సభకాదు. మిత్రుల గోష్ఠి. నేను అధ్యక్షునిగా మీకు

కొన్ని విషయాలు విన్నవించాలని తలచితిని. కాని ఇప్పుడు నేను చెప్ప బోవునది ఉపన్యాసముకాదు. కొన్ని మాటలు.

"గ్రంథాలయంవంటి ఉత్తమమైన స్థలము, పవిత్రమైన స్థలము వేరేలేదని నేను తలుస్తుంటాను. ఒకవిధంగా చూస్తే దేవాలయము కంటే కూడా పుణ్యస్థలము. మన దేవాలయాలలోకి హరిజనులను రానివ్వము. ఆవిధంగా మనం గొప్ప తప్పు, నేరము చేస్తున్నామనవచ్చును." వేదాంతా చార్యులు, ముసి, ముసిగా నవ్వాడు. ముసలి వకీలు, "హరిజనుల సంగతి ఇక్కడెందుకో!" గొణుక్కొన్నాడు. "ఇక్కడ కూర్చొన్న వారిలో హరి జను లెందరున్నారో తెలియదు. ఉంటే నాకు కలిగే సంతోషం చెప్పతరము కాదు. మనలో చదువుకున్నవాండ్లున్నారు. చదువురాని వాండ్లున్నారు. గొప్ప పండితులున్నారు. ఇందరము మనలోఉన్న భేదాలను, కులాలను లక్ష్యం చేయకుండా ఇక్కడచేరినాము. మనలో కొందరము దరిద్రులము కావచ్చును. కొందరము శ్రీమంతులముగావచ్చును. కాని ఇక్కడ అంద రం కలిసి కూర్చున్నాము. అంతెందుకు! మహాఘనత వహించిన నిజాం ప్రభువుగారి చిత్రం, గాంధీమహాత్ముని చిత్రం, ఇంకా ఇతర నాయకుల చిత్రాలను కూడా పెండాలులో అలంకరించాము. మన ప్రభువుగారి గురించి మనకు బాగా తెలియును. గాంధీ మహాత్మునిగురించి కూడా బాగా తెలి యును. మహాత్ముని గురించి చెప్పబూనుకుంటే రోజులు చాలవు." కంఠీ రవం చప్పట్లు కొట్టగానే అంతా చప్పట్లు కొట్టారు. ముసలి వకీలు "గ్రంథా లయము గురించి చెప్పక ఇవన్ని ఎందుకు అనవసరంగా "కొంచెం పెద్దగా అన్నాడు. వకీలు మాటలు అధ్యక్షునికి చెవిలో పడ్డాయి. అధ్యక్షుడు చిరు ముఖంతో వకీలును చూచి, సభికుల నుద్దేశించి ఈ విధంగా సంభాషిం చాడు. "ఇక్కడ ఒకరు గ్రంథాలయం గురించి మాట్లాడాలంటున్నారు. మీ గ్రంథాలయం చాలాప్రాచీన గ్రంథాలయం. ఆంధ్రోద్యమములో ప్రధాన విషయమైన గ్రంథాలయోద్యమమని మీరెరుగుదురు. మీగ్రంథాలయంలో మంచి, మంచి పుస్తకాలున్నాయి. ఈ సందర్భమున ఒకశ్లోకం జ్ఞాపకం

వచ్చింది. వెనుక మన ప్రాచీనులు ఈ విధంగా, తాము వ్రాసే ప్రతి గ్రంథం తుదిలో వ్రాసేవారు:

శ్లో॥ భగ్న పృష్ఠ కటి గ్రీవః
స్తబ్ధ దృష్టి రధో ముఖం
కష్టేన లిఖితం గ్రంథం
యత్నేన పరిపాలయేత్॥

అన్నారు. అనగా గ్రంథము వ్రాయుటలో "నావీపు, కటి ప్రదేశము, గొంతు పట్లుపట్టుక పోయినవి. దృష్టిమందగించింది. ఇట్టి కష్టములు పడి, గ్రంథమును వ్రాసినాను. కావున శ్రద్ధతో నీగ్రంథమును రక్షించుకొనవల సినది." అని అర్థము. కాబట్టి గ్రంథాలయములోని గ్రంథముల విషయ ములో మీకు అంత శ్రద్ధ అవసరము. ముగిస్తూ ఒకమాట, దీన్ని హెచ్చ రిక అంటే బాగుంటుందేమో! ఈ హెచ్చరిక యిక్కడ కూర్చున్న మీకే కాదు. దేశములోని ప్రజలకే కాదు. ప్రజలకు, ప్రభుత్వానికి సంబంధించిన వారికి హెచ్చరిక. కండ్లు మూసికొని, కాలము గడుపాలని తలచే ప్రతి వారికి సంబంధించిన హెచ్చరిక. అయితే ఈ హెచ్చరిక నేను చేయడం లేదు. శ్రీమత్ శంకర భగవత్పాదులవారు చేసిన హెచ్చరిక:

"యస్మిన్ దేశే కాలే
నిమిత్తచ యో ధర్మాఽనుష్ఠేయతే
స ఏవ దేశ కాలనిమిత్తాంతరేష్వ
ధర్మోభవతి"

కాలము మారుకొలది రుచులు, జనుల అభిప్రాయములు మారుచుం డును. తదనుగుణంగా వివేకముతో వ్యహవరించుట అందరివిధి. అది లోపించినపుడే ద్వేషాలు, సంఘర్షణలు సమరములు మొదలవుతాయి." వేదాంతాచార్యులు చప్పట్లు కొట్టాడు. సభికుల చప్పట్లతో సభ మారు మోగింది.

"మనము జరుప తలపెట్టిన్న సభకు కొన్ని అవమానకరములైన నిబంధనలను ప్రభుత్వం మోపింది. ఆత్మగౌరవము గలవారెవరూ కూడా వాటిని సహింపరు. అందుకొరకై మనము అసమ్మతిగా సభనుమానుకొని, మన అసమ్మతిని తీర్మాన రూపంలో ప్రభుత్వానికి పంపుతాము" అని అధ్య క్షుడు తీర్మానాన్ని సభికులకు చదివి వినిపించాడు. "మీకందరికి ఆమోద మేనా?" సభికుల నడిగాడు. "చప్పట్ల ద్వారా సమ్మతిని ప్రకటించండి" అన్నాడు. రెట్టింపు ధ్వనిలో చప్పట్లు దీర్ఘంగా కొట్టారు. "ప్రభుత్వం మన గ్రంథాలయ సభకు పెట్టిన నిబంధనలు కంఠీరవంగారు చదివి విని పిస్తారు. తర్వాత సభ ముగుస్తుంది" అధ్యక్షుడు అన్నాడు. కంఠీరవం ఆ నిబంధనలను చదివి వినిపించిన తర్వాత కృతజ్ఞతా వందనాలతో సభముగి సింది.

# 14

నిజామాబాదుకు వెళ్ళి వచ్చిన హైదరలీ. తన అల్లుని సూచనల ప్రకారం దిమ్మెగూడెంలో హరిజనులను మహమ్మదీయులుగా చేసే సన్నా హాలు మొదలు పెట్టాడు. ఆరోగ్యం బాగలేదని మిషపెట్టి గడీలోకి వెళ్ళటం తగ్గించు కున్నాడు. గడీలోకి వెళ్ళినప్పుడు గంభీరంగా వ్యవహరించేవాడు. క్లుప్తంగా మాట్లాడేవాడు.

రామభూపాల్‌రావుకు హైదరలీపై అనుమానం దినదినం బలపడ సాగింది. కాని హైదరలీతో ద్వేషంపెంచుకుంటే, ప్రభుత్వ వ్యతిరేకమవు తుంది. అందువల్ల భీతిల్లితూ ఎటూతోచక తల్లడిల్లాడు.

హైదరలీ ప్రతిరోజు చావిడిముందర కూర్చొని హరిజనులతో సాను భూతిగా మాట్లాడేవాడు. వాండ్ల కష్టాలు పోయే రోజులు వచ్చాయని ఇన్నాళ్లకు భగవంతుడు హరిజనులకు మేలుచేయ బోతున్నాడని, హరిజనుల కష్టాలకు అలాహజ్రత్ హృదయం సీరైపోతున్నదని హరిజనులతో అంటుండేవాడు. భూములు, చదివించిన తర్వాత ఉద్యోగాలు ప్రభుత్వం,

ఇస్తుందని మొత్తంపై హరిజనుల గూడెంలో సుముఖవాతావరణం కల్పించాడు. రామభూపాల్‌రావు తటస్థంగా ఉండటంకూడా హైదరలీకి యింకా ఉత్సాహం కలుగడానికి కారణమైంది.

రామభూపాల్‌రావు, వెంకటాద్రి కలిసి హైద్రాబాదుకు వెళ్ళి ఆర్య సమాజ నాయకులతో మాట్లాడి, ఉల్లాసంగా తిరిగి వచ్చారు. రామభూపాల్‌రావు ఇదివరకంటె ధైర్యంగాను, మనో నిబ్బరంతోను ఉన్నాడు. వెంకటాద్రి సమయానికై నిరీక్షిస్తూ, తన భావికార్యక్రమాన్ని నిర్ణయించుకున్నాడు.

దిమ్మెగూడానికి అంజుమన్ నాయకులు పెద్ద, పెద్దవాండ్లు వస్తున్నారని మొదటే వదంతి బయలు దేరింది. హరిజనులలో సంచలనం, ఉత్సాహం మొదలైంది. తమను దూరం చేసిఉంచిన మొత్తం గ్రామాన్ని ప్రతీకారంగా చూడసాగారు. తాము ఇన్నాళ్ళనుంచి అనుభవిస్తూ వస్తున్న కష్టాలు గట్టెక్కే సదవకాశం వస్తున్నదని ఉవ్విళ్ళూరారు. తాముచేస్తున్న జీతాలు, కూలిపనులు, నివసిస్తున్న గుడిసెలు, మురికి కుంటలు, మైల గుడ్డలు తాత్కాలికమైనవని తాము ప్రభుత్వోద్యోగులుగా, రాజు మతావలంబులుగా మొత్తం గ్రామాన్ని హిందువులను గుప్పిట్లో పెట్టుకుంటామని ఊహించసాగారు. తామనుభవించిన కష్టాలన్నిటికి, అవమానాలకు ప్రతీకారం తీసుకొనే అవకాశం లభించిందని ఆశలు కలిగాయి.

కొమరయ్య స్వయంగా ఒకసారి నిజామాబాదుకు వెళ్ళి తనభూమిని రామభూపాల్‌రావు హరించిన సంగతి వివరంగా చెప్పాడు. హైదరలీకి, రామభూపాల్‌రావుకు పడిరావడం లేదని, ఆగ్రామానికి కూడా అంజుమన్ వాండ్లువచ్చి హరిజనులను మహమ్మదీయులుగ మార్చనున్నారని తెలిపాడు. మతపరివర్తన పేరుతో ప్రభుత్వం తలపెట్టిన దుష్టనీతిని, కంఠీరవం ఎంతో అసహ్యించుకున్నాడు. జిల్లాలల్లో అక్కడక్కడ గ్రామాల్లో మత పరివర్తన పేరుతో జరుగుచున్న దౌర్జన్యాలు, అన్యాయాలు విన్నప్పుడల్లా కంఠీరవానికి పట్టరానికోపం వచ్చేది. ఇప్పుడు తనస్వగ్రామంలో కూడా అవి జరుగ

బోతున్నందున తానుస్వయంగా అటువంటి పనులకు అడ్డుపడాలని నిశ్చయించుకొని కంఠీరవం ఆనాడే దిమ్మెగూడెం ప్రవేశించి కొమరయ్య ఇంట్లో బసచేశాడు.

ఐదుగురు పోలీసులు, ఒక జమేదారు, జిల్లాఅంజుమన్ నాయకుడు, హైదాబాదు కేంద్ర అంజుమన్ నాయకుడు, ఒక ప్రచారకుడు వచ్చి మొదట హైదరలీ ఇంట్లో బసచేశారు. కొద్దిసేపు మాట,ముచ్చట జరిపి, హరిజన వాడకు వెళ్ళి, హరిజనులను వెంటబెట్టుకొని, రామభూపాల్‌రావు గడీముందరనుంచి చావిడీకి బయలుదేరారు. వారంతా గడీముందరనుంచి వెళ్ళబోతున్నారని తెలిసి రామభూపాల్‌రావు మేడఎక్కి కిటికీ సందుల్లోంచి దొంగవలె తొంగిచూచాడు. వచ్చినప్పుడల్లా హరిజనులతో వెట్టిపనులు చేయించుకొనే పోలీసువాండ్లు, ఆ రోజు చాకలి, మంగలి, కుమ్మరివాండ్లతో చేయించుకున్నారు. హరిజనుల స్థాయిపెరిగినట్టుతోచి పోలీసువాండ్లకు ఈర్ష్యకలిగింది.

చావిట్లో అంజుమన్‌వారు, హైదరలీ, చావిడి ముందర హరిజనులు, దూరంగా ఇతర గ్రామీయులతో కంఠీరవం నిలబడి ఉన్నాడు. కేంద్ర అంజుమన్ నాయకుడు చావిడి ముందు భాగంలో నిలుచుండి ఉపన్యాసం మొదలు పెట్టాడు.

"ఈ గ్రామంలో అందరివలె పుట్టి పెరిగినా మీరు ఊరికి దూరంగా మురికి కొంపల్లో ఉంటున్నారు. మీరు పందుల్లుగా బ్రతుకుతున్నారు. వేరే వాండ్లవద్ద మీకు కుక్కలకున్న గౌరవంలేదు. మీతో పొద్దస్తమానం పని చేయించుకొని కడుపుకు నిండని కూలి, జీతాలు ఇస్తున్నారు. కాబట్టి ప్రజల మేలుకోసం ఎల్లప్పుడూ పాటుబడే మన మహాఘనత వహించిన ఆలా హజ్రత్ మీ బీదవాండ్లందరిని బాగుచేయటానికి నిశ్చయించుకున్నారు."

"బాగా వినండి" అంటూ హైదరలీ చుట్ట ముట్టించాడు.

"యిగ హైదరలీ ఎంత జీతం ఇస్తడో చూస్తంగద" రైతుల్లో ఒకడు గొణిగాడు.

"ఇప్పుడు మీకు మా ప్రచారకుడు ఒకటి చదివి వినిపిస్తాడు" అని నాయకుడు కూర్చున్నాడు.

ప్రచారకుడు ఒక అచ్చు పత్రికను పైకెత్తి "దీంట్లో మన ఆలా హాజ్రత్ ఫర్మాన్ ఉంది. దీంట్లో ఉన్న వివరాలు హైదరలీగారు తర్వాత మీకు చెప్పుతారు. ఈ పత్రికలన్నీ హైదరలీగారికి ఇచ్చిపోతాము" అన్నాడు.

ప్రచారకుడు పత్రికలను హైదరలీకి ఇచ్చి ఉపన్యాసం మొదలు పెట్టాడు. "మీరు మహమ్మదీయుల్లోకలిస్తే మీ కష్టాలు పోతాయి. మీరంతా మహమ్మదీయులతో సరిసమానముగ విద్య, ఉద్యోగాలు పొందవచ్చును. హిందువుల దేవాలయాల్లోకి వెళ్ళలేనివారు, ఊరి చేదబావులవద్దికి పోజాలని వారు స్వేచ్ఛగా మసీదులోకి వెళ్ళవచ్చును. చేదబావుల్లోకి వెళ్ళవచ్చును. దేశముఖులు, పటేలు, పట్వారీలు ఏ విధమైన కష్టాలు పెట్టినా మేము సహాయం చేస్తాము. మీ ఆడవాండ్లకు మీకు ఇవ్వాలని మా వెంట బట్టలు కూడా తెచ్చాము; మీ కోసం బడికూడా ఏర్పాటు చేయిస్తాము" అని హైదరలీని చూచాడు.

హైదరలీ హరిజనుల పెద్దమైన యల్లయ్యను సైగచేసి "వచ్చి బట్టలు తీసుకో" అన్నాడు.

గుంపులో కూర్చొనిఉన్న ఒక గౌండ్ల ముసలి "దొర గుంజుకున్న భూములు, తీసుకున్న లంచాలు ఇప్పిస్తరా," అన్నాడు.

"తప్పకుండా ఇప్పిస్తాము. మీకున్న కష్టాలన్ని మీ హైదరలీసాహెబుకు చెప్పుకోండి, ఆయన అన్ని తీరుస్తాడు. మన రాజ్యానికి ప్రధాన మంత్రి సర్ అక్బర్ హైదరీవలెనే మీఊరికి హైదరలీగారు ఉన్నాడను కోండి" కేంద్ర అంజుమన్ నాయకుడు అన్నాడు.

"హైదరలీసాహెబు న్యాయం చేయకపోతే ఇంకెవరు చేస్తారు.? ఇంతవరకు చేస్తున్నదంతా న్యాయమే" దూరంగా కూర్చొని ఉన్న కొమరయ్య అన్నాడు.

"ఏమన్నవు కొమరయ్యా?'' హైదరలీ ఒళ్ళు మండి కేకవేశాడు.

"ఏమి లేదు. అంతా న్యాయంగానే జరుగుతున్నది హైదరలీగారి దగ్గరఅన్నా" అని కొమరయ్య లేచి నిలుచున్నాడు.

"ఆయన్నుపట్టుకో" హైదరలీ పోలీసులకు చెప్పాడు. పోలీసులు హడావుడిగా వెళ్ళి కొమరయ్యను పట్టుకొనివచ్చి చావిట్లో కూర్చోపెట్టారు. కంఠీరవం, చంద్రయ్య మొదలగు రైతులు ఒకరి నొకరు చూచుకున్నారు. హైదరలీ హరిజనులను ఒక్కొక్కరిని చావిట్లోకి తీసుకరావడం, ప్రచారకుడు వాండ్లజుట్టు, మొలతాడు కత్తిరించడం మొదలుపెట్టారు. మగవాండ్ల కొక్కొక్క ధోతి. ఆడవాండ్ల కొక్కొక్క చీరె ప్రకారంయిస్తు పోయారు, గులాంఅలి, దస్తగీర్, కరీం, ముస్తఫా మొదలగు పేర్లుపెట్టారు. గౌండ్ల ముసలి చేతులు నలుపుకుంటూ చావిట్లోకి వచ్చాడు. ''నేనుకూడా తురకల్లో కలుస్తా. మరి నా భూములు నాకిప్పియ్యాలె. దొర గుంజుకున్నడు" అన్నాడు.

హైదరలీ "మంచిది" అని ఉత్సాహంతో ప్రచారకుని చేతిలోనుండి కత్తెరను తీసికొని, స్వయంగా గౌండ్లముసలిజుట్టు, మొలతాడు కత్తెరించి "ఈ రోజునుంచి నీ పేరు గులాంరసూల్" అన్నాడు.

ఆ గౌండ్లముసలి పిచ్చోడివలె దిక్కులుచూస్తూ మహమ్మదీయులుగా మారిన వాండ్లకు కొద్దిగా దూరంగా కూర్చున్నాడు.

కంఠీరవం, చంద్రయ్య మొదలగు రైతులు మెల్లగా చావిట్లోకి వెళ్ళారు. కంఠీరవం కేంద్రి అంజుమన్ నాయకుడివద్దికి వెళ్ళి, "మీతో మాట్లాడలని వచ్చాము" అన్నాడు.

ఆనాయకుడు హైదరలీని చూస్తూ, "ఎవరువీండ్లు." అన్నాడు. హైదరలీ సమాధానమివ్వకముందే, "సరే. ఏ మడుగుతారో అడుగవచ్చు" అన్నాడు.

"మీవెంట ఈ పోలీసు లెందుకు?" కంఠీరవం ప్రశ్నించాడు.

"మీవంటివాండ్లు ఏమైన పిచ్చిపనులు చేస్తే గ్రామంలో అశాంతి కలగకుండా చూడటానికి ప్రభుత్వం తన పని తాను చూచుకుంటున్నది.

వాండ్లను మాకు సంబంధంలేదు. మేమురమ్మంటే వాండ్లురారేమ." నాయ
కుడు సమాధాన మిచ్చాడు.

"అయితే మీపని అశాంతికి దారితీస్తుందని మీకు తెలిసుండి కూడా
ఇటువంటి పనులకు ఎందుకు తలపడ్డారు?"

ఆనాయకునికి కోపంవచ్చింది. "హద్దుమీరి మాట్లాడుతున్నారు!"
అన్నాడు.

"ఎవరి హద్దుల్లో వాండ్లు ఉంటూ, ఎవరి బాధ్యతలను వాండ్లు గుర్తిం
చాలని చెప్పాలనే మీవద్దికి వచ్చింది."

"ఏమిటయ్యా? మహాచెప్పవచ్చినవు? నీకేం పనిలేదా?" హైదరలీ
నిర్లక్ష్యంగా అన్నాడు.

"నీపనేమిటో నువ్వు చూచుకోరాదు? లేనిపోనివి మెడకేసుకుంటు
న్నవు?" పోలీసు జమేదారు అధికారధ్వనిలో అన్నాడు.

కంఠీరవం అందరిని కలయచూచాడు. "మీ అన్యాయాలను అరికట్ట
డమే నాపని" తీవ్రంగా సమాధానమిచ్చాడు కంఠీరవం.

"తెలివిలో ఉన్నావా? తెలివితప్పి మాట్లాడుతున్నావా?" హైదరలీ
కూర్చున్నచోటినుంచి లేచి అన్నాడు.

"అసలు మీకు తెలివిలేదు. తెలివిఉంటే మీరెందుకు ఇటువంటి
పనులు చేస్తారు? ఇప్పటికైనా తెలివితెచ్చుకొమ్మని చెప్పుతున్నాను."

నాయకునికి కోపం ఎక్కువైంది. "ఇక్కడినుంచి వెళ్ళిపోతావా,
లేదా?" గాండ్రించి అరిచాడు.

"నా ఊరుకువచ్చి నన్ను పొమ్మంటున్నావా?"

"ఈ విధంగానే నీసంభాషణఉంటే నీకు సరియైన స్థలమేదో
చూపించాల్సి వస్తుంది. జాగ్రత్త."

"లే కొమరయ్యా. పోదాంలే. వీండ్లకు బుద్ధి, జ్ఞానము లేకుండా
పోయింది. మిమ్ములి పిచ్చలపిడిగా గాలికి వదిలిన ప్రభుత్వానికి అంతకన్న

లేదు'' కఠీంరవం అందరిని సంబోధిస్తున్నట్టు అని కొమరయ్యను చేయిపట్టి లేపాడు.

"కొమరయ్య మా నిర్బంధంలో ఉన్నాడు. ఎట్లావెళ్తాడు? బుద్ధికలిగి ఉండక పోతే నీకు అదేగతి పడ్తుంది." జమేదారు అడ్డంవచ్చి ప్రశ్నించాడు.

"నిర్బంధంలో ఉన్నవాడిని అక్రమంగా విడిపించుకొనడం, ప్రభుత్వోద్యోగ కర్తవ్యనిర్వహణంలో అడ్డంకులు కల్గించడం కూడా నేరమే. చూస్తావెందుకు? ఇద్దరికి బేడీలు తగిలించి, లేవంగ, పడంగ తంతూ వెంట తీసుక పోతాం" కేంద్ర అంజుమన్ నాయకుడు జమేదారు నుద్దేశించి అన్నాడు.

"అది నిజమేకాని, పోనియ్యమని అవకాశమిస్తున్నాను. వినకపోతే మీరన్నంత పనేఅవుతుంది" జమేదారు కంఠీరవాన్నిచూస్తూ బెదిరించాడు.

"మీ పశుబలం సంగతి మాకు తెలుసు. మీ బెదిరింపులకు, అన్యాయాలకు మేం వెనుకకు పోము. హైదరలీ అన్యాయాలను అన్యాయమనడం కూడా నేరమైంది గదు?'' కంఠీరవం గుడ్లెర్రచేస్తుఅన్నాడు.

కొమరయ్య సంభాషణా ధోరణిని శ్రద్ధగా వింటున్నాడు, ఒకొకసారిభయం, ఒకొకసారి ధైర్యం కలుగుతున్నది. చంద్రయ్య మొదలగు ఇతర రైతులు వింతగా చూస్తున్నారు.

"హైదరలీని అన్నందుకు కాదు. ప్రధానమంత్రియైన నవ్వాబ్ సర్ హైదర్ నవాజ్ జంగ్ బహద్దర్ యెడ హేళనగా, ధిక్కారంగా మాట్లాడటం సామాన్యమైన నేరంకాదు. వాడిజీవితమంతా జేల్లోగడువాలె" జమేదార్ అన్నాడు.

"అట్లాగా? అయితే నన్నుకూడా పట్టుకోవచ్చు. మీ ప్రభుత్వం ఈ విధంగాచేసే ప్రతి పనిని నేను వ్యతిరేకిస్తున్నాను. మీరు ఒక లంచగొండివాడు అచ్చువేసిన పత్రికను నైజాం ఫర్మాన్ అని అబద్ధాలుచెప్పి, ప్రజలను మోసంచేస్తుంటే బుద్ధి ఉన్నవాడెవడూ చూస్తూ ఊరుకోడు. ఈ పత్రిక

లేమిటో నాకు తెలుసు. రాజమండ్రిలో అచ్చైన ఈ పత్రిక నైజాం ఫర్మాన్ అవుతుందా? ఈ విధంగా మీరు మీ మతానికే హాని చేసుకుంటున్నారు. నిజమైన మహమ్మదీయుడెవడైనా ఇట్లా చేస్తాడా?'' కంఠీరవం గొంతుచించుకొని ఉపన్యాస ధోరణిలో మాట్లాడాడు.

"ఇగ నీకు బుద్ధిచెప్పింది లాభంలేదు. ఇద్దరిని కలిపి బేడీలు తొడిగించు'' నాయకుడు జమేదారుకు ఆజ్ఞఇచ్చాడు.

చంద్రయ్య, ఇతర రైతులు జంకినారు. ఎటు పాలుపోలేదు.

జమేదారువచ్చి.కంఠీరవానికి,కొమరయ్యకుకలిపి బేడీలు తగిలించాడు.

ఈ వార్త విని ఊళ్లో కలవరం బయలుదేరింది. అన్నమ్మ వణికిపోయింది. వెంకటాచార్యులు, రామభూపాల్‌రావు ఒకరినొకరు ప్రశ్నార్థకంగాచూస్తు బంగళాపై గుటుకు మిటుకు మనుకుంటూ కూర్చున్నారు. ఆండాళమ్మ పిచ్చిదానివలె, కాలుకాలిన పిల్లివలె ఇంట్లోకి బయటికి తిరుగసాగింది. చుట్టుప్రక్కల ఇండ్లవాండ్లు మిద్దెలనుండి, అడ్డగోడలపైనుండి చావిడివైపు భయంగా చూడసాగారు.

పోలీసులు, నాయకులు కంఠీరవాన్ని, కొమరయ్యను వెంటతీసికొని బయలుదేరారు. ప్రచారకుడు, హైదరలీ, మతం మారిన వాండ్లను వెంట తీసికొని హరిజనవాడకు వెళ్ళారు. గొండ్ల ముసలి దిక్కులు చూచుకుంటూ వెళ్ళి, ఇంటి బయట అరుగుమీద ఆలోచిస్తు కూర్చున్నాడు.

మత నాయకులు, జమేదారు కచ్చడంలో కూర్చున్నారు. కంఠీరవానికి, కొమరయ్యకు కలిపి కట్టినతాడును పట్టుకొని ఇద్దరు జవానులు కచ్చడం వెంట నడువ సాగారు. వాండ్లు ఊరువదిలి పోతుంటే ఊరంతా బావురు మన్నట్టుండి, భయంతో కంపించి పోయింది. ఆరోజు సాయంత్రం వరకు గ్రామవాతావరణం ఉక్కిరి బిక్కిరిగా తోచింది. తర్వాత మెల్లగా ఒక్కొక్కరు ఇండ్ల నుండి బయటికి వచ్చి గుస, గుసలు, గొణుగుడులు ప్రారంభించారు. వెంకటాద్రి గడీలోకిచేరుకున్నాడు. రామభూపాల్‌రావుతో సమాలోచనలు సాగించాడు.

దిమ్మెగూడెంలో మత పరివర్తన జరుగక ముందు. యక్రిగుట్ట నుంచి రామభూపాల్‌రావు వియ్యంకుడు ఉత్తరం రాసినపుడు రామభూపాల్ రావు, వెంకటాద్రి కలిసి, భావికార్యక్రమం గురించి వేసుకున్న పథకాలకు, మత పరివర్తన జరిగినప్పటి పరిస్థితికి ఎంతో భేదంకలిగింది. అప్పుడు కేవలం స్థానికంగా రైతులను తమవైపు చేసికోవడం మొదటిపనిగా తల చారు. కాని ఇప్పుడు కొమరయ్య, కంఠీరవం నిర్బంధింపబడటం ఒక సమస్యగా తోచింది. కంఠీరవానికి బద్ధవిరోధియైన వెంకటాచార్యులు రామ భూపాల్‌రావు నమ్మిన బంటు. కొమరయ్య రామభూపాల్‌రావు ఆగ్రహానికి గురియైనవాడు. హైదరలీకి వ్యతిరేకంగా గ్రామవాతావరణం కల్పించాలె. తురకలుగా మారిన హరిజనులకు నీళ్లు పుట్టకుండా తిప్పలు పెట్టి ఒత్తిడి తేవాలె. ఇవి రామభూపాల్‌రావు, వెంకటాద్రి ముందున్న సమస్యలు, అంతేగాక కంఠీరవం, కొమరయ్యలపై మోపిన నేరాలుకూడా సామాన్య మైనవికావు. రాజద్రోహనేరాలు, హైదరాబాదు సంస్థానములో బహుశః మొదటి రాజద్రోహనేరము. అప్పటికప్పుడు వెంకటాద్రి ఏమీ తేల్చలేక పోయాడు. "ఆలోచిద్దాం" అని వెంకటాద్రి గడీని వదిలి పోయాడు.

"కంఠీరవం సామాన్యుడుకాదు. తనేకాక, ముక్కు ముఖమెరుగని కొమరయ్యను కూడా బాగానే సిద్ధం చేశాడు. ప్రభుత్వమంటే లక్ష్యం, భయంలేకుండా వేళ్లమీద తీసిపారేశాడట" రామభూపాల్‌రావు వెంకటా చార్యులతో అన్నాడు.

కంఠీరవాన్ని రామభూపాల్‌రావు అవిధంగా పొగడటం వెంకటా చార్యులకు ఆశ్చర్యంవేసింది. తనకు గిట్టనివాడిని శ్లాఘించడం అతనికి సహింపుకాలేదు. "అయితే ఏమవుతుందంటారు?" వెంకటాచారి ఫలితాన్ని తేల్చుకుందామని అడిగాడు.

"ప్రభుత్వం తలచుకుంటే ఏమైనా అవుతుంది." రామభూపాల్ రావు ఆలోచనాధోరణిలో అన్నాడు. "చూడాలె ఆఖరు కేమవుతుందో!" రామభూపాల్‌రావు, ఒక నిట్టూర్పు విడిచాడు గడీలోకి వెళ్ళి పోయాడు.

వెంకటాచార్యులు సందిగ్ధంలో పడ్డాడు. ఏమీతోచక ఇల్లు చేరుకున్నాడు.

ఇంట్లో భార్య, తల్లి బేరుపోయి కూర్చున్నారు. వెంకటాచార్యులు ఇంటికి రాగానే, "తమ్ముడిని చూచావురా?" తల్లి పట్టలేక అడిగింది. "వచ్చింది సరిగా తెలియనే లేదు. ఇంతట్లకె ఈ అల్లరి బయలు దేరింది. ఊళ్ళోకి వచ్చిన వాడు కనబడి కూడా పోడాయె.కండ్లతో చూడటానికి కూడా నోచుకోనైతిని" భార్య తాయమ్మ పశ్చాత్తాపం పడ్డది.

"ఏమిటో అవి నెత్తికే ఎక్కడంలేదు. దొర అటువంటివాడు, తలుపులు పెట్టుకొని, కదలకుండ ఇంట్లో కూర్చున్నడు. మరి వాని మొండిధైర్యమేందో, వాడేందో, ఆ వచ్చిన వాండ్లతోన నీవెంత అంటే నీవెంత అని వాదన మొదలు పెట్టిండట. మరి వాండ్లు ఊరుకుంటారు? పట్టుకపోయిరి." వెంకటాచార్యులు సమాధానమిచ్చాడు. "దొరవారు, వెంకటాద్రి ఆలోచనలు చేస్తున్నరు. ఏమవుతుందో చూడాలె" మంచంలో కాళ్ళు చాచి పడుకుంటు వెంకటాచార్యులు అన్నాడు.

మహమ్మదీయులుగా మారిన హరిజనులు జీతగాండ్లుగా పనిచేయడానికి వెనుకముందాడారు. అయితే ఏమీపని చేయకుండా ఎన్నాళ్ల ఏవిధంగా బ్రతకడం? వెంటనే చదువులు, ఉద్యోగాలు. భూములు పొందడం సంభవమా? ఏభూములు, ఏవిధంగా లభిస్తాయి? ఎవరివల్ల ఎవరివి, ఎప్పుడు, ఏవిధంగా భూములు హరించ బడ్డాయి? ఇవన్నీ ఆలోచిస్తున్నా కొద్దీ అంతు దొరకని సమస్యలు, దిమ్మెగూడెంలో ఉంచిన మత ప్రచారకునికి హరిజనవాడలో ప్రత్యేకంగా ఒక పాకవేసికొని హైదరాబాదీ పర్యవేక్షణలో ఉన్నాడు, క్రమంగా, పటేండ్లు, పట్వారీలు మహమ్మదీయులే అవుతారని, వ్యాపారాలు, నేతపని మొదలగు పనులన్ని హిందువులకు బదులు మహమ్మదీయులే చేస్తారని అతనికి తోచినవి, ఊహించినవి హరిజనులకు చెప్పసాగాడు. వెంట తెచ్చిన కొంత డబ్బుతో కొన్నాళ్లు సహాయం చేశాడు. రెండోవైపు కొందరు రైతులు కొత్తగా జీతగాండ్రను ఏర్పాటుచేసు

కున్నారు. మహమ్మదీయులైన హరిజనులు గ్రామంలోకి పనిఉండి వెళ్లితే కొందరు గంభీరంగా ఉండేవారు. కొందరు బీరుపోయిచూచేవారు,

"జీతానికైతే రావడంలేదు. సరే, అది నీయిష్టం. కాని తీసుకున్న కాడికి లెక్కచేసుకొని వచ్చేదుంటే ముట్టచెప్పు" ఒక రైతు మందలించాడు.

"అయితే చెప్పవు ముత్తా? ఖర్మంగాల. ఇప్పుడు నీపేరేం పెట్టినోగ్రి మరి, ఇగమీరు, జీతాలకు, నాతాలకు, తెగలకు, కళ్లాలకు యెళ్ళనట్లేనా? మీకేం తోచిందోగని నాకు మాత్రిం మీరు చేసిన పని పసందుగాలె." దుకాణములోకి ఉప్పు, మిరపకాయ కొనవచ్చిన ఒకనితో కోమటిశంభయ్య అన్నాడు.

మొత్తంపై గ్రామంలో అస్పష్టంగా ఓ విధమైన అసంతృప్తి అసహ్యం ఏర్పడింది.

గ్రామ ప్రజల భావాలు, హరిజనవాడ పరిస్థితి ఎప్పటికప్పుడు వెంకటాద్రి తెలిసికుంటూనే ఉన్నాడు. ఒకసారి రైతు చంద్రయ్యను ఇంటికి పిలిపించుకొని, అంతుకనుక్కోడానికి ప్రయత్నంచేశాడు.

"చెప్పవు చంద్రయ్యా! ఎన్నడులేంది కొత్త, కొత్తయిచూడబట్టిమి. ఎప్పుడన్నా, మన తాతల, తండ్రుల కాలంలో ఇట్లైందని విన్నాం? తెలియకడుగుత, ఈ మాదిగోళ్ళు జీతాలు, నాతాలు, తెగలు, కళ్ళాలు మానుకొని ఏంచేస్తరట. ఏమాలోచనలు చేస్తున్నరో, ఏమన్న తెలిసెనా?" వెంకటాద్రి సంభాషణ మొదలు పెట్టాడు.

"ముందు ఎట్టైట్లైతదో నీకంటె నాకే తెలుస్తదనుకుంటున్నవా? నేనైతే అదంతా ఆలోచించలె. జీతానికి నాదగ్గర బొక్కల తొంటని కొడుకు లచ్చిగా డుండేది. రెండు రోజులురాలేదు. అన్ని సూత్తునే ఉంటిమి, వస్తవా, రావా? అని అడిగేదేందని, తెనుగోల్ల పోరడ్ని మాట్లాడుకున్న. కోతలు, కళ్లాల రోజులు. ఊర్కె యెత్తదా!" చంద్రయ్య సమాధాన మిచ్చాడు.

"మరి మొగోళ్ళ ఇండ్లల్ల కూసొని ఆడోళ్లను మాత్రిం కూళ్ళకు పంపుతున్నరు. ఇందేందట" వెంకటాద్రి మళ్లా అడిగాడు.

చంద్రయ్య ఏదో చెప్పుదామని అనుకుంటుండగానే, "జుట్టు బొట్టు, మొలతాడు లేంది మన కళ్ళాల్లోకి వస్తే పొలితిరుగనిస్తమా మరి! ఆ ఆడో ళ్ళను మాత్రం కూలికెందుకంట పిలిచేది?" వెంకటాద్రి అన్నాడు.

"నిజమేమరి. మీరేమో ఇటువంటి వఖ్తున చేతులు ముడ్సుక కూకుం టరి. మేం నోట్ల నాలుక లేనోళ్ళం. మేం ఏమనుకుంటే మాత్రిం ఏంసాగు తది" అంటూ చంద్రయ్య లేవబోయాడు.

"మీరుకూడా ఆలోచించుకోరి. ఏదోదోవ కనిపెడ్తాం" వెంకటాద్రి ఆలోచనా ధోరణితో అన్నాడు.

చంద్రయ్య లేచి పోతుండగా, వెంకటాద్రి, పిలిచి, "కొమరయ్య సంగతేమన్న తెలిసిందా?" అన్నాడు.

"ఎవరికి, ఎట్ల తెలుస్తది? చచ్చింది బతికింది ఏది తెలియలేదు ఏమైతదో, ఏంపాడో!" చంద్రయ్య విచారంగా అన్నాడు.

"ఓ పూట నిజామాబాదుకు పోయిరారాదు? అక్కడి సంగతులన్నా తెలుస్తయి." వెంకటాద్రి ఓరకంటచూస్తు అన్నాడు.

"మేం పోతే ఎవరు కంటరు. మీ అసుంటోళ్ళు, కచ్చేర్లు తిరిగి నోరుపోతే అతిగతి ఏమన్న తెలుస్తది" చంద్రయ్య అన్నాడు.

చంద్రియ్య దారిలోకి వచ్చాడని వెంకటాద్రి గ్రిహించాడు. "నన్ను పొమ్మంటవా?" గంభీరంగా అడిగాడు.

"ఇంకా అనుమానమా? ఉన్న ఊళ్ళ చదువొచ్చినోళ్లు ఇసుంటి వఖ్తున పనికిరాకపోతే ఎట్లమరి!" చంద్రియ్య వింతగా వెంకటాద్రిని చూస్తు అన్నాడు.

"అట్లైతె సరే. కాని ఒక సంగతి. మరి మాదిగగూడెం సంగతి మీరైతులంతా కట్టుమీదికి వచ్చి ఆలోచించాలె. మీవాండ్లతో నాకంటె నువ్వు

మాట్లాడటమే బాగుంటది. సరే! నిజామాబాదుకు పొయ్యే సంగతి రేపు చెప్తనీకు" అన్నాడు వెంకటాద్రి.

చందర్య్యా ఇంటితోవ బట్టాడు. వెంకటాద్రి గడీలోకి వెళ్లాడు. చంద్రయ్యతో జరిగిన సంభాషణా వివరాలు రామభూపాల్‌రావుకువివరించాడు.

వెంకటాద్రిపై చంద్రయ్య విశ్వాసం ప్రకటించటం రామభూపాల్ రావుకు సంతోషమైంది. వెంకటాద్రి నిజామాబాదుకు వెళ్ళి కంఠీరవానికి, కొమరయ్యకు అయ్యే సాయంచేయాలని, వాండ్లకు బలంగా తాను, ఇతర ప్రజలు ఉన్నారని చెప్పాలని రామభూపాల్‌రావు వెంకటాద్రికి చెప్పాడు.

కొమరయ్య తల్లిని, భార్యను తీసికొని నిజామాబాదుకు వెళ్ళ వలసిం దని, తానుకూడా వస్తున్నానని వెంకటాద్రి చందర్య్యకు చెప్పాడు.

కంఠీరవాన్ని, కొమరయ్యను తీసికొని అంజుమన్ నాయకులు, పోలీసులు నడిపించుకుంటూ నిజామాబాదుకు తీసుక వెళ్లారు. దోవలో అంజుమన్ నాయకులు ధీమాతో మాట్లాడేవారు. కంఠీరవాన్ని రెచ్చకొట్ట డానికి ప్రయత్నించేవారు.

"ఏమనుకున్నవ్? మహమ్మదీయులతో రుద్దుకోవడం తమాషాకాదు" జిల్లా నాయకుడు బొమ్మలు ఎగరవేస్తు అన్నాడు.

"మీరు మహమ్మదీయులమని అనుకుంటున్నారా? నేను మిమ్ముల మహమ్మదీయ మతానికి శత్రువులంటాను." కంఠీరవం బుసకొడ్తూ అన్నాడు.

"అయితే నీవంటి కాఫిర్లు మహమ్మదీయులా?" అంజుమన్ కేంద్ర నాయకుడు ప్రశ్నించాడు.

"ఇస్లాం అంటే శాంతి. శాంతిని కోరి, సత్యానికి పాటుపడే ఏమత మైనా నాకు సమ్మతమే. కాని మీరు మీమతాన్ని శాంతికి ద్రోహం చేసేదాని వలె మార్చినారు." కంఠీరవం దీరాలు తీస్తుఅన్నాడు.

"నోరు మూసుకొని నడువవోయ్! చాలాపెద్దిరికం చేయబోతున్నావ్?" జమేదారు బెదిరిస్తు అన్నాడు.

కొమరయ్య పరి, పరి విధాలా ఆలోచించసాగాడు. కంఠీరవం ధైర్యానికి నిబ్బెర పోయాడు.

"నువ్వు సనాతనుడివి కదా! ఆర్యసమాజం గాలి ఎట్లాతగిలింది?" అంజుమన్ కేంద్రనాయకుడు ఆలోచనా ధోరణిలో అడిగాడు.

"మీకు పచ్చకామెర్ల రోగం పుట్టింది. మీకువ్యతిరేకమైన వాండ్లంతా ఆర్యసమాజీయులని అంటున్నారు. కుక్క కాటుకు చెప్పు దెబ్బవలె మీకూ వాండ్లకు బాగా జోడు కుదిరింది. మీరు మీపిచ్చి చేష్టలు మానుకోక పోతే, ఇంకా ఎటువంటివాండ్లు పుడుతారో చూస్తుండండి. మీరు బుద్ధికలిగి, తెలివితో వ్యవహరించక పోతే మీఅంతట మీరే నాశనమై పోతారు. మహమ్మదీయ మతానికి మీవంటి మూర్ఖులు చేస్తున్న ద్రోహంతో ఇంత వరకు కలిగిన అప్రతిష్ట ఇంకా పెరిగిపోతుంది. నేటి మీ చర్యలకు మీరే సిగ్గుపడి. చెప్ప నలవికాని, ఊహించజాలని నష్టాలకు, కష్టాలకు గురి అపుతారు" కంఠీరవం ఉక్రోషంలో ఇంకా మాట్లాడ పోతుండగా, జమేదారు రౌద్రంతో కచ్చడం దిగి, కంఠీరవం రెండు చెంపలు వాయించాడు.

"నేనప్పటి నుంచి ఇదే అంటున్నాను. మీరు ఇంతకంటె ఇంకేమి చేయజాలరు." కండ్లనిండా నీళ్ళు కారుతుండగా ప్రతీకారంతో అన్నాడు. కొమరయ్య నిస్సహాయుడుగా బిక్కముఖంవేసి, పిచ్చివానిలా చూడ సాగాడు.

అంజుమన్ కేంద్రనాయకుడు ఆతురతతో కచ్చడందిగి, జమేదారును వారించి, కోపంతో కంఠీరవాన్ని చూచాడు. "ఒక విషయం చెప్తున్న, బాగావిను. నీవు నీస్థితిని మరచి మాట్లాడుతున్నావు. నీవు నిర్బంధంలో ఉన్నావని, రాజద్రోహివని తెలిసికో. నీ ప్రవర్తన నిన్నింకా బాధల పాల్జే స్తుంది. ఆపైన నీయిష్టం" అంటూ జమేదారును చేతితో తోసుకుంటూ కచ్చడ మెక్కాడు.

"చెప్పు దెబ్బలు తింటూ, గులాములోలై పడిఉన్న మాదిగోండ్లు ఆత్మ గౌరవం, సంఘమర్యాద పొంది ఉండటం ఈబాపనోడికి సహింపరాకుండా ఉంది" జిల్లా నాయకుడు తన అభిప్రాయం ప్రకటించాడు.

"నేను మీమీద మోపుతున్న నేరాలుగాని, ఊహించుతున్న ఫలితాలుగాని తప్పని చెప్పే ధైర్యం మాత్రం మీలో ఎవరికిలేదు అవకాశం దొరికిందని దౌర్జన్యం చేస్తున్నారు. ఇతరులు హరిజనులను అణగదొక్కుటే మీ ఈ కార్యక్రమానికి మూలకారణమైతే, ఆ హరిజనులకు మీరు ఒరగపెట్టేది కూడా ఏమీలేదు. వాండ్ల గతి ఇట్లా చేస్తేఅసలేమారదు." తిరిగి కంఠీరవం సమాధాన మిచ్చాడు.

"ఎంత మొండోడు. ఎంత చెప్పినా నీకు బుద్ధిరావడం లేదు. నీమంచికే చెప్తున్న. ప్రాణంతో బ్రతకదలచుకుంటే నోరు మూసికొని ఊరుకో." క్రూరంగా కంఠీరవాన్ని చూస్తు అంజుమన్ కేంద్రనాయకుడు అన్నాడు.

కంఠీరవం ముసి, ముసిగా నవ్వాడు.

"నిజామాబాదుకు చేరింతర్వాతగాని వీనిపని పట్టను. నాసంగతి, నాప్రభుత్వం సంగతి అప్పుడుగాని వీనికి తెలియదు" జమేదారు తలకాయను ఊపుతూ గొణిగాడు.

"మీ వంటిమదం అట్లా ఉంది, ఎవరేం చేస్తారు?" తనలో తాను గొణుగుకున్నాడు కంఠీరవం.

ఇంతలో ఒక ఊరుచేరారు. అంజుమన్ నాయకులు ఆఊళ్లో ఉండిపోయారు. వారితో ఇద్దరు పోలీసుల ఉంచి, మిగతా పోలీసులతో కంఠీరవం, కొమరయ్యలను తీసికొని జమేదారు నిజామాబాదుకు చేరుకున్నాడు.

వెంటనే జిల్లాన్యాయాధిపతి వద్దికి తీసికెళ్ళి వారం రోజుల వరకు తమ ఆధీనములో ఉంచాలని పోలీసులు కోరారు. న్యాయాధిపతి అంగీకరించాడు.

కంఠీరవాన్ని, కొమరయ్యను పోలీసులు తమనిర్బంధములో ఎన్నో హింసలకు గురిచేశారు. వారం రోజుల వరకు ప్రతినిత్యము మధ్య రాత్రి వారిద్దరిని ఒక చీకటి గదిలోవేసి తీవ్రంగా కొట్టడం, రహస్యస్థలాల్లో కారం పెట్టడం, బోర్ల పడుకోబెట్టి చేతులపై మంచంకోళ్లుమోపి మంచంపై అయి దారుగురు పోలీసులు గంతులు వేయడం, నోట్లో మూత్రం పోయడం, ఒకరి మూత్రం ఇంకొకరి నోట్లో పోయించడం. తలకు తాడుచుట్టి గట్టిగా వడిపెట్టడం, చేతివేళ్ళ మధ్య కట్టెలు ఇరికించి గట్టిగా వత్తడం, నడుముకు తాడు కట్టి ఆ గోడకు, ఈ గోడకు కొట్టడం— ఈవిధంగా పోలీసులు తోచి నట్లల్లా హింసించారు. కంఠీరవాన్ని కొమరయ్యతో వేరుచేసి కొన్నాళ్లు ఉంచారు. కంఠీరవం ఎన్ని హింసలనైనా గుండె నిబ్బరంతో సహించాడు. ఆ ఘటనలన్ని తనకు పాఠాలుగా గ్రహించాడు. కొమరయ్య హింసలకు తట్టు కోలేదు. అతని బలహీనతలను ఉపయోగించుకొని కంఠీరవానికి వ్యతిరే కంగా తిప్పాలని పోలీసులు అతని కెన్నో దుర్బోధలు చేశారు. కొమరయ్య హృదయంలో కంఠీరవంపై గౌరవంతగ్గలేదు- పైగా కంఠీరవం ఆత్మవిశ్వా సానికి ఇంకా ప్రభావితుడైనాడు.

ఒకనాడు కంఠీరవం, కొమరయ్యలు కాళ్ళకు, చేతులకు బేడీలతో న్యాయస్థానానికి తేబడ్డారు. ఆ రోజు న్యాయస్థానం జనంతో కిట, కిట లాడింది.

"న్యాయస్థానంలో మాకు కూర్చునేసౌకర్యం కలిగించాలె" కంఠీరవం న్యాయాధిపతిని అడిగాడు.

"ఇది న్యాయస్థానము. నేను మహాఘనతవహించిన నిజాం ప్రభు వునకు ప్రతినిధిని. నిజాం ప్రభువు ఎదుట కూర్చొన తలచితివా?" న్యాయాధి పతి ప్రశ్నించాడు.

"ప్రజలకు మర్యాద చేస్తే ప్రభువుల ఘనతకు లోటు వస్తుందని నే ననుకోను. ప్రజలు కోరకముందే ప్రజలకు సౌకర్యాలు కలిగించడం ఉత్తమ ప్రభుత్వ లక్షణం."

న్యాయాధిపతికి పక్కనే కూర్చొని ఉన్న ఉద్యోగి బొమ్మలు ముడి పెట్టాడు. కొందరు వకీళ్లు ఒకరి నొకరు వింతగా చూచుకొని గంభీరంగా తలలు నేలకు వేశారు.

ఒక మహమ్మదీయ వకీలు ఒకహిందూ వకీలును ప్రతీకార దృష్టితో కొద్దిసేపు చూచాడు. "నీవు తెరవెనుక నాటక మాడుతున్నావు. ఒకనాడు కాకపోతే ఒకనాడైనా నీపని పట్టకపోతాం"అన్నట్లున్నవి అతని చూపులు.

"నిందితుని యెడల అవలంబించాల్సిన పద్ధతులు న్యాయస్థానానికి తెలుసు." న్యాయాధిపతి కుర్చీలో సదురుకొని కూర్చుంటూ అన్నాడు.

"నన్ను నిందితుడనని అప్పుడే నిర్ణయించారన్న మాట. అయితే ఇక విచారణ దేనికి? మమ్మలను ఇంతవరకు తీసుకరావడం, విచారణపేర ఈ నాటక మాడటం ఎందుకు?" అని కంఠీరవం గంభీరంగా కోర్టునంతా కలయ చూచాడు.

న్యాయాధిపతి తత్తర పడ్డాడు. "పోలీసులు నిందితులుగా భావించి న్యాయస్థానానికి తెచ్చారు. పోలీసులు మోపిన నేరాలయొక్క నిజానిజాలు సప్రమాణముగా తేల్చివేయడం న్యాయస్థానం విధి."

"అయితే మా మీద నిందమాత్రమే ఉందన్నమాట. నేరస్థులము కామన్నమాట."

కోర్టులో గుస, గుసలు, గొణుగుడు ప్రారంభమైంది.

"మీరు అయినా, కాకపోయినా మీ విషయంలో ఏవిధంగా, ఏమి చేయాల్సింది న్యాయస్థానానికి తెలుసు. నీవు నేర్పాల్సిందేమిలేదు. ఇక విచారణ ప్రారంభమవుతుంది''అని న్యాయాధిపతి కాగితాలు తిరగవేయ మొదలు పెట్టాడు.

''మీ విచారణలో మేము ప్రేక్షకుడిగా మాత్రమే ఉండవలెనా? మా విషయమేదైన చెప్పుకోవచ్చునా?"

ఇంతలో పోలీసు వకీలులేచి, "నీవు నీ గురించి మాత్రం మాట్లాడాలె. కొమరయ్య వైపున పైరవీ చేయ వీలులేదు." అన్నాడు.

"కొమరయ్య వైపున మీరెట్లా మాట్లాడుతున్నారు?" కంఠీరవం వెంటనే అందుకున్నాడు.

న్యాయాధిపతి పోలీసు వకీలును కూర్చోమని సైగ చేశాడు.

"నీవేమైన చెప్పతలచుకుంటే తర్వాత నేనడిగినప్పుడు చెప్పవచ్చును. కాని అనవసరమైన ప్రశ్నలతో, వాదనతో న్యాయస్థానము యొక్క విలువ గల సమయాన్ని వృధాపుచ్చవద్దు"అని న్యాయాధిపతి పోలీసు వకీలు వైపు చేతులు చాపాడు.

పోలీసు వకీలు న్యాయాధిపతికి కాగితాల నందించి, మాట్లాడబోతుండగా కంఠీరవం, న్యాయాధిపతి నుద్దేశించి, "మీ విచారణ ప్రారంభం కాక ముందు, నేనొక ముఖ్య విషయం చెప్పదలచుకున్నాను" అన్నాడు.

పోలీసు వకీలు "చెప్పతలచుకున్నది తర్వాత చెప్పాలని ఒకసారి చెప్పితే అర్థంకాలేదా?"అని అధికార ధ్వనిలో అన్నాడు.

"మీరు అనవసరంగా నా విషయంలో జోక్యం కలిగించుకుంటున్నారు. నేను న్యాయాధిపతి నుద్దేశించి మాట్లాడుతున్నాను. ఇగ నేను చెప్ప తలచుకున్నవిషయం. పోలీసులు మమ్ములను నిర్బంధములో ఉంచుకున్నన్నాళ్ళు చెప్పరాని హింసలకు గురిచేశారు. నీచమైన విధానాలు అవలంబించారు. మా చావు బ్రతుకులు వారి దయాధర్మానికి వదలివేయ బడ్డాయి. వారి క్రూరత్వము విచారించితే మీకేఆశ్చర్యం కలుగుతుంది.' ఇప్పుడే, మీ ఎదుటనే మీ ప్రభుత్వ డాక్టరుతోనే మమ్ములను పరీక్ష చేయిస్తే మా స్థితి మీకు తెలిసిపోతుంది."

"ఇప్పుడు విచారణలో ఉన్న అభియోగానికి, నీవు చెప్పే విషయానికి సంబంధంలేదు. నీవు అవసరమని తలిస్తే పోలీసులపై ప్రత్యేకంగా వేరొక అభియోగంపెట్టే స్వాతంత్ర్యం నీకున్నది. నీకు న్యాయస్థానంలో

అందరికి వలెనే న్యాయం లభిస్తుంది"అని నిర్లక్ష్యంగా న్యాయాధిపతి పోలీసు వకీలు వైపు ముఖం తిప్పాడు.

పోలీసు వకీలు వాదన మొదలు పెట్టాడు.

"ప్రభూ !

మొదటి నిందితుడు వి. కంఠీరవం వల్ద్ రఘునాధాచార్యులు, దిమ్మెగూడెం గ్రామంలో చావిట్లో బహిరంగ ప్రదేశములో గొంతెత్తి ప్రభుత్వాన్ని ధిక్కరిస్తూ మాట్లాడాడు. మహోఘనత వహించిన ప్రభువును, చట్టబద్ధమైన ప్రభుత్వాన్ని దూషించాడు. రెండవ నిందితుడు గొట్టం కొమరయ్య వల్ద్ కోటయ్య దిమ్మెగూడెం గ్రామంలో హిందువేతరులైన వాండ్లు శాంతియుతంగా తమ మత ప్రచారం చేసుకుంటుంటే, అడ్డువచ్చి, ఇతరుల మతాధికారాన్ని ధిక్కరించాడు. పైగా ప్రధాన మంత్రి హిజ్ఎక్సెలెన్సీ రైట్ఆనరబుల్ నవాబ్ సర్ హైదర్ నవాజ్ జంగ్ బహద్దుర్ గారిని, వారునిర్వహిస్తున్న ప్రభుత్వాన్ని హేళనగా అపహాస్యం చేశాడు. శాంతి స్థాపనకై దిమ్మెగూడెంలో ఉన్న పోలీసు సిబ్బంది విధ్యుక్త కర్తవ్యం నిర్వహించుటలో అడ్డంకులు కల్పించారు. కాబట్టి వీరిరువురిపై ఐ. పి. సి. సెక్షన్ 124 (ఏ) కు సమానమైన తాజీరాత్ ఆసఫ్యా దఫా 82 క్రింద, రాజద్రోహ నేరము విచారణ జరిపి, గుణపాఠముగా శిక్షించాలని, వీరి కవ్వబడే శిక్ష ఎల్లరికి హెచ్చరికగా ఉండాలని ప్రార్థిస్తున్నాను"అని ముగించాడు.

"ఇంకొక విషయము" ప్రాసిక్యూటర్ తిరిగి మొదలు పెట్టాడు. "మొదటి నిందితుడు కంఠీరవం దిమ్మెగూడెం వదలిపెట్టి ఇల్లు, ముంగిలి లేక ఆవారావలె ఈ ఊళ్లోనే చాలాకాలంనుంచి ఉంటున్నాడు. తోడబుట్టిన అన్నకు శత్రువు. ఆగ్రామం దేశముఖు అయిన రామభూపాల్‌రావుగారిపై ఈ రెండవ నేరస్థుడైన గొట్టం కొమరయ్య నాయకత్వాన గ్రామరైతులను ఉసికొల్పడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఎన్నాళ్ళనుండో ఆ గ్రామంతో సంబంధం వదులుకొన్న ఈ మొదటి నేరస్తుడు, కేవలం గ్రామంలో అశాంతిని రేకెత్తించడానికి, హిందూమహమ్మదీయ వైషమ్యాలు కలిగించడానికి,

సరిగా పేరేమతం వాండ్లు ప్రచారంకోసం ఆ గ్రామం వెళ్లిన్నాడే వెళ్ళాడు. పేరేమతం వాండ్లు సహనము ప్రదర్శించక పోయినా, పోలీసు సిబ్బంది లేక పోయినా ఆ రోజు తీవ్రమైన హిందూ మహమ్మదీయ సంఘర్షణ జరిగేది. దాని వల్ల ప్రభుభక్తితో, దేశభక్తితో శాంతంగా సుఖజీవనం గడుపుతున్న ఆ గ్రామంలో విషవాతావరణం ఏర్పడేది. ప్రభువులు ఈ విషయాలన్నిటిని విచారణలో దృష్టిలో ఉంచుకోవాలని నివేదించుకుంటున్నాను" అని కొన్ని కాగితాలు న్యాయాధిపతికి అందించాడు.

"మాపై మోపిన ఆ నేరానికి సంబంధించిన దఫాను చూడదలచాను" అన్నాడు కంఠీరవం.

న్యాయస్థానోద్యోగి కంఠీరవానికి పుస్తకం అందించాడు. పుస్తకం తిరగవేసి, ఒకటి రెండు సార్లు దఫాను చదివాడు. ఇంతలో న్యాయాధిపతి కంఠీరవాన్ని చూస్తు "పుస్తకం చివరలో పట్టికఉంది అది-చూడు" అన్నాడు.

కంఠీరవం కృతజ్ఞతా పూర్వకంగా న్యాయాధీశుడ్ని చూచి, పట్టికను పరిశీలించాడు.

"ఈ నేరంలో పైనుండి ప్రభుత్వ ఆజ్ఞలేనిది నిర్బంధించ చేయడానికి వీలులేదే?" న్యాయాధిపతిని కంఠీరవం ప్రశ్నించాడు.

న్యాయాధిపతి ఆతురతతో కంఠీరవంనుండి పుస్తకాన్ని అందుకొని చూచాడు. ఆలోచనాధోరణిలో ఆ పుస్తకాన్ని పోలీసు వకీలుకు అందించాడు. పోలీసు వకీలు చదువుకొని తలనేలకువేసి కొద్దిసేపు ఆలోచించాడు.

"ప్రభూ!

నేను ఇదివరకే మనవిచేసినటుల వీరిని నిర్బంధించి నప్పుడు గ్రామ వాతావరణం చాలా ఉద్రిక్తంగా ఉండింది. అట్టి స్థితిలో నిర్బంధించక పోవడం ఎంత ప్రమాదమో మీరూహించవచ్చును. పుస్తకంలో ఆవిధంగా ఉండటం అచ్చుతప్పని భావిస్తున్నాను" అన్నాడు.

న్యాయాధిపతి ఫక్కునవ్వాడు. "సరే వీండ్లను రిమాండులో ఉంచండి" అంటూ ఫైలుపై వ్రాశాడు. ఆ నాటి విచారణ ముగిసింది.

కంఠీరవం, కొమరయ్యను న్యాయస్థానము బయటకి తీసికెళ్ళారు. న్యాయాధిపతి పోలీసు వకీలు దగ్గరికిపిలిచి, "ఇప్పటికి మించిందేమీలేదు. వచ్చే పేషీలోగా ప్రభుత్వాజ్ఞను తెప్పించండి" మెల్లగా అన్నాడు.

"ఎవరికి వినబడలేదుగదా!" అన్నట్టు ముందు కూర్చున్నవాండ్లను దోషిగాచూచాడు న్యాయాధిపతి.

కంఠీరవం, కొమరయ్య జేయిలో రిమాంన్డ్ చేయబడ్డారు.

దిమ్మెగూడెంనుంచి వెంకటాద్రి నిజామాబాదుకు వచ్చి అభియోగ విషయమై కొంచరి వకీళ్ళతో మాట్లాడాడు. కాని ఏ వకీలుకూడా సాహ సించి ముందుకురాలేదు.

"హైదారాబాదులో ఎవరైనా సిద్ధంకావచ్చు" ఒకవకీలు సలహా చెప్పాడు. వెంకటాద్రి అది భారమైన విషయమని గంభీరించి ఊరుకున్నాడు. ఆ అభియోగం విషయంలో ఏ విధమైన జోక్యంకలిగి ఉన్నట్టు ప్రభుత్వా నికి తెలిసినా ప్రమాదమేనని వెంకటాద్రి విని గాభరాపడ్డాడు. చంద్రయ్య తనతో అన్నమ్మను, కొమరయ్య భార్య కనకమ్మను తీసికొని నిజామా బాదుకు వచ్చాడు. చందరియ్యతో వెంకటాద్రి కలిసాడు. పరిస్థితులను తెలి పాడు. జేయిలో కొమరయ్యను కలిసికొనే ఏర్పాటుచేసి, బతుకుజీవుడా యని వెంకటాదిరి దిమ్మెగూడెం చేరుకున్నాడు.

జేలువాంన్లు చంద్రయ్యను కొమరయ్యతో, కలిసికోనివ్వలేదు. అన్నమ్మ. కనకమ్మమాత్రం కలిసి, క్షేమసమాచారాలు తెలిసికొన్నారు. కొడుకు కోట య్యను చూడగానే కొమరయ్య కండ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. దుఃఖం ఉప్పొంగివచ్చింది. జేలు జవాన్ను మంచిచేసికొని, కొడుకును ఎత్తుకొని, హృదయానికి హత్తుకొని క్షణంసేపు మహానందాన్ని అనుభవించాడు. నిస్సహాయుడుగా భార్యను చూచాడు. అన్నమ్మ ఏడ్వటమేతప్ప ఎక్కువ మాట్లాడజాలలేదు. "అయ్యగారు బాగున్నాడా? నువ్వు ఆయన ఒక తానే ఉన్నారా?" గద్గదస్వరంలో అన్నమ్మ అంది.

కనకమ్మ పరీక్షగా కొమరయ్యను క్షణంపాటు గంభీరంగాచూచి, ఉప్పొంగివస్తున్న దుఃఖాన్ని కొడుకు గదుమకింద దాచుకుంది. "ఏడ్వకు కొడుక" అని తన ఏడ్పును తగ్గించుకుంది.

"ఆఖరుకు ఏ మైతదో," అన్నమ్మ ఆవేదనతో అడిగింది.

"ఎట్లచెప్పొస్తది" దీనంగా అన్నాడు కొమరయ్య.

"వెంకటాద్రయ్య, దొర మీకు సాయంచేయాల్నని అనుకున్నరట, చంద్రయ్య బావ అన్నడు. వెంకటాద్రయ్య ఈడికివచ్చిండట! మరి ఉన్నడో పోయిండో" మెల్లగా భయంతో అన్నమ్మ చెప్పింది.

కొమరయ్యకు ఆమెమాటలు వింతగా అనిపించాయి. ఇంతలో జేలు జవాను వచ్చి సమయం ముగిసిందని కొమరయ్యను లోపలికి పంపించాడు. అన్నమ్మ, కనకమ్మ వెనుకకు తిరిగి, తిరిగి చూచుకుంటూ వెళ్ళిపోయారు.

వారం రోజులకు తిరిగి అభియోగం విచారణ ప్రారంభమైంది. పోలీసులపక్షాన, హైదరలీ, ఇద్దరు హరిజనులు సాక్ష్యులుగా విచారింపబడ్డారు.

"సాక్ష్యలను ఏమైనా ప్రశ్నిస్తావా?" న్యాయాధిపతి అడిగాడు.

"సాక్ష్యలను ప్రశ్నిస్తాను. అంతటితోపోదు. ఈ నాటక మాడ్తున్న మీ ప్రభుత్వ నిర్వాహకులను కూడా చాలా ప్రశ్నలడుగాల్సి ఉంది" కంఠీరవం తీవ్రంగా అన్నాడు.

"నీవు?" కొమరయ్యను ప్రశ్నించాడు.

"ఏమీలేదు."

హైదరలీపై కంఠీరవం ప్రశ్నలు ప్రారంభించాడు.

"మీరు దిమ్మెగూడెంలో ఏంచేస్తుంటారు?"

"వ్యవసాయం."

"మీరు దొరగారి దగ్గర పెద్దగుమాస్తాకదూ?"

"ఏదో పేరుకు."

"నీ వద్ద ఉన్న భూమిలో కొంత భాగం దూదేకులవాండ్లది కదూ?"

"ఎప్పుడో ఉండె, ఇప్పుడు మాత్రం నాదే."

"దూదేకులవాండ్లకు డబ్బిచ్చావా?"

ఈ ప్రశ్నకు పోలీసువకీలు ఆక్షేపించాడు. "ఇది అభియోగానికి సంబంధంలేని ప్రశ్న" అన్నాడు.

"నేను మీకపటనాటకాన్ని బట్టబయలు చేయడానికి ఆ ప్రశ్న వేశాను. హరిజనులను మహమ్మదీయులనుచేసి ఉద్ధరించ బయలుదేరిన ఈ పెద్ద మనిషి అన్యాయంగా తోటిమతంవాండ్లైన దూదేకులవారి భూమిని, హిందువైన ఒక దొర ఆసరాతో హరించాడని మీరు తెలిసికోవాలె."

"ఇంకా ఏమైనా అడిగేదుందా?" న్యాయాధిపతి ప్రశ్నించాడు.

"చాలా ఉంది. అయితే హైదరలీగారు? మీకెంతమంది జీతగాండ్లు? వారిలో ఎంతమంది హరిజనులు? వారంతా ఇప్పుడు మహమ్మదీయులైనారా?"

"అన్ని ఒకసారి అడుగుతే ఎట్లు?"

"సరే! మీఅంజుమన్ నాయకులు, హిందువులు హరిజనులపై అన్యాయంచేస్తున్నారని అన్నారు. మరి మీరు దొరవారి గుమాస్తాగా, వ్యవసాయదారుగా, హరిజనులైన జీతగాండ్లకు అందరికంటె ఏమైన ఎక్కువ సౌకర్యాలు చేకూర్చారా?"

"అందరితోపాటు నేను జీతాలిస్తున్నాను."

"అయితే హరిజనుల మీద ఉండి, ఉండి ఇంత ప్రేమ ఎందుకు కలిగింది?"

"ప్రభుత్వం సాయంచేస్తుంటే బీదలు అనుభవించాల్నని నా అభిప్రాయం."

"ప్రభుత్వం సాయంచేస్తుందా? మీ అంజుమన్ నాయకులా?"

"వాండ్లేంది వీండ్లేంది. అంతా ఒక్కటే?"

"బాగుంది, ఇక మీరు వెళ్ళవచ్చు."

ఒక హరిజనుడైన సాక్షి పిలిపించ బడ్డాడు.

"నీ పేరేమి?"

"మల్లిగాడు-ఆఁ కాదయ్యా మస్కీన్ సాబు."

కోర్టులో ముసి, ముసి నవ్వులు, గొణుగుడు ప్రారంభమైంది.

"నిశ్శబ్దం, నిశ్శబ్దం" న్యాయస్థానం బంట్రోతు హెచ్చరించాడు.

"నీవు మహమ్మదీయుల్లో ఎందుకు కలిశావు?"

"మా బతుకులు బాగైతయని."

"అంటే, సర్కారు భూములు, కొలువులు ఇప్పిస్తనన్నది. అంతేనా?"

"అంతే."

"నీకు మహమ్మదీయ మతమంటే ఏమిటో తెలుసా?"

"అదంత నాకేం తెల్సు! యిందువులకేమో జుట్టు, మొల్తాడు. బొట్టు ఉంటది. తుర్కలకుండదు" అని ఆ సాక్షి న్యాయాధిపతి వైపు ముఖం తిప్పాడు. "అయ్యా! మరి మాకు జుట్టు, బొట్టు, మొల్తాడు లేపంటే కళ్లాలకాడికి రానియ్య మంటున్రట. ఎట్లబోర!" న్యాయాధిపతిని ప్రశ్నించాడు.

న్యాయాధిపతి వస్తున్న నవ్వును ఆపుకొని, కపట కోపంతో కంఠీరవాన్ని చూచాడు. "ఇంకేమన్నా అడిగేదుందా?" అన్నాడు.

"లేదు."

ఇంకొక సాక్షి పిలిపించ బడ్డాడు.

కంఠీరవం ప్రశ్నలు ప్రారంభించాడు.

"నాకు, అంజుమన్ నాయకులకు ఏదైనా జగడం జరిగిందా? ఆ రోజు నీవు చావిట్లో ఉన్నావు కదూ!"

"ఉంటిగద! మీరు, మీరు సానాసేపు మాట్లాడుకున్నరు. కొమరయ్య పటేలును ఎందుకు సావిట్లో కూర్చో పెట్టిన్రని మీరడిగితే, వాండ్లేమో అనిరి, మీరేదో అంటిరి. ఆడ్నించి జగడమాయె, ఇందాకవచ్చె."

"ఊఁ హైదరలీసాబు మీకు పత్రికలు చదివి వినిపించిండా?"

"మొన్న ఈడికి వచ్చేటప్పుడు బాటన సదివిండు."

"ఇప్పుడు ఆయన వద్ద ఉందా?"

"ఉండొచ్చు కీసల."

కంఠీరవం న్యాయాధిపతి నుద్దేశించి. "హైదరలీగారివద్ద ఉన్న పత్రికను న్యాయస్థానంలో ఉంచాలని కోరుతున్నాను" అన్నాడు.

"మీ వద్ద ఏదైనా పత్రిక ఉంటే ఇటివ్వండి" న్యాయాధిపతి హైదరలీ వద్దనుండి పత్రికను తీసుకున్నాడు.

కంఠీరవం ఆ పత్రికను తీసికొని సాక్షికి చూపుతు. "దీన్నేనా హైదరలీ మీకు చదివి వినిపించింది. ఆరోజు చావిట్లో చూపించిందిదేనా?"

"అదేనాయె. ఇంకోటెక్కడిది?"

"సరే నివు వెళ్లవచ్చు."

"పిండ్లను తీసుక వెళ్ళొచ్చు" కోపంతో అన్నాడు న్యాయాధిపతి. ఆరోజు విచారణ ముగిసింది.

మూడవసారి విచారణ తేదినాడు న్యాయాధిపతినేరారోపణ పత్రాన్ని చదివి వినిపించాడు.

"వేదాల కంఠీరవం, తండ్రి రఘునాధాచార్యులపై, గొట్టం కొమరయ్య, తండ్రి కోటయ్యపై రాజద్రోహ నేరము మోపబడినది. పోలీసుల సాక్షుల ద్వారా ఆ నేరము స్థిరపడి పోయినది. కాబట్టి మీరు శిక్షకు అర్హులుగా నిర్ణయిస్తున్నాను. మీరు మీ పక్షమున సాక్షులను, ప్రవేశ పెట్టవచ్చును. మీ విషయంలో చెప్పుకోవచ్చును.'' న్యాయాధిపతి అన్నాడు.

"నేను ఏది చెప్పినా, ఏది అడిగినా నాకు న్యాయమని తోచేదిగాను, మీకు బాధకలించేదిగాను ఉంటాయి. అవి మీ న్యాయస్థానములో. న్యాయశాస్త్రములో ఏ చర్య కిందికి వస్తాయో నే నెరుగను, ఇక మీరు చెప్పాలంటున్నారు కాబట్టి చెప్పుతున్నాను. నాకు సాక్షెవరు లేరు. నేను చెప్పే విష

యాలు మీపై ప్రభావంవేసే మీ హృదయాలే నాకు సాక్షులు. నేను రాజ ద్రోహము చేశానని నాపై నేరము. కాని దేశద్రోహులు. ప్రజాద్రోహులు మాత్రమే నన్ను రాజద్రోహులంటున్నారు. మీరు ఏర్పరచుకున్న న్యాయ స్థానాలు, న్యాయశాస్త్రాలు, రాజనీతి కేవలం మీరనుకున్నట్లు పరిపాలన సాగ టానికేనని ఈ అభియోగ విచారణ సందర్భంలో మీ వైఖరి తేల్చివేసింది. అయినప్పుడు నేనేది చెప్పినా లాభముండబోదని నా అనుమానం. అయినా నాకొక ఆశఉన్నది. ఎవరు ఎంత కృత్రిమ వాతావరణంలో, కపటనీతిలో మునిగితేలుతున్నప్పటికి వారు పుట్టింది మొదలు చచ్చేవరకు సమాజముతో వారికి సంబంధం ఉండక తప్పదు. సమాజములో పూర్తిగా నిర్మూలనము గాక యింకా కొంత జీవించియున్న మానవత్వపు ఛాయలు, వాటి ప్రభావ ముతో ఈ నిరంకుశ ప్రభుత్వ యంత్రిపాలకులు, ఒకప్పుడు కాకున్నా, ఒకప్పుడైనా కండ్లు తెరుస్తారని ఆశతో కొన్ని కటువైన, విస్పష్టమైన విష యాలు చెప్పతలచు కొన్నాను."

"అసలు విషయమేదో చెప్పక అనవసరంగా మాట్లాడుతున్నాడు." పోలీసు వకీలు న్యాయాధిపతిని సంబోధిస్తు అన్నాడు.

కంఠీరవం వింతగా పోలీసువకీలునుచూస్తు, తనవాదన సాగించాడు.

"అధికారం ఉంది కాబట్టి, అవకాశం దొరికింది కాబట్టి అనుకున్న ట్లా చేయడం అవివేకుల లక్షణం. మతపరివర్తనంపేర మీప్రభుత్వం అదే చేస్తున్నదని గట్టిగాచెప్తున్నాను. హిందువులు, మహమ్మదీయులు, అట్లే ఇతర మతస్తులంతా తమ తమ మతాలను పూర్తిగా అర్థం చేసుకున్న వారు కారు. ఎక్కువమంది గొర్రెదాటుగా ఏదో ఒక మతానికి చెందిన వారమని చెప్పు కుంటున్నారు. అంతే. ఇక మతాల మూలసిద్ధాంతాలను తెలుసుకొన్నవారు ఈ విధంగా వేటాడటానికి పూనుకోరు. ఆశయాల బలమే కాని, అధికార బలము వాని కనవసరము. పైగా అందరికి ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వం ఈవిధంగా పాక్షికత్వం వహించటం ఎవరు, ఏవిధంగా సమర్థిస్తారో నాకు తోచదు. ఈ విధంగా ప్రపంచములో అంతటా జరిగింది, జరుగుతున్నది,

జరుగుతుంది అని వాదిస్తే దాని ఫలితాలవైపుకూడా దృష్టిని సారించాలని నా మనవి. వాండ్లంతా చెడ్డఫలితాలను అనుభవించారు. మీరు వాటితో గుణ పాఠమైనా నేర్చుకోవాలని కోరుతున్నాను.

అందరివలెనే గ్రామ ప్రజలను పీడిస్తున్న హైదరరీ మతోద్ధారకు నిగా నటిస్తున్నాడు. ఆర్థికంగా అవస్థలపాలైయున్న బీదల అమాయ కత్వాన్ని ఊతగా తీసికొని హరిజనులపై మొసలి కన్నీరు కారుస్తున్నాడు. మీరు మీ ప్రభుత్వం కొత్త, కొత్త సౌకర్యాలు, కొర్త వాండ్లకు చేయడం కంటె, ప్రభుత్వము, ప్రజలయెడ నిర్వర్తించాల్సిన కర్తవ్యమేమిటో తెలిసికొని వ్యవహరిస్తే అంతా హాయిగాఉంటారు. మత ప్రస్తకే అనవ సరము."

"న్యాయస్థానం కాలం వృథా అవుతున్నది. చెప్పేదేదో స్పష్టంగా చెప్పారె." న్యాయాధిపతి అధికారధ్వనిలో అన్నాడు.

"మీరు మీ మనసులోని మాటను మార్చి అంటున్నారు, యథార్థ ములో నామాటలు మీకు రుచించడం లేదు. మీరు నాకివ్వదోయే న్యాయాన్ని బయలు పరచడానికి ఆతురతపడుతున్నారు. సరే రెండు మాటల్లో ముగిస్తాను. సిల్వర్ జూబ్లీ సమయాన మీ ప్రభుత్వం నుండి వేలరూపాయీలు లంచముగా పొందిన ఒకవ్యక్తి ప్రకటించేభావాలు, చెప్పే మాటలు నిజాం ప్రభువు ఫర్మానని సిగ్గులేకుండా చెప్పడం నేను సహించక ప్రజా ద్రోహకరమైన ఆపనిని ఖండించాను. అది రాజ ద్రోహమని తలిస్తే నా కభ్యంతరం లేదు. ఒక విషయం. నేనేమి నేరము చేయలేదని. అసలు నేరస్తులను ఎదుర్కొం టున్నానని నివేదిస్తున్నాను. నా వాదన యందలి భావాలు మీకు తప్పుగా తోచి మీరు నాకు శిక్షవేయ వచ్చును. జేలుకు పంపవచ్చును. నాభావాలు తప్పుగా రుజువుచేసి, ప్రభుత్వం క్రింద బానిసలై, ఆత్మగౌరవం, ఆశయాలు, లక్ష్యాలు లేక జీవించుటలోనే జీవితము యొక్క పరమా వధియని బోధించే మహామేధావులు జేలులోఉన్నారా యని అడుగు తున్నాను. ఒకవేళ అట్టి వ్యవస్థ ఉంటే, నాభావ పరివర్తనకు ఎంత కాలమవసరమో అంతకాలము నన్ను జేలులో పెట్టండి.

నా అన్నగారి మూర్ఖత్వానికి తట్టుకోలేకయిక్కడికి వచ్చాను. నూతన భవనాలు, న్యాయాధిపతులు న్యాయస్థానాలు, న్యాయవాదులు, విద్యావంతులు. విద్యా సంస్థలు. దేశరక్షకులు. దేశపాలకులతో నిండియున్న ఈ పట్టణములో బంధితుడనై మీరు చేయబోయే న్యాయానికి గురికాబోతున్నాను. ఇక నన్ను సంస్కరింపనున్న జేలులోకి వెళ్తాను. ఆ వైభవము కూడా చూడ కలుగుతాను. ఇక నేనేమి చెప్పతలచుకోలేదు. ఇంతే." అని కంఠీరవం వాదన ముగించాడు.

న్యాయాధి పతి కొమరయ్య నుద్దేశించి "ఏమైన చెప్పతలచుకున్నావా?" అన్నాడు.

"నేను హైదరలీ న్యాయం చేయడని, దొరవారి గుమాస్తాగా మమ్ము లందరిని కాల్చుక తింటున్నాడని అన్నాను. నేను ఇంకా ఎవరిని ఏమి అన లేదు." మెల్లగా కొమరయ్య అన్నాడు.

"మన ప్రభుత్వానికి ప్రధాన మంత్రి ఎవరో ఎరుగుదువా"? న్యాయాధిపతి ప్రశ్నించాడు.

"నా కెరుక లేదు. హైదరలీ అన్యాయంచేసే మనిషి అని అంటే ఇంత తప్పు కిందికి వస్తదని నాకు తెలియదు."

"ఇంకా ఏమైనా చెప్పతలచుకున్నావా?"

"నేను తప్పుచెయలేదు. నామీద అన్యాయంగా నేరం మోపిన్రు."

కంఠీరవానికి రెండు సంవత్సరాలు కఠినశిక్ష, అయిదువందల రూపాయిల జుర్మానా, జుర్మానా చెల్లించనిచో మరి ఆరు నెలలు జేలుశిక్ష విధించాడు. కొమరయ్య నుండి సత్ప్రవర్తన పూచీ తీసికొని విడుదల చేయాలని తీర్పు చెప్పాడు.

"నా భావ పరివర్తనకు రెండున్నర సంవత్సరములు చాలునని భావించారా" అని గంభీరంగా కంఠీరవం న్యాయాధిపతి వైపు తీవ్రంగా చూచాడు. న్యాయాధిపతి లేచి ప్రక్క గదిలోకి ప్రవేశించాడు.

కంఠీరవం సుమారు ఆరుమాసాల వరకు నిజామాబాదు జేలులోనే ఉంచబడ్డాడు. ఆకాలమున కొమరయ్యను వెంట పెట్టుకొని ఆండాళమ్మ ఒకసారి జేలుకు వచ్చి కొడుకును చూచింది.

"ఇల్లు వదలినా ఒకరి పంచన హాయిగాకాలం గడుపు తున్నావని, చదువు నేర్చుకుంటున్నావని విని సంతోషించానుకొడుకా! ఇదెక్కడిదో కొత్తది మెడబడ్డది కొడుకా!!" తల్లి దుఃఖించింది.

"ఇది చదువు కంటె తక్కువేమి కాదమ్మా! రామభూపాల్‌రావులు, వెంకటాచార్యులు, హైదరలీలు, మన ఊర్లోనేకాదు ప్రతిచోట ఉన్నారమ్మా, వాండ్లెక్కడ ఉన్నా నాకీ చదువులు తప్పవు!" గంభీరంగా అని ఒకనిట్టూర్పు విడిచాడు. తల్లి నోదార్చాడు.

# 15

నిజామాబాదులో బెదిరిపోయి దిమ్మెగూడెం చేరుకున్న వెంకటాద్రి రామభూపాల్‌రావుతో పరిస్థితులన్ని వివరించి చెప్పాడు. కంఠీరవం, కొమ రయ్యలపై మోపిననేరాల తీవ్రతను విని ఇద్దరూ భీతిల్లారు. ఆర్యసమాజీ యులతో సంప్రతించడానికి రామభూపాల్‌రావు హైద్రాబాదుకు వెళ్ళాడు.

వెంకటాద్రి చంద్రియ్యతో ప్రతిరోజు మాట్లాడడం సాగించాడు. ఆ మాట, ఈ మాట చెప్పుతూ, క్రమంగా రామభూపాల్‌రావును విశ్వసనీయు డుగా తలచేటట్టు చేశాడు. చంద్రయ్యపై నమ్మకంతో ఇతర రైతులు కూడా కొంత మొగ్గుచూపారు. ముఖ్యంగా కొమరయ్య భూమితగాదాతో ఏర్పడిన వాతావరణం మారిపోయి, మహమ్మదీయులైనవాండ్లంతా శతృవులుగా తలచ సాగారు. ఆ హరిజనులు మొదట జీతగాండ్లుగా ఉన్నపుడు తీసుకొన్న అప్పులకై, అధికంగా పొందిన జీతం గింజలకై ఒత్తిడి చేయసాగారు. ఆడవాండ్లను కూడా కూలీలుగాగాని, మరేవిధంగాగాని వ్యవసాయ పనుల్లోకి పిలువడం మానుకున్నారు. వచ్చినవాండ్లను చీవాట్లుపెట్ట సాగారు. సరిగ్గా

పంటలకాలంలోనే హరిజనులు పరివర్తన పొందటంతో వారి ఆర్థిక జీవితం దెబ్బ తిన్నది. అంజుమన్ వారి సహాయం మందగించింది. అంజుమన్ ప్రచారకుడు అప్పుడప్పుడు వెళ్ళి చాలారోజుల వరకు నిజామాబాదులోనే ఉంటూ లాంఛనంగా దిమ్మెగూడెం రావడం మొదలైంది. ప్రచారకునికై కట్టించిన పాక క్రమంగా, శిధిలమై పోయింది. ఒకసారి తాటిఆకులు, ఒకసారి కట్టెలు, ఒకసారి దూలాలు—ఈవిధంగా ఆ ప్రచారకుని ఇల్లు పేరుకు ఉండి పోయింది. దాంతో హైదరలీ ఇంట్లో బస చేయసాగాడు. హైదరలీకి అతన్ని భరించడం కష్టమై పోయింది. పరివర్తనపొందినవారి ఒత్తిడి కూడా ఎక్కువ కాసాగింది. హైదరలీ కూడా నిజామాబాదుకు వెళ్ళి అంజుమన్ నాయకులతో సంప్రతించాడు. కాని అంజుమన్ నాయకుల ప్రణాళికలు, పథకాలు సత్వరఫలితాన్నిచ్చేవిగా తోవలేదు. గ్రామీయులు ఆవిధంగా ప్రవర్తించటం సంఘ బహిష్కారం కిందవస్తుంది కాబట్టి గ్రామీయులపై అభియోగాలు లేవన్నుసని అంజుమన్ నాయకులు హైదరలీకి ఆలోచన చెప్పారు. ఆసంగతి దిమ్మెగూడెంలో హరిజనులకు చెప్పితే, యింకా గ్రామీయులతో ద్వేషంపెరుగుతుందని భయపడ్డారు.

రాజద్రోహనేరములో విముక్తి పొంది కొమరయ్య దిమ్మెగూడెం చేరుకున్నాడు. కంఠీరవం ఆదేశము ప్రకారం దిమ్మెగూడెంలో రాత్రి పాఠశాల, గ్రంథాలయము, భజన మొదలగు కార్యక్రమాలు నడపటానికై పరంధామయ్యను వెంటతీసికొని వచ్చాడు. పరంధామయ్య నిజామాబాదులో కంఠీరవానికి ఆత్మీయుడుగా ఉండి, అన్ని విషయాల్లో సహచరుడుగా ఉండేవాడు.

హైదాబాదు వెళ్ళిన రామభూపాల్‌రావు విజయదేవు పేరుగల ఆర్య సమాజం ప్రచారకుని వెంటబెట్టుకొని దిమ్మెగూడెం చేరుకున్నాడు. రామభూపాల్‌రావుకు హైద్రాబాదు ఆర్యసమాజీయుల హితవుతో ఆత్మ విశ్వాసం కలిగింది. గ్రామానికి పెద్దయైన తాను తన శక్తినంతా ఉపయోగించి, హైదరలీ ఆటలను కట్టివేయాలనుకున్నాడు. దాంతో గ్రామంలో

పూర్వపు పలుకుబడి తిరిగి పొందడమేగాక, ఇప్పుడు ప్రజాసేవకుడుగా కూడా ప్రతిభ వెలిగిపోవచ్చునని మనస్తృప్తి మితంపొందాడు.

ఒకరోజు హైదరలీ ఊళ్లోలేని సమయాన, మొత్తం హరిజనులను, రామభూపాల్‌రావు తనగడీలోకి పిలిపించు కొన్నాడు. "మీరంతా తొందర పడి తురకలైనారు. అందుకు ఫలితం అనుభవిస్తున్నారు. హైదరలీ మోసం ఇప్పుడైనా మీరు గ్రహించి ఉంటారు. మీరెన్నికష్టాలుపడుతున్నారో నేను ప్రతిరోజు తెలిసికొంటునే ఉన్నాను. ఉన్న ఊళ్లో పుట్టిపెరిగిన మీరు తిండి లేక అవస్థ పడుతుంటే గ్రామానికి ప్రభువునైన నేను ఎట్లా ఊరు కుంటాను? నేను రైతులకందరికి చెప్పి, తిరిగి మీ పనులు, కొలువులు యథా ప్రకారం ఇప్పిస్తాను. మీకేమిభయంలేదు." రామభూపాల్‌రావు హితోక్తులు పలికాడు. శేరిదారుడ్ని పిలిచి ఒక్కొక్కరికి అయిదు సేర్ల ప్రకారం వడ్లు కొలిపించాడు. వెంటనే విజయదేవు శుద్ధి సంస్కారం జరిపి అందరిని హిందువులుగా మార్చాడు. ఆసందర్భాన్ని పురస్కరించుకొని విజయదేవు హరిజనుల నుద్దేశించి ఉపన్యసించాడు.

"లక్షల సంవత్సరాల సభ్యత, సంప్రదాయము కలిగి ఉండి మొత్తం ప్రపంచానికి జ్ఞానభిక్షపెట్టిన ఆర్య సంతతికి చెందిన మీరు ఈవిధంగా వేరే మతాలను ఆశ్రయించడం దురదృష్టం. తాత్కాలికంగా పొట్టపోసుకోవ డానికై ధర్మాన్ని, విశిష్టతను మరచిపోవడం దుఃఖకరం. ఇప్పటికైనా మీకు భగవంతుడు సద్బుద్ధిని కలిగించినందులకు ఆ పరమేశ్వరునికి మనము కృత జ్ఞులమై యుండవలెను." అని విజయదేవు ఉపన్యసించాడు.

హరిజనులు ఒకరి ముఖాలు ఒకరు చూచుకొని, ముఖాన కుంకుమ బొట్లతో, భుజానవడ్ల మూటలతో ఇండ్లకు చేరుకున్నారు. యథాప్రకారం కూళ్లు,కొలువులు లభించాయి, బేగారి ప్రారంభమైంది. తిరిగి యథాస్థితికి చేరారు.

హైదరలీ నిజామాబాదు నుండి వచ్చేవరకు మారిన పరిస్థితులకు హడలి పోయాడు. హరిజనవాడకు వెళ్ళటానికే భయంవేసింది. తలపట్టు

కాని కదలకుండా ఇంట్లోకూర్చున్నాడు. హైదరలీ కొన్నాళ్ళ వరకు కుటుంబంతో నిజామాబాదులో ఉండిపోయాడు.

ఈ అలజడి, అట్టహాసం, దౌర్జన్యాలు, అభియోగము, న్యాయస్థానాలు, న్యాయవాదనలు, హిందూ. మహమ్మదీయ మత ప్రచారముతో ఆ గ్రామ ప్రజల జీవితములో ఒక వింత మనస్తత్వము, ఆలోచనాస్థితి, చైతన్యము ఏర్పడ్డది. పరంధామయ్య సాయంతో కొమరయ్య, పట్టుదలతో ఒక గ్రంథాలయమును ఏర్పాటుచేసి, రాత్రి పాఠశాల, భజనలు సాగించారు. విజయదేవు రామభూపాల్‌రావు గడీలోనే బసచేశాడు. అప్పుడప్పుడు గ్రంథాలయంలో ఉపన్యసించేవాడు. ప్రభుత్వ యంత్రిమందలి కుళ్ళు, మతపాక్షిక తత్వం, అంతా తురకమయమైపోవడంవల్ల హిందువులు, ఏవిధంగా దిన దినం సభ్యతా, సంస్కృతులకు దూరమైపోతున్నది ఉదాహరణలతో పేర్కొనడం అతని ఉపన్యాసంలో ముఖ్యమైన విషయంగా ఉండేది. విజయదేవు అప్పుడప్పుడు హైద్రాబాదుకు వెళ్ళి వస్తుండేవాడు.

కొన్నాళ్ళకు పరిస్థితులు యథాస్థితికివచ్చాయి. గ్రామీయుల చైతన్య స్థాయి పెరిగింది. పరంధామయ్య ప్రజల మన్ననలుపొంది, ఆత్మీయుడుగా అందరిలో కలిసి పోయాడు. రామభూపాల్‌రావు పరిపాలనా వ్యవహారాల విషయంలో పరంధామయ్యతో రైతులు, గుస, గుసలు మొదలు పెట్టారు.

రామభూపాల్‌రావుకు విశ్వసనీయుడైన విజయదేవు ద్వారా ప్రయత్నించి చూడాలని పరంధామయ్య ఆలోచించాడు. రామభూపాల్‌రావు ప్రజల నుండి లంచాలు, మామూళ్ళు గుంజడం, బెదిరించి, ప్రతిఫలంలేకుండా పనులు వెళ్ళతీసుకోవడం మొదలగు, వాటితో పాటు, అందరిని కలచి వేసిన కొమరయ్య భూమి సమస్య చాలా ప్రధానమైంది.

మామూలుగా విజయదేవు దిమ్మెగూడెం వచ్చిఒకసారి గ్రంథాలయంలో ఆషామాషి జరుపుతుండగా కొమరయ్య వచ్చి, పరంధామయ్యతో ప్రశంస తీశాడు. కొమరయ్య మెల్లగా వెళ్ళి విజయదేవు దగ్గర కూర్చున్నాడు.

"ఏమండీ! మీతో కొన్ని విషయాలు మాట్లాడాలని రైతులు అనుకుంటున్నారు. మీరు మనసు మీదికి తీసుకుంటే ప్రజలకు మేలు కలుగుతుందని వాండ్లు ఆశపెట్టుకున్నారు. మీరు గ్రహించారో లేదో కాని, గ్రామ పెత్తందారుగా రామభూపాల్‌రావు ఎన్నో అన్యాయాలు చేస్తున్నాడు. రామభూపాల్‌రావు అంటే మీకు చాలా నచ్చినవాడు. మీ మీద వారికికూడా గురిఉంది. ప్రజలు తాతముత్తాతల కాలంనుండి లంచాలు, మామూళ్ళు, ఇస్తున్నారు. దానికి ప్రజల అమాయకత్వమే కారణమనుకోండి. కాని పరిస్థితులు మారాయి. మీరు ఈ విషయాన్ని రామభూపాల్‌రావుతో మాట్లాడితే బాగుండదు?" పరంధామయ్య విజయదేవు నుద్దేశించి అన్నాడు.

"అన్యాయంగా నా భూమిని మింగిండు గదయ్యా!" కొమరయ్య అన్నాడు.

విజయదేవు తీవ్రంగా ఆలోచించాడు. "మంచిది. తప్పకుండా మాట్లాడుతాను. నా శక్తి వంచన లేకుండా ప్రయత్నం చేస్తాను" అన్నాడు.

"చూడండి! ఒక విషయం. మీరు నన్ను ఇక్కడికి పిలిపించి, ప్రజా సేవ చేయడానికి అవకాశం కల్గించారు. అటువంటి మీరు, ప్రజల విషయంలో కొంచెం ఆదరంగాను, న్యాయంగాను ప్రవర్తిస్తే ప్రజలెంతైనా సంతోషిస్తారు. మీకు ఆస్థి, పాస్తులున్నాయి. హాయిగా కాలంగడుపుతున్నారు. మీరు పరిస్థితులను, ప్రజల మనస్తత్వాన్ని దృష్టిలో పెట్టుకొని, లంచాలు, మామూళ్ళు మానుకొంటే ఎంతో బాగుంటుంది. కొమరయ్య భూమి విషయం కూడా మీరు కొంచెం శాంతంగా ఆలోచిస్తే మన వాండ్లను మనం ఆదుకున్నట్టవుతుంది. ఏమంటారు?" విజయదేవు రామభూపాల్‌రావుతో అన్నాడు.

విజయదేవు సంభాషణ మొదలుపెట్టడంతోనే రామభూపాల్‌రావుకు జెర్రులు పాకినట్లైంది. విజయదేవు ప్రజలకు చెప్పతగ్గవాడేగాని, తన విషయంలో జోక్యం కలిగించుకోవడం, విజయదేవు శక్తికి మించిన ప్రవర్తనగా రామభూపాల్‌రావు బాధపడ్డాడు.

"అంతా చెప్పడం అయినట్టేనా? ఇంకా ఏమైనా ఉందా?" అధికార ధ్వనిలో రామభూపాల్‌రావు అన్నాడు. విజయదేవుకు రామభూపాల్‌రావు ఆ మాటల్లో కొత్తదనం కనిపించింది. చులకనగా మాట్లాడుతున్నట్టని పించింది.

విజయదేవు ఆశ్చర్యంతో రామభూపాల్‌రావును చూస్తూ, "నేను మీ ముందట పెట్టిన విషయాలల్లో ఇంచుమించు అన్ని వచ్చినవనుకుంటు న్నాను" అన్నాడు.

"ఇవన్నీ గ్రామ వ్యవహారాలు. వీటిల్లోకి మీరు పోతే అంతుండదు. మేము పెట్టే ఖర్చులకింద ప్రజలిచ్చే మామూళ్లు మొదలైనవి చేతి చెమట కిందికిరావు. ఏదెట్లున్నా మీరిటువంటి వాటిలో జోక్యం కలిగించుకోక పోవడం చాలా మంచిది. మీరు గ్రంథాలయానికి వెళ్ళడమున్నూడా నాకేమి ఇష్టం లేదు. ఆ విషయం చెప్పాలని ఎప్పటినుంచో అనుకుంటున్నాను." రామభూపాల్‌రావు కటువుగా అన్నాడు.

విజయదేవు చెంపదెబ్బకొట్టినంత బాధపడ్డాడు. వ్యక్తిత్వం ఉప్పొంగి వచ్చింది. ఏదో మాట్లాడబోయాడు. "ఇంకా ఏమేమి చాడీలు చెప్పారు రైతులు?" రామభూపాల్‌రావు ప్రశ్నించాడు.

"ఇవన్ని చాడీలని మీరు భావిస్తే మీతో ఈ విషయం ఇక ఎత్తను. నాకు తోచిన మార్గం నేను అనుసరిస్తాను" అని విజయదేవు ఆవేదనతో లేచాడు.

"మొత్తానికి తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టేవాని తంతుగా ఉంది," రామభూపాల్‌రావు అన్నాడు.

అక్కడ నిలుచొని ఉండటం విజయదేవుకు మనస్కరించలేదు. తన బట్టలు మొదలగు వస్తువులు తీసికొని. "ఇక నేను వెళ్తున్నాను. సెలవు. నాకు మీ ఇంట్లో స్థానంలేదు. నమస్తే" అంటూ గడీని వదిలి గ్రంథాలయం చేరుకున్నాడు. గ్రంథాలయములో ఎవరూ లేరు. గ్రంథాలయములోని పుస్త

కాలన్ని తిరగవేసి, "ఋగ్వేదాది భాష్యభూమిక"అను గ్రంథాన్ని తీసి "అథ రాజ ప్రజాధర్మ విషయః సంక్షేపతః" అను అధ్యాయాన్ని తీవ్రంగా చదువసాగాడు. పుస్తకమందలి విషయం విజయదేవు నుత్తేజితం చేసింది. ఆర్యసమాజ సంస్థ అట్టి ఉత్తమ వ్యవస్థకై ఎందుకు పూనుకోలేదో ఆలోచించ మొదలు పెట్టాడు.

ఇంతలో పరంధామయ్య వచ్చి ప్రశ్నించాడు.

"నేను రామభూపాల్‌రావుతో సంబంధం తెంచుకొని వచ్చాను. ఇక అక్కడ అడుగుపెట్ట తలచుకోలేదు."

"అంత బెడిసిపోయిందా? మనకున్న విషయమేనా?" పరంధామయ్య ఆవేదనతో అడిగాడు.

"ఇదంతా మన తప్పు. ఇతరులనంటే ఏంలాభం? మనం కండ్లు మూసికొని కూర్చుంటే వచ్చే ఫలితాలివి?" గంభీరంగా విజయదేవు అన్నాడు. "ఋగ్వేదాది భాష్యభూమిక"ను పరంధామయ్యకు అందించి, అతని నాకర్షించిన భాగాన్ని చదువమన్నాడు.

పరంధామయ్య శ్రద్ధతో చదివాడు. అతని ముఖం వికసించింది. "మనం ఈ పుస్తకాన్ని ఎన్నడూ చదువలేదు. బలేపుస్తకం తెచ్చారు," అన్నాడు.

"అట్టి ఉత్తమ వ్యవస్థను నిర్మించంది మనం ఏమి చేసినా లాభం లేదు. రామభూపాల్‌రావు ఇంత అహంకారంతో, విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నాడంటే, గ్రామప్రజలు ఐక్యంగా ఉండి, బాధ్యతలను తెలిసికోక పోవడమే కారణం. కాబట్టి రామభూపాల్‌రావుకు విరుగుడును ఆలోచించాలని నా అభిప్రాయం."

"మొత్తానికి ఒక్కసారే తిరిగి పోయారు."

"నా సంస్థ ఆజ్ఞానుసారం వస్తున్నాను. అంతే. నా సంస్థ ఆశయాల కింద, లక్షమంది రామభూపాల్‌రావులు బలాదూర్. ఈ వ్యక్తి మా సంస్థచే

గౌరవింపబడవలసిన వాడు కాడని తేలిపోయింది. ఈ సంగతి మా సంస్థకు తెలిపి, నేను యిక్కడే ఉండి, ప్రజలను విజ్ఞానవంతులుగాను, హక్కు, బాధ్యతలను గుర్తించే పౌరులుగాను సిద్ధం చేస్తాను."

"మీ ప్రధానికి, రామభూపాల్‌రావుకు ఎంతో స్నేహం. దొరకు వ్యతిరేకంగా అతడు ఆలోచించడు. మీ ప్రధాని గారిని నేను బాగా ఎరుగుదును."

"అయితే అదికూడా చూస్తాను." విజయదేవు అంటుండగా కొమరయ్య వచ్చాడు." ఏంచేసుకొస్తిరి?" అన్నాడు.

విజయదేవు పశ్చాత్తాపంతో కొమరయ్యను చూస్తు, "ఆ పద్ధతులు మన మనుకున్నంత సులభంగా పోయేవికావు. మీరంతా ఒకటి కావాలె" గంభీరంగా అన్నాడు.

కొమరయ్యకు నవ్వు వచ్చింది, "మీరు దొరల మనుషులు. అదేందో మీరే ఆలోచించండి" అన్నాడు.

విజయదేవు బల్లెంతో పొడిచినంత బాధపడ్డాడు. "ఇది నవ్వాల్సిన విషయంకాదు. మనం చాలా గట్టిగా ఆలోచించాలె. ఎన్నో వేల ఏండ్ల కిందట ఒక మహాపురుషుడు ఏమి రాశాడో విను" అంటూ విజయదేవు చదువసాగాడు.

"ఒక్క పురుష దే రాజగుట భీతావహాము....సభకే రాజ్యప్రబంధము సలుపు శక్తియుండును. సభాసంయుక్తమగు దేశము సభ్యదేశము. ఒకడు రాజైయున్న చోట ప్రజను భక్ష్యపదార్థమునువలె పీడించును. స్వసుఖార్థము ప్రజల బహుముఖముల హరించును. ఉత్తమ పదార్థము లచ్చట ప్రజలకు కరవైపోవును. మాంసాహారి బలిసిన పశువును చూచినతోడనే చంపగోరినట్లు, ఒక్కడే నిరంకుశుడగు రాజు తన కంటె మత్తుడు, అధికుడు ఎవ్వడును కాకూడదను స్వేచ్ఛచేత ప్రజల యందెవ్వని అర్హతనుగాని సహింపడు. కనుక రాజవ్యవహారము

సభాప్రబంధ సంచాలితమయినప్పుడే రాష్ట్రమున శాంతి, భద్రము, సుఖము నిలుచును. ”

శ్రద్ధగా వింటున్న కొమరయ్య, ముసి, ముసిగా నవ్వుతు, “కొద్దో గొప్పో అర్థమైంది. కాని ఒక్క రాజుండక అంతా రాజు లుండాలంటే ఎట్లసాధ్యం?” ప్రశ్నించాడు.

“అంతా రాజులు కావాలని కాదు. దేశాన్ని నడపడంలో ఒక్కడికే అధికారముంటే కలిగే నష్టాన్ని గురించి ఆవిధంగా చెప్పాడు. మీకు ఈ కష్టాలు కలుగడానికి కారణంకూడా ఇదే. రామభూపాల్‌రావు ఆడిందే ఆట, పాడిందే పాట. మీరు నోరెత్తడానికి వీలులేదు. ఈ పద్ధతిపోయి ఈ గ్రామం మంచికి, చెడ్డకు రామభూపాల్‌రావుతోపాటు మీవంటి గ్రామీయులకు కూడా బాధ్యత, జోక్యము అవసరము” విజయదేవు విపులీకరించాడు.

“ఇవన్ని తెలిసినమీరు ఇన్నాళ్లనుంచి దొరోరితో ఎట్ల కలిసున్నారండి?” కొమరయ్య వెంటనే అన్నాడు.

విజయదేవు పశ్చాత్తాపంతో తల నేలకు వేశాడు.

“అయితే ఇంతకూ ఇప్పుడేం చేయమంటరు?” కొమరయ్య ప్రశ్నించాడు.

“అదే ఆలోచిస్తున్నాను. గ్రామీయులంతా ఒకటగా, ఒకరిబాధ అందరిబాధగా తలచి, మనబాధలకు కారణాలను, కారకులను ఎదుర్కోవాలె. గీతలో మహాపురుషుడు కృష్ణ దే మన్నాడో వినండి:—

“నాస్తి బుద్ధి ర యుక్తస్య
నచా యుక్తస్వభావనా,
నచా భావ యతశ్శాంతి
రశాంతస్య కుతస్సుఖమ్”

అంటే అంతా ఒకటేయని తలవనివాడు మంచి, చెడ్డను గమనించడు. వానికి భక్తి ఉండదు. భక్తి లేనివానికి శాంతిలేదు. శాంతిలేనిచోట సుఖముండజాలదు” అనివిజయదేవు వివరించాడు.

"ఏదో ఆలోచించండి. దోవ చూపించేవాడుంటే అంతా తయారవుతారు. మీకుతోడుగా పరంధామయ్యగారుండనే ఉండిరి. నేను చేనుకాడికి పోయి మళ్ళా వస్తా" అని కొమరయ్య వెళ్ళిపోయాడు.

"మొత్తానికి రామభూపాల్‌రావు మీద కత్తికట్టి సవారైనారు?" పరంధామయ్య ప్రశంసించాడు.

"పరంధామయ్యగారూ! మీకు చెప్పగలవాడిని కాను. రామభూపాల్‌రావు వంటివాండ్లు ప్రపంచములో బ్రతికి ఉన్నంతవరకు దేశానికి శాంతి లేదు. తనకుతాను ఏమనుకుంటాడో గాని ఎంతనిర్లక్ష్యం! ఎంతఅహంభావం. అంతా తన కిందివాళ్ళనే నీచభావం ఉండేమనిషి నిలువునా నాశనమవుతాడు. నేను పొట్టకెళ్ళక, పనిలేక ఈ పనిలోకి దిగాననుకున్నాడేమో! నాకు డబ్బు లేకపోవచ్చును. పలుకుబడి లేకపోవచ్చును. కాని ప్రతి మనిషికి ఉండే ఆత్మగౌరవం మాత్రం నశించలేదు. ఆత్మగౌరవం లేనివాడు బ్రతికున్నా చచ్చిన వాడితో సమానం. ఎంతవరకు దేశంలోని ప్రతివాడు ఆత్మగౌరవం కాపాడుకోడో, అంతవరకు రామభూపాల్‌రావు వంటి దుష్టశక్తులు జీవించి ఉంటాయి." చాలా ఉక్రోషంతో విజయదేవు అన్నాడు.

రాత్రిభజన వేళకు మామూలుగా గ్రామప్రజలు కూడారు. ఎన్నడులేనిది వెంకటాచార్యులు వచ్చి, ముఖం మాడ్చుకొని మూలకు కూర్చున్నాడు.

"ఊరువిడిచి వెళ్ళిపోయినాడనుకొన్న విజయదేవు గ్రంథాలయంలో బసచేసాడని రామభూపాల్‌రావుకు తెలిసి, వెంకటాచార్యులను వేగులవానిగా పంపాడు.

"మీరు భజన ప్రారంభించేముందు రెండు మాటలు చెప్పుతాను" గంభీరంగా విజయదేవు అన్నాడు. అందరు శ్రద్ధగా విజయదేవు వైపు చూడసాగారు.

"గ్రామప్రజలగు మీలో ఉన్న పిరికితనము పోగొట్టుకోవాలె. మీరు కూడా ఆత్మగౌరవముతో బ్రతుకుటకు పాటుపడాలె. మీకు పాడిపంటలు

సమృద్ధిగాగలిగి. మీగ్రామం మంచిచెడ్డలకు మీరు బాధ్యులుగా ఉండాలని కోరుతున్నాను. మీరు మీ విషయం ఎప్పటికప్పుడు ఆలోచించుకొంటూం డాలె. అట్టి శక్తి, బలము, జ్ఞానము, తేజము, స్థైర్యము మనకు కలుగాలని భగవంతుడిని ప్రార్థించుతుండాలె. నేను ఇప్పుడు చదివే ఒక్కొక్క వాక్యాన్ని మీరు కూడా చదువాలె" అని విజయదేవు ప్రార్థించాడు.

ఓం సహనావవతు సహనౌభువన్తు
సహ వీర్యమ్ కరవావహై
తేజస్వినావధీ తమస్తు మా విద్విషావహై
ఓం శాంతిః శాంతిః శాంతిః.

అనగా, "హేసర్వ శక్తిమాన్! మేము పరస్పరము రక్షించుకొందు ముగాక! మేమందరముకలిసి, మెలిసి సర్వోత్త మైశ్వర్యానందమును సదా భోగింతుముగాక! మెము పురుషార్థముచే నొకరి సామర్థ్యము నొకరు సదా వృద్ధినొందించుకొందుముగాక! మేము చదివి, చదివించునది విశ్వమంతట ప్రకాశించుగాక! మావిద్యయు నిరంతరాభివృద్ధి నొందుగాక! మేమెన్నడు పరస్పరము విరోదింప కుందుముగాక! ఒకరి కొకరి మిత్రులమై సదా ప్రవర్తించునట్లు నుగ్రహింపుము" అని విజయదేవు విపులీకరించాడు. ఇక మీ భజన కానీయండి" అని గ్రంథాలయం బయటకువచ్చి నిలుచున్నాడు. విజయదేవును వింతగా చూస్తూ వెంకటా చార్యులు వెళ్ళి పోయాడు.

విజయదేవు గ్రంథాలయములో బసచేసి, పరంధామయ్యకుతోడుగా ఉండిపోయాడు. రైతులవెంట చేనుల్లో కాలాక్షేపం చేస్తుండేవాడు. అప్పు డప్పుడు సందర్భాన్నిబట్టి, గ్రంథాలయములోను, భజనవేళల్లోను తనకు తోచిన ఆదర్శ వాక్యాలు, శ్లోకాలు వినిపిస్తుండేవాడు.

రామభూపాల్‌రావుకు విజయదేవుకు సరిపడటంలేదని హైదరలీకి తెలిసి, దిమ్మెగూడెం చేరుకున్నాడు.

విజయదేవు రామభూపాల్‌రావుకు విరోధికావడంతో ఆర్యసమాజీయు లంటే ప్రభుత్వానికున్న వ్యతిరేకతను ఉపయోగించుకొని, విజయదేవును

ఊళ్ళోనుంచి పంపివేయాలని. ఈవిషయంలో హైదరలీ సాయం తీసికోవాలని రామభూపాల్‌రావుకు వెంకటాద్రి సలహా ఇచ్చాడు. కాని రామభూపాల్‌రావుకు ఆ విషయం నచ్చలేదు. ఆర్యసమాజం ప్రధానిపై ఉన్న విశ్వాసము, పరిచయమునుబట్టి, అతనిద్వారానే విజయదేవుకు బుద్ధి చెప్పించాలని ఆలోచించాడు. ఆర్యసమాజం విజయదేవు ప్రవర్తనను సహించదని రామభూపాల్‌రావు దృఢంగా నమ్మాడు.

విజయదేవువచ్చి, క్షణికతురకలను తిరిగి హిందువులుగా మార్చడంతో హైదరలీకి పట్టరాని కోపం వచ్చింది. కాని రామభూపాల్‌రావు బలం ఉంది కాబట్టి ఏమిచేయాల్సింది తోచలేదు. సమయానికై వేచి ఉన్నాడు. ఇప్పుడు సమయం దొరికిందని వెంకటాద్రి ద్వారా రామభూపాల్‌రావుతో చెలిమికై ఆరాటపడసాగాడు.

అంజుమన్ ఇత్తెహాదుల్ముసల్మీన్ వారి ఎగురుడుకూడా మొదటంతలేదు. రామభూపాల్‌రావుతో విడి పోవడం తప్పుపనైందని హైదరలీ పశ్చాత్తాప పడ్డాడు.ఇకఇప్పుడు విజయదేవు గడీలోనుండి బయటపడి కేవలం గ్రామ ప్రజలపై ఆధారపడి ఉండటంతో హైదరలీ పాతఆలోచనలు పైకి ఉబికి వచ్చాయి. తిరిగి రామభూపాల్‌రావు చెలిమిని సంపాదించి, వెంకటాద్రి సలహాలను, రామభూపాల్‌రావు ఆజ్ఞలను కార్యరూపంలో పెట్టే భాగ్యం తిరిగి కలుగాలని హైదరలీ ఆలోచించ మొదలు పెట్టాడు.

ఒకనాడు పరంధామయ్య, విజయదేవు చేనులవైపు పోతుండగా దోవలో కుమ్మరి దుర్గయ్య దండంపెట్టి "నేనుచెరువు లోదట్టులో మన్ను తోడు కుంటుంటే దొరోరు అటకాయించిను్రి" అని చెప్పాడు.

"ఇంకా హర్రాజు కాలేదుగా! ఇప్పుడే ఎందుకు అటకాయించటం?" పరంధామయ్య ఆలోచించాడు. "సరే, రాత్రికి మాట్లాడుకుందాం, రాపో" అని చేనులవైపు వెళ్ళిపోయారు.

"ఈ పర్యాయం చెరువు హర్రాజులో మనంకూడా పాటపాడ్తే" విజయదేవు ప్రశ్నించాడు.

"నిజమే. బాగనే ఉంటది."

రాత్రిపూట గ్రామీయులు గ్రంథాలయములో కూడినప్పుడు, చెరువు హర్రాజులో పాటపాడాలని నిశ్చయించుకున్నారు. హర్రాజు సమయాన్నికై నిరీక్షించసాగాడు.

రామభూపాల్‌రావు హైద్రాబాదుకు వెళ్ళి, ఆర్యసమాజం ప్రధానిని వెంట తీసికొని దిమ్మెగూడెం వచ్చాడు. రాగానే, విజయదేవు కోసం ప్రధాని పిలుపంపాడు. కాని విజయదేవు గడీలోకి వెళ్ళడానికి నిరాకరించి, ప్రధానినే భజనవేళకు గ్రంథాలయానికి రమ్మని సమాధానం పంపాడు. ఆవిధంగా నిరాకరించడం. విజయదేవు తలబిరుసుతనమని, విజయదేవు గురించి రామభూపాల్‌రావు చెప్పిన విషయాలు నిజమని విశ్వసించాడు. గ్రంథాలయానికి వెళ్ళి ప్రజలముందు విజయదేవు తలెత్తకుండా చీవాట్లు పెట్టాలని. రామభూపాల్‌రావు విషయంలో గ్రామప్రజల కేర్పడిన విముఖతను తొలగించాలని పట్టుదలతో ప్రధాని ఆవేళకు గ్రంథాలయానికి వెళ్ళాడు. ఆనాడు గ్రంథాలయానికి మామూలుకంటె ఎక్కువమంది వచ్చారు. హరిజనులువచ్చి గ్రంథాలయం బయట కూర్చున్నారు. ప్రధానివెంట వెంకటాచార్యులు ప్రధాన భృత్యుడుగా వచ్చి ప్రధానిపక్కనే కూర్చున్నాడు. హైదరలీ రామభూపాల్‌రావు చెలిమికై ఆవేదనపడుతుండగా రామభూపాల్‌రావు ఆర్యసమాజీయుల వెంటబడటం, హైదరలీకి గాభరా కలిగించింది. ఆరోజు హైదరలీ ఇంటినుంచి కదలలేదు. తన తొత్తులైన వాండ్లను గ్రంథాలయానికిపంపాడు.

ప్రధాని ప్రసంగం మొదలు పెట్టాడు

"యిక్కడ కూర్చున్న పండిత విజయదేవు ఈ ఊరికి రావడానికి కారణము మీరు మరచిపోలేదనుకుంటాను. లక్షల ఏండ్లనుండి మనం కాపాడుకుంటున్న ధర్మం, నీతి, సభ్యతలను మంటకలిపి, పూర్తిగా మన సంప్రదాయాలను నాశనంచేసి, మొత్తం గ్రామాన్ని మహమ్మదీయమయం చేయాలని మన శత్రువులు ప్రయత్నించారు. కాని పరమాత్ముని ఇచ్ఛ వేరు విధంగా ఉన్నందున మీరు తొందరగానే కండ్లు తెరచి తెలివిగా ప్రవర్తిం

చారు. అప్పుడు రామభూపాల్‌రావు మీకు శక్తివంచన లేకుండ సాయం చేశారు. భ్రష్టమగుతున్న ధర్మాన్ని కాపాడుటకు ధర్మాత్ముడుగా వారు ఆపని చేశారు. నిజంగా ఆ రాముడు భూమిని పాలిస్తున్నాడనిపించింది."

రైతులు ఒకరి నొకరు చూచుకున్నారు. వెంకటాచార్యులు ఉత్సాహంతో నవ్వాడు. విజయదేవు గంభీరంగా తల నాడించాడు.

"అట్టి రామభూపాల్‌రావుగారు పండిత విజయదేవును పిలిపించి, తనఇంట్లో తనవాడిగా చూచుకున్నాడు. మీకు ధర్మోపదేశముచేయుటకు అవకాశంకలిగించాడు. కాని ఈరోజు పండిత్ విజయదేవు ఏంచేస్తున్నాడో గమనించారా? లేదు. మీరు గమనించలేదు. అందువల్లనే పండిత్ విజయదేవు రామభూపాల్‌రావు గారికి వ్యతిరేకంగాచేసే అబద్ధపు ప్రచారాన్నినమ్మి రామభూపాల్‌రావుగారికి కృతఘ్నులుగా సిద్ధమయ్యారు. ఇది ధర్మమనిపించుకోదు. ఇదినీతిగాదు. ఇది మనఆర్యసంప్రదాయానికే విరుద్ధం. ఈసంగతి మీఅందరముందరపెట్టి విజయదేవు మాసంస్థకేగాక, మేలుచేసిన ఒక మహావ్యక్తియెడ ఏవిధంగా అన్యాయముచేశారో చెప్పాలని ఇంతదూరంవచ్చాను. దేశంలోవిపరిస్థితులు మీకుబాగాతెలియవు. మనలను ఊరుపేరులేకుండజేసి, మనసభ్యత, ధర్మములను నాశనముచేయుటకు మనశత్రువులు ఎడతెగక కృషిచేస్తున్నారు. ప్రభుత్వము సర్వసహాయాలు వారికిచేస్తున్నది. మనము నిరాధారులుగా, ఆత్మశ్వాసముతో ఇంతటికఠినమైనపనిని నిర్వర్తిస్తున్నాము."

పరంధామయ్య కొంటెగానవ్వుతూ "తురకలైతే ఒరిగిందిలేదు. హరిజనులైతే అనుభవిస్తున్నదిలేదు. అన్నిఎప్పటోల్నేఉన్నాయి" అన్నాడు.

"అవును, ఆర్యధర్మము దేశమునూలమూలకు వ్యాప్తికానంతవరకు మనస్థితి ఈవిధంగానేఉంటుంది. పైగా పండిత విజయదేవువంటివాండ్లు మధ్యబయలుతేరుతుంటే యింకాచెప్పాల్సిందిలేదు. బయటిశత్రువులకంటె ఇటువంటి ఇంటిశత్రువులే చాలాబలంగాఉంటారు. కాబట్టి మొదటవారు ఇటువంటి శత్రువులను దగ్గరికిరానీయకూడదు. మీరుబాగాఆలోచించుకోండి. నమస్తే" అని ప్రధాని ప్రసంగంముగించికూర్చున్నాడు.

విజయదేవు లేచినిలుచున్నాడు. గంభీరంగా తలనేలకువేసి ధ్యానం చేశాడు. అందరిని ఒకసారిపరికించాడు. "నన్నేమన్నాచెప్పమంటారా ?" గ్రామీయులనుచూస్తూఅన్నాడు.

"చెప్పండి, మీరుచెప్పేదికూడాయింటాం. మాకు కొద్దో, గొప్పో తెలుస్తూనేఉంది" అంటూ కొమరయ్య నెత్తిరుమాలుతీసి కిందబెట్టి నెత్తి రెండుచేతుల్తో గోక్కున్నాడు.

విజయదేవు మొదలు పెట్టాడు,

"నేను ప్రధానిగారికి సమాధానమివ్వగలశక్తిగలవాడినిగాను. ఊరి వాండ్లెంత మీరెంత అమాయకులో నేనుఅంత అమాయకుడిని. ప్రధాని గారివంటి త్యాగము, పట్టుదల, ప్రోత్సాహంలేనన్ను ఆర్యసమాజమువైపు ఆకర్షించాయి. నేనుచేసేప్రతిపని విచక్షణతో విమర్శించి, హృదయపూర్వ కంగానమ్మి చేస్తున్నాను. మనధర్మం, జాతి, ఎట్టిస్థితిలోఉందో, ప్రధానిగారు వివరంగాచెప్పారు. అట్టిస్థితికి బయటిశత్రువులకంటె, నిటువంటి ఇంటిశత్రు వులవల్లనే ఎక్కువహానికలుగుచున్నదని ప్రధానిగారన్నారు. యథార్థములో రామభూపాల్‌రావుగారివంటివారివల్లనే హానిజరుగుతున్నది. మా ప్రధాని గారికి పల్లెటూరివిషయాలతో అంతగా పరిచయంలేదు వారికి మనప్రాంతం, వాతావరణంకూడాకొత్త. ఈఊరిలో రామభూపాల్‌రావుగారు నందంటే నంది, పందంటేపంది అవుతుందని ప్రధానిగారికి నివేదించుకుంటున్నాను. ఆయన, ఆయనఇష్టంతప్ప వేరేవాండ్లు తలెత్తుకొనితిరగడం అసాధ్యము. ప్రజలుపండించేపంట, పిండేపాలు, సమకూర్చేనెయ్యి, పొతముచేసినభూమి. పెంచబడుపశువులు, అందమైనస్త్రీలు, అన్నిటిపై రామభూపాల్‌రావుగారి లేక అతనితొత్తులకన్నుంటుంది. ఎప్పుడువశముచేసుకొందామనిఆలోచిస్తుం టారు. కొద్దిలోచెప్పాలంటే అందరూ బానిసలుగాబ్రతుకుతున్నారు. పరిస్థి తులీవిధంగాఉంటే ఏగ్రామములో, ఏదేశములో ధర్మమునిలువదు. సభ్యత వర్ధిల్లదు. నీతికి స్థానముండదు, కుళ్లు, కుతంత్రం, కుట్రలు చలామణిఅవు తుంటాయి. ఈగ్రామములో రామభూపాల్‌రావుగారు, హైదరలీగారు,

వెంకటాద్రిగారుతప్ప మిగతావాండ్లంతా పశువులని వారిఅభిప్రాయము. మొత్తముగ్రామజీవితము తల్లక్రిందులుకావటానికి, నేను మీవద్దికి రావదానికి, రామభూపాల్‌రావుగారు మాప్రధాని నాయకత్వంకూడాకారణమైన హైనరలి తిరిగి రామభూపాల్‌రావుకు కుడిభుజంగానిలవడానికి అవకాశం ఏర్పడుతున్నది. ముఖ్యంగా నేనుచెప్పిందాంట్లో ఏమాత్రైనా అసత్యమున్నదో ప్రధానిగారు యిక్కడకూర్చున్నప్రజలను అడుగవచ్చును. ఇంటింటికితిరిగి తెలిసికోవచ్చును."

"అన్నీనిజమే" ప్రజల్లోంచి ఒకడన్నాడు.

"అయినప్పుడు ఈమురికికుంటలనుండి, ఈనరకకూపములోనుండి, రామునివంటి పురుషులు, సీతవంటిస్త్రీలు, ప్రహ్లాదునివంటివాలురు ఉద్భవిస్తారా ? అసంభవము."

ప్రధాని ఆతురతతో నిలుచున్నాడు. ప్రతీకారంగా విజయదేవును చూస్తూ, "వీటన్నిటికి ప్రభుత్వమేకారణము. ఒక దుష్టప్రభుత్వమున్నప్పుడు పరిస్థితులనుబట్టి, కొందరు లొంగిఉండాల్సిఉంటుంది. అయినప్పుడు రామభూపాల్‌రావుగారు ఒక్కరే ఏమిచేయగలరు? ధర్మబద్ధము, న్యాయయుతమైన ప్రభుత్వాన్ని సాధించిననాడే ప్రజలంతా బాగుపడుతారు. ప్రభుత్వయంత్రాంగము బాగుపడుతుంది. పరిస్థితులు మారుతాయి" తీవ్రంగాఅన్నాడు.

"ప్రతిగ్రామంలో రామభూపాల్‌రావువంటి మహాపురుషులు వర్ధిల్లుతూ ప్రజల నణచివేస్తుంటే ఎవరు ధర్మబద్ధము, న్యాయయుతమైన ప్రభుత్వాన్ని సాధిస్తారో అర్థంకావటంలేదు" అంటూ విజయదేవు ప్రజలనుప్రశ్నించాడు.

"తెలియకడుగుత. దొరవారు సాగించుకుంటున్నయన్ని ఇప్పటిసర్కారు చేయమంటున్నదా? రూపాయకు, అణా, రెండణాలపరిహారం మామూళ్లు, పెండ్లికికట్నాలు, కచ్చదానికిఎడ్లు, కమ్మనినెయ్యి, బలంగలఘాములు, అఖరుకు చెట్లపాదుల కూరగాయలు, అంతమారమెందుకు ? మన ఈప్రధానిగారు రాత్రిపడుకోడానికి మంచం ఎవరింటికాడ తెప్పించిండో తెలుసుకోరాదిరి. ఇయన్ని మానెత్తినకొట్టి తీసుకొమ్మని సర్కారుఅంటుందా? ఖాసా

నుందా? మీఅంత తెలియకపోయినా, జర, జర మాకుకూడ ఎరుకవుతున్నయి లేరి" చంద్రయ్య నిలుమండి. ఎడమచేయి రొంటిమీదపెట్టుకొని కుడిచేయిని ఆడిస్తూ గట్టిగాఅన్నాడు. ప్రజల్లో అలజడి ప్రారంభమైంది.

"నాదగ్గర బంగారంవంటి భూమిని అన్నాలంగా నిలువునా దోచుకున్నడు. మరి పధ్రానిగారేమంటరు" కొమరయ్య చంద్రయ్యను చూస్తూ అన్నాడు.

"ఎక్కడలేనిఅన్నాలం నీకెరికేనా చంద్రియపెద్దయ? మొన్న చెర్వులో మన్నుతోద్దాంటే సుంకరోడొచ్చి అటకాయించె. పేరుకేమొ ఇంత సప్పటబిళ్ల ఒకటి ఇచ్చినమంటిరి. పంజుకుంటె కుంచెడువడ్లు ఎల్లవు. పొద్దు మూకులు, అయినప్పుడు, కానప్పుడు దిక్కుమాలిన చాకిరిచేస్తుంటిమి. అశడే పోనియి, కుమ్మరోడు, ఇన్నికుండలు చేస్కనన్న బతుకుతడు అని దొర అనుకోడాయె" కుమ్మరి దుర్గయ్య మోకాళ్లపైకూర్చొని, నేలపై వ్రేళ్లతో గీతలుగీస్తూ చెప్పాడు.

"మీరు రెక్కలచాకిరిచేసుకున్నది మాగనంగ చెప్పుకుంటున్నరు. అప్పుపెట్టి అడిగిఅడిగి ఆయుస్సునిండుతున్నది. నేనెవడికి చెప్పుకోవాలె." దూరంగా కనీకనపడనట్టుకూర్చున్న కోమటి శంభయ్య తనలోతాను గొణుగుకున్నాడు.

"అంత మీముచ్చట్లేనా? మమ్ముల కనేదుందా?" హరిజనుల్లోంచి ఒకడన్నాడు.

"జుట్టు, మొలతాడుపోయి, బతుకులుబాగైతయని తుర్కాయని చేసిన ఆరాటం అంతింతగాదు. అప్పుడు ఏంయిచ్చంత్రమో మరి ఊరిజనమంత దొరపట్టైపోయిన్రు. ఉన్నఊళ్లె కూటికిచచ్చెరోజొచ్చె. అప్పుడుమరి దొరోరు పిలిపిస్తెనే యిజయదేవయ్యగారువచ్చి, నిప్పుచేసి, నెయ్యిపోసి, ఏమేమోసదివి మళ్ళామేము ఎప్పటాలెఅయినమనిసెప్పిరి. సరే. అదిపోనియిరి గని, మళ్ల మాచేగారి, తన్నులు, తరుమడం మాకొచ్చిందిగని, ఒక మాటడుగుత, పొద్దస్తమానం చలికి, ఆనకు, వడగాడ్పుకు బంచెరదొడ్డికాడ

నీల్గి, నీల్గిచస్తే దయపుడ్తె రెండుపైసలుచేతులేసిరి, లేకుంటె అంగుష్ఠిముద్ర ల్తోనే అయిపాయె. అసలు ఖానూనేంది? దొరచేస్తున్నదా? సర్కారు చెయ్య మంటున్నదా? తెలిసిన మారాజులు వచ్చినుర్రి చెప్పరాదురి." ఇంకొక హరి జనుడు అన్నాడు.

"అప్పుడు దొరకు, హైదరలీకి ఎడమొకం, పెడమొకంఅయిందే. మరి ఇప్పుడు మూతులుకలపటానికి చూస్తున్నరంటరు. నిజమేనా? అసలు ఇదేం నాటకమోంట. మరి ఎవరు ఈసంగతి అడగరు? మళ్ళా మాచాపలకు తిప్పలొస్తది" బెస్తఫకీర అన్నాడు.

"ప్రధానిగారు తురక, హిందువు అనిఅంటున్నారు. మరి ఇప్పుడు కష్టాలు చెప్పుకున్నోళ్లంతా హిందువులేనయిరి. దొర హిందువేనాయె. మాను కుంటె ఎవడన్న కొట్టొచ్చిండ?" పరంధామయ్య ప్రశ్నించాడు.

"మనం సూడటంలేదే, సర్కారుమన్సులు తురకైనా, మనోడైనా చేసేగోల, ఆరాటం, తిట్లు, కొట్లు, అదికావాలె, ఇదికావాలెఅని అల్లుండ్లోలె అన్నిసాగించుకొని పొట్టపగులమెక్కి, మిగిలింది మూటలుకట్టుకొనిపోటల్లే రేదే." చాకలి సర్వయ్య గొంతుసరాయించుకొని అన్నాడు.

"ఆ యిందువేందో, తుర్కేందో, హైదరలి బీట్లకుపొయినా, దొర గారి ఏనెకుపొయినా, రైతుల గెట్లపొంటెపొయినా జివాలను అడుగుపెట్టని య్యరు. మాతాత ముత్తాతలకాలంనుంచి గొల్లోండ్లుఉన్నరాయె. నీయవ్వ ఒక్కడన్న పాపమన్నారె?" గొల్లవీరయ్యఅంటూ జకముకకొట్టి చుట్ట ముట్టించాడు.

"వీటన్నిటికి రామభూపాల్‌రావుగారే కారకుడని పండిత విజయ దేవు మీనెత్తికెక్కించాడన్నమాట." పర్రిధాని తలఊపుతు అన్నాడు.

"మీసంగతే అర్థంకావడంలేదు. ఇవన్ని నేర్పితే వస్తాయండీ? బాధలు పడలేక, పడలేక, కడుపులుమండి, దేవుడాయని మొత్తుకుంటుంటే, మీరీవి ధంగా మాట్లాడటం తమాషాగాఉంది" పరంధామయ్య హేళనగాఅన్నాడు.

ఇంతలో విజయదేవు లేచినిలుచున్నాడు. గుస, గుసలు, గొణుగుడు ఆగిపోయింది. "చప్పుడుచేయకుండతా!" అనిఒకడన్నాడు. "గొల్లోడికి చుట్ట కాల్చడానికి ఇప్పుదేతోచిందే. నలిపేయరాదురా?" ఇంకొకడన్నాడు. "ఏందే!. అక్కడ వాండ్లేంమాట్లాడు తున్రి? నువు కల్లునీళ్ల సంగతి రీశినవు" ఇంకొకడు గద్దించాడు.

విజయదేవు తిరిగిమాట్లాడసాగాడు. "ప్రధానిగారివిషయము మనం ఆలోచిస్తూకూర్చుంటే, వారిని ఒకరొకరు ప్రశ్నిస్తుంటే కలిగే లాభముండ బోదనిఅనుకుంటాను. మీకష్టాలనుగురించి మీరుఆలోచించుకున్నట్టే ప్రధాని గారికి వారి స్వంతఅభిప్రాయాలున్నాయి. అవి కావాలనగానేరావు, వద్దనగానే పోయేవిగావు. ఇప్పుడు మీరంతా చెప్పినవిషయాలపై ప్రధానిగారు ఆలోచిం చకపోరు. నిజానిజాలు అర్థంకాకపోవు, కాని ఇప్పుడసలు ప్రధానిగారు ఇంత దూరం వచ్చింది, మీగురించికాదు, నాగురించివచ్చారు. నేను రామభూపాల్ రావుగారికి ఆర్యసమాజానికి అన్యాయముచేశానని ప్రధానిగారు నాపై నేరాలు మోపారు. కానీ నేరస్తురెవరో మీరుతేల్చివేశారు. సంతోషం. నాకంతేచాలు. ఈనాటిపరిస్థితులలో నేను ఆర్యసమాజానికి పనికిరానివాడనని ప్రధానిగారు భావించిలే అది నాదుర్భాగ్యమని తలుస్తాను. సంస్థతో నాకు సంబంధాలు లేకున్నా, సంస్థకు జీవాలైన ఆశయాలు నాలోనశించిపోనంతవరకు నేను ఆర్య సమాజీయుడననే అనుకుంటాను. ఇది ప్రధానిగారియెదుట, సమాజానికి జీవ పట్టైన మీయెదుట ప్రమాణము ప్రతిజ్ఞచేస్తున్నాను. నమస్తే" విజయదేవు చాలించగానే, అంతాలేచారు. ప్రధానిగారికి బాధకలిగింది. వచ్చినప్పటి ఆత్మ విశ్వాసము సడలిపోయింది. కాని అంతమందిముందట అసమర్థుడుగా వెళ్ళి పోవడం అవమాన మనుకున్నాడు. లేని గాంభీర్యం కల్పించుకొని, విజయ దేవును, దగ్గరికిపిలిపించుకొని, చుట్టుకొందరు గుమికూడియుండగా అధికార ధ్వనిలో హితవు చేశాడు.

"ఈపరిస్థితిలో నేనుచెప్పేది మీనెత్తికెక్కేట్టులేదు. అర్థమయ్యేట్టు లేదు. అయినా ఇంకా సమయంమించిపోలేదు, కొంచెం శాంతంగా ఆలోచిం

చుకోండి. నేనేమి ఒళ్లుమరచి మాట్లాడటంలేదు. మీప్రజల వాదనలు నాకొక లెక్కకాదు. ఏమీతెలియని మూకను వెంటవేసుకొని ఏమేమో ఆలోచిస్తున్నారు. వాండ్లంతా నీకేదైనా తోడిపెడ్తారని ఆశపెట్టుకున్నట్టుంది. వాళ్ళది గొర్రెదాటుతత్వం. మీమంచికే చెపుతున్నాను. అంతగా మీకుఈవిధంగా పని చేయాలనిఉంటే పాయెగాప్రాంతాలున్నవి. ఎన్నోజాగీర్లున్నాయి. అవన్నివదలి ఒక పల్లెటూరిదొరవెంటపడ్డా రెందుకు ? సరే చెప్పతలచుకున్నది చెప్పాను. ఆపైన మీఇష్టం" అని ప్రధాని వెంకటాచార్యులుతో గదిలోకి వెళ్లిపోయాడు.

గ్రంథాలయంనుండికూడా అందరు వెళ్ళిపోయినారు. ఆనాటి సమావేశం గ్రామీయుల్లో చాలాఉత్సాహం రేకెత్తించింది.

"పాపం మీప్రధానిగారికి భలేప్రాయశ్చిత్తమైంది. అసలు వాండ్లకు పల్లెటూర్లంటె మెదడుండదని, ఆలోచించరని అనుకుంటారు. దానికితగ్గట్టు భలే భలే సంగతులువెళ్ళాయి.'' భోజనంచేస్తూ పరంధామయ్య విజయదేవుతో అన్నాడు.

"ఇటువంటివి ఒకటి రెండువోట్లఅయితేగాని వాండ్లు కండ్లుతెరవరు. అదిగాక ఇదివరకు వాండ్లు అవునన్నది కాదన్నవాడుండేగా ? పెద్దవాండ్లేమన్నా తలఊపడంతో పెద్దవాండ్లు తమనితామే మరచిపోతుంటారు." అని విజయదేవు ఫక్కున నవ్వాడు.

# 16

కంఠీరవం నిజామాబాదు జైలులో ఆరుమాసాలుఉన్నాడు. మొదట కొన్నివారాలు దిగులుగాగడిచింది. మొదట కోటగా, తర్వాత మందిరంగా, పిమ్మట జేలుగామారిన ఆగుట్టనుగురించి ఎల్లప్పుడు తీవ్రంగాఆలోచించేవాడు. సమాజోద్ధరణకై పుట్టే ప్రతితత్వము, ఆశయాలు, ఆచరణలో కోతియూపు దాలుస్తున్నట్టు ఆగుట్ట ఆస్థితికి వచ్చిందనుకున్నాడు. కాని ఉన్నతమైన ఆశయాలు తాత్కాలికంగా వికృతరూపముదాల్చినా, తుదకు దాని ప్రాతిపదిక

విషయము ఒకప్పుడుగాకపోయినా ఒకప్పుడు సత్ఫలితాల నివ్వకతప్పదని కంఠీరవం ఆత్మ తృప్తిపడింది.

ఆజేలులోని ఖైదీలతోపాటు కంఠీరవం గుట్టపై చెట్లుకొట్టడం, నీళ్ళుతేవడం, సమిష్టిగా వంటచేసుకోవడం అతనికి ఉత్సాహంగాఉండేది. తన అవసరాలు స్వయంగా కష్టించితీర్చుకోవడం అతని ఆత్మకెంతో హాయి నిచ్చాయి.

జేలుబారెకులు మూసిందిమొదలు నిద్రవచ్చేవరకు ఖైదీలకు ఏవేవో చెప్తుతుండటం, వారి జేలుజీవితానికి కారణాలను, కారకులను అడిగితెలిసి కొనేవాడు. వారి జీవితస్థితిగతులు తెలిసికోవడం కంఠీరవానికిసరదాగాఉండేది. ఆవిధంగా ఎన్నోకొత్త కొత్త విషయాలుతెలిసి, అతనిలోఆలోచనలు రేకెత్తసాగాయి. కంఠీరవంలో ఎంతోమార్పువచ్చింది. జేలుకు రానంతవరకు అన్యాయమైనఅధికారమన్నా, అవస్థపాల్జేసే వ్యక్తులన్నా కంఠీరవం సహించలేకపోయేవాడు. కాని వైష్ణవులు మొదలగు అగ్రజాతులవారికి ఇతరకులాలవారి యెడ చూపేవైఖరి, ఆచారవ్యవహారాలు మొదలగు విషయాల్లో కంఠీరవం పట్టింపు సడలిపోలేదు. జేలుజీవితంలో ఆపట్టింపు సడలిపోయింది. నాటివరకు తాను చాలాతప్పుచేశాడని పశ్చాత్తాపపడ్డాడు.

తర్వాత హైదార్బాదు జేలుకుమార్చబడ్డాడు. అతనిలో ఎన్నో కొత్త, కొత్త ఆలోచనలు బయలుదేరాయి. ఆశ్చర్యం కలిగించే, ఆవేదన పురికొల్పే, ఆందోళనరేకత్తించే ఎన్నోసంఘటనలు జేలులోజరుగుతుండేవి. నిజామాబాదుజేలులో, ఖైదీలకు, జేలుఅధికారులకు లేనిభయం హైదార్బాద్ జేలు అధికారులకుఉండటం కంఠీరవానికి ఎంతోవింతగాతోచింది. సర్కసులో అడవిమృగాలను ఆడించేవాడు చేతిలో ఒకకొరడానుమాత్రంపట్టుకొని, తన ప్రాణభీతిని ప్రేక్షకులకు వ్యక్తంకాకుండా కపటగాంభీర్యంతో, చాకచక్యంగా వ్యవహరించాడు. కానీ జేలుపెద్ద అధికారి జేలు లోపలిఆవరణలో కాలు పెట్టిందిమొదలు తిరిగి ఆఫీసులోకి చేరుకునేవరకు అతని అంగరక్షకులుపడే జాగ్రత్త, హడావుడి, అధికారిచూపే మేకపోతుగాంభీర్యము కంఠీరవానికి

ఆశ్చర్యంవేసింది. అంతభయంతో ప్రాణాలు గుప్పిట్లోపెట్టుకొని జేలు ఉద్యోగం చేయకుంటే గత్యంతరంలేదా ? అనుకున్నాడు. కాని తుదకు ఒక మానవుడేగా కావల్సిందిఈపనికి ! కాబట్టి తప్పదనుకున్నాడు.

కొంతమంది ఖైదీలు జేలునే వసతిగృహంగాపెట్టుకొనిఉన్నారని తెలిసింది. కొందరు 20, 25 ఏండ్లశిక్షలవాండ్లున్నారని. వారిఅభియోగముల విచారణపూర్తికావడానికి ఆరు, ఏడుఏండ్లుపట్టిందని ఆకాలము అసలుశిక్షలో చేర్చబడదని కంఠీరవంపడ్డబాధ అంతింతకాదు.

దీర్ఘ శిక్షలవాండ్లలో ఎక్కువమంది రైతులే. గ్రామాధికారుల కుట్రలకు గురియై, విసిగి వేసారి, రెచ్చిపోయి చేసినహత్యలు, ఒకరికినొకరికి విద్వేషాలుకల్పించి, ఒకరికిసాయంగా నిలబడి చేయించినహత్యలు, డబ్బునే ప్రధానంగాతలచిదాంపత్యవిలువను,కుటుంబకట్టుబాట్లను, పరహితమునుపాటింపక జరిగే అవకతవకలను, అరాజకపరిస్థితులను నెదుర్కొనుటకై చేసినసాహస చర్యలు ఇవే దీర్ఘశిక్షలకు ప్రధానంగా, వెనుకనున్న చరిత్రయని కంఠీరవం తెలిసికొన్నాడు. సహజస్వరూపమును, పరిపాలనయొక్క భయంకరదృశ్యమునుతలచుకొని బెంగపడ్డాడు. దారంలేని గాలిపటంవోలెనున్న ప్రస్తుత వ్యవస్థను సహించి సాగనివ్వటం మహాపాపమని నిశ్చయించుకున్నాడు. "మేధావులేమిచేస్తున్నట్టు ?" తనలోతాను మధనపడ్డాడు.

దీర్ఘకాలం శిక్షలఖైదీలు క్రమంగా జేలుసిబ్బందికి ప్రధానభృత్యులుగా మార్చబడి వారిద్వారా జరిపించబడే హింసలు, నడిపేకుట్రలు విని కంఠీరవం హృదయం తల్లడిల్లింది.

అయితే నేరానికి దారి తీసినవారి ప్రవృత్తిలో వెంట్రుకవాసికూడా జేలు జీవితములో మార్పురావటంలేదు, అవకాశముకూడాలేదు. పైగా రెచ్చిపోయి ఇంకా సాహసచర్యలుచేయడమో లేక లొంగిపోయి హృదయంలేని జేలుకట్టుబాట్లలో యింకాదిగజారిపోవడమోజరుగుతుంది. దాంతోఅన్నివిధాలా బానిస ప్రవృత్తిని అలవరచుకోడంజరుగుతుంది. ఖైదీలజీవితాలు ఆవిధంగా పరిణామంచెందటం కంఠీరవం ఆలోచించినకొద్దీ ఆందోళన ఎక్కువకాసాగింది.

కంఠీరవం నేతశాలలో పనిచేయవానికి నిశ్చయింపబడ్డాడు. ఒకనాడు బారెక్ వాచ్ మెన్ తోకూడి హాస్పిటాల్ కువెళుతున్నాడు. హాస్పిటాలుముందట చెట్లలో ఒక ఖైదీకూర్చొనిఉన్నాడు. "నాదేంతప్పురేమ"అని నిమిషానికి, ఐదు నిమిషాల కొకసారి అంటున్నాడు. తనసుట్టు ఎవరులేనట్టు, అడవిలో కూర్చు నట్టుఆ ఖైదీ పూర్తిగా పరధ్యాన్నంలోఉన్నాడు. ముందటపడిఉన్నరాళ్ళను ఏరి దూరంగాపారెస్తున్నాడు. కంఠీరవం అతన్నిచూడగానే హటాత్తుగా ఆగిపో యాడు. ఆఖైదీనిగురించి అక్కడఉన్నవారెవరూ శ్రిద్ధవహించటంలేదు. కంఠీరవం ఆశ్చర్యంతో వెంటవచ్చిన వాచ్ మెన్ను, ఖైదీనిగురించిఅడిగాడు. వాచ్ మెన్ నిర్లక్ష్యంగానన్నాడు, "రెండేండ్లాయెపిచ్చిలేసి ఎప్పుడూ అట్ల అంటుంటాడు." అని వాచ్ మెన్ హాస్పిటాల్ లోప్రవేశించాడు. తర్వాత ఖైదీ గురించి కంఠీరవం వివరాలుతెలుసుకున్నాడు. అతడు జేయిలో కుట్టుపని మీదఉండేవాడని, చాలాభయంతో నిర్ణీతమైనపనిచేసేవాడని, అయినాఅతనిపై కొందరు తోడిఖైదీలు చాడీలుచెప్పిఅధికారులతో,తీవ్రంగాకొట్టించారనిదానితో మానసికంగా ఒకనెలవరకుకృశించి, తర్వాత పిచ్చివాడుగామారాడని, మొదట్లో మంచి దేహదారుఢ్యంకలిగి, భయంకరంగాఉండిన ...కమరాఠా యువకుడనీ, అన్నదమ్ముల భూములపంచాయితిలో అయిదేండ్లు శిక్షపడి జేలుకువచ్చాడని కంఠీరవానికితెలిసింది. ఆరోజంతా కంఠీరవం దిగులుగా గడిపాడు. అన్నంవంటబట్టలేదు. తలచుకొని, తలచుకొని కన్నీరుపెట్టాడు.

ఒకనాడు కంఠీరవం తోడిఖైదీలతోకూర్చొని రొట్టెలతింటున్నాడు. గోడఆవలినుండి బొబ్బకేకలువినవచ్చాయి. కంఠీరవం తత్తరపడ్డాడు. రొట్టెను అక్కడపడవేసి బారెక్ గేటువద్దికివచ్చి తలుపునులాగిచూస్తే బైట నుంచి గొళ్లెంపెట్టిఉంది. ఏమీచేయలేక పిచ్చివానిలాగ ఆ గేటునుండి, బయటవినబడ్తున్న కేకలు శ్రద్ధగావింటున్నాడు. కొద్దిసేపటి కేకలుమామూ లుగామారాయి. కంఠీరవం వెనుకకుతిరిగి రొట్టెలదగ్గరకువచ్చి నిలుచుండి గేటు వైపు దిగాలుపడిచూడసాగాడు. ఇతరఖైదీలు తమదేమిపట్టలేనట్లు చలా సాగాకబుర్లుచెప్పుకుంటూ .రొట్టెలతింటున్నారు. కంఠీరవం విచారంతో పచా

రుచేయసాగాడు. ఇంతలో ఒక ఖైదీని ఇద్దరు మోసికొనితెచ్చి, అదేబారెకులో పడేసివెళ్లిపోయారు.

ఆ ఖైదీబోర్లపడుకొని మూల్గసాగాడు. నల్లగా నిగనిగలాడుతున్న ఆ యువకుడు పక్కకుపొర్లాలని ప్రయత్నముచేశాడు. కాని సాధ్యపడలేదు. కంఠీరవంవెళ్ళి అతనివద్దనిలుచుండి దీనంగాచూశాడు. ఇతర ఖైదీలురొట్టెలు తినడంలోను, చిప్పలుకడగటంలోను లీనమైఉన్నారు. బాధపడుతున్న ఆ యువకునిగురించి అంతానిర్లక్ష్యంతోఉన్నారు. కొద్దిసేపటికి ఇద్దరు వాచ్‌మేన్‌లువచ్చి ఆయువకుని పిర్రలపైబట్టను తొలగించారు. స్పిరిటుతోశుభ్రము చేశారు. టించర్‌ఐడిన్ రుద్ది, నోట్లో మందు పోసి వెళ్ళిపోయారు. ఆ యువకుడు మంటకు తాళలేక పెద్దగా మూల్గాడు. కంఠీరవం తన చేతితో విసురుతు పక్కకు కూర్చున్నాడు. ఇంతలో ఒక వాచ్‌మెన్ ఇన్ని పాలు తీసికొని వచ్చి, ఆయువకుని ముందట పెట్టి, "ఏయ్ బషీర్, పాలుతాగు" అని, కంఠీరవాన్ని వింతగాచూస్తూ వెళ్ళి పోయాడు.

కంఠీరవం ఆపాలను బషీర్ నోటికి అందించాడు. బషీర్ కష్టంగా తలపైకెత్తి పరీక్షగా చూచి, "సలాం మారాజ్" అని ఆయాస పడుతూ పాలుతాగాడు. కంఠీరవం గంభీరంగా తలనాడిస్తూ "సలాం" అన్నాడు. పాలుతాగి, బషీర్ తిరిగి మూల్గసాగాడు.

బారెక్ తాళాలు వేసిన తర్వాత బారెకులో, చెవులు చిల్లులుపడేంత సందడిగా ఉంది. కొందరు. ఖురాన్ పారాయణం, కొందరు భగవద్గీత, కొందరు బాలశిక్ష, కొందరు పాటల పుస్తకాలు, కొందరు నోటి పాటలు ఈవిధంగా బారెకంతా పల్లెటూరి బడిలాగ గోలగా ఉంది. కంఠీరవం బారెకు లోని ఈచేష్టలను శ్రద్ధగా గమనిస్తూ, అవి తనపై వేస్తున్న ప్రభావానికి బాధపడుతూ, బషీర్ పక్కన విచారంగా కూర్చున్నాడు.

చాలాసేపటికి ఆ ఖైదీ మూల్గు ఆగిపోయింది. కునుకు పట్టింది. అప్పుడు కంఠీరవం అక్కడినుండి లేచి తన పక్క మీదికి చేరుకున్నాడు. కాని కంఠీరవానికి రాత్రంతా నిద్రపట్టలేదు. బాధపడుతున్న ఒక ఖైదీ విష

యమై తోడి ఖైదీలు చూపుతున్న నిర్లక్ష్యానికి, మానసిక ప్రవృత్తికి బాధ పడ్డాడు. చాలాకష్టంగా ఆరాత్రి గడిచింది.

పొద్దునే అందరితోపాటు బషీరు కూడాలేచి నిత్యకృత్యాలు తీర్చు కుంటున్నాడు. కంఠీరవం ఆశ్చర్యంతో బషీర్‌ను చూస్తున్నాడు. దగ్గరికి "వెళ్ళి బాధ పూర్తిగా తగ్గిందా?" ప్రశ్నించాడు. "ఆ తగ్గినట్టే. కొంచెం పచ్చిగాఉంది. రేపటికి ఆపచ్చి కూడా లేకుండ పోతుంది." బషీరు సమా ధానమిచ్చి, రొట్టె తీసికునే వరుసలొకూర్చున్నాడు.

కంఠీరవం బషీరును వింతగా చూస్తూ అతని పక్కనే కూర్చున్నాడు. అందరితోపాటు రొట్టెనుతిని తన పనిలో ప్రవేశించాడు. బషీరు, హాస్పి టాల్ ముందట పిచ్చివాడు, నేతశాలలో పనిచేస్తున్న కంఠీరవం కండ్లలో ఆడుతున్నారు. సాయంత్రం తిరిగి బారెకులోకి చేరుకునే వరకు బషీరు, కాళ్ళ గొలుసులు, నడుముకు కట్టి ఉండి, ఉత్సాహంగా తోటి ఖైదీలతో మాట్లాడుతున్నాడు. కంఠీరవం బషీరు వద్దికి వెళ్ళి, "అప్పుడే ఇవన్ని ఏమిటి?" ప్రశ్నించాడు.

"పైటపనికి పంపుతున్నరు. లేకుంటే ఈ జేలోళ్ళు కూచబెట్టి తిని పిస్తారు?" బషీరు అంటూ, నెత్తి టోపీతీసి, తెచ్చుకున్న ఎంగిలి సిగరెట్లను కింద దులిపి, ఏరుకొ సాగాడు.

దాంతో బషీరుకు జేలు జీవితం కొత్తకాదని కంఠీరవం తేల్చు కున్నాడు. "రొట్టెవచ్చే వేళైంది. నేను చిప్ప కడుక్కొని వస్తా" అని కంఠీరవం నల్లావద్దికి వెళ్ళి, వచ్చి, బషీరు పక్కనే కూర్చున్నాడు.

"నొప్పి ఎట్లా ఉంది? తగ్గిందా?" కంఠీరవం సానుభూతిగా అడి గాడు.

"ఏంది నీకింత శ్రద్ధ?" అన్నట్లు బషీరు కంఠీరవాన్ని చూసి, మందహాసముతో, "నాదెబ్బలమీద నీకు చాలా శ్రద్ధ ఉందే?" అంటూ చిప్పలోని నీళ్ళని పీల్చివేశాడు "సానాతప్పైంది". అన్నాడు.

"బషీర్! నిన్న నీ అవస్థను చూచినప్పటి నుంచి నీవంటె నాకు ఓ విధమైన ప్రేమ, సానుభూతి ఏర్పడింది. ఎన్ని దెబ్బలు కొట్టారేం?" కంఠీరవం చిప్పను తుడుచుకుంటూ అడిగాడు.

"పన్నెండు దెబ్బలు. అసలు ఇవో దెబ్బలకింద లెక్కనా? కొట్టి, కొట్టి పిర్రలు మొద్దుబారి పోయినై. మొదటిసారి దెబ్బలు మాత్రం మరిచి పోను. అప్పుడు నాపిర్రలను చూస్తే నువ్వు గుండెపగిలి చచ్చే టోడివి! నెలరోజులు దవాఖానాలో లేవలేకుండ పడ్డాను. చూడటంలే. నెనెట్లా నడుస్తున్ననో? నరాలు పట్టేసినై." బషీరు కొంచెం విచారంగానే చెప్పాడు.

"దేంతో కొడ్తారు? మొదటిసారి ఎన్ని కొట్టారు?"

"మొదటిసారి రెండు డజన్లు, రెండోసారి డజను, ఇప్పుడోడజను. ఎదురు బెత్తం నూనెలో నానబెట్టి దెబ్బమీద దెబ్బకొడ్తారు. అప్పుడు డాక్టరు, జేలు పెద్ద దొర దగ్గర ఉండి కొట్టిస్తారు. మొదటిసారి కొట్టి నప్పుడు మూడు దెబ్బలకే బేహోష్అయిన. అప్పుడు డాక్టరు మందుపోసి, మళ్ళా కొట్టమన్నడట. మళ్ళా కొట్టేవరకు పిర్రలు పగిలి చర్మం లేచి వచ్చింది. డాక్టరు దాన్ని కత్తిరించి, మళ్ళా నోట్లో మందుపోసి కొట్టించిం డట. వాండ్లెన్నిసార్లు ఆవిధంగా కొట్టినోరో! నాకు మతిలేదు. రెండో నాడు దవాఖానాలో కండ్లు తెరిచిన." బషీరు కొద్దిసేపు గంభీరంగా తల నేలకువేసి విచారంగా నేల వైపును చూచి, "మీపేరే మంటిరి? నీలకంఠం, ఊఁ కాదు, కంఠీరవం, ఒకమాట చెప్త. ఆ దెబ్బలతో నామగతనం కూడా పోయింది" చాలాబాధతో అన్నాడు. "రా అట్లా కూర్చుందాం, కొట్టె వచ్చే వేళైంది." అని బషీరు అనగానే కంఠీరవం లేచాడు. ఇద్దరు పెళ్లి వరుసలో కూర్చున్నారు.

"ఇంతకు నీవు ప్రతి పర్యాయం చేస్తున్న అంత ఘోరమైన నేర మేంది."

"చేసేది దొంగతనమే! మరేమికాదు. అదే నావృత్తి అనుకోరాదు. కాని చిన్న వయసోండ్లను మొదట బెత్తపు దెబ్బలు కొడ్తే భయపడి ఇక

మీద దొంగతనం చేయరని సర్కారు అనుకుంటడట. కాని నేను మూడు సార్లు జేలుకు వచ్చిన. ఆదెత్తపు దెబ్బల భయం పోయింది. జేలుభయం అంతకూలేదు. కొన్నాళ్ళు బయట, కొన్నాళ్ళు దీంట్ల. అంతే. అగో: రొట్టె వచ్చింది'' అని బషీరు అన్నాడు.

రొట్టెలు పంచేవాడు వరుసగా పంచుతు, బషీరు వద్దికిరాగానే, "ఊహుం మళ్ళాతయారైనావ్?'' అన్నాడు.

"మిమ్ముల సూడంది పొద్దుపోదు మల్లన్నా, సరేగాని ఒక రొట్టె ఎక్కువెయ్యి'' బషీరు అన్నాడు.

"నీకు బయట కాలునిలుస్తాది! జేల్ను ఇల్లు చేసుకుంటరు" అనుకుంటూ ఒక సగం రొట్టెను బషీరు చిప్పలో వేశాడు.

"మీరు ఎప్పటికి ఉంటూంటే మేం మళ్ల, వస్తుంటం, దాన్దేంలే" బషీరు కొంటెగా నవ్వుతు సమాధానమిచ్చి, కంఠీరవాన్ని చూచాడు. "అట్ల పోయి సూసుందాంరా" అని బషీరు అక్కడినుంచి లేవగానే, కంఠీరవం కూడా అనుసరించి వెళ్ళాడు.

బషీరు ఎక్కువగా తీసుకొన్న రొట్టెను కంఠీరవం చిప్పలో వేస్తు, "మాకు బయటికంటె, ఇక్కడెన్నె దోస్తులెక్కువున్నారు'' అన్నాడు.

"అంత బతిమిలాడి తీసుకున్న రొట్టె నాకిచ్చావేం?''

"నాకెందుకు? నీకోసమే అడిగిన. నేను ఇయ్యాల డాక్టరింట్ల దోసెలుతిన్న.''

"జేలుకు రావడం మానుకోరాదు బషీర్!"

"ఏం? ఎందుకు? సరే, నీవన్నందుకు మానుకుంటననుకో. నన్ను మా వోళ్ళు ఊరికె ఉండ నిస్తారు? వాండ్లను తప్పించు కున్నా పోలీసులు ఊరుకోరు. మాది ఓ పెద్ద గుంపు ఉంది. మేమంతాకలిసి ఎక్కడ, ఎప్పుడు, ఎవరు, ఏవిధంగా దొంగతనం చేయాల్నో మాట్లాడు కుంటం. చేస్తుంటం. ఆగుంపుల చేరినాక ఇంకోపనికి మన సొప్ప దసలు." రొట్టెను పిండివేస్తు

అన్నాడు. "ఇప్పుడు ఈజేల్లనే ఎంత లేకున్నా ఇరువై మందైనా మా వోళ్ళున్నరు. అయ్యో! నీకు పప్పు సాలనట్టుందిగద!" కంఠీరవం చిప్పను చూస్తూ అన్నాడు.

"దెబ్బలుతిని నువ్వు అవస్థపడుతుంటే మీవాండ్లు ఒకడు కూడా పాపమన లేదే?"

"ఇయన్ని మామూలేనాయ్ అన్ని ఎర్కుండే మేషి పనులుసేస్తుం టం. ఒకడి కోసం ఇంకోడు తలపట్టుకూర్సుంటే ఇగ ముందర పడ్డట్టే. అయినా యీదెబ్బల్తో ఏమైద్ది?" బషీరు నిర్లక్ష్యంగా సమాధాన మిచ్చాడు.

"అయితే బషీర్! నీ వూరేదో చెప్పలే!"

బషీరు ముసి, ముసిగా నవ్వుతూ కంఠీరవాన్ని చూచాడు. "ఇన్ని యిన్నాక నావూరు అడుగుతున్నావ్?" అన్నాడు. "ఎక్కడ అందరం కలిసి ఉంటే అదే మాఊరు, సమయానికి ఎవరు దొరికితే వాండ్లే మాకు పెం డ్లాలు. ఏది దొర్కితే అదే మా సొమ్ము."

కంఠీరవం రొట్టెను నములుతూ పరధ్యాన్నంలో ఎదురుగా ఉన్న నల్లా నీళ్ళ ప్రవాహాన్నిపరికించసాగాడు. వాండ్ల జైలు జీవితంపై అసహ్యం కలిగింది. దీక్షగా బషీరును చూడసాగాడు. బషీరు తలవంచుకొని రొట్టెను తింటున్నాడు. కంఠీరవం దృష్టి బషీరు చెవులరంధ్రాలపైపడింది. ఆశ్చర్య పడ్డాడు. "నీ చెవులు కుట్టి ఉన్నాయే' నువ్వు మహమ్మదీయుడవు గదా! ఇదేంది మరి?" అన్నాడు.

బషీరు వింతగా కంఠీరవాన్ని చూచాడు. అతని ముఖంలో మార్పు కలిగింది. ఏదో జ్ఞాపకం వచ్చినట్లు గంభీరంగా తలనేలకు వేశాడు.

"నీ కులమేంటి బషీర్?" మెల్లగా అడిగాడు.

"ఏం చేస్తవు నాకులం తెలిసుకొని? అయినా అడిగినందుకు చెప్త. కాని ఇంతవరకు నాగురించి నీవోలె పట్టి, పట్టి ఎవ్వరు అడగలె. మాకుల మేదైతేం, మాదేవుడైతేం. మాపనులు మేము చేసుకుంటు పోతాం.

ఎవరేదైనా చేసేపని ఒకటేనాయ్, మాబతుకులు చాలా తమాషగఉంటయి." బషీరు తల నేలకు వేసుకొని అన్నాడు.

"నా ప్రశ్నలు నీకు కష్టమనిపిస్తున్నయా?"

"నువ్వు దోస్తువని అడుగుతున్నవ్. నాకెరికేలే" అని బషీరు లేచి నల్లావద్దికి వెళ్ళి మంచినీళ్లుతాగి వచ్చి కూర్చున్నాడు. "మాది వరంగల్ జిల్లాల్నో. నల్లగొండజిల్లాల్నో ఏదో ఊరట. మాఅయ్యా, అమ్మ కోమటోండ్లట. నా యజమాని ఒకసారి కోపంవచ్చి తిడ్తూ. "కోమటి బుద్ధి పోనియ్య వైతివి" అన్నాడు. అప్పుడు నేను కోమటోన్నని అనుకున్న."

"నీకు యజమాని ఎవరు బషీర్?" మధ్యలో కంఠీరవం ప్రశ్నించాడు.

"నువ్విట్ల ఒక్కొక్కటి అడుగుతుంటే నాకెరుకున్న యన్ని చెప్పేస్త ఇగ."

"నేనిట్లా అడుగటం నీకు కష్టమనిపిస్తే మాత్రం నిన్ను బలవంతం చేయను." నువ్వు ఒక్కొక్కటి చెప్పుతుంటే ఇంకా వినాల్ననిపిస్తున్నది.

"సరే అయితె. నాకు ఆరు ఏడేండ్లు ఉన్నప్పుడు మా ఊరికి ఒక తుర్క గిర్దావరు వచ్చిండట. ఆయననన్ను సాదుకుంటనని తెమ్పకుండంట. అప్పుడు సానాకరువుపడి, సానామంది పిల్లల్ను అమ్ముకున్నరట గద. మా వోళ్ళు ఏమన్న పైసల్ తీస్కొని నన్ను గిర్దావరుకు అమ్మిండొచ్చు. గిర్దావరు తిరిగిన చోట్లన్ని తిప్పిండు. ఆగిర్దావరు ఊర్కొర్కనే కొట్టుందేది. అంతరాత్రి దాంక, ఆయన పనై, నిదర్రి పట్టిందాక నన్ను పడుకోనియ్యక పోయేది. అడ్నించి లేచిపోదామని సానాసార్లు అనుకున్న. ఎందుకో పోబుద్ధి పుట్టలే. గిర్దావరు పెండ్లాంభలేమంచిఘుండే. ఆని కేం రోగమోగాని, గిర్దావరు పాపం ఆమెను సుద్ద చావకొట్టేది. ఆమెకు నేనంటే సానాఇష్టం, మంచిగ సూసుకునేది. ఆమెను గిర్దావరు కొట్టినంక నేను ఆమె కూసొని ఏడ్చె టోళ్ళం. అట్లనే కొన్నిదినాలు అయినంక, అప్పుడు గిర్దావరు పెండ్లం లేకుండె, గిర్దావరు బాగాతాగొచ్చిండు. పడుకునోడ్ని బూటుతో కొట్టి

లేపిండు. చేతిబెత్త తీస్క ఒళ్ళంతా పగల కొట్టిండు. దెబ్బలు తప్పించు కొని బజారుపొంట బడ్డ. మళ్ళ ఆని ఇంట్ల కాలుపెట్టలే. తిక్కటులేకుండ రైలెక్కి భోన్గిర్లదిగిన. అడ, ఈడ పైసలడుక్కొని బజార్ల పొంట తిరిగేది. ఓనాడు అరుగుమీద పనుకున్న. ఎవరో ఇద్దరు నావయసోళ్ళే అరుగు మీద మాట్లాడుకుంటు కూచున్నరు. నన్ను వాండ్లు చీకట్లో చూడలే. ఆరోజు ఎవరికి ఎన్ని పైసలు దొరికింది ఎన్ని కర్చైంది అడుక్కుంటున్నరు. తెల్లారి నాక వాండ్ల దోస్తీకుదిరింది. నేను వాళ్ళ తోటి తిరిగిన''.

బషీరు సంభాషణ ఆపి కంఠీరవాన్ని చూచాడు. కంఠీరవం కండ్లు నీళ్ళతో మెరుస్తున్నాయి. కన్నీరు చుక్క ముక్కు వెంట జారి, చివరన ముత్యంవలె నిలిచున్నది. "ఏడుస్తున్నావ్: ఎందుకు మారాజ్?" ఆశ్చర్యంగా బషీరు అడిగాడు.

"ఏమిలేదు. నువ్వు చెప్పేదికానియ్." గద్గదస్వరంలో కంఠీరవం అని కన్నీరును తుడుచుకున్నాడు.

బషీరుకు అర్థంకాలేదు. పిచ్చివానివలె కంఠీరవాన్ని శ్రద్ధగా చూడ సాగాడు.

ఇంతలో బారెకులు మూయడానికి జవానులు వచ్చారు. ఇద్దరూ లేచి చేతులు కడుక్కొని లోపల ప్రవేశించారు. ఒకరి పక్కన ఒకరు పక్కలు వేసుకొని వెల్లకిల పడుకున్నారు. బారెక్ సందడిగా ఉంది.

"ఎక్కడ ఆగిపోయిందో అక్కడి నుంచి మొదలు పెట్టు బారెకు కప్పునుచూస్తూ కంఠీరవం అన్నాడు.

బషీరు కంఠీరవం వాక్యాన్ని ఆజ్ఞగా అనుకున్నాడు. కంఠీరవం పైన ఉన్న వనువు, భక్తిగా మారింది.

బషీరు తిరిగి మొదలు పెట్టాడు. "మేము కలిసి, బిచ్చమెత్తుకొని, మూటలుమోసి బతికెటోల్లం. అప్పుడప్పుడు ఆ ఇద్దరు తోదోళ్ళు నాకు సెప్పకుండనే ఎటోపోయెటోళ్లు. ఎంతడిగినా చెప్పకపోయేది. ఒకనాడు

ఉర్సులో మేం ముగ్గురం తిర్గుతున్నం. మాదాంట్లో ఒకడు దుకాండ్లో బ్యాటీరిలైటు చేతుల పట్టిండట. దుకాందారు కనిపెట్టి, పట్టుకొని చావ, చావ కొడ్తాంటే. మేం ఇద్దరం అడ్డంపోయినం, అక్కడ కూడిన జనం తలా ఓ తన్ను తన్ని మా ముగ్గుర్ని పోలీసోళ్ళకు ఒప్పచెప్పిన్రు. ఇష్టమొచ్చినట్టు కొట్టి, వారంరోజులైనాక ఒదిలి పెట్టిన్రు. మా ముగ్గురి దోస్తానా ఇంకా ఎక్వైంది. ముగ్గురం కలిపి రైలు పెట్టెల్లో బల్బులు, ముసాఫిర్ల మూటలు దొంగతనం చేసేది ఒకసారి రైలు పోలీసులు పట్టుకున్నరు. దొంగమాలు దొరకకుండ దాసినం. పోలీసోళ్లు మొకద్దమా నడపటానికి మాలు దొరకదాయె. మేం టికటు లేకుండా రైలెక్కినమని మొకద్దమా నడిపి, మూడురోజులు జేలుకు పంపిన్రు. అక్కడ మాకు కొంత మంది దోస్తులైన్రు. బయట వాండ్లదోస్తుల కల్సుకొమ్మన్నరు. అప్పటినుంచి మేం ముగ్గురం వాండ్లతో తిరుగుతున్నం. వాండ్లు చెప్పే పనులు చేస్తుంటిం. మా ఇద్దరు దోస్తుల్లో ఇప్పుడు ఒకదేమో గుల్బర్గా జేల్లో ఉన్నడు, ఇంకోడు నాందేడు జేల్లో ఉన్నడు. ఇంకో ఏడాదైతేఓడు, ఆరునెల్లకు ఓడు జేలునుంచి వస్తరు. అంత అయిపోయింది, ఇంకేం చెప్పాలె." అని బషీరు కంఠీరవం వైపు చూచాడు. కంఠీరవం కండ్లు మూసికొని వెల్లకిలపడుకొని ఉన్నాడు. కాని అతని కండ్ల కొలుకుల్లోంచి నీటిధార తలకింద పెట్టుకొన్న టోపిని తడుపుతున్నది. బషీరు దగ్గరికి వంగి కంఠీరవం ముఖాన్ని పరీక్షిస్తు, చూస్తున్నాడు. కంఠీరవం ఉబికివస్తున్న దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తూ ముక్కుపుటాలనుంచి కష్టంగా గాలి విడుస్తున్నాడు. బషీరు నిర్విణ్ణుడయ్యాడు. "మారాజ్, మారాజ్" అని పిలిచాడు. చేతితో కదిలించాడు. "ఊఁ" అని కంఠీరవం పక్కకు తిరిగాడు. ముక్కుచీది. టోపీతో కండ్లు తుడుచుకున్నాడు. కంఠీరవంతో మాట్లాడటానికి బషీరుకు భయంవేసింది. ఎటూ తోచక దిక్కులు చూస్తూ కూర్చున్నాడు. కాసేపు అటూ, ఇటూ పచారు చేశాడు, ఇంతలో దూరంగా ఖైదీ నిప్పుకొడ్తున్న చప్పుడైంది. భద్రిపరచుకున్న ఎంగిలి సిగిరేట్లను చేతిలో పట్టుకొని నిప్పుకొడ్తున్న ఖైదీ వద్దికివెళ్ళి, సిగరేటు ముక్కలు తాగి పక్క దగ్గరికి వచ్చేవరకు కంఠీరవం నిద్రపోయాడు.

ఆ రాత్రింతా బషీరుకూడా ఆందోళనలో పడ్డాడు. తన సంగతి చెప్తుంటే కంఠీరవం ఆ విధంగా ఏడ్వటం, బషీరుకు తనపైన్నే జాలి పుట్టింది. "నిజమే. అయ్యేవడు, అమ్మెవరు, కులమేంది, దేశమేంది, ఇల్లా, ముంగిలా, బతికి ఇంతేకద!" హృదయంలో నుండి ఎవరో అన్నట్టనిపించింది. ఆ విధంగా ఇదివరకెప్పుడు బషీరు హృదయం మాట్లాడలేదు.

కంఠీరవం కొద్ది నెల్లకు విడుదల కానుండగా, ఒకనాడు జేలు అధికారి నేతశాల పర్యవేక్షణకు వచ్చాడు. కింది అధికారితో మాట్లాడుతూనే కంఠీరవం నేతను కనిపెట్టున్నాడు. అధికారి మాట్లాడుతు, మగ్గం దగ్గరికి వచ్చి కంఠీరవా న్నుద్దేశించి, "చాలా మంచిగా నేస్తున్నావు. విడుదలైనాక బయట హాయిగా పనిచేసుకొని బ్రతకవచ్చు" అన్నాడు.

కంఠీరవం వింతగా అధికారినిచూచి, "బయట పనిలేక, దొంగతనం చేసి రాలేదు నేను. నేను ప్రభుత్వ వ్యతిరేకినని జేలుకు పంపారు" అన్నాడు.

"అయితే యింకా మంచిదే. బయట నీకు ఎవరు నేర్పుతారు? ఆహారం పెట్టి, బట్టలు యిచ్చి ఎవరు నేర్పుతారు?" అధికారి గంభీరంగా అన్నాడు.

కంఠీరవం మగ్గందిగి అధికారికి ఎదురుగా నిలుచుండి, "ఆహారం, బట్టఇస్తున్నారు. ఒకరి బట్టలు ఇంకొకరు దొంగిలించ కూడదు. విధిగా పని చేయాలన్నట్టే విధిగా ఆహారం తినడం కూడా ఖానూను ప్రకారం తప్పదు. జేల్లో ఇవన్ని చెప్పుకొని గర్వించ తగ్గవే. అన్నిచోట్ల, అందరూ ఆచరించాల్సిన విషయాలే. కాని ఇట్టి వ్యవస్థ బయటకూడా ఉంటే, మొత్తం సమాజమే బాగుపడుతుంది. కాని మీరు జేలు నేరాల కింద, క్రమశిక్షణ, కట్టుబాట్ల పేరుతోచేసే మీ హింసా చర్యలు, వాటి ననుమతించె మీ జేలు నియమాలు మాత్రం మనిషిని నిలువునా నాశనం చేస్తాయి." కంఠీరవం సమాధాన మిచ్చాడు.

ఆ అధికారికి కంఠీరవం వాదన సోది అనిపించింది. నిర్లక్ష్యంగా చేతి కర్రను వేళ్ళల్లో ఆడిస్తూ "మా కవన్నిటితో పనిలేదు. ప్రభుత్వ నియమాల

ప్రకారం పనిచేయడం, చేయించడం మా పని. యిక్కడ నీవు తెలుసుకున్న మంచి విషయాలను బట్టి, ప్రభుత్వం నిన్ను జేలుకు పంపడం మంచిదే అయింది. ఏమంటావు?" అధికారి ప్రశ్నించాడు.

"వృధాఎట్లవుతుంది. ఒక వైపు సమాజపు నగ్నస్వరూపం, పరిపాలనా యంత్రం యొక్క భయంకర స్వరూపం స్పష్టంగా చూడగలిగాను. రెండోవైపు ఆదర్శ సమాజ నిర్మాణానికి ప్రాతిపదిక సూత్రాలను తెలిసికున్నాను. దేశహితమును కోరే వారిపై ఎంతటి మహత్తర బాధ్యత ఉందో కండ్లకు కట్టినట్టు తోచింది. దీనివల్ల, యధార్థంగా, ప్రభుత్వం నన్ను జేలుకు పంపి, కొరివితో నెత్తి గోక్కున్నట్టు చేసింది. జేలుకు రాకముందు నాలో ఉన్న అస్పష్టమైన భావాలు, ఇప్పుడు చాలా గట్టిపడ్డాయి". అంటూ, మగ్గం మీదినుంచి వేలాడుతున్న దారాన్ని అతికించాడు.

జేలు అధికారి ఆలోచనా ధోరణిలో కంఠీరవాన్ని పరీక్షగాచూచాడు, "ఇంకెన్నాళ్ళుంది నీ శిక్ష" అన్నాడు.

"రెండునెల్లు ఉండొచ్చు. ఎందుకు? చాలారోజులు నేను జేల్లో ఉండటంకూడా ప్రమాదమనుకున్నారా?'' కంఠీరవం అడిగాడు.

"నీ శిక్ష పూర్తి అయిన ఒక సెకండ్ తర్వాత నువ్వు ఉంటానన్నా ఉంచము"అని అధికారి నవ్వుకుంటూ, చుట్టు ఉన్న సిబ్బందిని కలయచూచాడు. కంఠీరవాన్ని చూచి, "నువ్వు నిజామాబాదునుంచి యిక్కడికి వచ్చావు కదూ?''అని వెళ్ళిపోయాడు.

విడుదల కాలం సమీపిస్తుందనగానే కంఠీరవానికి బయటి జీవితం, అనుభవాలు జ్ఞాపకం రాసాగాయి. తన గ్రామం స్థితెవిధంగా ఉందో, అని ఆలోచించాడు. తల్లిని తలచుకొని కన్నీరు తీశాడు. అన్నను తలచుకొని ఒక నిట్టూర్పు విడిచాడు. నిజామాబాదు గ్రంథాలయాన్ని, వేదాంతాచార్యులను తలచుకొన్నాడు. ఆనందంతో ఉప్పొంగి పోయాడు, ఆలోచనా ధోరణిలో ఆరోజంతా గడిపాడు. సాయంత్రం పని వదలివెళ్ళి, బషీరును కలిసికొంటేగాని కంఠీరవానికి మనస్థిమితం కలుగలేదు.

# 17

దిమ్మెగూడెంలో ప్రజల్లో చైతన్యం పెరిగింది. రామభూపాల్‌రావు అంటే బెదురు పోయింది. ప్రజలు తమ నిత్యజీవితములో రామభూపాల్‌రావువల్ల పొందే చిక్కులు పోగొట్టుకోవాల్సనే తహ, తహ ఎక్కువ కాసాగింది. గ్రంథాలయం ఆ ఊరి ప్రజలకు ప్రధానకేంద్రమైంది. రాత్రి పాఠశాలతోపాటు, పగటి పాఠశాలకూడా నడుస్తున్నది. విజయదేవు, పరంధామయ్యల నాయకత్వం, చంద్రయ్య, కొమరయ్యల ముందడుగు, ధైర్యం పట్టుదల, గ్రామ ప్రజలకు పెట్టనికోటగా పనిస్తున్నాయి. గ్రామప్రజల్లో ఉండే అమాయకత్వము, నిరాశ, నిస్పృహలు తొలగసాగాయి. ప్రభుత్వ పన్నులు చెల్లించేప్పుడు మామూళ్లు ఇవ్వడం పూర్తిగా ఆగిపోయింది. బహీఖాతాలపై రసీదులు వ్రాయించుకోవడం విధిగా జరిగేది. వేగారి నియమాల ప్రకారం పనివాండ్లకు కూలి డబ్బులు సాధించడంలోకూడా పట్టుదల ప్రదర్శించారు. గ్రామాలకు వచ్చే అధికారులనుండి మొదలే డబ్బు తీసుకొని వారికి కావాల్సిన తినుబండారాలను అందించడం మొదలైంది.

ఇక రామభూపాల్‌రావు, వెంకటాద్రి, హైదరలీ ప్రతివిషయం ఐక్యంగా ఆలోచించడం, కామారెడ్డి, నిజామాబాదు అధికారులతో సంబంధాలు పెంచుకోవడం జరిగింది. వ్యవసాయం, పోలీసుశాఖ వ్యవహారాలకు సంబంధించిన ప్రభుత్వ నియమాల, చట్టాల మార్పులు, వివరాలు ఎంతటి విద్యావంతునికికూడా పరిపూర్ణముగా తెలిసికోవడము కష్టమైనపని. రామభూపాల్‌రావు అతని తొత్తులకు ఇక ప్రభుత్వనియమాలను పట్టి, పట్టి పరిశీలించడం దానికి వ్యతిరేకంగా ఎవరు చేస్తారో కనిపెట్టి, వారిపై చర్య తీసికోవడం, న్యాయస్థానాల వెంట తిప్పడం మొదలు పెట్టారు.

ప్రభుత్వ రికార్డుల్లో ఉన్నదానికంటె ఎక్కువ భూమిని దున్నారని. వాన జాలునీళ్ళు వాడుకుంటున్నారని, గెట్లును దున్నారని, కొలతరాళ్లు పడిపోయాయని, అనుమతి లేకుండా ఇండ్లను మార్చి కడ్తున్నారని, దున్న

లకు, ఎద్దులకు మూతాడు కట్టలేదని-కొమ్ములకు బొడ్డెలు వేయించలేదని. ఈ విధంగా ప్రజలను ఇబ్బంది పెట్టడం మొదలైంది. రామభూపాల్‌రావు ఈ చర్యలవల్ల గ్రామీయులల్లో అనుభవము, బాధ్యతలను గుర్తించడం అధికమైంది.

నిజామాబాదులో ఆంధ్రమహాసభ జరుగనున్నటుల పత్రికల్లో వార్త లను చూచి దిమ్మెగూడెం ప్రజలు చాల సంతోషించారు. పరంధామయ్య, విజయదేవులు నిజామాబాదుకు వెళ్ళి మహాసభకు సంబంధించిన అచ్చుకాగి తాలను తెచ్చి, ప్రజలకు చదివి వినిపించారు. ప్రజల్లో ఉత్సాహం ఎక్కు వైంది. ఇంతలో మహాసభాహ్వానసంఘంవారిపేర్లు పత్రికలో రావడం. వాండ్లలో రామభూపాల్‌రావు కూడా ఒకడై ఉండటం గ్రామ ప్రజలు ఆశ్చ ర్యంతో నోరు తెరిచారు. ఎంత ఆలోచించినా అంతుచిక్కలేదు. పరంధా మయ్య నిజామాబాదుకువెళ్ళి రామభూపాల్‌రావు గ్రామంలో చేస్తున్న అన్యా యపు పనులు, కుట్రలు మొదలగునవన్ని ఆహ్వానసంఘ కార్యకర్తలకు, నాయకులకు తెలిపాడు. కొందరు అసహాయతను వెలిబుచ్చారు. కొందరు పరంధామయ్యను తప్పుగా తేల్చారు. " ఈ రోజున మనకు ప్రభుత్వంతో కావాల్సిన సౌకర్యాలు కోరుతున్నాం. మనమెంత ఐక్యంగా ఉంటే అంత మంచిది. మనం ఊరూరికి శత్రువులను పెంచుకొని పోతూంటే చాలా కష్టము. ఇంకా చాలా, చాలా చేయాల్సుంది. రామభూపాల్‌రావు వంటి వారి సాయం చాలా అవసరం ఉంటుంది." ఇవి పరంధామయ్యకు దొరికిన సమాధానాలు. దిమ్మెగూడెములో ఆర్యసమాజము ప్రధాని ఉపన్యాసము వలెనే ఈసమాధానాలున్నాయని అనుకున్నాడు. పైవాండ్లకు గ్రామవ్యవహా రాలుతెలిసికూడా కండ్లు మూసికొని ఉండట పరంధామయ్యకు అన్యాయమని పించింది.

నిజామాబాదు మహాసభకు రామభూపాల్‌రావు వెళ్లాడు. అగ్రి శ్రేణిలో అందరికి ఆప్తుడుగా వ్యవహరించాడు. వెంట కచ్చడం బండి, పనివాండ్లు, ఆడబాపవాండ్లు వెంటనే ఉన్నారు. ప్రత్యేకంగా భోజన వసతి ఏర్పాటు చేసుకున్నాడు.

పరంధామయ్య, విజయదేవులు, కొమరయ్య, చంద్రియ్యలు కూడా మహాసభకు వెళ్ళారు. ప్రేక్షకులుగాకూర్చొని సభాచర్యలను శ్రద్ధగావిన్నారు. గ్రామసమస్యలపై జరిగిన చర్చలు వారికి చాలానచ్చాయి. కాని రామభూపాల్‌రావు సభలో పాల్గొనడమే వాండ్లకు అయోమయమనిపించింది,

నిజాం రాష్ట్రంలో మత పరివర్తనకు సంబంధించిన తీర్మానముపై చర్చ జరిగినపుడు, జగపతిరెడ్డి ఉపన్యసించాడు. అతడు తన ఉపన్యాసములో నిజామాబాదు గ్రంథాలయ వార్షిక సభానుమతి సందర్భాన ప్రభుత్వ వైఖరి, కంఠీరవంపై అభియోగం మొదలగు విషయాలన్ని పేర్కొన్నాడు.

ఆవాతారరణం, చర్చలు దిమ్మెగూడెం నుంచి వచ్చిన పరంధామయ్య మొదలైన వారి కెన్నోవిధాల నచ్చాయి. కాని అందులో తమ స్థానమేమిటో తెలిసికోజాలక తికమక పడ్డారు. రెండు రోజులుండి తిరిగి దిమ్మెగూడెం వెళ్ళిపోయారు.

రామభూపాల్‌రావు కూడా చాలాఉత్సాహంగా దిమ్మెగూడెం చేరుకున్నాడు. కొత్త కొత్త వారితో పరిచయం, నాయకులతో కలిసి, మెలిసి తిరగడంతో తన ఘనత ఇనుమడించిందని ఉబ్బిపోయాడు. విజయదేవు, పరంధామయ్యలు కించ బుద్ధిగలవారని, అల్పులని, ఏమీ తెలియని అజ్ఞానులని, ప్రజలను తప్పుతోవలో పెడ్తున్నారని భావించాడు.

ప్రతి సంవత్సరం దిమ్మెగూడెంలో జరిగే చెరువు, చింతల హర్రాజుల్లో గ్రామ ప్రజలు కూడా పాటపాడాలని అనుకోవడమే కాని, సమయానికి డబ్బు చేకూరక ముందడుగు వేయజాలలేదు. కాని ఆ సంవత్సరం మొదటినుండే జాగ్రత్తపడి డబ్బును భద్రపరచుకొని సమయానికై నిరీక్షించసాగారు.

రామభూపాల్‌రావు, గిర్దావరు వెంకటాద్రి, హైదరలీ కలిసి మామూలుగా ఆ సంవత్సరం కూడా రామభూపాల్‌రావుపేర పాటను ముగించారు. దొంగపంజునామా జరిపారు. తొత్తులను సాక్ష్యులుగాను, పంజు

లుగాను పేర్లురాశారు. వారిలో వారే చేతి ముద్రలు వేశారు. అంతా ఎవరికి తెలియకుండానే జరిగిపోయింది.

రామభూపాల్‌రావు నాగండ్లు చెరువులో తట్టులో దున్నడం సాగ గానే, ఊళ్లోకలవరం బయలు దేరింది. కొమరయ్య, చంద్రయ్య చెరువు లోకి వెళ్ళి నాగండ్లను చూచి విభ్రాంతులయ్యారు. వెంటనే పరంధామయ్య, విజయదేవులు రైతులను, ఇతర ప్రజలను తీసికొని చెరువులోకి వెళ్ళి నాగండ్లను విప్పేశారు. దున్నడం ఆగిపోయింది. ఆసంగతి తెలిసి రామ భూపాల్‌రావు వణికి పోయాడు. ప్రజల సాహసానికి నిర్విణ్ణుడయ్యాడు. వెంటనే వెంకటాద్రిని కామారెడ్డికి పంపాడు. గ్రామంలో అశాంతిగా ఉందని, ప్రజలంతా దొమ్మికి సిద్ధపడ్డారని, రామభూపాల్‌రావు ప్రాణం అపాయంలో ఉందని పోలీసులకు చెప్పి, పోలీసు సిబ్బందితో, మేజిస్ట్రే ట్‌తో మరునాడు దిమ్మెగూడెం చేరుకున్నారు.

ఆ వాతావరణంతో గ్రామ ప్రజల ఉద్రిక్తత హెచ్చి పోయింది. మేజిస్ట్రేట్, పోలీసులు రామభూపాల్‌రావు గడీలో ఉపాహారాలు, సమాలో చనలు జరుపుతుండగా ఊరి ప్రజలంతా ఆడ మగ అంతా చెరువులో గుమి కూడారు. ఆడవాండ్లు పిల్లలతో ఒక చోట మగవాండ్లంతా ఒకచోట గుంపు గాచేరారు. గ్రామమంతా నిర్మానుష్యమైంది.

మేజిస్ట్రేట్ పోలీసు సిబ్బందితో చెరువులోదట్టుకువచ్చి ప్రజలంద రిని చూచి నివ్వెర పోయాడు. "ఈపరిస్థితి నాకేకొత్తగాఉంది. ప్రజలీవిధంగా కట్టుబాటుకొచ్చారా?" తనకు తానే అనుకున్నాడు. పోలీసులను ఒకచోట నిలిపిఉంచి, మగవాండ్ల గుంపు వద్దికి వెళ్ళాడు. పోలీసు అధికారి పోలీసు లను క్రమశిక్షణలో నిలబెట్టాడు. "ఈ విధంగా మీరు యిక్కడికి రావడం చట్టానికి వ్యతిరేకం. అయిదుగురి కంటె ఎక్కువ ఒకచోట కూడి ఉండ రాదని ఆజ్ఞాపిస్తున్నాను." మేజిస్ట్రేట్ గుంపు నుద్దేశించి అన్నాడు. "మీరు వెంటనే యిక్కడినుంచి కదలకపోతే పోలీసు బలంతో మిమ్ములను చెదర కొట్టాల్సి ఉంటుంది" అన్నాడు.

"ఈచెరువు హర్రాజు ఎప్పుడు జరిగిందో ఎవరికి తెల్వదు. అన్యాయంగా రామభూపాల్‌రావు ఒక్కడే ప్రతి సంవత్సరం చెరువులో సేద్యం చేసుకుంటున్నాడు" విజయదేవు సమాధాన మిచ్చాడు.

"హర్రాజు ఫలానా తారీఖుని జరుగుతుందని చావిడికి నోటీసు కూడా అంటించలేరు. ఊళ్ళోదుడోరికూడా చాటించలేదు." పరంధామయ్య అన్నాడు.

"సర్కారువి తనకేకావాలె, మందివి తనకేకావాలె" కొమరయ్య అన్నాడు.

"ఊళ్లోకి వచ్చినోరు మమ్ములన్ని కూడా విశారించ కూడదా? దొర ఏది చెప్పితే అదేమీకు నమ్మకమైతె ఎట్ల పాడైద్ది?" చంద్రియ్య అడిగాడు.

మేజిస్ట్రేట్ శ్రద్ధగా వాండ్ల మాటలనువింటున్నాడు. పోలీసులను వరుసగా కొద్ది దూరంలో నిలబెట్టి, పోలీసు అధికారి మేజిస్ట్రేట్ పక్కకు విధేయుడుగా నిలుచున్నాడు. ప్రజలను ప్రతీకారంతో చూచాడు.

"అవన్ని నాకు తెల్సు. హర్రాజుకు సంబంధించిన కాగితాలన్ని చూచాను. వాటివివరాలు మీకు చెప్పితే లాభంలేదు. ఏది ఎట్లున్నా మీరీ విధంగా ఉద్రేకంలో ఉండటం గ్రామశాంతి దృష్ట్యా చాలాప్రమాదకరం. కాబట్టి మీరు వెంటనే చెదరిపోవడం మంచిది. మీకు ఐయిదు నిమిషాలు అవకాశ మిస్తున్నాను. ఈసంగతి మీఆడవాండ్లకు చెప్పి ఇండ్లకు పంపండి." అధికారధ్వనిలో మేజిస్ట్రేటు అన్నాడు.

"గ్రామ క్షేమం, ప్రభుత్వ కర్తవ్యాన్ని మేము మరిచి పోలేదు కాని రామభూపాల్‌రావు ప్రజలను ఈవిధంగా రెచ్చకొడ్తుంటే అతడిని అదుపులో పెట్టక. మమ్ములను బెదరించడం ఎంతవరకు న్యాయం?" విజయదేవు ప్రశ్నించాడు.

"దొరకిందనలిగి, నలిగి, విసిగి వేసారి, ఎండు గడ్డివలె ఉన్నారు ప్రజలు. వాండ్లపై మీరు తుపాకులు కాలుస్తారా? ఎండుగడ్డి కాల్తే ఏమవు

తుంది? కాబట్టి మీరు శాంతంగా ఆలోచించండి. ప్రస్తుతం ఈ భూమిని ఎవరు దున్నకుండా ఆపివేయండి. హర్రాజు ఎప్పుడు జరిగింది? ఎవరు పంజులు? ఎవరు సాక్ష్యులు? ఇవన్నీ విచారణ జరుగాలె" పరంధామయ్య అన్నాడు.

"ప్రభుత్వ నియమాలను, ప్రజాశ్రేయస్సును పక్కకు తోసి ప్రజలను పశువులుగా తలచే ఈ కొద్ది మంది గ్రామాధికారులే మీ ప్రభుత్వం బొక్కసం నింపుతున్నారనుకొండి. ప్రజలపై అన్యాయాలుచేసి, కాల్చి చంపి, జేళ్ళకు పంపి, గుట్టలను, రాళ్ళను పరిపాలిస్తుందా?" విజయదేవు వాదించాడు.

మేజిస్ట్రేట్‌కు వాళ్ళ వాదనాబలం నచ్చినా, పైకి మాత్రం బింకం చూపాడు. "సరే. మీరన్నట్లే దున్నడం ఆపేస్తాను, కాని ఒక విషయం మాత్రం మీకుగట్టిగా చెప్పుతున్నాను. ప్రజ లేమైన చేయరాని పనులుచేసి, అశాంతికలిగిస్తే మాత్రం ప్రభుత్వం చూస్తూ ఊరుకోదు. మీరంతా చీమల్లాగ మాడిపోతారు. జాగ్రత్త" అంటూ మేజిస్ట్రేట్ ఊళ్లోకి వెళ్లాడు. సిబ్బందితో పోలీసు అధికారికూడా వెళ్ళి రామభూపాల్‌రావు ఇంట్లో బస చేశాడు. మేజిస్ట్రేట్ మూడు రోజుల వరకు 144 సెక్షన్ ఆగ్రామంపై మోపి వెంటనే ఊరువిడిచి వెళ్ళి పోయాడు. మూడురోజుల వరకు పోలీసు సిబ్బంది ఊళ్లో ఉండి వెళ్ళి పోయారు.

నాటి సంఘటన దిమ్మెగూడెం ప్రజలకు మరువరాని విషయమైంది. అంతమంది పోలీసులు ఒకివైపు, మొత్తం గ్రామం ఒకవైపు బలాబలాలు చూచుకోవడం, రామభూపాల్‌రావు చెరువు దున్నడం ఆగిపోవడం, గ్రామీయులకు పట్టరాని, ఊహింపజాలని సంతోషం కలిగింది.

దిమ్మెగూడెం ఈవార్త పత్రికలకు కూడా ఎక్కింది. ఆవార్తా పత్రిక దిమ్మెగూడెం వచ్చిననాడు గ్రంథాలయమంతా జనులతో కిట కిటలాడింది. ఆ వార్తను కత్తిరించి ఒక అట్టకు అంటించి గ్రంథాలయం

గోడకు వేలాడకట్టారు. ఎన్నోసార్లు చదివి వినిపించారు. ఆరోజు గ్రామా నికి పర్వదిన మైంది.

చెరువు హర్రాజు విషయంలో తహశీలు కచేరీలో విచారణ జరి గింది. రామభూపాల్‌రావు, వెంకటాద్రి, హైదరలీ, వేలి ముద్రలు చేసిన వారిని పిలిపించి వాఙ్మూలాలు తీసికున్నారు. గిర్దావరును తాత్కాలికంగా ఉద్యోగం నుండి తీసివేశారు. విచారణ పూర్తి అయినాక రామభూపాల్ రావును, తహశీల్‌దారు పిలిపించుకొని ఏకాంతంగా చాలాసేపు మాట్లాడాడు.

"చూచారా! మీకేమిచెప్పవలసిన అవసరంలేదు. ఏదో జరిగిపోయిం దనుకోండి. మీకు అగౌరవం జరిగినా, అప్రతిష్ట కలిగినా ప్రభుత్వానికి కలిగి నట్టే. ఇది మీకు మాత్రమే సంబంధించిన విషయమనుకోకండి" తహశీలు దారు ఉపశమనవాక్యాలు పలికాడు.

"మాగ్రామం సంగతి మీకు తెలియందా? ఎంతశాంతంగా ఉండేది. ఆర్యసమాజమని ఒకడు, గ్రంథాలయమని ఒకడు ఊరికి దాపురించారు. కొత్త, కొత్తవి లేవదీస్తున్నారు.'' రామభూపాల్‌రావు వినయంగా అన్నాడు.

"విజయదేవును పిలిపించింది మీరనే విన్నానే?" గంభీరంగా కలము పాళీని పరీక్షిస్తూ తహశీల్దారు అన్నాడు.

రామభూపాల్‌రావు తత్తర పడ్డాడు. గుటకలు మింగాడు. "అదే తప్పు జరిగింది.''

"అక్కడే వస్తుంది చిక్కు. తాత్కాలికంగా ఏవేవో జరుగుతుం టాయి. వాటిని తెలివిగా అర్థం చేసుకొని ప్రభుత్వానికి అండగా గ్రామాల్లో మీరు ఉంటుండాలె. ఎవరోవచ్చి వాండ్లకు తోచినది ప్రచారము చేసు కున్నారు. ఇష్టమున్న వాండ్లు మహమ్మదీయులైనారు. అప్పుడు మీపై ఖరి. పట్టుదల నాకేమి నచ్చలేదు. మీగురించి ప్రతి రోజు నాకు తెలిసిన విషయా లనుబట్టి నేనేమైనా చేయగలవాడిని. కాని మీకు, నాకుగల పరస్పర విశ్వా సం, వాత్సల్యం, మీవంశ ప్రతిష్ట, గౌరవమును దృష్టిలో పెట్టుకొని నేను

చాలా ఓపిక పట్టాను. అన్నింటిని అణిచిపెట్టి ఉంచాను. నేను చేయక ఊరుకున్నా, తుదకు మీకు మీమెడకు చుట్టుకున్నాయి చూడండి," తహశీల్దారు కలము నుద్దేశించి చెప్పసాగాడు.

రామభూపాల్‌రావుకు గొంతు నొక్కినట్లైంది. మత పరివర్తన కాలంలో తాను తప్పుచేయలేదని హృదయం అంటున్నది. కాని దాని పరిణామం ఈ విధంగా ఉంటుందని ఊహించకపోవడం తెలివితక్కువే యని పశ్చాత్తాపపడ్డాడు. "ఇట్లవుతుందని నా చిన్న బుద్ధికి తోచలేదు" చేతులు పిసుక్కుంటు అన్నాడు.

"అవన్నీ ఇప్పుడు మీకు జ్ఞాపకంచేసి మిమ్ములను బాధించడం నా అభిప్రాయంకాదు. ఇక ముందైనా జాగ్రత్తగా ఉండాలని నా అభిప్రాయం. ఎప్పుడూ నావంటి అధికార్లే రారుకదా?" అని తహశీల్దారు బల్లమీది కాగితాలను పరిశీలించసాగాడు, "ఇంకొక విషయం" తిరిగి తహశీల్దారు హితవు చేశాడు. "విజయదేవుతో పోయిన పీడను పోనీయక, ఆర్యసమాజ మంత్రిని పిలిపించడం, మొన్నటి ఆంధ్రమహాసభలో మీరు సభ్యులుగా ఉండి, పని చేయడం ఏమిటచెప్పండి. నా అభిప్రాయంలో మీరు వెంకటాద్రి సలహాలను ప్రమాణంగా తీసుకుంటున్నారు. అతనికి చేతినిండా ఎప్పుడూ పనిఉంటుండాలె. సరే! ఇవన్నీ గ్రహించాల్సిన విషయాలు. చెప్పితేరావు. అసలు సంగతేమంటే, మీగ్రామక్షేమం, మీప్రతిష్టను కాపాడటానికైనా మీరు, హైదరలీ కలిసి ఉండటం చాలా మంచిది. ఇప్పుడు, కలిసిమెలిసి ఉంటున్నారనే తెలిసింది. మనసుల్లోకూడా కపటాలు లేకుండాలె. తర్వాత సంగతేమంటే, ఈ హర్రాజు విషయములో చాలా తెలివిలోపంజరిగింది. ఊళ్ళోపరిస్థితులా విధంగా ఉంటే మీరు మామూలుగా ప్రవర్తించారు. సరే. జరిగిందేదో జరిగింది. ఇంతవరకు పెరిగిపోయిన తర్వాత పరిస్థితులను జాగ్రత్తగా ఒక మార్గములోకి తేవాల్సుంటుంది. కాబట్టి ఆరునెల్లవరకు హైదరలీని పట్వారిగా నియమించబోతున్నాను. ఇది పరిపాలనా దృష్ట్యా జరిగే వ్యవహారము మాత్రమే. ఇందులో మీరు వేరేవిధంగా భావించవద్దు. హైదరలీ మీవాడేగా! మీ చెప్పు

చేతల్లోనే ఉంటాడురేండి. ఇక మీరు వెళ్ళొచ్చు. ఆఁ మరచిన. తోట్లో మామిళ్ళు బాగాకాశినవా? ఈ వేసవికాలంలో వారం, పదిరోజులు, మీతోట్లో మకాంవేద్దా మనుకుంటున్నాను" అన్నాడు తహశీల్దారు.

"తప్పకుండా దయచేయండి. మహాసంతోషము" రామభూపాల్ రావు అని మూడుసార్లు వంగి సలాం పెట్టి వెళ్ళబోతూ, "మా ఊరును అదుపులోకి తేవాలె ప్రభూ! ఏదైనా మార్గం కనిపెట్టాలె" అన్నాడు.

"అదెంతపని. నేను కూడా ఆ విషయం తీవ్రంగా ఆలోచిస్తున్నాను." తహశీల్దారు తల ఎత్తకుండానే సమాధానమిచ్చి తన పనిలో లీనమైనాడు.

రామభూపాల్‌రావు వెళ్ళిపోయాడు.

ఆ సంవత్సరం చెరువు హర్రాజు తిరిగిజరుగదని గ్రామీయులకు తెలిసింది. గిర్దావరును ఉద్యోగంనుండి తాత్కాలికంగా తొలగించినట్టు, రామభూపాల్‌రావును కూడా ఆరు నెల్లవరకు పట్వారి పనినుండి తొలగించినట్టు పత్రికకు పంపినవార్తతోపాటు, హైదాాబాదు జేలునుండి కంఠీరవం విడుదలైన వార్తకూడా ప్రకటించబడింది. ఆనాడు దిమ్మెగూడెంలో వెల్లివిరిసిన ఉత్సాహం చెప్పనలవికాదు. కంఠీరవంతో ముఖపరిచయం విజయదేవుకు కలుగలేదు. పరంధామయ్యచేసే ప్రశంసలు, కొమరయ్య తెలిపిన విషయాలు కంఠీరవంపై విజయదేవుకు గౌరవభావం కలిగించాయి. కంఠీరవం గ్రామం వదిలి పోయిననాటి వివరాలు, నిజామాబాదుకు తీసికెళ్తూ, అంజుమన్ నాయకులు, పోలీసులు చేసిన అవమానకర చర్యలు, పోలీసు నిర్బంధంలో జరిపిన హింసాచర్యలు కొమరయ్య చెప్పుతూ ఆవేశంపొందాడు.

అండాళమ్మ, తాయమ్మ కంఠీరవం విడుదల వార్తవిని ఎప్పుడు చూస్తామా అని తహతహ చెందారు. కంఠీరవం విషయమై గ్రామీయులు చూపుతున్న శ్రద్ధాభక్తికి వెంకటాచార్యులు బెదరిపోయాడు. రామభూపాల్ రావుకు, తనకు వ్యతిరేకంగా ప్రజాబలంతో ఏమేమి చేస్తారో యని బెంగటిల్లాడు. పరంధామయ్య కంఠీరవాన్ని తీసికొని రావడానికై నిజామాబాదుకు

వెళ్లాడు. కాని కంఠీరవం హైద్రాబాదులోనే ఉండటంవల్ల నిరాశతో దిమ్మె గూడెం చేరుకున్నాడు.

# 18

కంఠీరవం శిక్ష ముగిసిన తేదీకే తలవనితలంపుగా బషీరు శిక్షకూడా ముగియడంతో ఇద్దరూ ఒకనాడే విడుదలయ్యారు. కంఠీరవం బషీరును వెంటబెట్టుకొని మోహనాచారి బసకు బయలుదేరాడు. నిజామాబాదు మోహనాచార్యులు వకీలుగా అక్కడే ఉన్నాడు.

"బషీర్! నువ్వు మీ వాండ్ల పొత్తువదలుకొని నా వెంటరారాదు! నీకు నేను, నాకునువ్వు నేటినుండి రక్షకులం. నువ్వు నా మీద విశ్వాసముంచితే నీకొక కొత్త ప్రపంచాన్ని చూపిస్తా. ఏమంటావు?" నడుస్తూ కంఠీరవం అన్నాడు.

బషీరుమాట్లాడకుండా కంఠీరవాన్ని అనుసరించాడు.

కంఠీరవం వెనక్కు తిరిగి బషీరువీపుపై చెయ్యివేసి, "నా మీద నీకు నమ్మకంలేదా?" ఆప్యాయంగా అడిగాడు.

"అదిగాదు మారాజ్. ఏమీతోచక ఆలోచిస్తున్న" బషీరు దీనంగా అన్నాడు.

"ఆలోచించుకో, ఇందులో తొందరేముంది? మరి ఇప్పుడు నావెంట వచ్చి అన్నంతినరాదు? ఇది కూడా ఆలోచించాల్నా?" కంఠీరవం ప్రశ్నించాడు.

బషీరు మందహాసం కురిపించి, "సరే." అని కంఠీరవం వెంట వెళ్లాడు."

కంఠీరవం వెళ్ళేవరకు మోహనాచార్యులు, తోడి వకీలైన వెంకటేశ్వర్రావుతో మాట్లాడుతు కూర్చున్నాడు. కంఠీరవాన్ని చూడగానే మోహనాచార్యులు నిశ్చింతుడై "ఎప్పుడు అన్నగారు విడుదల?" అని అమాంతం

కౌగలించుకున్నాడు. ఇద్దరికి కండ్లల్లో నీళ్ళు తిరిగాయి వారి కన్నీరుకు వెంక టేశ్వర్రావు, బషీరు దిగ్భ్రాంతులై ఒకరి నొకరు చూచుకున్నారు. మోహ నాచార్యులు కన్నీరు తుడుచుకుంటు, "కూర్చోండి అన్నగారు" అని కుర్చీ చూపించాడు.

కంఠీరవం బషీరుకు కుర్చీ చూపించి, తాను కూర్చున్నాడు. "ఇతడు నా జేలు మిత్రుడు బషీర్" అని, "వీరి పరిచయం?" వెంకటేశ్వర్రావును గురించి మోహనాచార్యుల నడిగాడు.

"క్షమించండి. వీరు నామిత్రులు, తోటివకీలు వెంకటేశ్వర్రావుగారు" ముఖం వెంకటేశ్వర్రావువైపు తిప్పి. "కంఠీరవంగారు వీరు. మాకు ఆప్త బంధువులు. సహృదయులు. మా నిజామాబాదు గ్రంథాలయాన్ని అభివృద్ధి కావడానికి వీరు చాలా కృషిచేశారు. నేనుబహుశః ఒకసారి చెప్పి ఉంటాను. మన స్టేటులో మొదటిసారిగా జరిగిన రాజద్రోహనేర విచారణయని" మోహనాచార్యులు చెప్పి, ఇంకా ఏమోఅనబోతుండగా, వెంకటేశ్వర్రావు, మధ్యలో, "పుస్తకంలో దఫాతప్పుగా అచ్చైందని సర్కారు వకీలుఅన్నడం టిరి ఇదేకదు?" అనగానే, "అదే" అని కంఠీరవం అందుకున్నాడు. అంతా ఫక్కున నవ్వారు. బషీరు నల్లగా చినిగిన దుస్తులతో ఆ వాతావరణంలో ఇముడకుండ కూర్చున్నాడు.

"అయితే అన్నగారు, మరి మనం భోజనంచేసుకుంటే?"అని మోహ నాచార్యులు కుర్చీలోంచిలేచాడు. లోపలికి వెళ్ళి, గడపల్లో నిల్చుండి బషీరును శ్రద్ధగా చూచాడు.

"మరి స్నానం చేసుకుంటే పని తీరిపోతుంది. ఇంతలో భోజ నం కూడా వస్తుంది." అని వెంకటేశ్వర్రావు అనగానే కంఠీరవం బషీరును లెమ్మని సైగచేశాడు. బషీర్ దగ్గరికి వెళ్ళి, "ఈ బట్టలను ఇంతనిప్పు ముట్టించి అవతల పారేయ్. పీడపోతుంది. నీకు వేరేబట్టలు ఇప్పిస్త" అని కంఠీరవం అంటుండగా కడపల్లో నిలుచున్న మోహనాచార్యులు సైగచేసి

పిలుచుకున్నాడు. "బషీరున్నాడే, మరి అతనుకూడా భోజనం చేయలేదుగా?" భావగర్భితంగా అడిగాడు.

"అవును, భోజనం చేయలేదు." కంఠీరవం అన్నాడు.

"అయితే సరే! ఇక్కడ పెడ్దాం," అని మోహనాచార్యులు ఆఫీసు గదిని చూపించాడు.

ఆ మాట వినగానే కంఠీరవం తల దిమ్మెక్కింది. చాలా బాధ పడ్డాడు. తల వంచి గంభీరంగా ఆలోచనలో పడ్డాడు. వర్ణభేదాలు, కుల కట్టుబాట్లు, ఉచ్చనీచ భావా లెంత అగాధాన్ని నిర్మిస్తాయో కొట్టవచ్చినట్టు స్ఫురించాయి. తన మనోవేదనను, మోహనాచార్యుల మనసును నొప్పింప కుండ వెల్లాలని కంఠీరవం ఆలోచిస్తున్నాడు.

కంఠీరవం ముఖవైఖరికి మోహనాచార్యులు ఆశ్చర్యపడి, "ఏమిటి అన్నగారు? అంత తీవ్రంగా ఆలోచిస్తున్నారేం" ప్రశ్నించాడు.

కంఠీరవం దీనంగా తలెత్తి, మోహనాచార్యుల కండ్లల్లోకండ్లునిలిపి, "మీరు వేరు విధంగా భావించవద్దు. మీరెంత నాకు ఆప్తులో, గౌరవనీయులో బషీరు కూడా అంతకావలసినవాడు. అతడిని నాతోదూరంగాఉంచజాలను, జేలుజీవితములో మేము ఒకరికొకరం కలిసిపోయాం. ఇకముందు అతడ్ని నా సహచరునిగా చేసుకోవాలని అనుకుంటున్నాను." గంభీరంగా అన్నాడు.

మోహనాచార్యులు, కంఠీరవం భావాలతో ఏకీభవించకపోయినా, కంఠీరవం వేదనకు చలించాడు. "అంతమాత్రానికి మీరంత బాధపడటం దేనికి" అన్నాడు.

"క్షమించాలె. నాకు బషీరుపైగల ప్రేమతో ఆవిధంగా అన్నాను, అంతేకాని మీ విశ్వాసాలను, పట్టుదలను నేను వెక్కిరిస్తున్నాననుకోకండి. నేనెరుగని ఆచారాలుకావుగా? అయినప్పటికి నా జేలుజీవితంలో వాటిపై శ్రద్ధ, విశ్వాసము సడలిపోయింది. కల్పితములైన అడ్డగోడలనుపించాయి." కంఠీరవం దీనంగా అన్నాడు.

"అవును. అంతే. ప్రతిది విశ్వాసంమీదనేగా ఆధారపడేది? ఏదైనా పట్టింపులు పెట్టుకుంటేనే మరి.... అయినా ఆడవాండ్లుకూడా లేరు. వెంకటేశ్వర్రావు ఏమంటాడో కనుక్కుంటా" అంటూ హడాహుడిగా వెంకటేశ్వర్రావు వద్దికి వెళ్లాడు.

"నీకా పట్టింపులులేవుగాని, మరి అందరం ఒకచోటనే కూర్చొని తిందామంటావా?" వీపుపైన చేతితో నిమురుతూ వెంకటేశ్వర్రావును అడిగాడు.

"ఇంటి నీడపట్టున కదలకుండకూర్చొని, అయ్య సంపాదిస్తుంటే, అయ్యగారు మింగుతుంటే అన్నీ సాగివస్తుంటాయి. నేను దేశ, దేశాలు తిరిగి, అష్టకష్టాలు పడ్డవాడిని. ఇవన్నీ పెట్టుకుంటే ఎన్నడో ఏమో అయిపోయేవాడిని. ఇక మీనమేషాలు లెక్కపెట్టక తమరు టిఫిన్‌క్యారియర్ తీసికొని వేగిరం వెళ్ళిరండి, ఆఫీసు వేళవుతున్నది." వెటకారంగా వెంకటేశ్వర్రావు అన్నాడు.

"నేనిప్పుడే వస్తాను," అని టిఫిన్‌క్యారియరుతో మోహనాచార్యులు వెళ్ళిపోయాడు.

కంఠీరవం, బషీరు, వెంకటేశ్వర్రావు నల్లా వద్దికివెళ్ళి స్నానాలు మొదలుపెట్టారు. వెంకటేశ్వర్రావు తన ధోతి, అంగీ తెచ్చి బషీరుకు ఇచ్చాడు.

"మన ఆచారాల, సంప్రదాయాల, కట్టుబాట్ల వెనుక ఉత్తమమైనట్టి ఏదైనా ఆశయమో, లక్ష్యమో ఉందని మీరనుకుంటారా" కంఠీరవాన్నుద్దేశించి వెంకటేశ్వర్రావు అన్నాడు.

"ప్రతిదానికి అట్లా ఉంటుందనుకోను. కొన్నిటికి ఉన్నప్పటికి వాటి మూలసూత్రాలు అడుగుపడి, కోతి రూపులుమాత్రం నిలచిపోయాయి." అని కంఠీరవం బషీరుపైపు వెంకటేశ్వర్రావు దృష్టిని మరల్చాడు. "ఇతని విషయమే చూడండి. ఇతని తలిదండ్రులు, వారెంత బీదవారైనా సహజ

ప్రేమతో పెంచుకుంటారుకదా! కాని కటిక దారిద్ర్యానికి తాళలేక ఒక గిర్దా వరుకు అమ్ముకున్నారు. చెడ్డ సావాసముతో దొంగల గుంపులోచేరి, దరి, దాపులేని అనాథజీవుడుగా అలమటిస్తున్నాడు. గర్భిణి అయిందిమొదలు సంపూర్ణ విద్య అలవడువరకు తన సంతానాన్ని ఆదర్శనీయులుగా చేయ వలసిన తల్లి, కన్నకొడుకును పోషించలేక పొరుగువారికి వదిలివేసింది. విద్యనేర్పని తల్లిదండ్రులు శత్రువులతో సమానమని మన పెద్దలు శాసిం చారు. ఇంత ఉన్నతాదర్శమును, కర్తవ్యమును బోధించు మన సభ్యత, సంస్కృతి ఇతని తల్లిదండ్రుల్లో లోపించింది. దరిద్రపిశాచానికి తాళలేక ఎంతఘోరమైనపని చేశారో చూడండి. తల్లిదండ్రులు భారము తగ్గించుకో చూచారేకాని బాధ్యతలను వదులుకొన్నట్టేగా? ఇదేమి రహస్యంగా జరగటం లేదు. నిరాఘాటంగా జరుగుతున్నాయి. ఇట్టివెన్నిజరుగుతున్నాయో! ఎవడైనా ఆపకలుగుతున్నాడా?" అని కంఠీరవం ఒక నిట్టూర్పు విడిచాడు. "ఇక మనకు మిగిలినవి మతవైషమ్యాలు, ఉచ్చ నీచభావాలు, ధనిక దరిద్ర తారతమ్యాలు, స్వార్థంతో కూడిన భోగలాలసత్వం, అహంకారం, ఆడం బరం, వీటన్నిటి ఫలితంగా బషీరువంటి కష్టజీవులు, నేటి అరాచక సమాజము అవతరించాయి" అని అన్నాడు.

కంఠీరవం మాటల్లోని తీవ్రతకు వెంకటేశ్వర్రావు నిర్విణ్ణుడై నిలబడి చూడసాగాడు.

కంఠీరవం స్నానం ముగించుకొని, ఒళ్లు తుడుచుకుంటూ, బషీరును చూచాడు. బషీరు స్నానంకూడా అయిపోయింది. వెంకటేశ్వర్రావు కంచాలు, ప్లేట్లు తెచ్చి నట్లాకిందపెట్టి నీళ్ళువదిలాడు. "నేనుకూడా ఒక్కొక్కప్పుడు ఆలోచిస్తుంటాను. ఆశ్చర్యంకూడావేస్తుంది. జరిగిపోయిన పాతకాలపు విషయాలు, విజ్ఞానము, విమర్శనాశక్తిని పరిశీలిస్తే వేలుపెట్టి వంకపెట్టడానికి వీలుకాని ఎన్నో గొప్ప గొప్ప విషయాలు తెలుస్తుంటాయి. అన్ని కలిగి ఉండికూడా మనస్థితికి ఎట్లా వచ్చాం? ఇంతవరకు కనిపెట్టకుండా మహా మహా మేధావులు ఏంచేస్తుండిరో అనిపిస్తుంది" అన్నాడు.

"అసలైన ప్రమాదమొకటి జరుగుతూ వచ్చింది. ప్రతివాడు ఎల్లప్పుడూ ఏదో కొత్తది కనిపెట్టాలని ప్రయత్నించడం, తన లోపాలను గ్రహించేకంటే ఎదుటివాని బలహీనతలను బలంగా తలవడం గొప్పతనంగా చెలామణి అవుతూ వస్తుంది. అది ఆగనంతవరకు నేటి అరాచకాన్ని ఆపజాలమని నా దృఢవిశ్వాసం." కంఠీరవం అన్నాడు.

ఇంతలో మోహనాచార్యులు టిఫిన్‌క్యారియర్ తీసికొనివచ్చాడు, అంతా ఎదురుబడి కూర్చొని భోజనం మొదలుపెట్టారు.

"నేటిదినం మన జీవితంలో మరువరానిదినం," మందహాసంతో వెంకటేశ్వర్రావు అన్నాడు.

"నాకు ఎన్నాళ్ళకో దొరికిన ఈకొత్తరకమైన ఆహారం కూడా మరువరానిదే" కంఠీరవం అనగానే అందరూ నవ్వారు.

"బషీరుగారు. సిగ్గుపడకండి. మీకు మేమేమి కొత్త. మీమారాజుకు మాకు ఏమి భేదం లేదనుకోండి. మనమంతా ఒకటే" వెంకటేశ్వర్రావు బషీరును చూస్తూ అన్నాడు.

"మాకు కొత్త, పాత ఏమిఉండదు. అట్లనుకుంటూ కూర్చుంటే మేం బ్రతకటంకూడా కష్టం" నవ్వుతూ బషీరు అన్నాడు.

"అవునుమరి! అంతా తమదేనని. అందరూ పాతవాండ్లేనని అనుకుంటేనేగాని మీ దొంగతనాలు సాగవాయె" కంఠీరవం ఘొల్లున నవ్వి, బషీరు వీపుపై చెయ్యినిమిరాడు.

"తనదంటూ ఒకటి లేనపుడు అంతా తనదని అనుకోక తప్పదు." వెంకటేశ్వర్రావు వెంటనే అందుకున్నాడు.

మోహనాచార్యులు ప్రసంగంమార్చి "అయితే చెప్పరూ అన్నగారు! జేలు జీవితమెట్లా గడిచింది?"

"గడవటానికేం, బాగానే గడిచింది. కాని మనం బయట చూస్తున్న ఆపక తపకలు, నిరంకుశత్వం, నీచపు అలవాట్లు రెట్టింపు వికృత రూపంలో

వీరవిహారం చేస్తుంటాయి. మొత్తం జేలు వ్యవస్థను క్లుప్తీకరించి చెప్పు తున్నాను. భయంకరమైన, భీభత్సమైన ప్రపంచమనుకోండి. నా జేలు జీవితములో, జేలులోని ప్రతి సంఘటనను పరీక్షించి తరచి చూచేవాడిని, ప్రతి ప్రభుత్వం తన దేశమును గురించి గొప్పగా చెప్పుకునే సుఖ సంప దలు, నీతినియమాలు, పరిపాలనా సౌష్ఠవం కండ్లార చూడాలంటే జేలులో నగ్నంగా చూడవచ్చును. ఇల్లాలు సంగతి ఇంటిగోడలే చెప్పుతున్నట్లు జైలులోని ఖైదీల గాథలే మనమేవిధంగా ఉన్నామో తెలిసికోవడానికి సజీవ ప్రమాణాలు. నా జీవితాంతంవరకు నేను మరువజాలని ఘోర సంఘటనలను జేలులో చూచి బెదిరిపోయాను. నేటి అరాజకపు సమాజ తాకిడికి తట్టుకోలేక, ఏదేని కారణంతో జేలు నాలుగు గోడల్లోకి చేరినవాడు, మనోనిబ్బరం, ఆత్మవిశ్వాసంను కోల్పోయాడంటే వాడు బయటికి వచ్చే వరకు అతడి నైజత్వమే నశిస్తుంది. అతని ఆలోచనలే మారుతాయి, అతని నైతిక స్థాయి దెబ్బతింటుంది. అతని పరిసరాలే మారుతాయి. పొగాకు పొగకు మూతి విరిచేవాడు గంజాయికి దాసుడవుతాడు. బంగారం దొంగి లించ సాహసం లేనివాడు ఎంగిలి బీడీలకొరకు వెతుకుతుంటాడు. సత్యమే ఆశయంగా పెట్టుకున్నవాడు అసత్యమే ఆదర్శంగా చేసుకుంటాడు. పది మందికి అన్నంపెట్టి ఆనందించేవాడు, ఇతరుల నోటిముందరి అన్నాన్ని అపహరించచూస్తాడు. కడుపునిండా అన్నంపెట్టి ఆదరించేవాడు అడిగినా లేదని ఈసడిస్తాడు." ఇంకా కంఠీరవం చెప్పబోతుండగా, మోహనా చార్యులు కంఠీరవాన్నుద్దేశించి "అన్నగారు అన్నం తినడం మానుకొని మాటల్లో పడ్డారు" హెచ్చరించాడు.

"అవును మారాజ్। ఈ మారాజ్ ఇక్కడ ఈమాత్రం మాట్లాడు తున్నాడు. జేల్లో మాట్లాడేది తక్కువ ఏడ్చేది ఎక్కువగా ఉండేది. ఇప్పుడు మీరు దోస్తులు కనిపిస్తే కడుపులో ఉన్నదంతా కక్కేస్తున్నాడు. పోనీయండి అంతా ఒకసారి బయటికి. ఒళ్లు కులాసాఐతది." బషీరు విచారంగా అన్నాడు.

కంఠీరవం కన్నీరు బొట బొట కంచంలో పడ్డాయి. వెంకటేశ్వర్రావు, మోహనాచార్యులు స్తబ్దులైనారు. ఏమనాల్సింది తోచలేదు. ఒకరినొకరు చూచుకొని నిట్టూర్పు విడిచారు. బషీరు కన్నీరు పెట్టడంకూడా గమనించారు.

"అన్నగారు! మీకింత బాధ కలుగుతుందని తెలిస్తే ఆ జేలు విషయమే ఎత్తకపోయేవాడిని. పోనీయండి, భోజనం కానియ్యండి" మోహనాచార్యులు అన్నాడు.

వెంకటేశ్వర్రావు చేతిలోని అన్నంముద్దను అట్లాగే పట్టుకొని పిచ్చివానివలె కంఠీరవాన్ని చూస్తు కూర్చున్నాడు.

అక్కడి వాతావరణమే మారిపోయింది.

"క్షమించాలె. ఆనందంగా అన్నం తింటున్న మీఅందరిని విచారములో ముంచివేశాను" అంటూ కంఠీరవం అన్నం కలిపాడు.

"మీబాధలో మేము పాల్గొన్నందుకు నాకుమాత్రం ఆనందం కలిగింది. ప్రపంచాన్ని మరచి, విద్యావంతులమనే ధీమాతో, సంపాదన, స్వార్ధమునే పనిగా పెట్టుకున్న మావంటివాండ్లకు మీవంటివారి సహచర్యము కలిగి, మీ అనుభవాలను, ఆవేదనను వింటుంటే మాస్థితికి మాకే సిగ్గేస్తుంది." వెంకటేశ్వర్రావు పశ్చాత్తాపం ప్రకటించాడు.

"ఇక ఏదో పోనీయండి. అన్నగారి హృదయభారం తగ్గనీయండి. తర్వాత మాట్లాడుకుందాం" మోహనాచార్యులు అన్నాడు.

"అవును, మారాజ్. ఒక్కరోజుతో పోయేదికాదు. ఒక్కనాడు చెప్పితే తీరేదికాదు." బషీరు విచారంగా అన్నాడు.

అంతా గంభీరంగా భోజనాలు ముగించుకొని లేచారు.

వెంకటేశ్వర్రావుగాని, మోహనాచార్యులుగాని కంఠీరవాన్ని పలుకరించడానికి భయపడసాగారు. "ఇంకా ఏమి విశేషాలు అన్నగారు" అని మోహనాచార్యులు అనబోయి, ఏదో తప్పుమాట అడుగబోతున్నానని భయపడేవాడు.

తొందరగా కోర్టుపని ముగించుకొని వస్తామనిచెప్పి వెంకటేశ్వ రావు. మోహనాచార్యులు వెళ్ళిపోయారు.

ఆఫీసులో పేర్చిఉన్న పాత పత్రికలు ముందర వేసుకొని కంఠీరవం చదువ మొదలుపెట్టాడు. బషీరు పత్రికలోని చిత్రాలను. ప్రకటన చిత్రాలను చూచి, కంఠీరవాన్ని వివరాలు అడుగుతూ కూర్చున్నాడు.

దిమ్మెగూడెం చెరువు సంఘటన వార్తను చదివి కంఠీరవం సంతోషంతో ఉబ్బిపోయాడు పరంధామయ్య పట్టుదలతో తన గ్రామీయుల చైతన్య స్థాయి ఇంతవరకు పెరిగిపోవడం కంఠీరవానికి ఎంతో ఆనందం కలిగించింది. ఇక తనగ్రామం వెళ్ళక తప్పదని నిశ్చయించుకున్నాడు.

"బషీర్! మాఊరికి పోదాం వస్తావా?" పత్రికలను చూస్తూ కంఠీరవం అడిగాడు.

"మీఊరికా మారాజ్! ఎప్పుడు మారాజ్! ఎంతదూరం మారాజ్?"

"కామారెడ్డి తాలూకాలోఉంది సుమారు మూడు ఏండ్లాయె నా ఊరుకు వెళ్ళక."

కోర్టునుంచి వెంకటేశ్వరావు. మోహనాచార్యులు రాగానే కంఠీరవం తన నిశ్చయాన్ని తెలిపాడు.

"బస్తీ జీవితంతో విసిగిపోయాను. కాని వారంరోజుల తర్వాతగాని కోర్టులకు సెలవులు లేవు. అప్పుడైతే నేనుకూడా వస్తాను. బహుశః మోహనాచార్యులు కూడా రావచ్చు" వెంకటేశ్వరావు అన్నాడు. "ఏమంటావు?" మోహనాచార్యులను ప్రశ్నించాడు.

"సెలవుల్లో మా అన్నయ్యగారి కూతురు వివాహం అనుకున్నాం. నేను వెళ్ళకతప్పదు. కంఠీరవం అన్నగారు మాత్రం రారా? వారు లేకుండా వివాహమెట్లా జరుగుతుంది? నాయనగారు, అమ్మగారు, మీరు విడుదలైనా ని తెలిసి ఎంత సంతోషిస్తారు. మీరు వచ్చిన సంగతి రేపే ఉత్తరం వ్రాసి తెలుపుతా" అన్నాడు మోహనాచార్యులు.

"ఇందిర వివాహమేనా? నేను ఆచిట్టితల్లి వివాహానికి తప్పకుండా వస్తాను. ఇందిరకు నేనంటె ఎంతో ప్రేమ. అమాయకపుపిల్ల. అమృతంవంటి హృదయం. బాగా చదివించారా?" కంఠీరవం ప్రశ్నించాడు. "ఒకసారి ఎవరితోనైనా నాకు ప్రేమ బాంధవ్యాలు ఏర్పడితే నేను వదులుకోవడం కష్టం. అవే నాకు తరగని ఆస్తిగా. ఆయుష్షుగా పనికివస్తున్నాయి." మందహాసం కురిపిస్తూ కంఠీరవం అన్నాడు.

"ఎన్నాళ్ళకో స్వగ్రామం వెళ్తున్నారు. వెంటనే అక్కడినుంచి కదలడం సాధ్యంకాకపోవచ్చు. అదిగాక మీ దిమ్మెగూడెం ప్రభావం చాలా పెరిగిపోతున్నది. అధోరకు వ్యతిరేకంగా చాలా గట్టిగా ఉన్నారు ప్రజలు. మీరు పుట్టిన గ్రామం ఇంకెట్లా ఉంటుంది?" మోహనాచార్యులు ముసి ముసిగా నవ్వుతూ అన్నాడు.

"దిమ్మెగూడెం నా జన్మస్థానమైంది. నిజామాబాదు నా కండ్లు తెరిపించింది. జేలు యాత్రాస్థలమైంది. ఇట్లా మారుతూఉంది. ఇంకా ముందేమి కానుందో! మీవంటి ఆత్మీయులు, బషీరువంటి బంధువులు, స్నేహితులు దొరుకుతున్నకొద్దీ నా హద్దులు పరిమితంగా ఉండటం సాధ్యంకాకపోవచ్చు. మా గ్రామం చెరుపు వార్త చూచారుకదూ! మా గ్రామ ప్రజలు ప్రశంసనీయమైన పనిచేశారు. వారిని కలిసికొని, కడుపునిండా మాట్లాడాలని ఆతురత పడ్తున్నాను. అక్కడినుంచి తప్పకుండా నిజామాబాదుకు వస్తాను. నాయనగారిని. అమ్మగారిని, ముఖ్యంగా చిట్టితల్లి ఇందిరను చూడాలని చాలా కుతూహలంగా ఉంది. ఆతల్లి ఒక యింటి అమ్మాయి కాబోతున్నది. భర్త, పిల్లలతో రాణిస్తుంది నాతల్లి." అంటూ కంఠీరవం ఆనంద బాష్పాలు రాల్చాడు.

వారం రోజులు హైదరాబాదులో ఉండి, హైదరాబాదు ముఖ్య స్థలాలను, బషీరును వెంటబెట్టుకొని చూచాడు. నిజామాబాదు గ్రంథాలయ సభాధ్యక్షుడుగా వెళ్ళిన జగపతిరెడ్డిని, ఇతరులను కలిసికొని మాట్లాడాడు. బషీరును పరిచయం చేయడం, బషీరు జీవితాన్ని చిత్రించడం, తన జేలు

అనుభవాలను, పరిస్థితులను విచారించడం కంఠీరవం సంభాషణలో ప్రధాన మైన విషయాలుగా ఉండేవి.

# 19

వారం రోజుల తర్వాత కంఠీరవం, బషీరు, వెంకటేశ్వర్రావులు బయలుదేరి దిమ్మెగూడెం చేరుకున్నారు. మధ్యాహ్నసమయం. ఎండ తీవ్రంగాఉంది. ప్రజలందరు అలసటతో ఇండ్లల్లో ఉన్నారు. కంఠీరవం మొదలగువారు నేరుగా గ్రంథాలయానికి వెళ్లేవరకు పరంధామయ్య, విజయ దేవు, మాట్లాడుకుంటు కూర్చున్నారు. పరంధామయ్య ఆమాంతంగా కంఠీ రవాన్ని ఆలింగనం చేసుకున్నాడు. విజయదేవు అప్యాయతతో కుశల ప్రశ్నలడిగాడు. అందరు పరస్పరం అభినందించుకున్న తర్వాత, "మా యింటికి పోయివద్దాం" అని కంఠీరవం అనగానే, అందరూ అనుసరించారు.

కంఠీరవం ఇంటికి వెళ్ళేవరకు వెంకటాచార్యులు గాఢనిద్రలో ఉన్నాడు. తల్లి, వదినె బట్టలు కుట్టుకుంటూ కూర్చున్నారు కంఠీరవం ఉదికి వస్తున్న ఆనందాన్ని పట్టలేక తల్లి ఒడిలోచేరి కుమిలి, కుమిలి ఏడ్చాడు. కాళ్ళపై తలవాల్చి మత్తిల్లినట్లు కండ్లు మూశాడు. వదినె మనసు కూడా చలించింది. కన్నీరు తుడుచుకుంటూ ఇంట్లోకివెళ్లి చెంబుల్లో నీళ్లు తెచ్చి "కాళ్ళు కడుక్కోమనరాదండి" అత్తను చూస్తూ అన్నది. కంఠీర వం తల్లివద్దినుండిలేచి వదినెకు దండం పెట్టాడు.

"నిలబడితివి నాయనా? అట్లా చాపవెయ్యమ్మ" ఆండాళమ్మ కోడలుతో చెప్పింది. "బాగున్నావా కొడుక, ఎన్నాళ్లాయె కొడుక నిన్ను దగ్గర కూర్చోబెట్టుకోక. ఆ శ్రియఃపతి కరుణ ఉండబట్టిగాని లేకుంటే నాతండ్రి బిడ్డ కష్టాలకు బ్రతుకుతాడను కున్నామా? దుర్మార్గ ముండాకొడుకులు, వాండ్లచేతిలో పడ్డాక వాండ్ల దయ. ఏంచేసినా చేస్తరు" అన్నది.

"మీరన్నది నిజమే తల్లి. రాక్షసులేనాయ్. ఇంకా వెనుకా ముందు ఆలోచ నెక్కడిది? అయినా కంఠీరవంగారు మాత్రం వాండ్లకు సరియైన వారేలేండి." విజయదేవు అన్నాడు.

కోడలు తాయమ్మ చాపలు పరిచి, బిడియంతో దూరంగా నిలు చుంది.

"కూర్చోండి నాయనా!" ఆండాళమ్మ ఆదరంగా అన్నది.

"పర్వాలేదండి" అని అంతా అన్నారు.

కంఠీరవం ఒళ్ళు మరచి ఆలోచన్లో పడ్డాడు. అనుభవాలను జ్ఞప్తికి చేసుకో సాగాడు.

ఆ అలికిడికి వెంకటాచార్యుల నిద్ర తేలిపోయింది. కండ్లు తెరిచాడు. ఎదురుంగా బషీరు, వెంకటేశ్వర్రావు, విజయదేవు, పరంధామయ్యలు నిలు చున్నారు. వెంకటాచార్యులకు ఆశ్చర్యం వేసింది. కండ్లు నలుముకున్నాడు. గాభరా పడ్డాడు. తత్తరపడి లేచి కూర్చున్నాడు. కంఠీరవం వచ్చి అన్న కాళ్ళపై బడి దండం పెట్టాడు. వెంకటాచార్యులకు అదంతా కలగాతోచింది. స్తబ్ధుడై పోయాడు అందరని కలయచూచాడు. ఆండాళమ్మ వెంకటాచార్యు లను పరీక్షగా చూస్తున్నది. భార్య తల నేలకు వేసి కన్నీరు పెడ్తున్నది. వెంకటాచార్యులు పిచ్చివానివలె దిక్కులు చూడసాగాడు.

"అమ్మా! మళ్లావస్తాను, గ్రంథాలయానికి వెళ్లాలె" అని కంఠీరవం విచారంతో ఇల్లు వదలి బయటికి వచ్చాడు.

రామభూపాల్‌రావుకు వ్యతిరేకంగామారిన తర్వాత విజయదేవు వెంకటా చార్యుల యింటికి రావడం అదే మొదటిసారి. ఆరోజు అతడు రావడం ఆండాళమ్మకు ఆశ్చర్యంకలిగింది. కంఠీరవంపై తనకున్నట్టే వాండ్లకూడా ప్రేమలుండబట్టే ఆవిధంగా వచ్చారని తేల్చుకున్నది. ప్రేమలున్న చోట ఎటువంటి విషవాతావరణమైనా, బలమైన అడ్డంకులైనా, కల్పించబడ్డ కృత్రిమ విద్వేషాలైనా పటాపంచలైతవని ఆమె తలిచింది.

"అత్తయ్యా! మరిది తప్పకుండా తిరిగి వస్తాడుకదూ!" ఆదుర్దాతో తాయమ్మ అడిగింది.

"ఎందుకురాడు? వాడేం పరాయివాడా? వాని ఇంటికి వాడు రాకేం చేస్తాడు?'' గుడ్లల్లో నీరు తీసికొని ఆండాళమ్మ సమాధాన మిచ్చింది. వెంకటాచార్యుల ముఖ వైఖరిని కనిపెడ్తున్నది.

"మీరు సాయంత్రం వరకు మరిదిని తీసుకరాండి. ఇల్లుండంగ పరాయిచోట్ల ఉండట మెందుకు? ఏం బాగుంటది?" భర్త నుద్దేశించి రాయమ్మ అన్నది.

వెంకటాచార్యులకు చిరాకుగా ఉంది. సందిగ్ధస్థితిలో పడ్డాడు. ఇంతలో రామభూపాల్‌రావువద్ది నుంచి పిలుపు వచ్చింది.

"వస్తాడుపో నాయన'' అని ఆండాళమ్మ. పిలుప వచ్చిన వానికి సమాధానం చెప్పింది. "నాయనా! ఇట్లావచ్చిపో'' వెంకటాచార్యులను పిలిచి, వంటింట్లోకి వెళ్ళింది. వెంకటాచార్యులు ఆలోచనా ధోరణిలో వంటింట్లోకి వెళ్లాడు. ఆండాళమ్మ వెంకటాచార్యుల రెండు చేతులు గట్టిగా పట్టుకుంది. "కొడుకా! నాకడుపు తరుక్కపోతున్నది. కన్నతల్లిబాధ చెప్ప డం కష్టం. దొరవారి మాటల్లోపడి, ఇంటిదాక వచ్చిన తమ్ముడిని వదులు కోకు. ఎంత తీసేసుకున్నా తోడబుట్టినవాడుగద నాయనా! మనసు స్వాధీనం చేసుకొని, తమ్ముడిని సాయంత్రం వెంటబెట్టుకరా. నన్ను చంపు కున్నట్టే లేకపోతే'' తల్లి బ్రతిమిలాడింది.

వెంకటాచార్యులు ముఖమంతా మాడ్చుకున్నాడు. "అయితే దొర వారిమాటలతో నేను చెడిపోతున్నాననానీ అభిప్రాయం? నాయనగారి కాలంలో పోగొట్టుకున్న భూమిసాధించడం చెడిపోవడమేనా నీదృష్టిలో, దొరవారిని గురించి నీవు పల్లెత్తుమాటన్నా నేను సహించను'' అంటూ నిర్లక్ష్యంగా వెంకటాచార్యులు వంటింట్లోంచి బయటికి వచ్చాడు. ఆండాళమ్మ విచారంతో నిలుచొని చూచింది.

"దొరకోసమని తోడబుట్టిన వాండ్లను దూరం చేసుకుంటావా ఎవ రన్నా?" భార్య ప్రశ్నించింది. "ఊరంతా పురుషంటే ప్రాణాలిస్తుంటే, తోడ

బుట్టిన అన్నైన మీరు ఇట్లా మాట్లాడితే ఎట్లా?" తిరిగి అనుకుంటూ వెంకటాచార్యులను అనుసరించి వాకిటి తలుపు వరకు వెళ్ళింది.

వెంకటాచార్యులు కోపంతో వెనుకకు తిరిగి, "ఊరంతా తోడిపెడ్తున్నది గద నాకు! ఇగ నీముద్దుల మరిది కూడా కూచోబెట్టి తినిపిస్తడు!" అని హడాహుడిగా రామభూపాల్‌రావు గడీకి వెళ్ళాడు.

ఆండాళమ్మ, తాయమ్మ భీరువులుగా ఒకరినొకరు చూచుకున్నారు.

వెంకటాచార్యులు వెళ్ళేవరకు, వెంకటాద్రి, హైదరలీ రామభూపాల్ రావుతో మాట్లాడుతున్నారు.

"పాపం! తమ్ముడు చాలా రోజులకు ఒచ్చిండు. నీతోమాట్లాడాడు?" వెంకటాద్రి భావగర్భితంగా అడిగాడు.

"దొరవారేమన్నా అంటారని ఆ మాత్రం తెలియదా? ఎంత తమ్ముడైనా మన్సులు కలువనప్పుడు మాట్లాడి మాత్రం ఏంలాభం?" హైదరలీ వెంటనే అందుకున్నాడు.

"ఈయనేమనుకుంటే మాత్రం ఏం? తల్లి ఊరుకుంటాది. కన్నకడుపాయె. సరే. అవన్ని పోనీయిగాని, మీయింటికి మీ తమ్మునితో పరంధామయ్య, విజయదేవులు కూడా వచ్చినార్తి. మరి నీతమ్ముని వెంట ఇంకెవరో ఇద్దరు కొత్త వాళ్లు వచ్చిన్రట. ఎవరు వాండ్లు? ఏమేం మాట్లాడారు?" రామభూపాల్‌రావు ఆదుర్దాగా అడిగాడు.

"ఏమిటండీ వాడితో మాట్లాడేది? మావాడిని చూస్తే మీరు ఆశ్చర్యపడతారు. వాని ముఖంలో వైష్ణవకళే లేకుండ పోయింది. వాడిని, వానివెంట ఉన్నవాండ్లను చూచి, పొద్దున్నే ఎవడి ముఖం చూచిన్నా, ఖర్మంగాలి అనుకున్న. ఎంతసేపు పున్నడనుకున్నారు? అసలు వాడికి ఇంట్లో కాలు నిలిచేట్లు లేదండోయ్. గ్రంథాలయానికి పోవాలని హడాహుడిగా పోయిండు. ఎక్కడికన్నా పోనీ. వద్దనేదెవరు? మళ్ళా వస్తానని తల్లికి చెప్పిపోయిండు. అదే నాకు చికాకుగా ఉంది." వెంకటాచార్యులు సమాధానమిచ్చాడు.

"వస్తే రానియ్యి. ఏమేం మాట్లాడుకుంటారో, ఏమేం సలహాలు చేస్తారో తెలుస్తుంది. ఏమంటారు దొరవారూ!" వెంకటాద్రి అన్నాడు.

రామభూపాల్‌రావు ఆలోచిస్తూ, పరధ్యాన్నంలో ఉన్నాడు. "మీ తమ్ముడు మొన్న, మొన్ననే కదూ జేలు నుంచి వచ్చింది?'' అని ప్రశ్నించాడు. వెంకటాచార్యులు సమాధానం చెప్పకముందే, "జేలుకు వెళ్ళినవాడుగదా! ప్రాయశ్చిత్తం జరుగొద్దు?'' అన్నాడు. మీసాలు పైకి ఎగతోశాడు. "ఇంకోసంగతి. మీతమ్మునికి బస్తీ గాలి బాగా తగిలింది. ప్రభుత్వమంటేనే లక్ష్యం లేనివాడు. పైగా చిన్నప్పటినించి గర్విష్ఠికూడా. కాబట్టి వీలువెంట నువ్వుగాని, మీ అమ్మగాని కొంచెం భయం చెప్పాలె. జాగ్రత్తగా మెలగమని చెప్పాలె. బయట ఏది చేసినా ఏది జరిగినా చెల్లిపోయింది. ఉన్నఊళ్లో మాటవేరు. ఎందుకంటే, చెరువు దున్నటం ఆగిపోయినప్పటినుంచి చంద్రయ్య, కొమరయ్యలు, వాండ్లను చూచుకొని ఊళ్లోవాళ్ళు పట్టపగ్గాలు లేకుండాఉన్నారు. ఎగిరిపడ్తున్నారు. వాండ్ల వెకిలి తనానికి మీవాడు 'సై' అంటే యింకా శివమెత్తుతుంది వాండ్లకు. తర్వాత మించిపోతే, అయ్యో అనుకుంటే లాభముండదు. సరే, వెళ్ళిరా. అఁ మరిచిపోయిన, రాత్రికి నువ్వు కూడా గ్రంథాలయానికి వెళ్ళి, కాసేపు కూచుండిరా'' రామభూపాల్‌రావు వెంకటాచార్యులకు పాఠాలు పెట్టి పంపాడు.

తల్లి, భార్య పోరు ఒకవైపు, రామభూపాల్‌రావు బోధన రెండో వైపు వెంకటాచార్యులను తికమక పరిచాయి. చాలాసేపు వరకు ఎటుతోచక అక్కడక్కడ కాలం గడిపి, చీకటి పడేవరకు గ్రంథాలయానికి వెళ్ళాడు. ఓచోట కీనీడను కూర్చున్నాడు.

వెంకటాచార్యులు వెళ్ళేవరకు గ్రంథాలయం ముందు ప్రజలు క్రిక్కిరిసి కూర్చున్నారు. అప్పుడే పరంధామయ్య మాట్లాడటం అయిపోయింది. అంతా చప్పట్లు కొట్టారు. కంఠీరవం లేచి నిలుచున్నాడు. కంఠీరవం అందరికి నమస్కరించాడు. అందరిని ఒకసారి కలయచూచాడు.

"అయ్యలారా!" అన్నాడు. ఆనందం ఉబికి వచ్చింది. ఆవేశం కలిగింది. ఇంకా మాట్లాడాలంటే నాలుక ఆడలేదు. గదమ వణికింది. ఒళ్ళంతా గగుర్పాటు కలిగింది. మాట్లాడాలని ప్రయత్నించాడు. గద్గద స్వరంతో, "ఎంతో కాలానికి తిరిగి మిమ్ములందరిని చూస్తున్నాను." మళ్ళా మాట తడబడింది. ఆపైన మాట్లాడలేకపోయాడు. కూర్చున్నవాళ్ళంతా దిగ్భ్రిమ చెందారు, దిగాలుపడి కంఠీరవం వైపు ఆశ్చర్యంతో చూడ సాగారు. విజయదేవుకూడా చలించి పోయాడు. గంభీరంగా తల నేలకు వేశాడు. పరంధామయ్య విచారంతో అందరిని పరికిస్తున్నాడు. బషీరు ముఖం చిన్నబుచ్చుకొని కూర్చున్నాడు. వెంకటేశ్వర్రావు పరీక్షగా కంఠీరవాన్ని చూచాడు. కొమరయ్య. చంద్రయ్యలు ఒకరినొకరు చూచుకొని నిట్టూర్పు విడిచారు. బరువైన గొంతుతో కంఠీరవం తిరిగి సంభాషణ మొదలుపెట్టాడు. మనసును స్వాధీనం చేసుకొన్నాడు. "నేను గ్రామం విడిచి వెళ్ళిపోయినపుడు నాకు కొమరయ్య ఒకడే ఆప్తుడుగా ఉన్నాడు. నేడు మీరంతా ఆప్తులుగా నాకు తోస్తున్నది. నాడు నాకు ఇల్లు, కుటుంబం ఉన్నప్పటికి అనాధునిగా ఊరు వదిలి వెళ్ళిపోయాను. ఈనాడు నా ఒంటిపై బట్టు తప్ప వేరే ఏమీలేవు. అయినా మీరంతా నాకు తరగని ధనంగా, విడదీయ జాలని కుటుంబంగా తలుస్తాను. మీవంటి వారు ప్రతి చోట ఉన్నారు. అట్టివారి ఆదరాభిమానాల వల్లనే నేనీనాటికి జీవించి ఉన్నాను. మిమ్ములను కలుసుకున్నాను. మీ ముందట ఒక కొత్త విషయం పెడ్తున్నాను." అని కంఠీరవం బషీరును దగ్గరికి పిలుచుకున్నాడు. బషీరు అభిమానంతో తల నేలకు వేసుకొని కంఠీరవం ప్రక్కన నిలబడ్డాడు. బషీరు భుజాన చెయిపెట్టి. కంఠీరవం సభికులను చూస్తూ "యిక్కడనించి పోయిం తర్వాత నాకు ఇతడొక అమూల్యమైన వస్తువుగా దొరికాడు. గొప్ప సహచరుడైనాడు. ఇతని పేరు ప్రస్తుతం బషీరు. అసలు ఇతనిది కోమటి కులమట. చిన్నప్పటి పేరు అతనికే తెలియదట. ఇతడు నావలెనే ఊరు వదిలి నానాచోట్ల తిరిగాడు. ఎన్నో అవస్థలకు గురి అయ్యాడు. దొంగల సహవాసములో చిక్కాడు. తుదకు నేడు నాకు స్నేహితుడైనాడు. ఇతనికి

నా అన్నవాడెవడు లేడు. మనసు కలిసిన ప్రతివాడు ఇతనివాడైనాడు. ఇప్పుడు మనమంతా బషీరుకు బంధువులం, స్నేహితులం. బషీరు వంటి వాండ్లెందరో జేళ్ళను ఇండ్లు చేసికొని ఉన్నారు." అన్నాడు.

సభికుల్లో గొణుగుడు ప్రారంభమైంది. "కోమటోడు కూడా తుర్కోల్ల కలిశిండే," "మనూళ్లో మాదిగోళ్ళ తోటే పోయింది. తుర్కోళ్లు కోమటోళ్ళను కూడా వదలనట్టుంది.", "అయితే మరి మన యిజయ దేవయ్య మంత్రాలు చదివి కలప కూరుకుంటాడు. జుట్టు, బొట్టు పెట్టంది నీదప్రి పడ్తాది ఆయనకు," "జేల్లనే ఉన్న దేమొ! పోరడు నిగ, నిగ బాగనే ఉండు." తలా ఓవిధంగా అనుకుంటున్నారు.

"దేశాన్ని కట్టుబాట్లతో, నీతి, నియమాలతో నడిపే ప్రభుత్వం, పరహితం, స్వార్థత్యాగం, విశాల హృదయంలేని ప్రజలు లేనంతవరకు బషీరు వంటి జీవులు బయలుదేరుతునే ఉంటారు. కాబట్టి ప్రతివారు పరిస్థితులను, మన కష్టాలను, కష్టాల కారకులను అర్థంచేసుకోవాలె. మన బాధ్యతలు గుర్తించి, హక్కులను సాధించుకోవాలె. అప్పుడు మన పుస్థితి నుండి బయటపడ్తాం. ఉత్తమ వ్యవస్థ ఏర్పడుతుంది. మన గ్రామం చెరువు వార్త, పత్రికల్లో చూడగానే రెక్కలుంటే ఇక్కడ వాలాలనుకున్నాను మీ పట్టుదల, చైతన్యము వల్లనే అంతటి పనిని సాధించారు. తుపాకులు. పోలీసులు. అధికారము. అన్నీ మీకింద పనికిరాలేదు. మీస్థితిని వారు తెలిసికోవడానికి ఇదేచాలు. మనకున్న ఈ శక్తి దుర్వినియోగం కాకుండ చూడాలె. ధనమైనా, తెలివైనా, యోగ్యతైనా ఉపయోగించే వానిపై ఆధారపడి ఉంటుంది. వాటిని గౌరవించని, వాటి విలువలను తెలిసికోలేని వాడి వద్ద అవి అట్టేకాలం నిలిచిఉండవు. కాబట్టి మీ శక్తి, సామర్థ్యాలు అన్యాయాన్ని దిరెంచుటకు మాత్రమే వినియోగించాలె. దుష్ట శక్తులకు బలికాకుండా చూడాలె. ఒట్టి కృతనిశ్చయం, ఆత్మశక్తి కలిగి అందరం అన్నదమ్ముల్లాగా బ్రతుకుదాం.'' అని కంఠీరవం నమస్కరించి కూర్చున్నాడు. అంతా చప్పట్లు కొట్టారు. వెంకటాచార్యులు లేచి వెళ్ళిపోయాడు. చప్పట్లు

ఆగకముందే. ఉత్సాహంతో వెంకటేశ్వర్రావు లేచి నిలుచున్నాడు. కూర్చున్న వాండ్లందరిని చూచేవరకు మొదటి ఉత్సాహం సన్నగిల్లింది. "మిత్రులారా!" అని దిక్కులుచూచాడు. ముసి, ముసిగా నవ్వాడు. "నాకు ఉపన్యాసం ఇవ్వటం రాదు. నాగురించి రెండు మాటలు చెప్పుకుందామని నిలుచున్న. నేను మీవంటి రైతులు మొదలైన వాండ్ల వైపున వకీలుగా పనిచేసి బ్రతుకుతున్నవాడిని. కాని పల్లెటూళ్ళంటే నాకు అంతగా పరిచయంలేదు. చిన్నప్పటినించి బస్తీలో పెరిగి, బస్తీలో చదువుకున్న వాడిని. నా బట్టలు నా వేషం, నాచేతి గడియారం ఇవన్ని చూచి నేను చాలా డబ్బుగలవాడినని మీరందరూ తప్పకుండా అనుకుంటారు. కాని అదంతా అబద్ధం. తలా ఇంత మీవంటి వాండ్లు ఇచ్చే పైసలే నాకు గతి. నాకు తల్లిలేదు. తండ్రిలేడు. ఊరులేదు. ఇల్లులేదు. క్షమించండి. ఏమో చెప్పబోయి ఏమో మాట్లాడుతున్నాను. సరే. అసలు విషయమేమంటే, ఇప్పుడు మన కంఠీరవంగారు ఒక మాటన్నారు. సరిగ్గా నడిపే ప్రభుత్వం, మంచి చెడ్డు ఆలోచించే ప్రజలు లేనప్పుడు ఎంతోమంది బికారులుగా ఊళ్ళు విడిచి, తల్లిదండ్రులను విడిచి. దేశాలు పట్టి 'నా' అనేవాడు లేక చివరకు దొంగగానో, దోపిడి దారుగానో, లేక నావంటి వానిలాగానో -అంటే నాపని మర్యాద పని అని సామాన్యంగా అనుకుంటుంటారు చాలామంది. కాని అట్ల కాదులెండి. నా ఎదుటి వకీలు అవుననన్నది, నేను కాదంటేనే కాని మారోజులు గడవవు- ఇట్లా తయారవుతారు. కాని కంఠీరవం వంటి మనిషిగా తయారు కావడం మాత్రం చాలా కష్టం.

ఇక నాసంగతేమంటే, అది చిన్నప్పుడు మా అమ్మ చెప్పితే కొద్దిగా జ్ఞాపకముండి చెప్పుతున్నాను. మాది ఒక పల్లెటూరేనట. ఎక్కడో మీ జిల్లాలోనే ఉన్నదని చెప్పినట్లు జ్ఞాపకముంది. నేను పుట్టిన కొద్ది నెల్లకే మా నాయనగారు గతించారట. మా అమ్మ అప్పుడు ఊరు విడిచి వెళ్ళిపోయిందట. కామారెడ్డి, సిరిసిల్ల, నిర్మల, యల్లారెడ్డి, బోధన్, ఆర్మూరు, ఇంకా ఎక్కడెక్కడో తిరుగుతూ మా అమ్మ నానా అవస్థలు పడినన్ని

చదివించింది. నేను ఇంకా చదువుతున్న రోజుల్లోనే మా అమ్మ ఓనాడు అకస్మాత్తుగా చచ్చిపోయింది. నేను స్నేహితుల సాయంతో అక్కడక్కడ తింటూ, బాజారు దీపాలకు చదువుకుంటూ మొత్తానికి చాలా కష్టంగా మెట్రిక్ వరకు చదువుకున్నాను. వకీలు పరీక్షలో నెగ్గాను. మన నిజామా వాదు మోహనాచార్యులతో స్నేహం కలిగి హైదారాబాదులో వకాలత్ చేస్తు న్నాను. కంఠీరవంగారితో పరిచయమయ్యి ఇక్కడకు వచ్చాను. ఇదంతా ఎందుకు చెప్పుతున్నాననుకున్నారు? నాగురించి ప్రభుత్వం తీసుకొన్న శ్రద్ధ ఏమీ లేదు.

ఇంకొక విషయం నాకాశ్చర్యం కలిగిస్తుంది. ఇంటింటికి వారాలు చేసుకొని, బజార్లో పడుకొని నానాఅవస్థలు పడుతున్న రోజుల్లో ఎవ్వడైనా 'నా' అనేవాడు కనపడ్తే ఒట్టు. ఇక నేను హైద్రాబాదులో వకాలత్ మొదలు పెట్టిన్నో లేదో చీమల బారుగా బంధువులు రావడం సాగింది. నేను బ్రాహ్మణ్ణి. నా పేరు అసలు వెంకటేశ్వర్లు, కాని వెంకటేశ్వర్రావు అని వాడుకలోకి వచ్చింది. మా నాయన గొప్ప జ్యోతిష పండితులని ఒకాయన చెప్పాడు. వావిలాల సుబ్బయ్య సిద్ధాన్తిగారంటే చాలా మంచి పేరు ఉండె నట. కచేరి పని ఉండి వచ్చే బ్రాహ్మణులంతా బంధువులమని, ఏవేవో వరుసలు చెప్పి తమ పనులు ఫీజు లేకుండా చేసిపెట్టమని ప్రాణం తింటుం టారు. అంతగా ఎక్కువైతే పది, పదిహేను రూపాయలు ఇస్తే మహా గొప్ప అనుకోండి.

ఇంకొక చిత్రం వినిపిస్తాను. ఒకనాడు ఒకాయనొచ్చాడు. ఆయన మాటలు, పద్ధతి చూస్తే ఆయన జీవితమంత కచేరీలల్లో గడిచినట్టనిపించింది. మా అమ్మకు చాలాదగ్గరి బంధువునని చెప్పుకున్నాడు. అతని వాలకం చూస్తే నాకు ఒళ్లుమండింది. "మా అమ్మ చచ్చినప్పుడు మోసే దిక్కులేక నేనుపడ్డ తిప్పలు, అవమానాలు అన్నిన్ని కావు. అప్పుడెక్కడ పోయినావు పెద్ద మనిషి?" అని అడిగాను.

"అయ్యో నాయనా! తెలిస్తే రాకపోదునా?" అని కపటసానుభూతిని వెలిపాడు. చచ్చేవాండ్లు బంధువులందరికి చెప్పి చస్తారా చెప్పండి? అంటే ఇట్లా ఉంటారు మనుష్యులు అని ఇంతకు చెప్పవచ్చింది. ఆ పెద్ద మనిషి ఆమాట ఈమాట మాట్లాడి, నాయనా! నీకు ఇరువై యకరాల నిక్షేపంలాంటి భూమి ఉంది. ఎట్లైనా వ్యవహారం తెలిసిన వాడివి. కాస్తాపట్టించుకున్నా వంటే నీసంపాదనకు ఆభూమి తోడుగా ఉంటుంది. ఎవరికైనా కౌలుకు ఇవ్వొచ్చు నన్నాడు. ఇక మీరే ఆలోచించండి, ఆ పెద్దమనిషి ఆలోచనెట్ల ఉందో. ఇరువై అయిదు ముప్పయిఏండ్లకింద ఊరువదిలి పోయిన వాడిని. ఇప్పుడు నాభూమి ఏది అని అడిగితే ఎవడైనా నవ్విపోడు? ఆపెద్ద మనిషి నన్నా విధంగా వ్యవహారాల్లోకిదింపి, మధ్య తనింత పని కల్పించుకోవాల్నని ఆలోచించాడు. క్షమించాలె. మిమ్ముల్నందరిని చూచేవరకు ఏమేమో మాట్లాడాను." అని వెంకటేశ్వర్రావు కూర్చున్నాడు.

శ్రద్ధతో వింటున్న కొమరయ్య, ప్రక్కనే కూర్చున్న చంద్రయ్యను చేతితో కదిలించి, "పెద్దయా! నాదగ్గర దొర గుంజుకున్న భూమి, మా అయ్యకు మొదలు కౌలుకిచ్చిన బాపనాయన పేరునీకు జ్ఞాపకం ఉన్నాదే?" అన్నాడు.

తలను రెండు చేతుల్తో పట్టుకొని గొంతుకూర్చున్న చంద్రయ్య కొమరయ్య వైపుమళ్ళి "ఆఁ అదే ఆలోచిస్తున్నరా." వెంకటేశ్వర్రావు నుద్దేశించి. "అయ్యా! మీ భూమిసంగతి చెప్పిన ఆపెద్దమనిషిది ఏవూరండి? రామడుగేనా? అయోధ్యరామయ్యగారుగదండి ఆయన పేరు?" అని అడిగాడు.

"అవును! ఆయన్ను గుర్తు పట్టారా మీరు? ఇటువైపువాడేనా?" వెంకటేశ్వర్రావు ప్రశ్నించాడు.

"కొమరయ్యా!ఇక దొరపని పట్టాం.చిక్కిందేపిట్ట"అంటూ చంద్రయ్య పట్టలేని సంతోషాన్ని ప్రదర్శించాడు.

ప్రజలు ఆశ్చర్యంగా ఒకరినొకరు చూచుకున్నారు. పరంధామయ్యా, "ఏంది సంగతి చంద్రయ్యా?" నిలుచుండి ప్రశ్నించాడు.

"ఇగ చెప్తగద," అని చంద్రయ్య మెల్లగా వెళ్లి వెంకటేశ్వర్రావు దగ్గర కూర్చున్నాడు. "అయ్యా! మీరు ఈమధ్య ఆభూమి ఎవరికి అమ్మలేదు గద?" ప్రశ్నించాడు.

వెంకటేశ్వర్రావు పిచ్చివానివలె చంద్రయ్యనుచూచాడు. "ఆ ఊరేదో తెలియదయ్యా అంటుంటే భూమిఅమ్మానని అడుగుతున్నావా?" అన్నాడు.

"సరే. అయితె. మన మిప్పుడే దొరదగ్గరికి పోవాలె"అని చంద్రయ్య శివమెత్తిన వానివలె ఆరాటంచేశాడు.

"ఏమిటా సంగతి? నిదానించి చెప్పరాదు. ఇటురా, కూర్చో" అని కంఠీరవం పిలిచాడు.

చంద్రయ్య ఉత్సాహంతో కంఠీరవం దగ్గరికి వెళ్లి "అంతా బయట పడ్డది" అని వెంకటేశ్వర్రావును చూచాడు. "ఇక మీరంతా ఇండ్లల్లకు పోండి" సభికులతో అన్నాడు.

అంతా కలవర పడ్డారు. సందిగ్ధస్థితిలో ప్రజలు ఇండ్లకు వెళ్లి పోయారు.

చంద్రయ్య, కొమరయ్య, పరంధామయ్యా, విజయదేవు, బషీరు, కంఠీరవం, వెంకటేశ్వర్రావులు మాత్రమే గ్రంథాలయంలో ఒక చోట కూర్చొని మాట్లాడసాగారు.

"వకీలుగారు గనుక మనకు మద్దతుగా ఉంటే మనమేదైనా చెయ్యొచ్చు" అని చంద్రయ్య కంఠీరవాన్నుద్దేశించి, "బాగా యినండి, మన కొమరయ్య నెత్తికొట్టి గుంజుకున్న ఆభూమి అసలు ఈవకీలుగారిది. ఇంక దీంట్ల అనుమానమేలేదు. అయితే దొరపేర ఎట్లా పట్టాఅయింది ఇప్పుడే తేల్చుకోవాలె. మీ కెవరికి కోపంరాకపోతే, వకీలుగార్ని ఒకటడుగుత.

ఏన్లేదు. వకీలుగారు మన్ను గట్టిచేస్కొని మాకు మద్దదుగా ఉంటరా లేదా? అది మొదలు తేలాలె." నేలగుడ్డి అడిగాడు.

"వకీలుగారు చెప్పిందంత ఈ ఊరికి సంబంధించిందేనా?" గుడ్లు మిటకరించి విజయదేవు అడిగాడు.

"ఇంక అనుమాన మెందుకు? ఈ వకీలుగారి తండ్రి చచ్చినంక ఆ రామడుగు అయోధ్యరామయ్య గారేనాయె, మన కొమరయ్య తండ్రికి కౌలుకాగితం రాయించింది. నాకన్నీ మతి ఉన్నయి. మీరేది అనుమానపడొద్దు." చంద్రయ్య గట్టిగా వాదించాడు.

"వెంకటేశ్వర్రావుగారు అనుకోకుండా రావడంవల్ల, ఎన్నో విషయాలు అనుకోకుండా బయట పడ్తున్నాయి. సరే, అయితే వకీలుగారు! మీ అభిప్రాయమేమిటో వాండ్లకు చెప్తేనే బాగుంటుంది" కంఠీరవం అన్నాడు.

వెంకటేశ్వర్రావు, మందహాసంతో, "అయిలే ఇదే నా ఊరన్నమాట. చాలాబాగుంది. ఆ భూమిసంగతికూడా నిజమేనన్నమాట. అయితే ఇక ఇప్పుడు నన్నేమి చేయమంటారు?" అన్నాడు.

"చేసేది సానాఉంది. మీరుమాత్రం మీభూమి ఈఊరి దొర పేర ఎట్లాపట్టా అయింది, తెల్సుకోవాలె" చంద్రయ్య అన్నాడు.

కొమరయ్య ఆభూమి గురించి జరిగిన విషయమంతా వెంకటేశ్వర్రావుకు వివరించి చెప్పాడు. "మాటి, మాటికి ఖానూనంటడు మా దొర. మరి మీరుకూడ ఖానూను తెలిసినోరే సైతిరి. ఆ ఖానూనేందో, అమ్మడమేందో మీరు తేల్చుకోవాలె" కొమరయ్య అన్నాడు.

"మా గ్రామ వ్యవహారాలు సామాన్యంగా ఉండవు. దేశాలను మింగే మహామహులుంటారన్నమాట." అని వెంకటేశ్వర్రావు కంఠీరవాన్ని మందహాసంతో చూచాడు. "అయితే, ఆ రామడుగు అయోధ్యరామయ్య గారిని పిలిపిస్తే బాగుండదు?" అని ప్రశ్నించాడు.

"ఒకవేళ ఆయనదగ్గర కౌలు కాగితం వ్రాయించాడంటే ఇంకా మనం బలంగా ఉంటాం." విజయదేవు అన్నాడు.

"అసలు ఎవరు అమ్మింది, సాక్ష్యలెవరు, సంగతేందో తహశీల్ కఛేరీకి వెళ్లి కనుక్కోవాలె." పరంధామయ్య సలహా ఇచ్చాడు.

"మన మనుకున్నవన్ని దృఢపడితే మీదొల వారికి మాత్రం మంచి సన్మానం జరిపిస్తాను. చేతులకు బేడీలు తగిలించి బజారు తిప్పక పోతానా చూడండి. ఇంత పగటి దోపిడిటండి! ప్రజల ఆస్తులు, ప్రభుత్వ చట్టాలు వీండ్లకు లెక్కలేదే: కంఠీరవంగారు! మీవెంట యిక్కడికి రావడం చాలా మంచిదైంది. అందుకే ఏదైన సహవాసం వల్లనే జరుగుతుంటాయి అంటారు" వెంకటేశ్వర్రావు అన్నాడు.

"ఏంటున్నావా బిషర్! ఒక్కొక్కరి సంగతి. మీరు దొంగతనం చేస్తే వెత్తం దెబ్బలు జేలుశిక్షలు. ఎన్నో ఏండ్ల కిందట ఒకరి భూమిని వన పని హరించి ఒకడు రాజ్యం ఏలుతున్నాడు, వీండ్లకు జంకులేదు. పాప భీతిలేదు. ప్రభుత్వ భయంలేదు. వీండ్లకు శిక్షలేదు, జేళ్ళు లేవు" కంఠీరవం గంభీరంగా అన్నాడు.

"అసలు ప్రజల లోపంగాని, ఒకవేళ ప్రతి గ్రామంలోని ప్రజలంతా విజ్ఞానవంతులై, కర్తవ్యాన్నెరిగి, ఐక్యంగానిలబడితే, ఈరోజు పెద్దలుగా పెత్తనం చేస్తున్న వాండ్లకు అసలుస్థలం జేళ్లుగాక వేరేఉందంటారా?" విజయదేవు అందరిని కలయచూస్తూ అన్నాడు.

"అయితే ఆపని మన ఊరినించే మొదలు పెడ్దాం" పరంధామయ్య ప్రతీకారంతో అన్నాడు.

"విజయదేవుగారన్నట్లు యదార్థంగా, శిక్షలు, జేళ్లు, దండనీతి, సమాజ విద్రోహులకై పుట్టాయి. కాని స్వార్థులు, వాటి నన్నిటిని, దేశభక్తులపై ప్రయోగిస్తున్నారు." కంఠీరవం అన్నాడు. "అయితె, చంద్రయ్యగారు! మీరు అయోధ్యరామయ్యగారిని తీసుకరావాలె. ఆమీద ముందు విషయ మాలోచిద్దాం. ఇక, పరంధామయ్యగారు, వెంకటేశ్వర్రావుగారు తహశీలు కఛేరికి వెళ్ళి చాలా గోప్యంగా వివరాలు సేకరించుకొని రావాలె" అని కంఠీరవం సలహా చెప్పాడు.

చంద్రయ్య ఉత్సాహంతో ఇంటికెళ్ళిపోయాడు. అంతా కొమరయ్య ఇంటికి భోజనానికై బయలుదేరారు.

వెంకటాచార్యులు గ్రంథాలయం నుంచి ఇంటికి పోతూ నానావిధాల ఆలోచించసాగాడు. కంఠీరవం అంటే అతనిలో నాటుక పోయిన నిర్లక్ష్యం సడలి పోయింది. చెప్ప జాలని జంకుకలిగింది. తల్లి, భార్య చెప్పిన మాటలు మెదడులో తిరిగాయి. రామభూపాల్‌రావు బోధలు చెవుల్లోగింగురు మంటున్నాయి. కంఠీరవం అంటే గ్రామ ప్రజలు ఆవిధంగా గౌరవించడం, ప్రేమించడం, వెంకటాచార్యుల ఆలోచనకు కారణమైంది. "కంఠీరవం నా తమ్ముడేగా! ఆ గౌరవం పొందుతున్న కంఠీరవానికి నేనుఅన్నను." వెంకటాచారిలో అభిమానం కలిగింది. "అయితే మాత్రం? వానికి భయపడ్తానా? ఏమిటి వాడుచేసే ఉద్ధారకం?" బూటక ప్రతిష్ఠ ఉబికి వచ్చింది. ఎటూ ఒక నిర్ణయం చేయలేక ఆలోచిస్తూనే ఇంటికి వెళ్ళాడు.

తల్లి, భార్య గ్రంథాలయం ఉన్నవైపు కండ్లు అప్పగించి, అశాంతితో ఇంటి ముందర నిలుచున్నారు. కంఠీరవాన్ని వెంకటాచార్యులు తీసికొని వస్తాడా, రాడా అని ఆందోళనతో ఉన్నారు.

వెంకటాచార్యులు కడపల్లో అడుగుపెట్టగానే, "మరిదేడి?" భార్య ప్రశ్నించింది.

"ఏం నాయనా! ఒక్కడివే వచ్చినవు?" తల్లి అని వెంకటాచార్యులను దీనంగా చూస్తు, దగ్గరికి వచ్చి నిలుచుంది.

వెంకటాచార్యులు చిరాకులో పడ్డాడు. విచారంగా మంచం మీద కూర్చున్నాడు.

"కంఠీరవం రావన్నాడా?" తల్లి తిరిగి అడిగింది.

"ఎందుకు రానంటాడు అత్తయ్యా!" భార్య సమాధాన మిచ్చింది.

"జేలుకు పెళ్ళిండు గదనే! ప్రాయశ్చిత్తం చేయంది పంక్తి భోజనం ఎట్లమ్మా?" తల్లిని పరీక్షగా చూస్తూ మెల్లగా అన్నాడు. అత్త, కోడలు

విశ్రాంతులై ఒకరినొకరు చూచుకున్నారు. కన్న కొడుకును దూరం చేసే ఆ నియమాలు ఎవరు, ఎందుకు పుట్టించారో అన్నంత బాధతో తల్లి కుంది పోయింది. "సమయానికి ఇటువంటివి బాగా జ్ఞాపకమొస్తాయి నాయన నీకు!" నిష్ఠూరంగా అని తల్లి కన్నీరు పెట్టింది. "రాక, రాక ఇంటికొచ్చిన కొడుకును వదిలిపెట్టి పాడుపొట్ట నింపుకునే మొండి బతుకాయెనాది. ఇట్లా ఈ మొండి బతుకెన్నాళ్ళో" తల్లి కుమిలింది.

వెంకటాచార్యులు తనలో ఏదో బలహీనత ప్రవేశించి, తమ్ముని వైపు ఆకర్షిస్తున్నదని, ఆవాతావరణం ప్రభావితం చేస్తున్నదని గ్రహించాడు. తప్పుచేస్తున్నానని తత్తర పడ్డాడు. మనసును స్వాధీనం చేసుకుంటున్నట్టు తెప్పరిల్లి, వింతగా పరిసరాలను పరికించాడు.

"అంతకైతే మరిదికి మొదట అన్నం బెట్టుదాం, ఏమంటరు అత్త గారు?" భార్య ఆలోచన చెప్పింది.

వెంకటాచార్యులు ముఖమంతా మాడ్చుకొని, కోపంతో భార్యను చూచాడు. "వానితోనే పోయిందా? వెంట ఒక తురకోడున్నాడు. ఇంకో దెవరో దూదేకులోడు ఉండొచ్చు. ఇకసరే మన ఊరి పెద్దలు ఉండనే ఉన్నారుకదా! వాండ్లందరిని వదిలిపెట్టి వాడొక్కడొస్తాడా? రాడు, వాండ్ల కోసం నేను మాదుగుల్లో కలిసి, దొర వారితో కంటు తెచ్చుకుంటానా?" ఆవేశంతో అన్నాడు. కాని వెంకటాచార్యులకు వెంటనే ఒకవిషయం జ్ఞాపకం వచ్చింది. కంఠీరవం ఇంటికి వస్తే లోగుట్టు తెలుసుకొమ్మన్నాడుగా! వెంకటాచార్యులు ఆలోచించసాగాడు. కంఠీరవం ఇంటికివస్తే మాట్లాడాల్సి ఉంటుంది. ఎట్లా మాట్లాడాలె. ఒకవేళ మాట్లాడినా తీసేసినట్టు మాట్లాడితే! అతనివెంట విజయదేవు, పరంధామయ్యలు కూడా వస్తారు. వాండ్లతో ఎట్లా మాట్లాడటం? వెంకటాచార్యులు ఒక నిర్ణయానికి రాలేక పోయాడు. భార్య, తల్లి విచారంగా గోడకు ఆనుకొని, నిస్సహాయులుగా వెంకటాచార్యులను చూస్తు నిలుచున్నారు.

"మరి నాకుకూడుపెడ్తరా లేదా?" అప్రయత్నంగా కటువుగా అంటూ భార్యను కోపంగా చూచాడు.

"ఎందుకు పెట్టం కొడుకా!" ఒక నిట్టూర్పు విడిచి, తల్లి వంటింట్లో వెళ్ళింది. కోడలు నిరుత్సాహంతో అత్తను అనుసరించింది.

# 20

కొమరయ్య ఇంటికి పోగానే, అందరు ముందు వసారాలో కూర్చున్నారు. కంఠీరవం నేరుగా ఇండ్లోకి వెళ్ళి "అన్నమ్మేది, ఎక్కడుంది?" అనుకుంటూ వంటింట్లో జొరబడ్డాడు. అన్నమ్మ, కోడలు కనకమ్మ కలిసి వడ్డనకై ఆయత్తపడుతున్నారు. కంఠీరవాన్ని చూడగానే అన్నమ్మ ముఖం వికసించింది. "బాగున్నావు కొడుకా" ఆనందంగా అంటు ఎదురుగా వచ్చింది. దగ్గరికి రాగానే కంఠీరవం అమాంతంగా అన్నమ్మను ఆలింగనం చేసుకొని, కాళ్ళకు మొక్కాడు. అన్నమ్మ ఆశ్చర్యంతో పక్కకు తొలిగింది. "నీకేం పిచ్చా? బాపోళ్ళం, మా కాళ్ళకు మొక్కుతావా?" ముక్కు మీద వేలు వేసుకొని అన్నది. కంఠీరవం ఆవేశపడ్డాడు. ఉబికి వస్తున్న ఆనందాన్ని అదుపులోకి తెచ్చుకో ప్రయత్నించాడు. "నీ చల్లని నీడ నాకెంతో హాయిగా ఉంటుంది. అన్నమ్మా! నువ్వు నా తల్లి కంటే దేంట్లో తీసిపోయావు? మీ వంటితల్లుల ఆశీర్వచనమే మాకు ఆయుస్సు పోస్తుంది."అని గౌరవంగా ఒకసారి కనకమ్మను చూచి వసారాలోకి వచ్చాడు. అంతా భోజనానికి కూర్చున్నారు. కంఠీరవం పక్కనే బషీరు కూర్చున్నాడు. ఎదురుగా కూర్చున్న విజయదేవు ఆలోచనా ధోరణిలో బషీరును, కంఠీరవాన్ని చూడసాగాడు. బషీరు సహపంక్తిలో భోజనం చేయడం విజయదేవుకు అసమ్మతంగా ఉండింది.

అగ్రజాతికి చెందిన కంఠీరవం తన కాళ్ళపై బడటం, పక్కకు మహమ్మదీయుని కూర్చోబెట్టుకొని తినడం అన్నమ్మకు విడ్డూరమనిపించింది. కొమరయ్య అన్నమ్మకు సాయంగా వడ్డన చేయసాగాడు.

"ఏమిరా కొమరయ్యా! అయ్యగారు మనింట్ల తింటే ఊళ్లో వాండ్లు ఏమనుకుంటరు? ఆ తురకాయన్ను రద్దుకొని కూసోక పోతే ఏమాయె?" అన్నమ్మ కొమరయ్యను పక్కకు పిలిచి, గుస, గుసగా చెప్పింది.

"అమ్మా! వాండ్లకు బువ్వ పెట్టె నసీబ్ మనకుంది. వాండ్లిద్దరికి బువ్వ పెట్టటమంటే గుట్టమీద సంతర్పణ చేసినంత పుణ్యమనుకో. సరే గాని, ఆయనతో గిట్ల ఈ మాటనేవు" అని కొమరయ్యా తిరిగి వడ్డనలో లీనమైనాడు. అన్నమ్మ కంఠీరవాన్ని పరీక్షగా చూస్తూ తలుపు పక్కన నిలుచున్నది. ఇల్లు విడిచి పోయేటప్పుడు ఆండాళమ్మ దుఃఖం, కంఠీరవం మాటలు, చావిట్లో అంజుమన్ నాయకులతో పెట్టుకున్న జగడం— అన్ని తలుచుకుంటూ నిలుచున్నది. "ఏదో, చల్లగ బ్రతుకు నాయనా" ఆమె అను కోకుండానే హృదయం ఆశీర్వదించింది.

అంతా భోజనాలు ముగించుకొని, కొద్దిసేపు ఆషామాషీ సాగించారు. చెరువు సంఘటన వివరాలు, కొమరయ్యా భూమి రామభూపాల్‌రావు గుంజు కున్నప్పుడు అన్నమ్మ చేసిన ధైర్యం, కొమరయ్యాపై రామభూపాల్‌రావు చేసిన దౌర్జన్యం, మతపరివర్తన వాతావరణం, విజయదేవుకు, ఆర్య సమాజం ప్రాధానికి జరిగిన వాగ్వివాదం అన్నీ చర్చించారు. కంఠీరవం ఆనందంతో ఉబ్బిపోయాడు. బషీరు ఆ చర్చలన్నీ శ్రద్ధగా వింటూ, అవి అతనిపై వేస్తున్న ప్రభావానికి ఉద్రిక్తుడయ్యాడు.

చంద్రయ్యా రామడుగు గ్రామానికి, పరంధామయ్యా, వెంకటేశ్వ ర్రావులు తహశీలుకు వెళ్ళారు. ఆరోజంతా ఆషామాషీగానే గడిచింది. సాయంత్రం అంతా కలిసి, కొమరయ్యా తోట బావి భూమిని చూడటానికి వెళ్ళారు. వచ్చేటప్పుడు గ్రామం నలువైపులా తిరిగారు. హరిజన వాడకు దగ్గరగా, అంజుమన్ మత ప్రచారకునికై వేసిన గుడిసె స్థలమును చూచారు. పూర్తిగా పాడుగోడలుగా ఉండిపోయిన వెంకటేశ్వర్రావు ఇంటిని చూచారు. చెరువు కట్టమీదికి వెళ్ళారు. మేజిస్ట్రేట్‌తో వచ్చిన ప్పుడు, అంతా గుమికూడిన స్థలాన్ని, పోలీసులు నిలుచున్న స్థలాన్ని చూపుతు విజయదేవు విషయాల్ని వివరించాడు. చెరువు కట్టమీద నిలుచుండి కంఠీరవం నలువైపుల గంభీరంగా తిలకించాడు. దూరంగా ఎత్తైన ప్రదేశ ములో చేనులో ఉన్న పాత గుడిని ఒళ్లు మరిచి చూడసాగాడు. గ్రామం

నుంచి వెళ్ళిపోయినప్పటి దృశ్యం, చేను కాపరుల ఆతిథ్యం, కనకయ్యా సంభాషణ, కొమరయ్యతో కలయిక- అన్ని కంఠీరవం తలచుకొని ఒక నిట్టూర్పు విడిచాడు. కొమరయ్యా వైపు తిరిగి, "కనకయ్యా ఇప్పుడేంజేస్తు న్నాడు?" ప్రశ్నించాడు.

"పాపం! పొట్టకెళ్ళక షోలాపూర్ బట్టల గిర్నిలో పని చేస్తున్న డంట, అప్పుడప్పుడు వచ్చిపోతుంటడు." కొమరయ్యా విచారంగా సమా ధాన మిచ్చాడు.

కంఠీరవం బ్రాహ్మణేతరులతో కలిసి భోజనం చేయడం గ్రామీయు లకు సహించరాని విషయమైంది. గుస, గుసలు మొదలైనాయి.

"నీ కొడుకు మీ ఇంటికి అసలే రావా అమ్మా?" ఒక స్త్రీ ఆండాళమ్మను పరామర్శించినట్లే, విమర్శించింది.

"మీరు తెలిసినోళ్ళే శూద్రుల్లిండల్లో తింటుంటే మాలమందోండ్లకు పట్టపగ్గాలుంటయ్యా?" ఇంకొక స్త్రీ ఆండాళమ్మను ప్రశ్నించింది.

వారి మాటలతో ఆండాళమ్మను బల్లెంతో పొడిచినట్లైంది. రఘునాథా చార్యులకుండిన నిష్ఠకు, కంఠీరవం చేష్టలకు ఉన్న అగాధమును తలచు కొని నిట్టూర్పు విడిచింది. అసహాయురాలుగా తనలో తాను కృశించసాగింది.

గ్రామీయుల్లో కొందరికి కంఠీరవం భోజనం విషయంలో ఉన్న విముఖతను ఆధారం చేసుకొని వెంకటాచార్యులు కంఠీరవాన్ని విమర్శించ మొదలుపెట్టాడు. కంఠీరవం ఒట్టిపోకిరివాడని, చిన్న, పెద్ద, కులం, మతం లేనివాడని, తన, పర అనే విచక్షణే లేదని చెప్పసాగాడు.

ఆడవాండ్లలో బయలుదేరిన గుస, గుసలు, మగవాండ్లకు పని కల్పించాయి. కొందరు వచ్చి, కొమరయ్యతో, తమ మనసులోని మాటలు చెప్పారు. కొమరయ్యా కూడా కంఠీరవం ఆవిధంగా కలిసి, మెలిసి భోజనం చేయడం తప్పేనని భావించాడు. ఒకసారి సందర్భం కనిపెట్టి, గ్రామంలో

కొందరు లేవదీసిన ప్రశ్నను కంఠీరవానికి చెప్పాడు. కంఠీరవం ఒక చిరు నవ్వు నవ్వి, "మంచిది. ఆవిషయం ఆలోచిద్దాం," అని తలవూపాడు.

రాత్రివేళ గ్రంథాలయంలో అంతా కూడగానే, కంఠీరవం తన భావాలను వ్యక్తపరిచాడు.

"మనము చేసే పనులవల్ల, చెప్పే మాటలవల్ల, కష్టముగాని, నష్టముగాని ఇతరులకు కలుగకుండ చూడటం చాలా ప్రధానం. నేను కేవలం ఒక మానవుడినని మాత్రమే అనుకుంటున్నాను. నేను కుల, గోత్ర, మత, వర్గాలతో వైరాలు పెంచుకోవాలనిగాని, వాటికి లొంగి అడ్డంకులకు అదరి పోవాలనిగాని నేను తలవను. మీకు నాకు, నాకు బషీరుకు, అల్లే నేను ప్రేమించే, నా విజ్ఞానానికి, నా ఉనికికి కారణమయ్యే ఏశక్తి, లేక జీవితో కూడా నేను వేరుగా ఉండటం ఆత్మద్రోహ మనుకుంటాను." గంభీరంగా కంఠీరవం ఒక్కొక్క వాక్యం తూచినట్టు మాట్లాడాడు.

విజయదేవు శ్రద్ధగా వింటున్నాడు.

"కులాల పేర, మతాల పేర, ప్రారంభమైన ఈ అడ్డగోడలు, క్రమంగా బలమైన అడ్డంకులుగాను తయారైనాయి. దాంతో మనలో ఐక్యత నశించింది. సమిష్టి బాధ్యత, సమిష్టి ఆలోచన, సమిష్టి జీవితము, లేకుండా పోయింది. ఎవరికివారు బాధ్యతారహితులై పోతున్నారు. నేను నావరకు అటువంటి ఏ అడ్డంకులను కూడా లక్ష్యపెట్టదలుచుకోలేదు. ప్రయత్న పూర్వకముగా అట్టివాటిని ఎదుర్కొంటాను. కాని ఒక సంగతి మీరు దృష్టిలో ఉంచుకోవాల్సని సవినయంగా ప్రార్థిస్తున్నాను. ఎవరికి వారు, తాము చేసే ప్రతిపని, అంతరార్థం, పరిణామం తెలిసికొని చేయటం మంచిది. అంతేగాని వ్యక్తిగతమైనట్టి, లేక అధికార పూర్వకమైనట్టి లేక ఆర్థికమైనట్టి ఒత్తిడికి లొంగి, అణగి యుండటం మాత్రం ఆత్మహత్య చేసికున్నట్టే" కంఠీరవం గ్రామీయుల సందేహాలకు సమాధానంగా అన్నాడు. కంఠీరవం మాటలను గ్రామీయులు శ్రద్ధగా విన్నారు. అతనితో వాదన పెట్టుకోవడంగాని, ప్రశ్నించడంగాని శక్తికి మించిన విషయంగా తోచింది.

గంభీరంగా కంఠీరవం సంభాషణను వింటున్న విజయదేవు, కంఠీరవంతో వాదనకు దిగాలని ఉత్సాహపడ్డాడు.

"మీరు ప్రకటించిన భావాలతో ఇంచుమించు నేను ఏకీభవిస్తాను. కులాలు, మతాలు నిజంగా లేకుండా పోవాల్సిందే. ప్రస్తుతం కులాల పట్టింపులు పెట్టుకున్నా సాగేవికావు. గ్రామాల్లో మన ప్రజల్లో కొన్ని భావాలు నాటుకపోయాయి. అవి క్రమంగా పోతుంటాయనుకోండి. కాని నాకొక సందేహం.... సందేహమేమిటెండి, గట్టిగా విశ్వాసం ఉంది. అయినా ఈ విషయంలో మీ అభిప్రాయమేమిటో తెలుసుకుందామని మనవి చేయ దలిచాను." విజయదేవు దీర్ఘమైన ఉపోద్ఘాతం ప్రారంభించాడు.

"కొన్ని దేశాల్లో ఉండే ఆచారాలు, అలవాట్లు లేక మత విధులు, వేరే దేశంలోని మత విధులకు, సభ్యతా సంప్రదాయాలకు విరుద్ధమేగాక, హానికరంగా కూడా పరిణమిస్తాయి. అయినప్పుడు మీరనుకునే సమిష్టి తత్వము దెబ్బతింటుందేమోనని నా అనుమానం" విజయదేవు మందహాసం కురిపిస్తూ వినయంగా అన్నాడు.

"దెబ్బతినాల్సిన అవసరంలేదు. నేడు సమాజములో ఆచరణలోనున్న అలవాట్లు, సంప్రదాయాలు ఒకేసారి, ఎవరైనా ఒకరు, ఏ దేశంలోనైనా నికరంగా నిశ్చయించి, ఆచరణలోకి తెచ్చినవికావు. సమాజ వికాసంతోపాటు, జీవితములోని ప్రతి విషయం- కట్టుకునే బట్ట మొదలు రాజ్యాంగ పద్ధతివరకు - మారుతూ వచ్చాయి. వికాసదశలో చెడుగు ప్రవేశించడం లేక మంచి ఫలితాలేర్పడటం పైననే ఆ వికాస దశకు సంబంధించిన సమాజం యొక్క రూపం నిలిచిపోతుంది, కొన్నాళ్ళ వరకు. దాన్నిబట్టి ఆయా దేశాల, లేక జాతుల, ప్రజల నైతిక కట్టుబాట్లు, ఆచార వ్యవహారాలు, సంస్కృతీ సంప్రదాయాలు మారుతూ ఉంటాయి. కాబట్టి ఏ దేశం, లేక జాతి కూడా తనకొక ప్రత్యేక విశిష్టత ఉందని చెప్పుకోవడంలో అర్థంలేదు. బయటి ప్రపంచం యొక్క ప్రభావంతో దూరం ఉన్నామని అనుకోవడం పొరపాటు. అది అసంబద్ధం, అసహజము కూడా. ఈ

మూల విషయాన్ని మనం దృష్టిలో పెట్టుకోవాలె. ఈ దృష్టితో ఆలోచిస్తే ఒకరి పరిస్థితివల్ల, ఇంకొకరి పరిస్థితి మారి సమిష్టితత్వము చెట్బతినదు. భిన్నమైన రెంటి కలయికతో ఒక కొత్త వాతావరణం ఏర్పడుతుంది, ప్రభావం కలుగుతుంది. దాని ఫలితంగా కలిగే మంచినిమాత్రమే స్వీకరించి, చెడుగును పరిత్యజించి విశాల హృదయంతో కృషి చెస్తే, ఒక కొత్త సభ్యత, సంస్కృతి, సంప్రదాయం ఏర్పడుతాయి. అదే తుదకు 'సమిష్టి' తత్వముగా పరిణతి పొందుతుంది. అదే విశ్వమానవ సౌభ్రాతృత్వానికి పునాదిరాయి." అని కంఠీరవం వివరించాడు. విజయదేవుకు తృప్తికరంగాను, మనోరంజకంగాను సమాధానమిచ్చానని కంఠీరవం సంతృప్తి పడ్డాడు. కాని విజయదేవు ఆలోచనా పై ఖరితో మెడను కొంచెం వంకరగా పెట్టి... "ప్రస్తుత పరిస్థితిలో అన్నిటికంటె విశాలమైన దృక్పథము, ఉన్నత ఆశయాలు, విశిష్టమైన సభ్యతా సంప్రదాయాలు గల సంస్కృతి ఆర్య సంస్కృతియని నా విశ్వాసము" అన్నాడు.

"ఆవిధంగా మీరు విశ్వసిస్తే తప్పేంలేదు. మనిషికి కలిగే ప్రతి విశ్వాసానికి వెనుక కొంత చరిత్ర ఉంటుంది. ఆ చరిత్రను అర్థంచేసుకొనే పద్ధతిపై ఆ విశ్వాసం ఆధారపడిఉంటుంది. అర్థం చేసుకొనే పద్ధతి మారితే విశ్వాసాలుకూడా మారుతుంటాయి. అదిగాక ప్రతి దేశానికి చెప్పుకోతగ్గ ఘనత ఏదోఒకటి ఉండితీరుతుంది. అయితే ఆ దేశము తన ఘనతనే గీటురాయిగా పెట్టుకోకూడదు. తన గీటురాయితో ఇతర దేశాలు చెప్పుకొనే ఘనతల రంగు తేల్చుకోకూడదు. దానితోపాటు పోలికల్లో కనిపించే లోపాల వెనుక, హెచ్చు తగ్గుల వెనుక వాటికి కారణమైన ఆయా దేశాల వారి పరిస్థితులను, పరిణామ దశలను కూడా అర్థము చేసికోవాలె. అప్పుడు కాని ప్రతివానికి సశాస్త్రీయ విమర్శనా దృష్టి అలవడదు. అప్పుడు అట్టి వాడు తన ఘనతకు గర్వించుకొనుటతోపాటు, తన ఘనతలవల్ల సత్ఫలితాలు ఇతరులు అనుభవించుటకు కారకుడవుతాడు. అట్లే ఇతరుల ఘనతల్లోని ప్రత్యేకతలతో తాను లాభిస్తాడు. దాంతో ఒక చక్కని రాజమార్గం

ఏర్పడుతుంది కాబట్టి మీరు విశ్వసించిన ప్రకారం ఆర్య సంస్కృతి విశిష్టత కలదనుటకు నాకు ఆక్షేపణ లేదు. అయినా, ఆ విశిష్టత పరిపూర్ణమైందని మాత్రం నేను ఒప్పుకోను. ఆర్య సంస్కృతి జీవనాడిని బట్టి చూస్తే ముందడుగు వేయాల్సింది ఎంతో ఉంది" కంఠీరవం అన్నాడు.

"ఇప్పుడు బషీరుగారి విషయం, అంటే అతని సభ్యతను ఏమంటాం?" విజయదేవు ప్రశ్నించాడు.

"బషీరు మీకు ఒక్కడే కనపడ్తున్నాడా? చెప్పుకొనుటకు హిందువని, మహమ్మదీయుడని, క్రైస్తవుడని, ఇంకా ఏమేమో యని పిలుస్తుంటాం. ఈ మతాలు, బలవంతంగా మెడకు పడ్డమేగాని, కోంతెచ్చుకున్నవి బహుస్వల్పం. పుట్టుకవల్లనో, లేక తరువాత ఏదైన ప్రభావం వల్లనో మెడకుపడ్డ పేర్లు మాత్రమే. ఇక మత విధులను ఆచరిస్తున్న దెంతమంది? అన్నం తినేముందు అన్నార్తులు లేకుండా చూడమని ఆర్యులు ఘోషించారు. ఇప్పుడేం చేస్తున్నారు? తలుపులు దగ్గరికి బిగించి భోజనాలు చేస్తున్నారు, వారిసంతతివారు. వడ్డీని గ్రహించడం, బంగారం ధరించడం వర్జనీయమని ఖురాన్ బోధిస్తున్నది. కాని? అప్పులు పెట్టి వడ్డీని జీవితాధారంగా చేసుకున్నారు. ఒక చెంపపై కొట్టితే, రెండోచెంపను చూపమన్న ఏసుక్రీస్తు శిష్యసంతతి, మహాత్ముని వంటి పురుషోత్తముని హింసలపెడ్తున్నది. అక్షరాల మత విధులను ఆచరించు ప్రతినిధులు లెక్కకు మిక్కిలిగా లేరు. కారణం? మతాలు, భౌతికకారణాల వెంట నడుస్తూ తమ ఉనికిని ఇముడ్చుకొని బలహీనతలకు దారి తీశాయి" అని కంఠీరవం ముసి, ముసిగా నవ్వాడు.

"మీ రెన్నన్నా చెప్పండి, విజయదేవుగారికి తుర్కలంటే పడరాదు. ఎన్నన్నా మాహ్లాదుతతు కాని తుర్కల కాడికి రాగనే మాట ఎహో పోతది" కొమరయ్య నవ్వుకుంటూ అన్నాడు.

"అంటే అంజుమన్ వాండ్లు మత విషాన్ని పంచుతుంటే దానికి విరుగుడుగా ఆదేమార్గం అనుసరణీయమని విజయదేవుగారి అభిప్రాయమై

ఉండొచ్చు. కాని అది నేనంగీకరించను. దానికి విరుగుడు పూర్తిగా భిన్నంగా ఉండాలె. హైదరలీ, రామభూపాల్‌రావుల ఐక్యత మన అందరికి కనువిప్పుగా ఉండాలె. మనం మన సమస్య దృష్ట్యా వ్యక్తులను, ఆశయాలను అర్థం చేసుకోవాలె. అవి ఎక్కడ నించి, ఏవిధంగా వస్తున్నవో గమనించాలె" కంఠీరవం కొమరయ్యను సంబోధిస్తున్నట్టు మాట్లాడాడు.

"నేను పదేండ్లనుంచి మాగుంపులో తిరుగుతున్న. ఎన్నడు కూడా మాలోమేము హిందువులమని, తురకలమని అనుకోలేదు. కాని ఇదే సంగతనుకుంట అప్పటినించి అనుకుంటున్నరు? ఎక్కువ చదువుకుంటే అన్నిటి మీద అపనమ్మకం, అనుమానం కల్గుతుందా, ఎరకలేక అడుగుతున్న?" బషీరు కొమరయ్యను చూస్తూ అన్నాడు. ముఖమంతా చిన్న బుచ్చుకున్నాడు.

"నిజం జాగానే తెలుసుకున్నడు." కొమరయ్య నవ్వుతూ అన్నాడు.

"విద్యాహీనులమని ఎవరిని అంటూంటామో వాండ్లలో విషయగ్రహణశక్తి ఎక్కువగా ఉంటుంది" అని కంఠీరవం అంటుండగా, నిజామాబాదుకు వెళ్లిన పరంధామయ్య, వెంకటేశ్వర్రావులు వచ్చి, కంఠీరవానికి, విజయదేవులకు నమస్కరించారు. కంఠీరవం పక్కకు కూర్చున్నారు. కొమరయ్య అక్కడ కూర్చున్న ప్రజలను లేపి, ఏదో మాట మంతి సాగించి, ఇండ్లకు పంపాడు.

# 21

పరంధామయ్య చాలా కోపంగా ఉన్నాడు. వెంకటేశ్వర్రావు పరీక్షగా కంఠీరవాన్ని చూస్తూ కూర్చున్నాడు.

ఒక తల్లికడుపులో మీవంటి అన్న, దమ్ములు పుట్టారంటే చాలా ఆశ్చర్యమేస్తుంది." పరంధామయ్య బుసకొడ్తు అన్నాడు. "మీ అన్న తల గొట్టి నడిబజార్లో వేలాడతీశినా పాపంలేదు" అంటూ కంఠీరవాన్ని ఉక్రోషంతో చూచాడు.

"కొంచెం నిదానించండి. జరిగేదేమిటో మంచిగానే జరుపుదాం. కాని శాంతించండి." వెంకటేశ్వర్రావు ఉపశమనం కలిగించాడు.

కంఠీరవం, పరంధామయ్య వీపుపై చేయివేసి, "చాలా రోజులకు పరంధామయ్యగారి నిజ స్వరూపాన్ని చూస్తున్నాను. ఒకప్పుడు నిజామాబాదులో గ్రంథాలయ సభకు ప్రభుత్వం కొన్ని అన్యాయమైన నిబంధనలు విధిస్తే ఈవిధంగానే ఆరాటం చేశాడు. అతి అమాయకులు ఇట్లాగే ఉంటారు" అన్నాడు.

"అసలు మొదట వెంకటాచారి కాళ్ళకు తాడు కట్టి, చచ్చిన కుక్కను ఈడ్చినట్లు, ఈడ్చుకొచ్చి, పెడరెక్కలు గుంజకు కట్టాలె. సిగ్గు, లజ్జ, బిడియం లేక, తనే వెంకటేశ్వర్రావునని చెప్పుకొని కొమరయ్య నోట్లో మన్ను పోశాడు, పెద్ద కులంలో పుట్టినా అన్ని పాడు బుద్ధులే", అంటూ పరంధామయ్య గుడ్లెర్రచేసి అందరిని కలయజూచాడు.

అందరూ నిర్విణ్ణులై, కంఠీరవమే నేరస్థుడన్నట్లు అతని వైపు చూచారు.

కంఠీరవం అవమానంతో భారంగా తల నేలకు వేసి కూర్చున్నాడు.

"మీరు చేయమన్న పని చేయడానికి నేను సిద్ధంగా ఉన్నాను. నేను నా అన్న విషయంలో అభిమాన పడ్డానని మీకెవరికి సంకోచం ఉండనక్కర లేదు, ఉన్నదని కూడా నేను అనుకోను. నాకు, నా అన్నకు పుట్టుకతో ఏర్పడిన సంబంధం తప్ప వేరే ఏమీ లేదు. అది మీరెరిగిన సంగతే. కని, పెంచి, కల్మషం లేకుండా కనికరించే మా అమ్మకు, నీతి, నియమం, నిష్ఠ, విజాయితి గల మా నాయనకు నేను కొడుకునై పుట్టినందుకు నేనెంతో గర్విస్తుంటాను. అవిధంగానే ఈరోజు నా అన్నయ్య చేసిన అన్యాయానికి శిక్షగా నా అన్నయ్యను న్యాయస్థానానికి అప్పచెప్పి అతని పాపాన్ని లోకానికి తెలుపడం కూడా నాకు గర్వకారణ మవుతుంది" కంఠీరవం గంభీరంగా అన్నాడు.

"మీ అన్న చాలా పెద్దమనిషి ఉన్నట్టుంది మారాజ్?" బషీరు ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును. మాకులం పెద్దది. చేష్టలు, బుద్ధులు కూడా పెద్దవి." కంఠీరవం చిరునవ్వుతో అన్నాడు.

విజయదేవు హృదయంలో తుఫాను రేగింది. ఇంతవరకు జరిగిన చర్చల్లో కంఠీరవం చెప్పిన సమాధానాలు, వెలిబుచ్చిన భావాలు ఏవి కూడా విజయదేవుకు నచ్చలేదు. వాటిపై మళ్ళా ఒకసారి చర్చించి, కంఠీరవాన్ని తనతో ఏకీభవించేటట్లు చేయాలని తనలో తాను మథన పడుతుండగా, కంఠీరవం తన అన్న విషయంలో, వెలిబుచ్చిన భావాలు విజయదేవుకు కను విప్పుగాతోచింది. కంఠీరవం, తన కర్తవ్య నిర్వహణ విషయంలో అన్న మాటలు విజయదేవుపై సమ్మోహనాస్త్రాలుగా పనిచేశాయి. "ఎంతటి మహా వ్యక్తి." తనలో తాను అనుకున్నాడు.

"అయితే వెంకటాచార్యులంగారు, ఏలినవారి దగ్గరికి వేంచేస్తారన్న మాట" వ్యంగ్యంగా విజయదేవు మాట్లాడాడు.

"మీ అన్నను పిలిచి మాట్లాడుదామంటారా?" కొమరయ్య అన్నాడు.

"ఎవరిని, ఏమి అడుగవద్దు. మనం చాలా గుట్టుగా కచేరీకి పోయి చంద్రయ్య, అయోధ్యరామయ్యలసాక్ష్యాలనుఇప్పించి, మొదట రాముభూపాల్ రావును, వెంకటాచార్యులను నిర్బంధింప చేయాలె. అంతవరకు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలె." వెంకటేశ్వరాావు సలహా చెప్పాడు.

"అప్పుడు దొరకు సాయంగా దొంగ సాక్ష్యాలిచ్చిన తిరుపతయ్య, పాపయ్యలు ఇప్పుడు మనపట్టే ఉన్నారు" పరంధామయ్య అన్నాడు.

"అయితే వెంటనే మనమంతా నిజామాబాదుకు వెళ్ళాలె" కంఠీరవం ఉత్సాహంగా అన్నాడు. ఆరోజే చంద్రయ్య, అయోధ్యరామయ్యను వెంటబెట్టుకొని దిమ్మెగూడెం చేరుకున్నాడు.

వెంకటేశ్వర్రావు, అయోధ్యరామయ్యలు పరస్పరం కుశల ప్రశ్నలు, క్షేమ సమాచారాలు మాట్లాడుకొన్నారు.

"ఏదో మంచిచేసుకొని సర్దుకపోతే బాగుండును, అనవసరంగా రచ్చ కీడ్వటం ఏంబాగుంటుంది?" అయోధ్యరామయ్య రామభూపాల్‌రావు విషయంలో సంకోచిస్తూ అన్నాడు.

పరంధామయ్యకు పట్టరాని కోపం వచ్చింది. "మేము చేసేదంతా న్యాయశాస్త్రం ప్రకారమే. అయినప్పుడు న్యాయశాస్త్రం దొరవారికి వేరే విధంగా ఎట్లా ఉంటుంది?" అన్నాడు.

"ధర్మప్రభువులు. దైవాంశ సంభూతులు. అన్ని విషయాలకు, అవధులకు అతీతులు కదండీ?" విజయదేవ్ వ్యంగ్యంగా అంటూ హేళనగా నవ్వాడు.

"అది దొరవారితోటే పోవటం లేదుగా! అన్యాయంగా వెంకటాచార్యులుగారు కూడా ఇరుక్కున్నారే. మరి ఆవిషయమైనా ఆలోచించండి. కంఠీరవంగారేమంటారో ఈ విషయంలో," అయోధ్యరామయ్య ఫిలోసాఫిగ్గా మాట్లాడి కంఠీరవాన్ని కొంటెగా చూచాడు.

"సరే! అవన్ని మీకెందుకు లేండి. యదార్థమేదో, అదిమాత్రం మీరు దాచకుండా మాకు సాయంచేయండి, అంతే." వెంకటేశ్వర్రావు అన్నాడు.

అంతాకలిసి న్యాయస్థానానికి వెళ్ళారు. వెంకటేశ్వర్రావు న్యాయాధిపతిని ప్రత్యేక గదిలో కలిసికొని వివరంగా విజ్ఞప్తిని సాక్ష్యాల పట్టికను అందచేశాడు.

న్యాయాధిపతి ఆ అభియోగ వివరాలు తెలిసికొని ఆశ్చర్యపడ్డాడు. "అయినా మీకు రామభూపాల్‌రావుమీద ఇంత పగెందుకు?" బొమ్మలు ముడిచిపెట్టి ముఖం మాడ్చుకొని అన్నాడు.

"ఇందులో పగ ఏముంది? జరిగిన అన్యాయానికి చట్ట ప్రకారం చర్య తీసుకోమంటున్నాను. అంతే."

"అయినా మనుష్యుడన్నప్పుడు తప్పులు జరుగుతుంటాయి. సదురు కొని పోతుండాలె. మీరా చదువుకున్నవాండ్లు. బస్తీలో ఉంటుంటారు. మీకేవిధంగానైనా కాలం గడుస్తుంది. కాని ఈవిధంగా ఉన్నఊళ్లో కక్షలు పెంచితే అన్యాయంగా అమాయక ప్రజలు అవస్థలపాలవుతారు. మీరు ఎప్పుడు ఊళ్లో ఉండపోయారా! ఉన్నా మీవల్ల వాండ్లకు జరిగే సాయమే ముంటుంది, మాటల బలం తప్ప? అందుకోసం లౌకికంగా ప్రవర్తించి, ఉచితజ్ఞత నుపయోగిస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ఇదంతా నేను వ్యక్తిగతంగా అంటున్నదే. అధికారరీత్యా న్యాయం చేయడంలో నేను వెనుకాడేవాడినికాను." న్యాయాధిపతి హితవుచేశాడు. అభియోగానికి సంబంధించిన కాగితాలను పరిశీలించాడు.

"దొంగ సాక్ష్యాలతో ఇతరుల భూమిని మింగి, పెద్దమనిషిగా ఊరేగుతున్నప్పుడు, ఆవిషయములో చర్య తీసికుంటే గ్రామ కక్షలు పెరుగుతాయని మీరు మమ్ముల హెచ్చరించడం నాకాశ్చర్యంగా ఉంది. మేము మిమ్ముల చట్టరీత్య పొందాల్సిన న్యాయాన్నే కోరుతున్నాము," కృత్రిమ వినయంతో వెంకటేశ్వర్రావు అన్నాడు. న్యాయాధిపతి వైఖరిపై అతనికి కోపంవచ్చింది.

న్యాయాధిపతి చదువుతున్న కాగితాలను పక్కకుతోసి, చేతి గడియారాన్ని చూసుకున్నాడు. "నేను విచారణ స్థలానికి వెళ్ళాలె. సమయం అయిపోయింది." అని లేవబోయాడు.

"ఒక మనవి," వెంకటేశ్వర్రావు న్యాయాధిపతిని, వెళ్ళకుండా నిలుపాలనే ఉద్దేశంతో అన్నాడు. "ఈ అభియోగము యొక్క తీవ్రతను, రామభూపాల్‌రావు యొక్క పలుకుబడిని దృష్టిలో నుంచుకొని మీరు ఈ ప్రత్యేక గదిలో విచారణ జరిపి వెంటనే నిర్బంధాజ్ఞలను పంపించాలని కోరుతున్నాను" అని వెంకటేశ్వర్రావు వాదించాడు.

"చట్టాలు, శాసనాలు ఎవరి పలుకుబడికి, పరిమితికి తల ఒగ్గవు. ప్రభుత్వానికి న్యాయమే ఆశయము, ఆధారమే విశ్వాసము'' అంటూ న్యాయాధిపతి కుర్చీలో కూర్చున్నాడు. గంటకొట్టాడు.

చప్రాసిరాగానే, ఒక్కొక్కరిని పిలిపించి, సాక్ష్యాలు తీసికొని, రామభూపాల్‌రావు, వెంకటాచార్యుల పేర నిర్బంధాజ్ఞలు పంపించాడు.

నిర్బంధాజ్ఞలను పోలీసులను వెంటబెట్టుకొని అంతా దిమ్మెగూడెం చేరుకున్నారు. రామభూపాల్‌రావు, వెంకటాద్రి, హైదరలీ గడీబంకుల్లో కూర్చొని గ్రామవ్యవహారాలను చర్చించుకుంటున్నారు.

వెంకటేశ్వర్రావు పోలీసులతో గడీలోకి వెళ్లి ఆజ్ఞను చేతికిచ్చి రామభూపాల్‌రావును నిర్బంధింప చేశాడు. అక్కడ ఒక జవాన్ను ఉంచి అక్కడినుంచి వెంకటాచార్యుల ఇంటికి వెళ్లారు. వెంకటాచార్యులు రామదాసు నాటకాన్ని, చాలా కష్టంగా ఒక్కొక్క వాక్యాన్ని చదువు తున్నాడు. వెంకటేశ్వర్రావు, పోలీసులతోరాగానే, తల్లి, భార్య, బిడియంతో లోపలికి వెళ్లారు. వెంకటాచార్యులు దిగులుతో మంచంలోనించి లేచి బిత్తర పడి చూచాడు, పోలీసు అమీను, నిర్బంధాజ్ఞను చదివి వినిపించి, వెంట తీసికొని రామభూపాల్‌రావు గడీలోకి వెళ్ళారు.

దిమ్మెగూడెంలో కలవరం బయలుదేరింది. అందరి మనస్సులు, దృష్టి రామభూపాల్‌రావు గడీవైపే ఉన్నాయి. కాని అక్కడికి ఎవరూ వెళ్ళడానికి సాహసించలేదు. కొమరయ్య, విజయదేవు మొదలైన వారంతా ఉద్రిక్తులై గ్రంథాలయంలో మౌనంగా కూర్చున్నారు. వెంకటాచార్యులు పిచ్చివానివలె రామభూపాల్‌రావువైపు చూడసాగాడు. వెంకటాద్రి, హైదరలీ కిమ్మనకుండా కూర్చున్నారు. రామభూపాల్‌రావుకు నిలువెల్ల చెమటలుపెట్టినాయ్. నోటమాట రావడంలేదు. తత్తరపడ్డనాలుకతో, "జమానతు తక్మీలు చేసుకోరాదండి'' పోలీస్ జమేదారుతో దీనంగాఅన్నాడు.

వెంకటేశ్వర్రావు, "అదంతా న్యాయస్థానంలో'' అన్నాడు.

"అవునన్నట్లు'' అమీను దీనంగా రామభూపాల్‌రావువైపు చూచాడు.

ఇంట్లోంచి బట్టలు తెప్పించుకొని, కచ్చడంలో కూర్చొని రామభూపాల్‌రావు, వెంకటాచార్యులు పోలీసులతో ఊరువదలి వెళ్ళిపోయారు.

గ్రామ ప్రజలు చెప్పజాలని ఆవేదనలోపడిపోయారు. తమను పీడిస్తున్న దుష్టశక్తులకు తగినశాస్తి జరిగినందుకు సంతోషం కలిగింది. గ్రామానికి పెద్దయై చేసే తప్పులన్నీ ఒప్పులుగా చెల్లిపోవడం చూచిన ఆ ప్రజలే తమ కండ్లెదుట నేరస్థుడుగా నిర్బంధింపబడటం, పోలీసులకు విధేయుడై లొంగిపోవడంతో ఆశ్చర్య పడ్డారు. కులానికి పెద్దయైన వెంకటచార్యులు, గ్రామానికి పెద్దయైన రామభూపాల్‌రావుల యొక్క పెత్తనాలం దలి లోతు పాతులింతే కదా యని కొందరు మాతులు విరిచారు. పోలీసు అధికార్లు వచ్చినప్పుడల్లా రామభూపాల్‌రావు గడీలో కులాసాగా కాలం గడిపేవారు. విందులు, వినోదాలు, మామూళ్ళు, మేజువాణీలు మొదలైన సంబరాలు జరుగుతుండేవి, కాని ఆ అధికారుల్లో ఒకడైనలమీజాకు ఆరోజు ఇన్ని మంచి నీళ్ళు ఇచ్చిన వాడులేడు. పోలీసులు వస్తున్న పిల్లులవలె పేలవమైన ముఖాలు వేసుకొని ఆరోజు ఊరువిడిచి వెళ్ళిపోయారు. గత్తర రేచినప్పుడు గ్రామాన్ని వదిలిపెట్టి దేవరను సాగనంపినట్లుండింది. ఆరోజు గ్రామం వాలకం.

ఆండాళమ్మ భరింపరాని దుఃఖంతో కుమిలి పోయింది. కంఠీరవం ఈ విషయంలో అన్నకు సాయపడక శత్రువర్గంతో కలిసిపోవడం ఆమెకు అసహ్యంకలిగింది.

వెంకటాచార్యులు ప్రజాకంటకుడని భార్య తాయమ్మ ఎరిగున్నా, నిర్బంధింపబడటానికి మాత్రం కంఠీరవం యొక్క పాలిపగే కారణమని కంఠీరవాన్ని నిందించింది.

"చిన్నప్పుడు ఏదోజరిగింది. ఇంకా మనసులో పెట్టుకొని ఇంటికి పోక, పరాయివాళ్ళ పంచన చేరి పాలిపగను ఈవిధంగా తీర్చుకోవడం కంఠీరవం చేయాల్సిన పనికాదు" కోమటిశంభయ్యా మనసులో అనుకున్నాడు.

"ఎంత చెడ్డవాడైనా, తోడ బుట్టినోడాయె, పరాయి వాడవుతాడు? కష్టాల్లో ఉన్నప్పుడు ఆదుకోకపోతే మానె, కానోళ్ళతో కలిసి ఉండటం, కొమురయ్యాలో గుస, గుసలు పెట్టడం ఏంబాగుందమ్మ? నీవేమన్నాఅను" ఒక స్త్రీ బాటన పోతున్న ఒక స్త్రీని పిలిచి చెప్పింది.

"మనముండేది ఎవరింటరు? ఇంట్లకుక్క జొరబడ్డెమో పో తమ్మ" అని ఆస్త్రీ చేతులు తిప్పుకుంటు వెళ్ళి పోయింది.

"దొరమాట తీయలేక అప్పుడు ఏదో తప్పుచేసుంటడు. ఎందు కొచ్చింది పోనీయి అని కంఠీరవం చెప్పితే, వకీలుగారు యినకపోయినారు. మనలోమాట" ఒక గౌండ్లాయిన కల్లుతాగడానికి వచ్చిన ఒకనితో అన్నాడు. మొత్తంపై ఆరోజు దిమ్మెగూడెంలో అపూర్వమైన సంఘటనగా అందరు ఆశ్చర్య పోయారు.

దిమ్మెగూడెం సంఘటన మొత్తం జిల్లాలోనే కలవరం లేపింది. అధి కార బృందం ఆశ్చర్యం ప్రకటించింది. ప్రభుత్వానికి జీవనాళాలైన గ్రామా ధికారు లీవిధంగా ప్రజలముందు పలచనై పోవటం, పరిపాలనా సౌష్ఠవాన్నికే గొడ్డలి పెట్టుగా భావించారు. ప్రభుత్వమన్నా ప్రభుత్వాధికారులన్నా ప్రజల్లో భయమున్నపుడే ప్రభుత్వ యంత్రం, పరిపాలనా పద్ధతి కట్టు దిట్టంగా ఉంటాయి. కాని ఈవిధంగా చట్టం పేర, న్యాయంపేర ఉచితజ్ఞత లేకుండా వ్యవహరించడం ప్రమాదానికి దారి తీస్తుందని కొందరు భీతిల్లారు.

"ఇంత బద్మాషులైనారే ప్రజలు." ఒక అధికారి విస్మయాన్ని ప్రక టించాడు.

"గ్రామ, గ్రామంలో కామధేనువులుగా ఉంటూ,కరువుల్లో, కష్టాల్లో ఆదుకొనే దొరలను ఈవిధంగా అవమానపరచడం, విశ్వాసఘాతకమని ఒక చప్రాసి వ్యాఖ్యానించాడు.

ఆనాడు క్లబ్బులో అందరు ఈవిషయమే ప్రధానంగా చర్చించారు.

"ప్రజలు దిన, దినం హద్దుమీరి పోతున్నారు."

"చెరువు పంచాయితిలో ప్రజలకు బుద్ధి చెప్పితే ఇంతవరకు రాక పోవును."

"మత పరివర్తన ప్రచారముతో అసలు గ్రామాల పరిస్థితులే మారాయి. బహుశః అంజుమన్ వారు ఈవిషయం ఊహించజాలలేదను కుంటాను."

"మత పరివర్తన కాలంలో రామభూపాల్‌రావు చేసిన పిచ్చి పనుల వల్లనే ఆగ్రామ మావిధంగా తయారైంది."

"మీరు గమనించే ఉంటారు. ఈమధ్య ఒక కాంగ్రెసు నాయకుడు ఎక్కడో ఉపన్యాసంలో ఒకమాటన్నాడు. మత పరివర్తన ప్రచారంతో సంస్థానంలో బయలుదేరిన మతతత్వవాదము సమసి పోవాలంటే జాతీయ బునాదులపై రాజకీయ పోరాటం జరుపడం అవసరమన్నాడు. మొత్తానికి ఈ మత పరివర్తన కార్యక్రమం మాత్రం చాలా తీవ్ర సమస్యలకు దారి తీసింది. ప్రభుత్వ వ్యతిరేకులు ఈఅదను చూచుకొని ఇష్టమొచ్చినట్టు దుష్ప్రచారానికి పూనుకున్నారు."

అధికారుల ఆలోచనలను అతి శ్రద్ధగా వింటు, వాటితో సంబంధం లేనట్టు ఒక హిందూ వకీలు పత్రికను చూస్తూ కూర్చున్నాడు. అతని దృష్టిని తమవైపు తిప్పాలని ఒక అధికారి ప్రయత్నించాడు.

"మీ గ్రంథాలయంలో కార్యదర్శిగా ఉండి, తర్వాత వేరే అభి యోగంలో జేలుకు వెళ్ళిన కంఠీరవం దిమ్మెగూడెంలో మకాం పెట్టాడట నిజమేనా?"

"అవునట. విడుదల కాగానే అక్కడికే చేరుకున్నాడట. అసలు అతని స్వగ్రామం కూడా దిమ్మెగూడెమే. రామభూపాల్‌రావుతో పాటు ఉన్న వెంకటాచార్యులు కంఠీరవానికి స్వంత అన్న అవుతాడు." హిందూ వకీలు సమాధానం చెప్పి, అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడు.

"అతనికి ప్రజల్లో మంచి పలుకుబడి ఉన్నదట. అభియోగంలో అన్నను తప్పించలేక పోయాడా?"

"అన్నకు అతనికి పడరాదు. అదిగాక కంఠీరవం దేశదిమ్మరి. ఇల్లు, సంసారం విషయం పట్టిలేదు. చిన్నప్పటినుంచి దేశాలు పట్టి తిరిగినవాడు. వాడికి నీతి, నిజాయతి ఎట్లా ఉంటుంది?"

"మొత్తానికి రామభూపాల్‌రావు చిక్కుల్లోపడ్డాడు."

"సహాయం చేసే స్వభావం గలవాడు. మంచి అనుభవం, అణకువ, వ్యవహార జ్ఞానం ఉన్నవాడు. నేను మెచ్చుకునే వాళ్ళలో అతనొకడు" ఒక అధికారి సిగరేట్ ముట్టించి, బ్రిడ్జి టేబిల్ చేరుకున్నాడు.

"మీ చేతిలో చిక్కాడు. ఇంకా విచారణ జరుగాల్సిందెంతో ఉంది." అంటూ ఇంకొకడు కూడా బ్రిడ్జి టేబిల్ చేరుకున్నాడు.

"మేము న్యాయాన్ని చేసేవాండ్లం" అని ఇంకొకడు కూడా బ్రిడ్జి టేబిల్ చేరుకున్నాడు.

"అందుకే ఈ అభియోగంలో రామభూపాల్‌రావుకు న్యాయం కలగాలని మా అందరి అభిప్రాయం."

అభియోగం విచారణ ప్రారంభమైంది. రామభూపాల్‌రావు, వెంకటాచార్యులు హామీపై విడుదల చెయ్యబడ్డా, దిమ్మెగూడెం వెళ్ళడానికి జంకారు. దొడి పెత్తందార్లంతా తీవ్రంగా ఆలోచించారు. కొందరు పెద్ద వకీళ్ళద్వారా వెంకటేశ్వర్రావుపై ఒత్తిడి తెచ్చి అభియోగాన్ని ఎత్తి వేయించాల్సని ఎత్తులు వేశారు.

ఆ అభియోగం అటు న్యాయాధిపతికి, ఇటు పెత్తందార్లకు పరీక్షగా తయారైంది. అన్నిటికి బలహీనమైన విషయం రామభూపాల్‌రావు, వెంకటాచార్యులు తాము నిందితులు కామని రుజువు చేసుకొనె అవకాశం లేదు. అభియోగాన్ని ఉపసంహరింప జేయడమే ఇక మిగులింది. కాని వెంకటేశ్వర్రావు తన న్యాయశాస్త్ర ప్రతిభను పూర్తిగా ప్రదర్శించి దోషులకు బాగా బుద్ధి చెప్పాలని చాలా పట్టుదల వహించాడు.

తుదకు అభియోగంలో వెంకటాచార్యులకు మూడు సంవత్సరాలు, రామభూపాల్‌రావుకు ఒక సంవత్సరం కఠినశిక్ష విధింపబడ్డది. హైకోర్టులో

పునర్విచారణ చేయించడం కూడా లాభంలేదని విరమించుకున్నారు. తీర్పు జరిగిన వెంటనే రామభూపాల్‌రావును, వెంకటాచార్యులను పోలీసులు స్వాధీనంలోకి తీసుకొని, నిజామాబాదు జేలుకు చేర్చారు.

# 22

రామభూపాల్‌రావు వ్యవసాయం, వ్యవహారాలు చూడటానికి, అల్లుడు కొండల్‌రావు దిమ్మెగూడెంలో ఉంటున్నాడు. కొండల్‌రావు ఎఫ్. ఏ. వరకు చదివి, ఆపైన చదువటం ఎందువల్లనో సాధ్యపడలేదు. రామభూపాల్‌రావు పాతకాలం వాడు కాబట్టి, కొత్త రాజకీయాలు, పరిస్థితులు తెలియనందువల్ల ప్రజలాపిధంగా ఆయన్ను కష్టాల పాల్జేశారని కొండల్‌రావు అభిప్రాయం. కొండల్‌రావు విద్యార్థి దశలో ఉత్సాహంగా కొన్ని సభల్లో పాల్గొన్నాడు. ఖద్దరు ధరిస్తాడు. గాంధీ జయంతి, జాతీయ వారం సందర్భాన ఉపన్యాసాలు విన్నాడు. హరిపుర కాంగ్రెసు, ఆంధ్ర మహాసభలకు వాలంటీరుగా వెళ్ళాడు. వ్యాయామ పోటీల్లో పాల్గొని కొన్ని బహుమతులు కూడా పొందాడు. ఉపన్యాస పోటీల్లో కూడా ఉన్నాననిపించుకున్నాడు. ముఖ్యంగా విద్యార్థి దశలో అతని కార్యకలాపాలతో, అతను ఆరితేరిన రాజకీయవేత్తనని, కంఠీరవం మొదలగు, రామభూపాల్‌రావు శత్రువులు, అల్పులని, వెలితిపడేవాండ్లని కొండల్‌రావు అభిప్రాయం. దిమ్మెగూడెంలో కొండల్‌రావు ఉండింది మొదలు అతని తోడి విద్యార్థులుగా ఉండినవారు అప్పుడప్పుడు రావడం, కులాసాగా వారం, పదిరోజులుండటం, వేటాడటం మొదలైనవి జరుపుతుండేవారు.

కంఠీరవం, వెంకటేశ్వర్రావు మొదలైనవారు దిమ్మెగూడెంలో శాశ్వతంగా ఉండిపోయారు. పాడుబడిన, వెంకటేశ్వర్రావు ఇల్లును బాగు చేయించుకొని అంతా అందులో కలిసి ఉండసాగారు. తోట బావి భూమిని స్వాధీనం చేసుకొని, కొమరయ్య వ్యవసాయం సాగించాడు. మామిడిచెట్లు, నిమ్మచెట్లు మొదలైన తోట భాగం మాత్రం వెంకటేశ్వర్రావు స్వంత

పర్యవేక్షణలో ఉంచుకొని, శ్రద్ధగా శాస్త్రీయ పద్ధతిన పండ్లు పండించ సాగాడు. కామారెడ్డిలో వకీలుగా పనిచేయ మొదలుపెట్టాడు. విజయదేవు, పరంధామయ్యలు మామూలుగా గ్రంథాలయ నిర్వహణలో లీనమై ఉన్నారు. కంఠీరవం, బషీరులు కొమరయ్యకు వ్యవసాయంలో సాయంగా ఉన్నారు. బషీరు విద్యాభ్యాసం మొదలు పెట్టాడు. వెంకటేశ్వర్రావు అప్పుడప్పుడు రైతులకు సంబంధించిన ప్రభుత్వ నియమాలను, వాటి లోతుపాతులను ప్రజలకు బోధించేవాడు. కంఠీరవం తనకు నచ్చిన గ్రంథాలను చదివి విని పించడం, తోచిన విషయాలపై విపులీకరించడం మామూలుగా జరుగు తుండేది. అన్నమ్మ వీరందరిని కన్నతల్లిగా చూసుకుంటుండేది.

ప్రభుత్వం దిమ్మెగూడెంపై బాగా దృష్టిని కేంద్రీకరించే ఉంచింది. పోలీసు శాఖవారు చాలా అనుమానంగా, కంఠీరవం మొదలైన వారి విషయంలో ఉంటూ ప్రతివిషయాన్ని జాగ్రత్తగా కనిపెట్టు ఉన్నారు. మాటి, మాటికి గ్రంథాలయానికి రావడం ఏమేమో ప్రశ్నలు వేయడం, హెచ్చరించడం జరుగుతుండేది. కోమటి వాండ్ల బాట్ల విషయం, కొలతల విషయంలో శ్రద్ధ ఎక్కువైంది. ముఖ్యంగా దిమ్మెగూడెం, ఆ గ్రామప్రజల కు కనువిప్పుగాను, ప్రభుత్వానికి హెచ్చరికగాను ఉండింది.

ఒకనాడు కంఠీరవం తల్లి నోదార్చటానికి ఇంటికి వెళ్ళాడు. అతడు తనకు తానే ఇంటికి రావడం ఆండాళమ్మకు ఆనందం కలిగింది. కాని మొదటిలాగా ఆప్యాయతను చూపలేదు. కంఠీరవంపై ఆమెకు చిన్నప్పటి నించి ఉన్న ప్రేమ కొద్దిగా తగ్గింది. వైష్ణవేతరులతో కలిసి ఉండటం, తోడపుట్టిన వాని విషయంలో సానుభూతి కలిగి ఉండకపోవటం ఆమె హేయమైన విషయంగా తలిచింది.

"రా నాయనా! కూర్చో" అన్నది ఆండాళమ్మ.

"అన్నయ్య ఉన్న ఇంట్లో అడుగు పెట్టకూడదనుకున్న దీక్ష సాగినట్లేనా?" వదినె తాయమ్మ కోపంతో కొర, కొర చూస్తూ అన్నది.

ఆమె మాటలకు కంఠీరవం నిర్విణ్ణుడై, ఆశ్చర్యంగా తాయమ్మను చూచాడు. ఏదో అనబోయాడు. విచారంగా తల నేలకు వేశాడు.

"అన్నయ్యను విడిపించలేవా నాయన నీవు? అందరిని దూరంచేసుకొని ఈ నా మొండిబతుకు ఇట్లా ఉండాల్సిందేనా? ఫలానా వారి ఒక కొడుకు, ఇల్లు, ముంగిలిలేక దేశాలమీద తిరుగుతున్నాడని, భ్రష్టుడైండని, ఒకకొడుకు దుర్మార్గంచేసి జేలుకు వెళ్ళాడని లోకం అనుకుంటుంటే ఎట్లా ముఖమెత్తుకొని తిరగాలె కొడుక, పదిమందిలో. ఎవరికి లేని పట్టుదలలు, పనులు నీకే ఉండాల్నా కొడుక?" ఆండాళమ్మ గద్గదస్వరంతో అన్నది.

"తాజెడ్డకోతి వనమెల్ల చెరిచినట్టు, తాను చెడిపోయిందికాక అందరిని చెడకొడ్తేగాని మనసుకు సంతోషం లేదేమొ!" తాయమ్మ ముఖమంతా మాడ్చుకొని అన్నది.

కంఠీరవం మానసిక బాధతో, నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

"చూడు! నీ స్నేహితుడేకదా! ఆ వెంకటేశ్వర్రావు ఏం చేసిండు, ఎన్నాళ్లో పాడుబడ్డ ఆఇల్లును సొంతం చేసుకున్నడు. మీతో కలిసి ఉన్నట్టే ఉండి వకీలు పనిచేసి సంపాదిస్తున్నడు. అన్ని వైరాగ్యాలు నీకేనా?" తల్లి ప్రశ్నించింది.

"నువ్వు నేర్చుకున్న చదువు, చెప్పే బుద్ధులు అన్నీ ఇటువంటి వేనా?" తాయమ్మ వెటకారంగా అడిగింది.

కంఠీరవం వదినెను గంభీరంగా ఒకసారి చూచాడు. తల్లివైపు పరీక్షగా దృష్టి నిలిపాడు. "అమ్మా! వదినె నీవు ఒకవైపు నన్నిట్లా నిందిస్తే ఎట్లా అమ్మ?" అమాయకంగా, ఆవేదనతో అన్నాడు.

ఆండాళమ్మ దీనంగా కొడుకును చూచింది. "నిందలా కొడుక ఇవన్ని? మేము అనుభవిస్తున్నదంతా ఏమంటవు. ఇదంతా మేంచేసుకున్న ఖర్మేనా? ఇంతకు, మేం ఇట్లా కుమిలి చావాల్సిందేనా? ఏమైనా ఆలోచిస్తావా?" అన్నది.

"అన్నయ్య చాలా పెద్దతప్పుచేశాడమ్మా. అయినప్పుడు చేసిన తప్పుకు శిక్ష అనుభవించక తప్పదు కదమ్మా!" తల నేలకువేసి కంఠీరవం మెల్లగా అన్నాడు.

"అవును కాదామరి! లోకంలో అందరు సత్య హరిశ్చంద్రులైతే, ఇక మీ అన్నయ్య ఒకడేగా మహాపాపి అయిండొచ్చు" తాయమ్మ వెంటనే సమాధానమిచ్చింది.

"అదికాదు వదినే, అన్నయ్య చేసింది చాలా పెద్ద తప్పు నేనేం చేస్త. న్యాయాన్ని లక్ష్య పెట్టక, ఎట్లైనా నాఅన్న అని చెప్పి, అన్యాయాన్ని సహిస్తు, ఎట్లా ఊరుకోవాలె చెప్పు? స్పష్టంగా చేసిన నేరం కనబడుతుంటె నేనెవరికైనా, ఏమిచెప్తాను? కేవలం నాఅన్న అయినందువల్లనే, నేను చెప్పితి వినేవారున్నారని గర్వించి, మంచి, చెడ్డవిచక్షణ మరిచి పోవాల్నా వదినె?" పాపిధేయపడ్తున్నట్టు కంఠీరవం అన్నాడు.

"తోడ బుట్టిన వాండ్లకు, కనీసం కావాల్సిన వాండ్లకుండే తాపత్రియం నీకుంటే నువ్విట్లా మాట్లాడవు. ముఖ్యంగా మేము నీకు పరాయ వాండ్లం. ఏం చేస్తాం! ఎంత అనుభవమో అనుభవించక తప్పదు. ఫలానా వారి తమ్ముడు అచ్చంగా ధర్మరాజని లోకం అంటుంటేవిని అయినా సంతోషిస్తాం. అంతకంటే ఎక్కువ ఏం చేయగలం, చేతకాని వాళ్లం. నువ్వు! సమర్థుడివి," అనుకుంటూ తాయమ్మ అక్కడనించి లేచి వెళ్ళి పోయింది.

"అమ్మా! వదినె ఆవిధంగా బాధపడ్తే అందులో ఆశ్చర్య మేముంది? మీ బాధలు నాకు అర్థం కావనుకుంటున్నారా? ఒకడి బాధను నా బాధగా తీసికునే నాకు అన్నయ్య జేలుకు పోతే ఆనందంగా ఉంటుందా అమ్మ?" నేను ఒక విషయం మీతో మాట్లాడాలని వచ్చిన" దీనంగా కంఠీరవం అన్నాడు.

"మా మీద ఇంకా ఆశపెట్టుకున్నావా కొడుక?" ఆశతో ఆండాళమ్మ కంఠీరవాన్ని చూచింది. తాయమ్మవచ్చి అత్తపక్కకు కూర్చున్నది.

"అమ్మా! అందరం కలిసి మెలిసి ఉండుటమేగా నీకు కావాల్సింది? నీ హృదయ మటువంటిది. వదినె మనసుకూడా నేను గ్రహించాను. అన్నయ్య ఆపదలో ఉండబట్టిగాని, నేనంటే మావదినెకు చాలా ప్రేమ. గౌరవం, మర్యాదలను పాటించక, ప్రజలకు కంటుగా ఉండి. రామభూపాల్‌రావుకు బానిసగా ఉండడం మంచిదా చెప్పమ్మ అన్నయ్యా. విడుదలై వచ్చేవరకు మీదగ్గరకు వచ్చి మాతోపాటు ఉండాలని నేను మిమ్ముల కోరడానికి వచ్చిన. ఆనందంగా ఉండొచ్చును నువ్వు నాకేం కాదు మాఅందరికి తల్లిగా ఆదరిస్తాం, పూజిస్తాం. ఏమంటావమ్మా?" కంఠీరవం ఆవేదనతో అర్థించాడు. వదినె వైపు ఆశతో చూచాడు.

"నీకు వచ్చిన అప్రతిష్ఠ. భ్రష్టత్వం మాకుకూడా పంచి పెట్టాలనా నీఅభిప్రాయం? ఈ నాలుగు గోడలు పాడుబడ్తేగాని మీకు ఆనందం కలగదేమో?" తాయమ్మ ఉక్రోషంతో అన్నది.

"ఎందుకు కొత్త, కొత్త ఆలోచనలు నాయనా? నీవు మాతో కలిసి ఉండాలని మేమనుకుంటన్నం. కులం, జాతి, ఆచారంలేని ఆ మాదిగెల గుంపులో మమ్మెందు కీడుస్తవు? అండాళమ్మ భారంగా అన్నది.

"మీ ఆచారాల, విశ్వాసాలల్లో వెంట్రుకవాసి లోపం రాకుండ చూచే బాధ్యతనాది. మీ యిష్టం ప్రకారం మీరిష్టం. కట్టుబాట్లు మీకు నడుపుకో వచ్చు నేను ఒక్కడిని ఇల్లు విడిచి పోయినందుకు తహతహ పడ్తావు కదమ్మ! నీవంటి వాండ్లు ఇంకా న్యాయ కొడుకులు నీచల్లని నీడకిందికి తేవాలని అనుకుంటున్నాను. దీంట్లో నీకు ఆనందమే ఉంటుందికదమ్మా! మాదిగె గుంపు అనిఅంత చులకగా తీసేయకు, నేనేఅంటే నాకంటె ఎక్కువ కష్టాలు అనుభవించి, దిక్కు, దెశలేక సద్భావం, సహవాసం అండగా ఉన్న వాండ్లు వాండ్లంతా. నేను జేయిలో ఒక స్నేహితుడిని సంపాయించుకున్న అతడే బషీరు. కోమటిగా బుట్టి, తురకగా పెరిగి, దొంగగా జీవిస్తుంచే మనిషిని చేద్దామని వెంటబెచ్చు కున్న. విజయదేవు చమవుకున్నవాడు. బద్ధిమంతుడు. తన విశ్వాసాలకు అందని సమాజానికి దూరమై కష్టించే

ప్రిజలను, నీతిగల వ్యక్తులను అండగా చేసుకొని ఇల్లు, ఊరువదిలి యిక్కడ ఉన్నడు. వకీలు సంగతి వేరే ఏమీ చెప్పాల్సింది లేదుగద! అత నికి తల్లిలేదు, తండ్రిలేడు కదా! ఉన్న భూమి కొమరయ్యకు ఇచ్చిండు. అతని ఇంట్లో మేమంతా ఉంటున్నం. ఇక పరంధామయ్య సంగతి సవతి తల్లి పోరుపడలేక, తండ్రి ఆదరం లేక అనాథుడుగా లేచి వచ్చిమాలో ఒకడై జీవిస్తున్నాడు. వీరందరికి తల్లియై బతకటంకంటే నీకు వేరేఆనందం ఏముంది? ఇంకో సంగతి అన్నయ్య విడుదలకాగానే నేను ఆయన్ను దొరతో దూరం చేసి, మాలో ఒకనిగా ఉంచుకోవాల్నని అనుకున్న. ఇది నేను వచ్చినపని." కంఠీరవం మనోవేదనను బయట పెట్టాడు.

భర్తను గురించి కంఠీరవం అన్నమాటలతో తాయమ్మకు కొంచెం శాంతం కలిగింది. కోపం తగ్గించుకున్నది. ఆలోచనా ధోరణిలో కంఠీర వాన్ని చూచింది.

"నాకెటూ తోచడం లేదు. నేను పిచ్చిదాన్నయ్యేటట్టుంది. కన్న కొడుకులు కష్టపడ్తుంటే ఆదుకోలేని వ్యర్థపు చితుకునాది." ఆండాళమ్మ అయోమయంగా మాట్లాడింది.

"తొందరేంలేదు. మీరు నిదానంగా ఆలోచించుకోండి."అని కంఠీ రవం వెళ్ళి పోతుంటే, తల్లి, వదినె దిగులుపడి చూచారు. ఈ విధంగా కంఠీరవం అప్పుడప్పుడు ఇంటికి వెళ్ళడం, తల్లితో, వదినెతో మాట్లాడటం జరుగుతుండేది దీనివల్ల కంఠీరవం గురించి ఉన్న చెడ్డ అభిప్రాయాలు పోయి. ప్రేమ విశ్వాసాలు కలిగాయి.

## 23

ఒకనాడు హైదాబాదు నుండి వచ్చిన పత్రికలతోపాటు ఒక రిజిస్టర్డ్ కాగితాల కట్ట కూడా వచ్చింది. అప్పుడు కంఠీరవం ఒకడే ఇంట్లోఉన్నాడు. కంఠీరవం ఆతురతతో విప్పి చూచాడు. కొన్ని అచ్చు కరపత్రాలు, జగపతి రెడ్డి కంఠీరవానికి ప్రత్యేకంగా రాసిన ఉత్తరం అందులోఉన్నాయి. కర

పత్రాన్ని, ఉత్తరాన్ని మరీ, మరీ చదివాడు. ప్రత్యేకంగా వాటిలోని కొన్ని వాక్యాలు కంఠీరవాన్ని ఉత్తేజపరిచాయి. చాలా ఉప్పొంగిపోయాడు. ఒళ్లు మరిచి పరిసరాలను పరికించాడు. ఆలోచనలో పడ్డాడు. "హైదాబాదు సంస్థానంలో కాంగ్రెసు పోరాటం. అబ్బా! ఎన్నాళ్ళకు!" హృదయంలో నుంచి ధ్వనించింది. తాను చూస్తున్న కుళ్ళు, కుట్రలు, కుతంత్ర పరిపాలన నిర్మూలమై తానాశించిన ఆదర్శ ప్రభుత్వం సాధించే అవకాశం కలిగిందని ఉద్వి. తబ్బిబ్బైనాడు. మత వివశతతో కూడిన నిరంకుశ ప్రభుత్వం నామ రూపాలు లేకుండ నిర్మూలనమయ్యే రోజులొచ్చాయని ఉల్లాసపడ్డాడు. కర పత్రం తిరిగి చదువసాగాడు.

"ప్రజలు అవివేకం, అజ్ఞానం, అమాయకత్వం కారణంగానే ప్రతి నిరంకుశ ప్రభుత్వం అధికారం నడుపకలుగుతున్నది. నిదానమైయున్న ప్రజల చైతన్య తాకిడికి తట్టుకునేశక్తి ఈ ప్రభుత్వాలకుండదు. అట్టి ప్రజా చైతన్య వాహినితో పాప పంకిలమైన ఈస్థాపపు రోజులనుండి మనమంతా బైటపడటానికి ఉద్యుక్తులం కావాలె..... చీకటి గదులైన సంస్థానాల్లో అగ్రస్థానము కలిగి ఉన్న హైదాబాదు సంస్థానంలో ఉక్కిరి బిక్కిరవుతున్న ప్రజలు స్వేచ్ఛా వాయువులు పీల్చే సదవకాశంలభించింది. ఈ చీకటి గదులయొక్క కృత్రిమ గోడలను నేలమట్టంచేసి, సోదర భారతీయులతో భుజం, భుజం కలిపి మన హక్కులను మనం సాధించు కోవాలె. భావ్యతాయుత ప్రభుత్వం వల్లనే అట్టిది సాధ్యమవుతుంది."

కంఠీరవం జగపతిరెడ్డి ఉత్తరం తిరిగి తెరిచాడు. "ఆసఫ్ జాహి వంశ చరిత్ర మొత్తం అవినీతి, కుట్ర, ద్రోహాలతో నిండిఉంది. అట్టివారికి విధేయులుగా బ్రతుకుటే సిగ్గుచేటు." అని ఉన్న ఉత్తరంలోనిభాగం చదివి కంఠీరవం తనకు తాను నవ్వుకున్నాడు. "రాజ్యాల స్థాపనకు, రాజవంశా లకు ఘనత తెచ్చే చరిత్రంటూ ఏదైనా ఉందా?.... ఈ భ్రమ కొన్నాళ్ళు. ఈ భ్రమ తొలగటానికి కొంత కాలం వృథా కావాలె కాబోలు" కంఠీరవం అటూ, ఇటూ పచారు చేస్తు ఆలోచించసాగాడు.

ఆ కాగితాలను తీసికొని గ్రంథాలయానికి చేరుకున్నాడు. "కేవలం న్యాయం సాధించుటకో, స్థాపించుటకో అవతరించిన రాజులుగాని, రాజ్యాలు గాని ఉన్నాయంటారా?" కంఠీరవం తన చేతిలోని కాగితాలను విజయ దేవుకు అందిస్తూ అడిగాడు.

విజయదేవు ఆతురతతో కాగితాలను చదువసాగాడు.

"మన నిజాం ప్రభుత్వ వంశ చరిత్రను గురించి జగపతిరెడ్డిగారి వాక్యాలు గమనించండి." తిరిగి విజయదేవు నుద్దేశించి, కంఠీరవం అన్నాడు.

కంఠీరవం ప్రశ్నను వినిపించుకోకుండానే, వికసించిన ముఖంతో. "శుభ సమయమాసన్నమైంది" అంటూ కంఠీరవాన్ని ఉత్సాహంతో చూచాడు విజయదేవు.

"ముఖ్యంగా అందరు ద్వేషించే ఈ నిరంకుశ ప్రభుత్వానికి తుది ఘడియలు దగ్గరికి వచ్చాయి." కంఠీరవం కిటికీలోంచి బయటికి చూస్తూ అన్నాడు.

విజయదేవు మళ్ళా కరపత్రం చదువసాగాడు. "ఆలస్యమైనప్పటికి, ఆఖరుకు మనంకూడా ముందడుగు వేసే రోజువచ్చింది. హైద్రాబాదులోకాం గ్రెసుఉద్యమంప్రారంభించడమంటే గుట్టనుకదిలించడమన్నమాట" విజయ దేవు కంఠీరవం వైపు చూడకుండానే, కరపత్రంతో చెప్పుతున్నట్లు అన్నాడు. "నిజంగా జగపతిరెడ్డిగారు ఓ చక్కని వాక్యం వాడాడండి. మన రాజవంశం గురించి, మీరు గమనించి ఉంటారు" విజయదేవు పట్ట లేని సంతోషం ప్రదర్శిస్తు ప్రశ్నించాడు.

"ప్రతి రాజవంశం పాపంతో కూడుకొని ఉన్నదని చరిత్ర రుజువు చేస్తున్నది. బడితె గలవాడిదే బర్రె సూత్రం ప్రకారం ప్రభ లించినవారే క్రమంగా రాజులయ్యారు. క్షాత్రం పేర, శౌర్యం పేర దేశాధిపతులయ్యారు. అయినపుడు ఒక రాజు గొప్పవాడని, లేక వాని వంశం పవిత్రమైందని, ఇంకో రాజు పాపి అని అనడంలో అర్థంలేదు." నికరంగా అన్నాడు కంఠీరవం.

"న్యాయశాస్త్రాలకు, ధర్మసూత్రాలకు కట్టుబడి, నీతిని, నిజాయతిని కాపాడుకుంటూ ఆదర్శనీయులనిపించుకున్న రాజుల చరిత్రలు చాలా

ఉన్నాయి. ఎందుకులేవు?'' విజయదేవు సమాధానమిచ్చి, హిందీ పత్రికను. విప్పాడు

"మీరు పేర్కొన్న ఆ ఆదర్శ ప్రభువులు తమ ఘనతకు, లాంఛ నాలకు, ఆడంబరాలకు, అధికారాలకు అడ్డంకులు. ఆక్షేపణలు రానంతవరకే ఆదర్శనీయులు. లేక ఇంకోవిధంగా ఆలోచిస్తే అతి హీనంగా పరిపాలించే వేరేవానితో పోలిస్తే మెరుగ్గా తోచవచ్చు. అంతేకాని కేవలం ప్రజల ప్రతి నిధులుగా, ప్రజల సర్వతోముఖా వృద్ధినే పరమాశయంగా పెట్టుకొని స్థాపించిన, సాధించిన రాజ వంశాలు కాని. రాజులుగాని లేరని నా దృఢ విశ్వాసం.'' కంఠీరవం అన్నాడు.

"అంటే ఒక విషయం మనం దృష్టిలో ఉంచుకోవాలె. నేడు మనల నెదుర్కొంటున్న సమస్యలు, కష్టాలు, కరువులు, కాటకాలు పూర్వకాలం అంతగా ఉన్నట్టు ఆధారాలులేవు. కాబట్టి నాడు ప్రజలు—ప్రభుత్వం అనే సమస్యలు, వైషమ్యాలు బయలుదేరుటకు, అవిశ్వాసము ప్రబలుటకు అవకాశం లేకుండె ననుకుంటాను.'' విజయదేవు సమాధానమిచ్చాడు.

"అయితే నేను సూటిగా ఒకటి అడుగుత. నాడు పేదలుండిరా? భికారులుండిరా? అసహాయులు, అనాథలుండిరా? కొంచెం శాంతంగా ఆలో చించండి. తరచి చూస్తే ఉన్నట్టు తేల్తుంది. ఏదేశములో అట్టి పరిస్థితు లుండునో, ఆ దేశ పరిపాలనా వ్యవస్థ లోప భూయిష్టమై ఉందన్నమాట. అవే ప్రబల తార్కాణాలు, సజీవ సాక్ష్యాలు. దేశములందలి అవకతవకలకు, పేదలపాట్లకు, సంపన్నుల వైభోగాలకు దైవిక కారణాలని కొన్నాళ్లు గడిపారు. ధర్మసూత్రాలపేర కొన్నాళ్ళు కప్పి పుచ్చారు. బాధితులు కండ్లు తెరిచి, రెచ్చిపోయి, షేతువాదనకు దిగేసరకు పశుబలాన్ని చేసట్టారు. అది ఇంకా సాగుతునేఉంది. కాబట్టి అనవసర భ్రాంతులలో కొట్టుకపోకండి. మనిషి మనిషిగా జీవించే మార్గమేదో. అది ఒకటే మనకు గీటురాయి. ఆ ఆత్మవిశ్వాసం కలిగిఉండి, స్పష్టమైన గమ్యం తెలిసికొని రంగంలో దూకంది లాభంలేదు. స్వాతంత్ర్యం, అధికారం, ఏ ఒకరి సొత్తుగాక, ఎల్లరి అనుభూతికి, ఆచరణకు అందుబాటులోనుండే సమిష్టి హక్కుగా పరిణమించినప్పుడే ఏదేశమైనా సుభిక్షంగా ఉంటుంది. బాధ్యతా రహిత

ప్రభుత్వాల ఉనికి నశిస్తుంది. సరే, మన భావాలతోపాటు మన సంసిద్ధను కూడా జగపతిరెడ్డిగారికి తెలుపుదాం." అని కంఠీరవం అంటుండగా వెంక టేశ్వర్రావు, పరంధామయ్య, బషీరు మాట్లాడుకుంటూ గ్రంథాలయంలోకి ప్రవేశించారు.

"ఏం బషీర్! మళ్ళా మనం వచ్చినచోటికి వెళ్ళాలె" కంఠీరవం ముసి, ముసిగా నవ్వుతూ అన్నాడు.

"మీ రాజవంశానికి రోజులు దగ్గరికివచ్చాయి." విజయదేవు హేళన గా అన్నాడు.

బషీరు దిగాలుపడి చూచాడు. పరంధామయ్య విజయదేవు చేతిలోని కాగితాలను ఆతురతతో తీసుకున్నాడు. వెంకటేశ్వర్రావు, పరంధామయ్య కలిసి చదువసాగారు.

"ఏంసంగతి మారాజ్?" బషీరు మందహాసంతో అడిగాడు.

"ఏమిలేదు. ఇప్పటి సర్కారును పూర్తిగా మార్చేసి, మొత్తం ప్రజల ఇష్టంపైన కొత్త సర్కారును ఏర్పాటుచేయాలని కొందరను కుంటున్నారట, ఆసంగతే జగపతిరెడ్డిగారు వ్రాశారు.

"అయితే మనమేంచేయాలె.

"చాలా చేయాల్సుంటుంది. ఊడలు పారిన మర్రి చెట్టును చూచుం టావు. అంత గట్టిగా వేళ్లపాతుకొని ఉంటాయి ప్రభుత్వాలు. మరి మర్రి చెటును పీకేయడ మంటే ఒకరిద్దరితో ఆయ్యేదికాదు" ఇంకాకంఠీరవం పూర్తి చేయక ముందే, మధ్యలో విజయదేవు కల్పించుకొని "భూమిలో ఒక్క వేరున్నా దానిదుంపతెగమళ్ళా చిగురుపెడ్తుంది. ఆమర్రిచెట్టు" అనినవ్వాడు.

కంఠీరవం తిరిగి చెప్పసాగాడు. "మరి ఈ ప్రభుత్వాలను మార్చ డానికి ప్రజలంతా ఒకటయ్యే వరకు కుక్కను తలుపు పెట్టి కొడ్తే పైన బడి కిరుస్తారంటారే, అట్లనే ఈ సర్కారోళ్ళంతా ఇష్టమొచ్చిన పని చేస్తారు."

"మనం జేలుకు పోవాల్నా మళ్ళ?"బషీరు అమాయకంగా అడిగాడు.

"అవును, వందల ఏండ్లనించి ఇష్ట మొచ్చినట్టు ఆటలాడిన ప్రభు త్వం, తనకింద అణగిఉన్న ప్రజలు ఎదురు తిరిగితే ఊరుకుంటుందా?

రెచ్చిపోయి పిచ్చిపనులన్నీ చేస్తుంటది. దాంట్లో జేళ్ళలో పెట్టడం కూడా ఒకటి. మరి మొదటిసారి నన్ను జేలుకు పంపించెందుకో ఎరికేగా?" కంఠీరవం విపులీకరించాడు. "మంచి ప్రభుత్వం వచ్చేదాకా కష్టాలు తప్పవు." తిరిగి అన్నాడు.

"మంచి ప్రభుత్వమంటే" కంఠీరవం ఆద్దురాగా అడిగాడు.

"మంచి ప్రభుత్వంలోనీ తల్లి దండ్రులవలె పొట్ట కెళ్లక కన్న బిడ్డలను అమ్మకోరు, వదులుకోరు. అన్యాయంగా ఇతరుల ఆస్తులను ఆక్రమించరు. ఒకరికి ఒకని కిద్వేషం ఉండదు. అన్నం లేదని అరిచే వాండ్లుండరు. చదువురాని వాడు ఉండడు. అందరు నీతితో, ఉంటారు. కట్టుగా ఉంటారు. దయతో మెలగుతారు. ముఖ్యంగా అంతా అప్పులుగా బతుకుతారు."అని కంఠీరవం ముగించి,"పరంధామయ్యగారు! మనమంతా ఒకసారి హైద్రాబాదుకు వెళ్ళిరావాలె" ఆలోచనాధోరణిలో అన్నాడు.

"అయితే మారాజ్! ఇక్కడ మనమంతా కలిసున్నట్టే అంతా కలిసుంటరన్నమాట మంచి ప్రభుత్వంలో?" బషీరు ప్రశ్నించాడు.

కంఠీరవం మందహాసం కురిపిస్తూ "అవును" అన్నాడు.

ఒకనాడు కంఠీరవం అందరితో కలిసి, ఇంటికివెళ్ళి, తల్లి, వదినె కాళ్ళపైబడి, వెళ్లొస్తమ్మా" అని గంభీరంగా అని తిరిగివచ్చాడు.

కొమరయ్యతప్ప అందరూ హైద్రాబాదు బయలుదేరారు. వీరు వెళ్ళిపోయిన కొద్ది దినాలకే హైదాబ్రాదులో స్టేటు కాంగ్రెసు ప్రథమ సత్యాగ్రహం ప్రారంభమైంది.

ఇంతలో రామభూపాల్‌రావు శిక్షముగిసి దిమ్మెగూడెం చేరుకున్నాడు. వచ్చీ రావడంతోనే, అధికార వర్గానికి అండగా నిలిచి గ్రామ ప్రజలపై అధికారం చేయడం సాగించాడు. గ్రంథాలయం మూతబడ్డది. వెంకటేశ్వర్రావు ఇంటిలో పోలీసు నాకా పెట్టించాడు.

వెంకటేశ్వర్రావు డిక్టేటర్‌గా, బషీర్, కంఠీరవం, పరంధామయ్య, విజయదేవు అనుచరులుగా ఒక దళంగా సత్యాగ్రహం చేసి నిర్బంధించబడ్డారు.

---

౨౧౫

# దేశోద్ధారక గ్రంథమాల (స్థాపితము 1938)

“ఈ గ్రంథమాలరూపమున తమరు చేయుచున్న ఆంధ్రభాషా సేవ ప్రశంసనీయమై యున్నది.”

—ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు

“ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి శ్రమించునట్టి వీరి గ్రంథమాలను అందరునూ ఆదరించి తమ విధిని నెరవేర్చ వలసియుండును.”

—కీ॥ శే॥ సురవరము ప్రతాపరెడ్డిగారు

“దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించి ఆంధ్రదేశమునకు గొప్ప భాషాసేవచేసిన దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు గారిని చిరస్మరణీయులుగా చేసియున్నారు.”

—శ్రీ కొండా వెంకటరంగారెడ్డి

“దేశీయులందరు గ్రంథమాల యొక్క ప్రచురణములను పొంది ఈ కార్యమును జయప్రదముగ నిర్వహించుటలో సహాయపడుదురని ఆశించుచున్నాను.”

—శ్రీ మందుముల రామచంద్రరావు

“ప్రతి పుస్తకము ఆకర్షవంతముగను, ఉపయోగకరముగను ఉన్నది. ........మీ గ్రంథమాల ఆంధ్రదేశమున కమూల్యమగు సేవచేయుచున్నదనుటలో నెట్టి యతిశయోక్తి లేదు.”

—శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు

“ప్రజలకు వినోదం కలిగించడంవల్ల గ్రంథమాలను అభివృద్ధి చేసుకొనే దృష్టి ప్రకాశకులకు లేదు. ‘ప్రజలకు ఈ దినాలలో అత్యావశ్యకమయిన విజ్ఞానం కలిగించాలి’ అన్న దృఢ సంకల్పం ప్రతి ప్రచురణము నందు ప్రస్ఫుటంగా కనబడుతూ ఉంది.”

—కాగడా 10-2-1940

# ప్రచురణలు

# అచ్చు తప్పులు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండాల్సింది |
|---|---|---|---|
| 6 | 21 | ఆడబాపనాడు | ఆడబాపవాడు |
| 13 | 3 | కనిపించే | కనిపించిన |
| 14 | 9 | తోరణాలు | తోరణాలతో |
| 17 | 3 | సాపాట్లు | సాపాట్ల |
| 17 | 26 | ఆధికారబలం | అధికారబలాన్ని |
| 20 | 9 | పుట్టమా? | పుట్టినమా? |
| 22 | 5 | దప్తరాలు | దఫ్తరాల |
| 24 | 9 | ఫథాలున | పథాలున |
| 24 | 15 | మరకలు | వంకరలు |
| 24 | 16 | రాక్షషుడవా? | రాక్షసుడవా? |
| 33 | 17 | పోయ | పోయి |
| 51 | 2 | చేయిలేపి | చేయిచూపి |
| 52 | 5 | బళ్ళ | బళ్ళపెట్టి |
| 60 | 12 | తీసికున్నది | తీసుకోసాగింది |
| 65 | 3 | దొరోను | దొరోరి |
| 83 | 10 | ప్రతిగా | పోటీగా |
| 89 | 22 | గింజలిప్పించురు | గింజలిప్పించురి |
| 93 | 25 | మసిద్ | మస్జిద్ |
| 95 | 25 | ఒప్పప్పందం | ఒప్పందం |
| 100 | 21 | అధ్యక్షునికి | అధ్యక్షుని |
| 100 | 25 | విషయమైన | విషయం |
| 103 | 15 | రాజు | రాజ |
| 105 | 10 | మసీఘలోకి | మస్జిద్‌లోకి |
| 110 | 22 | సహింపుకాలేపు | సహించలేదు |
| 111. | 10 | వాండ్లతోన | వాండ్లతోని |

| | | | |
|---|---|---|---|
| 111 | 21 | ప్రచారకునికి | ప్రచారకుడు |
| 113 | 7 | కూకుంటరి | కూకుంటరు |
| 121 | 15 | నిర్బంధించచేయడానికి | నిర్బంధించడానికి |
| 122 | 2 | వకీలు | వకీలును |
| 128 | 24 | జీవించుటలోనే | జీవించడమే |
| 130 | 20 | వాండ్లంతా | వాండ్లను |
| 136 | 9 | మనకున్న | మనమనుకున్న |
| 138 | 17 | ఒకటగా | ఒకటిగా |
| 142 | 11 | వెళ | వెళ్లి |
| 143 | 16 | ఎడతెగక | ఎడతెగని |
| 144 | 10 | వంటి | వంటివారి |
| 144 | 13 | ఇటువంటి | నావంటి |
| 145 | 3 | నాయకత్వంకూడా | నాయకత్వం వహించడానికి |
| 146 | 22 | దొరపట్టె | దొరపట్టై |
| 150 | 8 | చెప్పుతుండటం | చెప్పుతు |
| 150 | 13 | అగ్రజాతులవారికి | అగ్రజాతులవారు |
| 150 | 24 | వ్యవహరించాడు | వ్యవహరిస్తాడు |
| 152 | 24 | మామూలుగా | మూర్ఖుగా |
| 154 | 1 | మానసిక | వారి మానసిక |
| 154 | 22 | ఎంమ | ఎందుకు |
| 154 | 24 | తప్పైంది | దప్పైంది |
| 155 | 18 | వైపును | వైపు |
| 158 | 22 | మంచిషుండె | మంచిమనిషుండె |
| 160 | 6 | కలిపి | కలిసి |
| 163 | 19 | తొత్తులను | తొత్తులు |
| 164 | 10 | ఉండటం | ఉండటంచూచి |
| 164 | 25 | కచ్చడంబండి | కచ్చడం ఉంది. |

229

# నూతన ప్రచురణలు

## 13. జైలులోపల (కథానికలు) వెల 0-10-0

రచయిత: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

" కొత్తజాతికథలు మీరు తెలుగులో సృష్టిస్తున్నారు.......... కథలు హృదయవిదారకంగా ఉన్నవి. పడమటి దేశాల్లో ఇట్టి వాఙ్మయసృష్టి సంస్కరణాలకి దారితీసెను. మన దేశంలో అలనా పాలనా లేదు. "

—శ్రీ చింతా దీక్షితులు

" యిలాంటి కథావస్తువులు యింతవరకు యెవరూ తీసుకోలేదనే నా అభిప్రాయం. ఈ వస్తునిర్ణయంలోనే మీరు నవ్యమార్గం అనుసరించి, సామాజికంగా చచ్చినవాండ్లతో సమానమని నిర్ణయింపబడ్డ ఖైదీల జీవితాలు ఈ నివసమాజచరిత్రకు స్మృతిచిహ్నాలుగా పనికి వస్తాయని చక్కగా నిరూపించారు. "

—శ్రీ ధరణికోట శ్రీనివాసులు

" జైలుసంస్కర్తలు గ్రహించాల్సిన విషయాలు బలంగా ప్రతిపాదించబడటం గమనార్హం. నేరస్తులు వస్తుతః నేరస్తులుకారు. వారు పరిస్థితులకు లొంగిపోయి నేరస్తులు కావించబడ్డారన్న అభిప్రాయం ప్రతి రచనా కలిగిస్తుంది. "

—గోలకొండ పత్రిక

" .......... ఇవి ఉన్నసమస్యల వాస్తవికతను, మానవ స్వభావములను, పరిస్థితుల సత్యస్వరూపమును అతి సహజముగ హృదయంగమముగ తెలుపుచున్నవి, ఇవి రచయితకు గల సంస్కారమును, భావోద్వేగమును వెల్లడించుచున్నవి. "

—సుజాత

" ........ దైనందిన జీవితంలో మనం చూచే సాధారణఘట్టాలనే, కథగా తీసుకొని సాధారణం అనుకునేటట్టు గాక ఉత్తమంగా సృష్టించారు. ....... ఆళ్వారుస్వామి గారు తమ జేలు జీవితానుభవంలోంచి కొన్ని అమూల్య విషయాలను ముచ్చటైన పుస్తకంద్వారా అందజేసి నందులకు అభినందనీయులు. "

—స్రవంతి

## 14. నా గొడవ (గేయాలు) వెల 1-8-0

రచయిత: శ్రీ కాళోజీ నారాయణరావుగారు

" కాళోజీ నిఖిలాంధ్రకవి. ......ఆయన తనఖండకావ్య సంపుటానికి 'నాగొడవ' అనిపేరు పెట్టారు.... కాని ఇవి విశాలజగత్తు ప్రజలందరిగొడవ. ఇది మనం మననం చేసుకోవాల్సిన పుస్తకం. యుద్ధంలోపాల్గొన్న కవులంతా చెల్లాచెదరుగా పారిపోతే లూయీ అరగాఁ ఒక్కడే వేగంతో నిలబడి మహావిప్లవాన్ని వెల్లడించే గీతాలు వ్రాశాడు. కాళోజీ లూయీ అరగాఁ వంటివాడు."

—శ్రీ. శ్రీ

" కాళోజీ కవిత్వం సమాజానికి హెచ్చరిక వంటిది.......వేమనకూ ఈయనకూ ఏలా మాత్రంగా వ్యత్యాసం ఉందేమో గాని అతనుచెప్పడానికి వీలు గాని కాళోజీ చెప్పంది తప్పలేదు." ఆడంబరంలేని, అలంకారాల ఆరపట్లలేని నిసర్గమైన కృతి కాళోజీ కావ్య సంపుటి."......వ్యంగ్యాత్మక విమర్శాయుత హాసగీతికలు రచించి కాళోజీ కవితాజగత్తులో క్రొత్తవిప్లవాన్ని కలిగించాడు."

—శ్రీ దాశరథి

"ఈ కవిరచనలో అంతటా ఒక విశిష్టమైన ప్రత్యేక వ్యక్తిత్వం సుస్పష్టంగా కనిపిస్తున్నది.......కాళోజీ దారివేరు.'నాగొడవ' పఠిస్తున్నపుడు మనమొక్క వినూతనమైన అనుభూతి ప్రపంచములోకి వెళ్లిపోతాము......., ఈయనలోగల సత్యాన్వేషణదృష్టి సంకుచితమైన రాజకీయ నినాదాలకు తాత్కాలికమైన అలజడులకు అతీతమైన కాలావధులనుదాటి నిసూక్తిఘోషణిలో వినబడుతూంటుంది. నేటికాలపు కవితాపరిణతి అవగాహన చేసుకోదలచిన భావుకులందరు తప్పకుండా చదువ వలసిన ఖండకావ్య సంపుటి."

—భారతి

"......... ఈ సంపుటిలో ప్రతి గీతం ఒక పరమ సత్యం. ఆ "సత్యం" కల్పనా కథలకంటె చిత్రమైంది కాదూ? తెలంగాణా ప్రజల కన్నీటిలో ఎన్నెన్నికలలు కలవో చూడతలచినవారికి కాళోజీగారి "నాగొడవ" కనువిప్పు."

—కిన్నెర

# 15. ఉదయ ఘంటలు. వెల 2-4-0

## (56 అఖిలాంధ్రకవుల గేయసంపుటి)

"......ఈ సంకలనంలో ఇంతకు పూర్వం అజ్ఞాతంగా ఉండి పోయిన ఉత్తమ ఖండకృతులెన్నో సేకరించి ప్రకటించారు. పేరుపొందిన రచయితల రచనలలోనించికూడా ఇలాంటి కృతులే సేకరించడంవల్ల ఈ సంకలనానికీవిషయంలో ఒక ప్రత్యేకత వచ్చింది. ఇది ఆధునిక కవితాభిమానులందరూ తప్పకుండా పరిశీలింపవలసిన సంపుటి"

—ఆంధ్ర పత్రిక.

"ఇప్పుడు ఆంధ్ర దేశంలో అనేక తరహాల కవిత్వం ఆవిర్భవిస్తున్నప్పటికీ అందులో ప్రధాన ప్రవాహం అభ్యుదయ సాహిత్యం. దీనికికారణం దినదిన ప్రవర్ధమానమౌతున్న సామాజిక చైతన్యమూ, ప్రజాజీవితమూ దీనిలో వెల్లి విరియడమే. ఇలాగ వెల్లివిరిసిన అఖిలాంధ్ర కవులగీతికా సంపుటి "ఉదయఘంటలు." ......అనేకకవుల చక్కని గీతాలు యిందులో ప్రచురితమైనాయి. ......సంపాదకుల, ప్రచురణ కర్తల కృషి కొనియాడతగింది."

—విశాలాంధ్ర.

"........నవ్యకవిత్వోద్యమంలో పాల్గొన్న వారిరచనలను ఏర్చికూర్చి, .......ఒక్కసంపుటిలో అందించినందుకు అభినందనీయులు. ....... ఆధునిక ఆంధ్ర రచనావిధానంలో వచ్చిన మార్పుయొక్క సమగ్ర స్వరూపాన్ని తెలిసికోవాలంటే ఈగ్రంథం చాలావరకు సహాయపడుతుంది."

—బృందావని.

"......సానలుతీరి పకపకన రంగురంగుల రోచిస్సులు విరజిమ్మే మణిలా కలరవాలను కురిపిస్తూ, వంపువంపునా కర్పూరకాంతులీనే కపోత

కంఠంలా, వివిధ సౌరభాలను, వెలార్చే కదంబ ప్రసూనమాలలా, రంగు, రుచి, వాసనల సొదు తీరులు గల అపురూపపు "ఉదయ ఘంటలు" నినాదతరంగాలు అనవరతం మనశ్రవణ మనోమస్తిష్క ఫలకాలను తాకుతూనే వుంటాయనడం అత్యుక్తికాదు."

—ఆంధ్రప్రభ.

"ఈ సంకలనంలో యావదాంధ్ర కవులు సమిష్టిగా ఏకముఖాన మనకు మేల్కొలుపులు పాడుతున్నారు. ఇవి ఉదయ ఘంటలు ......ఇవి హృదయ ఘంటలు......... మనకావ్య సాహిత్యంలోని విశిష్ట భాగాలతో ఒక్క "తెలుగు ఎంథాలజీ" కూడా రాలేదని నిరుత్సాహపడుతున్న ఈనాడు కనీసం గేయసాహిత్యంలోని మచ్చు రచనలతోనైనా ఈసంపుటి వెలువడటం ఆంధ్ర సాహిత్యానికి ఒక అభ్యుదయమేనని దీనిని పరిశీలించిన వారు అంగీకరించుతారు."

—స్రవంతి.

"......కేవలము జీవితోత్సాహమూ, సౌందర్య సందర్శనమూ మాత్రముగాక, పీడితసోదరబాధానుకంపనమూ, నిత్యనూతన చైతన్య కల్పిత చిత్రసృష్టి......."ఉదయ ఘంటలు" వారిలోనే మోగుతాయి. ........ఈ సంపుటము నిండా బ్రతికిఉన్న వ్యావహారికంలోనే తళుకుక్కమన్నాయి భావాలు. ........భావవిప్లవానికి "ఉదయ ఘంటలు"లో అటవిడుపు. "మాడుపొట్టతోఁ నీవు గానిద చాకిరి చేయగ తోకపూపి, మూతి నాకుతుచ్చులకే వైభవాలు

—అనిపుట్టకిట్లు కదిల్చేభావాలు "ఉదయఘంటలు"లో ఎన్నైనాకలవు."

—కిన్నెర.

"ఈ ఆధునిక ఖండకావ్య సంపుటి పురోగమిస్తున్న నవ్యార్థ సాహిత్య పొకడలను ప్రస్ఫుటింప జేస్తున్నది. ఇందులో........దేశీయ సాంఘిక సమస్యలు, ఆర్థికసమస్యా లోపాలు, ప్రపంచ క్లిష్టపరిస్థితులు,

| | | | |
|---|---|---|---|
| 165 | 23 | గిర్దావరు | గిర్దావరు, |
| 167 | 5 | దుడోరి | దండోర |
| 176 | 15 | కష్టజీవులు | నికృష్టజీవులు |
| 181 | 7 | వెళ్లున్నారు | వెళ్తున్నారు |
| 191 | 17 | గొంతు | దొంతు |
| 194 | 3 | మీద్వోల | మీదోర |
| 206 | 13 | ఏలినవారి | ఎల్లెమారు |
| 207 | 24 | ముడిచిపెట్టి | ముడిపెట్టు |
| 208 | 26 | వారించాడు | వాదించాడు |
| 211 | 14 | సౌష్ఠవానికై | సౌష్ఠవానికే |
| 217 | 5 | ఒకడేగా | ఒక్కడే |
| 217 | 11 | చెప్పితి | చెప్పితె |
| 217 | 17 | ఎ్కకువ | ఎక్కువ |
| 218 | 3 | నేనంటే | లేకుంటే |
| 218 | 7 | నాకేం | నాకే |
| 218 | 15 | మమ్మొందు | మమ్మొందుకు |
| 219 | 14 | చితుకు | బతుకు |
| 220 | 11 | నిదానమైయున్న | నిద్రాణమైయున్న |
| 221 | 22 | పరిభలించిన | పరిభవించిన |
| 222 | 22 | షేతువాదనకు | హేతువాదనకు |
| 224 | 5 | కంఠీరవం | బషీరు |

పీడితమానవ సంఘటనలను యితివృత్తముగాగలవి. ......చక్కని ముద్రణ, తయారీలతో ఆకర్షణీయంగా తయారైన యీగ్రంథము ముద్దులు, మూటగట్టుచు ఉత్సాహానందముల ప్రేరేపించుచున్నది."

—గృహలక్ష్మి.

"ఈ సంవత్సరం—చిరకాలంతర్వాత కవితా సంపుటాలు వచ్చాయి. అందులో ఉత్తమమైనది వేసినగౌరవం తెలంగాణావారికే దక్కింది. అఖిలాంధ్ర కవుల రచనలతో కూడిన "ఉదయ ఘంటలు" ఒక గొప్ప కృషిఅని చెప్పకతీరదు."

—శ్రీవాత్సవ.

---

మొదట రు. 10 - 0 - 0 చెల్లించి గ్రంథమాలలో సభ్యులుగా చేరవచ్చును. అట్టిసభ్యులకు రు. 11 - 4 - 0 వెలగల మా ప్రచురణ ములు అందజేయ బడును. అంతకుపైగా చెల్లించు ద్రవ్యాన్ని విరాళ ముగా స్వీకరించి మాగ్రంథాలు పంపుచుందుము.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B145 |
| పుస్తకం పేరు | ప్రజలమనిషి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 245 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI,vi |
| లేని పేజీలు | |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| స్కాన్ చేసినది | Sushmitha |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |